# శ్రీమదాంధ్ర

సప్తమ, అష్టమ, నవమ స్కంధములు

విద్వాన్ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులుగారిచే
పరిష్కరింపఁబడి, లఘుటీక, ప్రతిపదార్థములు, వ్రాయఁబడినది

ప్రకాశకులు:

బెజవాడ - మద్రాసు.

[కాపీరైటు రిజిష్టర్డు]

# విషయసూచిక

## సప్తమస్కంధము



## అష్టమస్కంధము

## నవమస్కంధము

శ్రీరస్తు.

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః.

శ్రీమదాంధ్ర

# భాగవతము

## సప్తమస్కంధము.



మద్విఖ్యాతచరిత్రా
క్రామితరోదోంతరాళ! కమనీయమహా
జీమూతతులితదేహా
శ్యామలరుచిజాల! రామచంద్రనృపాలా!

### ౧. అధ్యాయము

వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యాన వైఖరీసమేతుం డయిన సూతుం డిట్లనియె; అట్లు ప్రాయోపవిష్టుం డయిన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రు నవలోకించి, 2

సీ. సర్వభూతములకు సముఁడు నెచ్చెలి ప్రియుం
డైన వైకుంఠుఁ డనంతుఁ డాద్యుఁ
డింద్రునికొఱకు దైత్యేంద్రుల నేటికి
[1]విషమునిక్రవడి వెదకి చంపె?
నసురులఁ జంపంగ నమరులచేఁ దన,
కయ్యెడిలాభ మింతైనఁ గలదె?

---

1. రాగద్వేషాదిగుణములచే విషమమయిన బుద్ధి కలవానివలె,

నిర్వాణనాథుండు నిర్గుణుం డగు తన,
తనువుల వలని భయంబుఁ బొరయఁ

ఆ. గలుగనేర వట్టిఘనుఁడు దైత్యులఁ జంపి
సురలఁ గాచు చునికి చోద్యమనుచు
సంశయంబు నాకు జనియించె మునినాథ!
[1]ప్రజ్ఞమెఱసి తెలియఁ బలుకవయ్య. 3

వ. అనిన శుకుం డిట్లనియె. 4

శా. నీ సంప్రశ్నము వర్ణనీయము గదా నిక్కంబు రాజేంద్ర! ల
క్ష్మీసంభావ్యుని సచ్చరిత్రము మహాచిత్రంబు చింతింపఁ ద
ద్దాసాఖ్యానములొప్పు విష్ణుచరణ ధ్యానప్రధానంబులై
శ్రీసంధానములై మునీశ్వరవచో జేగీయమానంబులై. 5

క. చిత్రంబులు త్రైలోక్యప
విత్రంబులు [2]భవలతాలవిత్రంబులు స
న్మిత్రంబులు మునిజనవన
[3]చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్. 6

వ. నరేంద్రా! కృష్ణద్వైపాయనునకు నమస్కరించి హరికథనంబులు సెప్పెద వినుము. వ్యక్తుండుగాక గుణంబులు లేక ప్రకృతిం జెందక భవంబుల నొందక పరమేశ్వరుండు దనమాయవలనయిన గుణంబుల నావేశించి బాధ్యబాధకత్వంబుల నొందును. అతండు గుణరహితుండు, సత్త్వరజస్తమంబులు ప్రకృతిగుణంబులు. ఆగుణంబులకు నొక్కొక్క కాలంబున హానివృద్ధులు గలవు. ఆ యీశ్వరుండు సత్త్వంబున దేవఋషులను, రజోగుణంబున నసురులను, దమోగుణంబున యక్షరక్షోగణంబులను విభజించె. సూర్యుండు పెక్కెడలం గానంబడియు నొక్కరుం డయిన తెఱంగునఁ దద్విభుండును సర్వగతుండయ్యును భిన్నుండుగాఁడు. తత్త్వవిదులయిన పెద్దలు

1. ప్రజ్ఞ = బుద్ధి. 2. భవ + లతా + లవిత్రంబులు = సంసారమను తీవలకు కొడవళ్ళు. 3. చైత్రంబులు = చైత్రమాసమువంటివి. (వసంతఋతువున వనము లింపొందినట్లు, విష్ణుదేవుచరిత్రములచే మునిజను లానందింతురని యర్థము.)

వ. అదియునుంగాక దంతవక్త్రుండును వీఁడును నిరంతరంబు గోవిందు నింద సేయుదురు. నిఖిలజనులు సందర్శింప నేఁడు వీనికి విష్ణుసాయుజ్యంబు గలుగుట కేమి హేతువు? వినిపింపుము. పవనచలితదీపశిఖయునుం బోలె నా హృదయంబు సంచలించుచున్న దనిన ధర్మనందనునకు నారదుం డిట్లనియె. దూషణభూషణతిరస్కారంబులు శరీరంబునకుం గాని పరమాత్మకు లేవు. శరీరాభిమానంబునం జేసి [1]దండవాక్పారుష్యంబులు హింసయై తోఁచు తెఱంగున నేను నాయది యనియెడు వైషమ్యంబును భూతంబులకు శరీరంబునందు సంభవించు. అభిమానంబు బంధంబు. నిరభిమానుండై వధించినను వధంబుగాదు. కర్తృత్వ మొల్లనివానికి హింసయు సిద్ధింపదు. సర్వభూతాత్మకుండైన యీశ్వరునికి వైషమ్యంబు లేదు గావున, 13

ఆ. అలుక నైనఁ జెలిమి నైనఁ గామంబున
నైన బాంధవమున నైన భీతి
నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁ డగు హరిఁ
జేర వచ్చు వేఱు సేయఁ డతఁడు. 14

క. వైరానుబంధనంబునఁ
జేరిన చందమున విష్ణుఁ జిరతరభక్తిం
జేరఁగ రాదని తోఁచును
నారాయణభక్తియుక్తి నా చిత్తమునన్.

క. కీటకముఁ దెచ్చి భ్రమరము
పాటవమున బంభ్రమింప భ్రాంతం బై త
త్కీటకము భ్రమరరూపముఁ
బాటించి వహించుఁ గాదె భయ[2]యోగమునన్. 16

వ. ఇవ్విధంబున. 17

శా. కామోత్కంఠత గోపికల్, భయమునం గంసుండు, వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్, సంబంధులై వృష్ణులుం,

1. వాక్పారుష్యము = కఠినముగా మాట్లాడుట 2. యోగమునన్ = సంబంధము చేత.

బ్రేమం జేరరు, భక్తినేమము, నిటె చక్రిం గంటి; మెల్లైన ను
ద్దామధ్యానగరిష్ఠుఁడైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా! 18

శ్రీహరిద్వారపాలకులకు సనకాదులవలన శాపము గల్గుట.

వ. మఱియుఁ బెక్కండ్రు కామద్వేషభయస్నేహసేవాతిరేకంబులఁ జిత్తంబు హరిపరాయణంబుగాఁ జేసి తద్గతిం జెందిరి. హరి నుద్దేశించి క్రోధాతురులైన యేనింటిలోపల నొక్కటి యైన వెన్నునికి లేని నిమిత్తంబున నతండు వ్యర్థుం డయ్యె. మీ తల్లి చెలియలి కొడుకు లయిన శిశుపాలదంతవక్త్రులు దొల్లి విష్ణుమందిరద్వారపాలకులు విప్రశాపంబునఁ బదభ్రష్టులై భూతలంబున జన్మించిరి. అనిన విని యుధిష్ఠిరుండు నారదున కిట్లనియె. 19

మ. అలుగం గారణ మేమి విప్రులకు మున్నా విప్రు లెవ్వారు ని
శ్చలు లేకాంతులు నిర్జితేంద్రియులు నిస్సంసారు లీశానువ
ర్తులు వైకుంఠపురీనివాసు లన వింటిన్ వారి కెబ్భంగి నీ
ఖల[1]జన్మంబులు వచ్చె నారద! వినం గౌతూహలం బయ్యెడిన్. 20

వ. అనిన నారదుం డిట్లనియె. ఒక్కనాఁడు బ్రహ్మమానసపుత్రులైన సనకసనందనాదులు దైవయోగంబున భువనత్రయంబు నందును సంచరించుచు నైదాఱేండ్లప్రాయంపుబాలకులభావంబున దిగంబరులయి హరిమందిరంబునకు వచ్చి చొచ్చునెడ మొగసాల నున్న పురుషు లిరువురు వారలం జూచి. 21

క. డింభకుల [2]ననర్గళవి
స్రంభకుల రమాధినాథసల్లాపసుఖా
రంభకుల [3]ముక్తమానస
దంభకులం జొఱఁగనీక తఱిమి రధీశా! 22

క. వారించిన తమకంబున,
వారించుక నిలువ లేక వడిఁ దిట్టిరి [4]దౌ

1. ఖలజన్మంబులు = నీచజన్మలు 2. అనర్గళ విస్రంభకుల = అడ్డులేని చొరవ గలవారు (చనవరులు అన్నమాట.) 3. విడువఁబడిన మనోగర్వము కలవారు. (గర్వరహితులు) 4. ద్వారపాలకులు.

వారికుల నసురయోని న
వారితులై పుట్టెఁ డనుచు వసుధాధీశా! 23

వ. మఱియు నాపిన్నపెద్దలు వారలంజూచి మీరలియ్యెడనుండ నర్హులు గారు. నారాయణచరణమూలంబు విడిచి రజస్తమోగుణులరై రాక్షసయోనిం బుట్టుం డని శపియించిన, వారు నా శాపవశంబునం బదభ్రష్టులై కూలుచు మొఱలిడిన నమ్మహాత్ములు దయాళువులై క్రమ్మఱం గరుణించి మూఁడు జన్మంబులకు వైరంబున భగవత్సన్నిధానంబు గలిగెడు మని నిర్దేశించి చనిరి. ఇవ్విధంబున శాపహతులై హరిపార్శ్వచరులైన పురుషు లిరువురు హిరణ్యకశిపుహిరణ్యాక్షులన దితికి జన్మించిరి. అందుఁ గనిష్ఠుండైన హిరణ్యాక్షుని హరి వరాహరూపంబున సంహరించె. అగ్రజుండయిన హిరణ్యకశిపుండు నరసింహమూర్తి యయిన శ్రీహరిచేత విదళితుండయ్యె. అతనికొడుకు ప్రహ్లాదుండు దండ్రిచేత [1]హింసితుఁడయ్యును నారాయణపరాయణుండై శాశ్వతుం డయ్యె. రెండవ [2]భవంబునఁ గైకసి యను రాక్షసికి రావణకుంభకర్ణులయి సంభవించిన, విశ్వంభరుండు రఘుకులంబున రాఘవుం డయి యవతరించి వారల వధియించె. అమ్మహాత్ముని పరాక్రమంబులు మార్కండేయఋషి వలన నెఱింగెదవు. తృతీయజన్మంబున మీతల్లి చెలియలికి శిశుపాలదంతవక్త్రులన నుద్భవించి;

శా. వక్రం బింతయులేక పాయని మహా వైరంబునన్ నిత్యజా
తక్రోధస్మరణంబులన్ విదళితోద్యత్పాపసంఘాతులై
చక్రచ్ఛిన్నశిరస్కులై మునివచశ్శాపావధిప్రాప్తులై
చక్రిం జెందిరి వారు పార్శ్వచరులై సారూప్యభావంబునన్. 25

వ. అనిన విని ధర్మనందనుం డిట్లనియె. 26

క. బాలున్ హరిపదచింతా
శీలున్ సుగుణాలవాలు [3]శ్రీమన్మేధా

1. బాధింపబడినవాఁడు. 2. పుట్టుకలో. 3. శోభాయుక్తమైన బుద్ధివిశేషములు కలవాఁడు.

జాలుఁగ సంతోషింపక,
యేలాశించె రాక్షసేంద్రుం డనఘా! 27

క. [1]పరిభూతవ్యథనంబులు,
నిరుపమసంసారజలధినిర్మథనంబుల్
నరకేసరికథనంబులు,
పరిరక్షితదేవయక్షఫణిమిథునంబుల్. 28

౨ అధ్యాయము

వ. మునీంద్రా! వినిపింపు మనిన నారదుం డిట్లనియె. కమలోదరుచేతం
దనసహోదరుండు హతుండయ్యె నని విని హిరణ్యకశిపుండు రోష
శోకదందహ్యమానమానసుండయి ఘూర్ణిల్లుచు నాభీలదావ
దహనజ్వాలాకరాళంబులయిన విలోకనజాలంబుల గగనంబునం
బొగలెగయ నిరీక్షించుచుం దటిల్లతాంకురసంకాశధగద్ధగిత
దంతసందష్ట[2]దళసచ్ఛదుండును నదభ్రభయంకర[3]భ్రుకుటితఫాల
భాగుండును నిరంతరాశాంతదురంతవైరవేగుండును నై మహాప్రభా
జాలజటాలంబగు శూలంబుఁ గేలసందుకొని సభామండపంబున
నిలువంబడి త్రిమస్తకత్రిలోచనశకునిశంబరశతబాహునముచి
హయగ్రీవపులోమవిప్రచిత్తిప్రముఖులైన దైత్యదానవుల నాలో
కించి యిట్లనియె. 29

శా. నాకుం దమ్ముఁడు మీకు నెచ్చెలి రణన్యాయైకదక్షుండు బా
హా[4]కుంఠీకృతదేవయక్షుఁడు హిరణ్యాక్షుండు వానిన్ మహా
[5]సౌకర్యాంగము దాల్చి దానవఘనాసౌకర్యముల్ నీఱుగా
వైకుంఠుండు వధించిపోయెనఁట యీ వార్తాస్థితిన్ వింటిరే. 30

చ. వనములనుండుఁ జొచ్చు మునివర్గములోపల సంచరించు సం
జననమెఱుంగ రెవ్వరును జాడ యొకింతయు లేదు తన్నుఁ డా

1. వ్యథల నన్నిటిని ద్రోసిపుచ్చునవి 2. దళసచ్ఛద = పెదవి. 3. భ్రుకుటిత = ముడివడిన. 4. కుంఠీకృత = లోబరుచుకొనబడిన. 5. సూకరమునకు సంబంధించిన శరీరము (వరాహమూర్తి)

సిన మతి డాయు వెంటఁబడి చిక్కక చిక్కఁడు వీని నొక్క కీ
లున మన మెల్ల లోఁబడక లోఁబడఁ బట్టుకొనంగవచ్చునే. 31

సీ. భుజశక్తి నాతోడఁ బోరాడ శంకించి
మున్నీట మునిఁగిన మునుఁగుఁ గాక
అలయించి పెనఁగు నా యచలసంభ్రమమున
[1]కెఱఁగి వెన్నిచ్చిన నిచ్చుఁ గాక
జగడంబు సైఁపక సౌకర్యకాంక్షియై,
యిలక్రింద నీఁగిన నీఁగుఁ గాక
క్రోధించి యటుగాక కొంతపౌరుషమున
హరిభంగినడరిన నడరుఁగాక

ఆ. కఠిన[2]శూలధారఁ గంఠంబు విదళించి,
వానిశోణితమున వాఁడి మెఱసి
మత్సహోదరునకు మహిఁ దర్పణముసేసి,
మెఱసివత్తు మీకు మేలు దెత్తు. 32

క. ఖండితమూలద్రుమమున
నెండిన [3]విటపములభంగి నితడు వడిన నా
ఖండలముఖ్యులు వడుదురు,
భండనమున నితఁడు దమకుఁ బ్రాణము లగుటన్. 33

సీ. పొండు దానవులార! భూసురక్షేత్రసం
గతమైన భూమికి గములు గట్టి
మఖతపస్స్వాధ్యాయ మౌనవ్రతస్థుల
వెదకి ఖండింపుఁడు విష్ణుఁడనఁగ
నన్యుఁడొక్కఁడు లేఁడు యజ్ఞంబు వేదంబు
నతఁడె భూదేవక్రియాదిమూల
మతఁడు దేవర్షిపిత్రాదిలోకములకు
ధర్మాదులకు మహాధార మతఁడె

1. ఎఱఁగి = వంగి. 2. నెత్తురు. 3. చెట్లు.

శా. [1]నీరాగారనివిష్టపాంథులక్రియన్ నిక్కంబు సంసారసం
చారుల్ వత్తురు గూడి [2]విత్తురు సదా; సంగంబు లే దొక్కచో;
శూరుల్ వోయెడి త్రోవఁ బోయెను భవత్సూనుండు దల్లి! మహా
శూరుం డాతఁడు తద్వియోగమునకున్ శోకింప నీ కేటికిన్. 38

సీ. సర్వజ్ఞుఁ డీశుండు సర్వాత్ముఁ డవ్యయుం
డమలుండు సత్యుఁ డనంతుఁ డాద్యుఁ
డాత్మరూపంబున నశ్రాంతమును దన
మాయాప్రవర్తన మహిమవలన
గుణములఁ గల్పించి గుణసంగమంబున
[3]లింగశరీరంబు లీలఁ దాల్చి
కంపితజలములోఁ గదలెడిక్రియఁ దోఁచు
పాదపంబులభంగి భ్రామ్యమాణ

ఆ. చక్షువుల ధరిత్రి చలితమై కానంగఁ
బడినభంగి, వికల భావరహితుఁ
డాత్మమయుఁడు గంపితాంతరంగంబునఁ
గదలినట్లు తోఁచుఁ గదల కుండు. 49

బాలవేషము దాల్చిన యముండు దెలిపెడు సుయజ్ఞోపాఖ్యానము.

వ. అవ్వా యివ్విధంబున లక్షణవంతుఁడు గాని యీశ్వరుండు లక్షితుండై [4]కర్మసంసరణంబున యోగవియోగంబుల నొందించు సంభవవినాశశోకవివేకావివేకచింతాస్మరణంబులు వివిధంబులు. ఈ యర్థంబునకుఁ బెద్దలు ప్రేతబంధుయమసంవాదం బను నితిహాసంబు నుదాహరింతురు. వినుము చెప్పెద. ఉశీనరదేశంబునందు సుయజ్ఞుం డను రాజు గలండు. అతండు శత్రువులచేత యుద్ధంబున నిహతుం డయి యున్నయెడ. 40

సీ. చినిఁగిన బహురత్నచిత్ర[5]వర్మముతోడ
రాలినభూషణరాజితోడ

---

1. నీరాగార + నివిష్ట + పాంథుల + క్రియన్ = చలివేంద్రములలోఁ బ్రవేశించిన బాటసారులవలె. 2. విత్తురు = వీడిపోదురు. 3. సూక్ష్మశరీరము. 4. కర్మప్రవాహంబున. 5. కవచము.

భీకరబాణ నిర్భిన్న వక్షముతోడ
దఱచు గాఱెడు [1]శోణితంబుతోడఁ
గీర్ణమై జాఱిన కేశబంధముతోడ
రయరోషదష్టాధరంబుతోడ
[2]నిమిషహీనంబైన నేత్రయుగ్మముతోడ
భూరజోయుతముఖాంబుజముతోడ

ఆ. తునిసిపడిన దీర్ఘదోర్దండములతోడ
జీవహీనుఁ డగు నుశీనరేంద్రుఁ
జుట్టి బంధుజనులు సొరిది నుండఁగ భయా
క్రాంత లగుచు సతుల కాంత లెల్ల. 41

శా. [3]ప్రస్తాకంపిత కేశబంధములతో సంఛిన్నహారాళితో
హస్తాబ్జంబులు సాఁచి మోఁదికొనుచున్ హా నాథ! యంచున్ బహు
ప్రస్తావోక్తులతోడ నేడ్చిరి వగం బ్రాణేశుపాదంబుపై
సస్తోకస్తనకుంకుమారుణ[4]వికీర్ణాస్రంబు వర్షించుచున్. 42

మ. అనఘా! నిన్ను నుశీనరప్రజల కర్థానందసంధాయిగా
మును నిర్మించిన బ్రహ్మ నిర్దయత నున్మూలించెనే వీరికిం
దనయశ్రేణికి మాకు దిక్కు గలదే ధాత్రీశ! నీబోఁటికిం
జనునే పోవిడి చనంగ భ్రాతృజనులన్ సన్మిత్రులం బుత్త్రులన్. 43

మ. జనలోకేశ్వర నిన్నుఁ బాసిన నిమేషంబుల్ మహాబ్దంబులై
చను లోకాంతరగామివై మరల కీ చందంబునన్ నీవు వో
యిన మే మెట్లు చరింతు మొల్లముగదా యీలోకవృత్తంబు నేఁ
డనలజ్వాలలఁ జొచ్చి వచ్చెదము నీ యంఘ్రిద్వయిం జూడఁగన్. 44

వ. అని యిట్లు రాజభార్య లారాజశవంబు డగ్గఱి విలపింపం బ్రొద్దు గ్రుంకెడు సమయంబున వారల విలాపంబులు విని బ్రాహ్మణబాలకుండై యముండు సనుదెంచి ప్రేతబంధువులంజూచి యిట్లనియె. 45

1. నెత్తురుతో. 2. ఱెప్పపాటు. 3. ఆకంపిత = కదలుచున్న. 4. వికీర్ణ + అస్రంబు = చెల్లాచెదరైన కన్నీళ్లను

ఉ. మచ్చిక వీరికెల్ల బహుమాత్రముఁ జోద్యము దేహి పుట్టుచుం
జచ్చుచు నుంటఁ జూచెదరు చావక మానెదువారిభంగి నీ
చచ్చినవాని కేడ్చెదరు చావుస కొల్లక డాఁగ వచ్చునే ?
యెచ్చటఁ బుట్టె నచ్చటికి నేఁగుట నైజము ప్రాణికోటికిన్. 46

క. జననీజనకులఁ బాసియు,
ఘనవృకముల బాధపడక కడుఁ బిన్నలమై
మనియెద మెవ్వఁడు గర్భం
బున మును రక్షించె వాఁడె పోషకుఁ డడవిన్. 47

క. ఎవ్వఁడు సృజించుఁ బ్రాణుల,
నెవ్వఁడు రక్షించుఁ ద్రుంచు నెవ్వఁ డనంతుం
డెవ్వఁడు విభుఁ డెవ్వఁడు వాఁ
డివ్విధమున మనుచుఁ బెనుచు [1]హేలారతుఁడై. 48

ఆ. ధనము వీధిఁ బడిన దైవవశంబున
నుండు; పోవు మూల నున్న నైన;
నడవి రక్ష లేని యబలుండు వర్ధిల్లు,
రక్షితుండు మందిరమునఁ జచ్చు. 49

క. కలుగును మఱి లేకుండును
గలభూతము లెల్లఁ గాలకర్మవశములై
నిలువఁబడు బ్రకృతిఁ [2]బద్దుణ
కలితుఁడు గాఁ డాత్మమయుఁ డగమ్యుఁడు దలఁపన్. 50

సీ. పాంచభౌతికమైన భవనంబు దేహంబు;
పురుషుఁడు దీనిలోఁ బూర్వకర్మ
వశమున నొకవేళ వర్తించు [3]దీపించుఁ
దఱియైన నొకవేళఁ దలఁగి పోవుఁ
జెడెనేని దేహంబు చెడుఁగాని పురుషుండు
చెడ డాతనికి నింత చేటు లేదు

1. విలాసపరుఁడై 2. ప్రకృతియొక్క గుణములతోఁ గూడినవాఁడు 3. వృద్ధి పొందునని భావము.

పురుషునికిని దేహపుంజంబునకు వేఱు
గాని యేకత్వంబు గానరాదు

ఆ. దారువుల వెలుంగు దహనుని కైవడిఁ
గాయములఁ జరించు గాలిభంగి
¹నాళలీన స్థూల నభము చాడ్పున వేఱు
తెలియవలయు దేహి దేహములకు. 51

వ. అని మఱియు నిట్లనియె. 52

సీ. భూపాలకుఁడు నిద్రఁబోయెడి నొండేమి
విలపింప నేటికి వెఱ్ఱులార!
యెవ్వఁడు భాషించు నెవ్వఁ డాకర్ణించు
నట్టివాఁ డెన్నఁడో యరిగినాఁడు,
ప్రాణభూతుం డైన పవనుఁ డాకర్ణింప
భాషింప నేరఁడు, ప్రాణి దేహ
ములకు నేతఁ దాన ముఖ్యుండై యింద్రియ
వంతుఁడై జీవుండు వలను మెఱయ,

ఆ. ప్రాభవమున భూతపంచకేంద్రియమనో
లింగదేహములను లీలఁ గూడు
విడుచు నన్యుఁ డొకఁడు విభుఁడు దీనికి మీరు
వగలనేల వగలఁ బొరలనేల ? 53

క. ఎందాఁక నాత్మ దేహము
నొందెడు నందాఁకఁ గర్మయోగము; లటపైఁ
జెందవు; మాయాయోగ
²స్పందితులై రిత్తజాలి బడ నేమిటికిన్. 54

మ. చెలులుం దల్లులు నంపు లాత్మజులు సంసేవ్యుల్ సతుల్ చారుని
ర్మలగేహంబు లటంచుఁ గూర్తురు మహామాయాగుణభ్రాంతులై

4. వేఱు వేఱు కొట్టములందున్న యాకాశము వేఱువేఱని తోఁచినట్లు. 2. స్పందితులు = చలించినవారు

కలలోఁ దోఁచిన యోగముల్ నిజములే కర్మానుబంధంబులం
గలుగుం [1]సంగము లేక మానుఁ బిదపం గర్మాంతకాలంబునన్.

వ. మఱియు మాయాగుణప్రపంచంబు నెఱింగెడు తత్త్వజ్ఞులు నిత్యానిత్యంబులం గూర్చి సుఖదుఃఖంబులం జెందరు. అజ్ఞులు గొందఱు యోగవియోగంబులకు సుఖదుఃఖంబుల నొందుదురు. తొల్లి యొక్క మహాగహనంబున విహగంబులకు [2]నంతకభూతుం డైన యొఱుకు గలఁడు. అతం డొక్కనాఁడు ప్రభాతంబున లేచి వాఁడు పైన వేఁటతమకంబున. 56

క. వల లురులు జిగురుఁ గండెలుఁ,
జలిదియు జిక్కంబు ధనువు శరములుఁ గొనుచుం
బులుఁగులఁ బట్టెడు వేడుక
[3]యలుఁగులు వెడలంగఁ గదలి యడవికిఁ జనియెన్. 57

వ. ఇ ట్లడవికిం జని తత్ప్రదేశంబునందు. 58

క. కట్టలుకఁ [4]దడుకుచాటునఁ,
బిట్టల నురిగోలఁ దిగిచి బిఱుసున ఱెక్కల్
పట్టి విఱిచి చిక్కములోఁ,
బెట్టుచు విహరించె లోకభీకరలీలన్.

వ. మఱియు నానావిధంబు లగు శకుంతలంబుల సంతంబు నొందించుచు సకలపక్షిసంహారసంరబ్ధకుం డైన లుబ్ధకుండు దనసుం బదఁ గాలచోదితుం డై సంచరించుచున్న కుళింగపక్షిమిథునంబు గనుంగొని యందుఁ [5]గుళింగి నురిం దిగిచి యొక్క చిక్కంబులో నైచినం జూచి దుఃఖించి కుళింగపక్షి యిట్లనియె.

చ. అడవులమేఁత మేసి మన మయ్యల కెన్నఁడు నెగ్గు సేయ కి
క్కడ విహరింప నేఁ డకట [6]కట్టిఁడిబ్రహ్మ కిరాతు చేతిలోఁ

---

1. సంబంధము (హత్తుగడ. అంటు) 2. యముఁడైనవాఁడు. 3. పొంగి పొరలగా: ఆలుగు=చెఱువులో నగువానిలో ఎక్కువగా నుండునీరు పోవుట కేర్పఱచిన దారి (కలుజు) 4. కంచె. 5. ఆడపిచ్చుక. 6. కఠినుఁడు.

బహు మని వ్రాసెనే నుదుటఁ బాపపుదైవము కంటికింత యొ
క్కఁడు బరువయ్యెనే బ్రదుకు కోమలి! యే మన నేర్తుఁ జెల్లరే. 61

క. ఒకపూటు మనల సంచలిఁ,
బ్రకటించి కిరాతువలలఁ బడఁజేయక ని
న్నొకతెన్ వలఁబడఁ జేసిన
[1]వికటీకృతపటుఁడైన విధి నే మందున్.

ఉ. ఱెక్కలు రావు పిల్లలకు నేఁపటినుండియు మేఁత గానమిం
బొక్కఁడు గూఁటిలో నెగసి పోవఁగ నేరవు మున్ను తల్లి యీ
దిక్కుననుండి వచ్చు నని త్రిప్పుచుఁజూడ్కుల నిక్కి నిక్కి న
ల్దిక్కులుఁ జూచుచున్న వతిదీనత నెట్లు భరింతు నక్కటా! 63

వ. అని యివ్విధంబున. 64

క. కుంఠితనాదమునఁ గోషను,
గంతము శోషింప వగచు ఖగముయు హానన్
క్రాంతసంధాన కిరాతుఁడు
కుంఠితగతి నేసి నొక్క కోలం గూలన్. 65

క. కాలము వచ్చిన బెబరుని
కోలను ధరఁగూలె ఖగము ఘోరపుఁద్రోవం
గాలము డాసిన నేలం
గూలక పో వశమె యెట్టి గుణవంతులకున్. 66

ఉ. కావున మీరు వచ్చుతఱిఁ గానరు వచ్చి ధరిత్రిఁ బడ్డ ధా
త్రీవిభుదేహముం గదిసి దీనత నేడువనేల! పోఁడు చిం
తావశులార! వత్సరశతంబుల కైన నిజేశు [2]చక్కికిం
బోవుట దుర్లభంబు; మృతిఁ బొందినవారలు నేర వత్తురే. 67

వ. అని యిట్లు కపటబాలకుండై క్రీడించుచున్న యముని యుపలాల
నాలాపంబులు విని సుయజ్ఞునిబంధువు లెల్ల వెఱఁగుపడి సర్వప్రపం

---

1. వికటమైన పనిచేయుటయందు సమర్థత కలది. 2. సమీపమునకు.

చంబు నిత్యంబుగాదని తలంచి శోకింపక సుయజ్ఞునికి [1]సాంపరాయిక కృత్యంబులు సేసి చనిరి. అంత నంతకుం డంతర్హితుం డయ్యెనని చెప్పి హిరణ్యకశిపుండు దన తల్లిని దమ్మునిభార్యలం జూచి యిట్లనియె. 68

క. పరులెవ్వరు దామెవ్వరు
పరికింపఁగ నేకమగుట భావింపరు త
త్పరమజ్ఞానము లేమిని
బరులును నే మనుచుఁ దోఁచుఁ బ్రాణుల కెల్లన్. 69

వ. అని తెలియం బలికిన హిరణ్యకశిపునివచనంబులు విని దితి కోడండ్రునుం దానును శోకంబుమాని తత్త్వవిలోకనంబు గలిగి లోకాంతరగతుండైన కొడుకునకు వగవక చనియె, నని చెప్పి నారదుండు ధర్మనందనున కిట్లనియె. 70

3 అధ్యాయము

క. [2]అజరామరభావంబును
ద్విజగద్రాజ్యంబు [3]నప్రతిద్వంద్వము దో
ర్వ్యజితాఖిలశాత్రవమును
గజరిపుబలమును హిరణ్యకశిపుఁడు గోరెన్. 71

వ. ఇట్లు గోరి మందరాచల[4]ద్రోణికిం జని యందుఁ [5]గాలిపెనువ్రేల నేల నిలువంబడి యూర్ధ్వబాహుండయి మిన్నులు చూచుచు వాఁడి మయూఖంబులతోడి ప్రళయకాలభానుండునుంబోలె నిగ్గులుగుల ప్రభాజాలంబులతోడ నెవ్వరికిం జేరఁజూడరాక పరమదారుణంబైన తపంబుసేయుచుండె. నిర్జరులు నిజస్థానంబుల నుండిరి. అంత 72

మ. అదరెం గుంభిని, సాద్రియై కలఁగె నేడంభోనిధుల్, తారకల్
చెదరెన్ సగ్రహసంఘులై, దిశలు విచ్ఛిన్నాంతలై మండఁగా, బె

1. అంత్యక్రియలు. 2. అజర + అమర + భావంబు = ముదిమి, చావు లేకుండుటను 3. ఎదురులేనిది (శత్రులులేనిది. నిష్కంటకము) 4. రెంటు కొండల నడిమిపల్లము. 5. కాలి బొటనవ్రేలిమీఁద.

బ్రహ్మదేవుండు హిరణ్యకశిపునకు వరంబు లిచ్చుట.

వ. అని దేవతలు విన్నవించిన స్వయంభూతుండును భగవంతుండును
నైన నలుమొగంబులప్రోడ భృగుదక్షాదులతోడ మందరపర్వ
తంబునకు వచ్చి యందు నియమయుక్తుండును పిపీలికాభక్షితమేదో
మాంసచర్మరక్తుండును [1]వల్మీకతృణవేణుపటలపరిచ్ఛన్నుండును
మహాతపఃప్రభావసంపన్నుండును నై నీరంధ్రనిబిడనీరదనికరనివిష్ట
[2]నీరజబంధుండునుం బోలె నివసించియున్న నిర్జరారాతిం జూచి
వెఱఁగుపడి నగుచు నిట్లనియె. 80

మత్తకోకిలము.

ఓ సురారికులేంద్ర! నీ క్రియ నుగ్రమైన తపంబు మున్
జేసి చూపినవారు లేరిటఁ జేయువారును లేరు నే
నీ సమాధికి మెచ్చితిన్ విను నీ యభీష్టము లిత్తు నా
యాస మేటికి లెమ్ము లెమ్ము మహాత్మ! కోరుము కోరికల్. 81

శా. దంశవ్రాతములుం బిపీలికలు మేదఃక్రవ్యరక్తంబులన్
సంశీర్ణంబులు సేసి పట్టితినఁగా శల్యావశిష్టుండ వై
[3]వంశచ్ఛన్నతృణావళీయుతమహావల్మీకమం దుండియు
భ్రంశం బింతయు లేక నీకు నిలుపం బ్రాణంబు లెట్లుండెనో. 82

ఉ. ఉత్సుకతన్ జలాన్నముల నొల్లక యీక్రియ నూఱుదివ్య సం
వత్సరముల్ శరీరమున వాయువులన్ నిలుపంగ వచ్చునే
యుత్సవమయ్యెఁ జూచి మము నుగ్రతపంబున గెల్చి తీవు నే
వత్సలతన్ నినుం గదియ వచ్చితిఁ గోరిక లెల్ల నిచ్చెదన్. 83

వ. అని పలికి వనమక్షికాపిపీలికాభక్షితం బైన రక్షోవిభుని దేహంబు
మీఁదం గమండలుజలంబులు ప్రోక్షించిన సద్దానవేంద్రుండు
గమలాసనకరకమలకమనీయకనకమయదివ్యామోఘకమండలుసిక్త

---

1 వల్మీక + తృణ + వేణు + పటల + పరిచ్ఛన్నుండు = పుట్టలు, గడ్డి, వెదురు పొదలతో కప్పఁబడినవాఁడు 2 సూర్యుఁడు 3 వంశ + ఛన్న + తృణా + ఆవళీ + మహత్ + వల్మీకము = వెదుళ్ళతో కప్పబడిన తృణసముదాయముతోఁ గూడిన గొప్పపుట్ట.

నిర్మలనీరధారాభిషేకసంసిక్తసకలాంగుండయి తపంబు చాలించి సాంద్రకీచకసంఘాతసంఛాదిత[1]వామలూరుమధ్యంబు వెలువడి మహాప్రభావబలసౌందర్యతారుణ్యసహితుండును వజ్రసంకాశదేహుండును దప్తసువర్ణవర్ణుండును నై [2]సిం సేంధననికరనిర్గతవహ్నియునుం బోలె వెలుంగుచుం జనుదెంచి. 84

మ. దివిజానీకవిరోధి మ్రొక్కెఁ గని వాగ్దేవీమనోనేతకున్
సవిశేషోత్సవసంవిధాతకు నమస్సంత్రాతకున్ సత్తపో
నివహాభీష్టవరప్రదాతకు జగన్నిర్మాతకున్ ధాతకున్
వివిధప్రాణిలలాటలేఖనమహావిద్యానుసంధాతకున్. 85

వ. ఇట్లు దైత్యేశ్వరుండు దివి నున్న హంసవాహనునకు ధరణీతలంబున దండప్రణామంబు లాచరించి సంతోషబాష్పసలిలసంవర్ధితపులకాంకురుండై యంజలి సేసి కంజగర్భునిమీఁద దృష్టి యిడి గద్గదస్వరంబున నిట్లని వినుతించె. 86

సీ. కల్పాంతమున నంధకారసంవృత మైన
జగము నెవ్వఁడు దన సంప్రకాశ
మున వెలిగించుచు మూఁడుభంగుల రజ
స్సత్త్వతమోగుణసహితుఁ డగుచుఁ
గల్పించు రక్షించుఁ గడపటఁ బ్రహరించు
నెవ్వఁ డాద్యుండు సర్వహేతు వగుచు
శోభితుండై స్వయంజ్యోతి యై యొక్కట
విలసిల్లు నెవ్వఁడు విభుత మెఱసి

ఆ. సమయ మయిన మానసప్రాణబుద్ధీంద్రి
యములతోడ నెవ్వఁ డలఘుమహిమ
నడరు నట్టి సచ్చిదానందమయునకు,
మహితభక్తి నే నమస్కరింతు. 87

1 పుట్ట 2 తడిలేని కట్టెలసమూహమునుండి వెలువడిన నిప్పు

వ. దేవా! నీవు ముఖ్యప్రాణంబగుటం జేసి ప్రజాపతివి, మనోబుద్ధి చిత్తేంద్రియంబులకు నధీశ్వరుండవు, మహాభూతగణంబులకు నాధార భూతుండవు, [1] త్రయీతనువునం గ్రతువులు [2] విస్తరింతువు, సకల విద్యలు నీతనువులు, సర్వార్థసాధకులకు సాధనీయుండవు, [3] ఆత్మనిష్ఠా గరిష్ఠులకు [4] ధ్యేయంబగు నాత్మవు, కాలమయుండవై జనులకు నాయుర్నాశంబు సేయుదువు, జ్ఞానవిజ్ఞానమూర్తివి, నాద్యంతరహి తుండవు, అంతరాత్మవు, మూలసూక్ష్మంబులకు మూలంబగు పరమా త్మవు, జీవలోకంబునకు జీవాత్మవు, సర్వంబును నీవ, నీవు గానిది లేశంబును లేదు, వ్యక్తుండవు గాక పరమాత్మవై పురాణపురుషుం డవై యనంతుండవైన నీవు ప్రాణేంద్రియమనోబుద్ధిగుణంబుల నంగీకరించి పరమేష్ఠిపదవిశేషంబున నిలిచి స్థూలశరీరంబునం జేసి యింతయుం [5] బ్రపంచింతువు, భగవంతుండవైన నీకు నమస్కరించెద నని మఱియు నిట్లనియె. 88

క. కోరినవారలకోర్కులు,
నేరుపుతో నిచ్చు మనువ నీక్రియ నన్యుల్
నేరరు కరుణాకర నేఁ
గోరెద నీ విచ్చెదేనిఁ గోరిక లభవా! 89

శా. గాలిం గుంభిని నగ్నిఁ నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
రేలన్ [6] ఘస్రములం దమఃప్రభల భూరిగ్రాహరక్షోమృగ
వ్యాళాదిత్యనరాదిజంతుకలహవ్యాప్తిన్ సమస్తాస్త్రశ
స్త్రాళిన్ మృత్యువులేని జీవనము లోకాధీశ! యిప్పింపవే. 90

౪ అధ్యాయము

వ. అని మఱియు రణంబులందుఁ దన కెదురు లేని శౌర్యంబును, లోక పాలుర నతిక్రమించు మహిమయును, భువనత్రయజయంబును, హిరణ్యకశిపుండు గోరిన నతనితపంబునకు సంతోషించి దుర్లభం బులయిన వరంబులన్నియు నిచ్చి కరుణించి విరించి యిట్లనియె. 91

---

1. వేదమయమైన శరీరముచేత. 2. విస్తరింపఁ జేయుదువు. 3. ఆత్మ + నిష్ఠా + గరిష్ఠులు = బ్రహ్మజ్ఞానశ్రేష్ఠులు. 4. ధ్యానింపఁదగినది. 5. విస్తరింపఁ జేయుదువు. 6. పగటికాలములందు.

శా. అన్నా ! కశ్యపపుత్ర ! దుర్లభములీ యర్థంబు లెవ్వారికిన్,
మున్నెవ్వారలుఁ గోరి రీ వరములన్, మోదించితిన్ నీయెడన్
నన్నుం గోరిన వెల్ల నిచ్చితిఁ బ్రసన్నత్వంబుతో బుద్ధి సం
పన్నత్వంబున నుండుమీ సుమతివై [1]భద్రైకశీలుండవై. 92

వ. అని యిట్లు మోహనంబు లయిన వరంబు లిచ్చి దితినందనుచేతం బూజితుండై యరవిందసంభవుండు [2]బృందారకసందోహవంద్యమానుం డగుచు నిజమందిరంబునకుం జనియె. ఇవ్విధమ్మున [3]నిలింపారాతి వరపరంపరలు సంపాదించుకొని. 93

క. సోదరుఁ జంపిన పగకై
యాదర మించుకయు లేక యసురేంద్రుఁడు కం
జోదరుపై వైరము సు
న్మాదరతం దగుచుఁ జేసె మనుజాధీశా ! 94

సీ. ఒకనాఁడు గంధర్వయూథంబుఁ బరిమార్చు
దివిజుల నొకనాఁడు దెరలఁ దోలు
భుజగుల నొకనాఁడు భోగంబులకుఁ బాపు
గ్రహముల నొకనాఁడు గట్టివైచు
నొకనాఁడు యక్షుల నుగ్రత దండించు
నొకనాఁడు విహగుల నొడిసిపట్టు
నొకనాఁడు సిద్ధుల నొంచి బంధించు
మనుజుల నొకనాఁడు మద మడంచు:

తే. గడిమి నొకనాఁడు కిన్నరఖచరసాధ్య
చారణప్రేతభూత పిశాచవన్య
సత్త్వవిద్యాధరాదుల సంహరించు
దితితనూజుండు దుస్సహతేజుఁ డగుచు.

1 భద్ర + ఏక + శీలుండు = మంగళప్రధానమైన స్వభావముగలవాఁడు. (మంగళకరుఁడనుట) 2 దేవతలు. 3 నిలింప + అరాతి = దేవతలయొక్క శత్రువయిన హిరణ్యకశిపుఁడు.

క. [1]అట్టళ్ళతోడఁ గోటల
గట్టలుకం గూలఁ ద్రోచి కరివ్యాఘ్రములతోఁ
జుట్టు విడిసి దిక్పాలుర
పట్టణములు గొనియె నతఁడు బలమున నధిపా!

క. కృశులై సంప్రాపితమ
దశులై [2]సర్వంకషోగ్ర దైతేయాజ్ఞా
వశులై నిశలును దివములు
దిశలెల్లను గట్టువడియె దీనత ననఘా.

వ. మఱియు నద్దానవేంద్రుండు విద్రుమసోపానంబులును మరకతమణి మయప్రదేశంబులును, వైడూర్యరత్నస్తంభసముదయంబులును జంద్రికాసన్నిభస్ఫటికసంఘటితకుడ్యంబులును, బద్మరాగపీఠకనక కవాటగేహళీవిటంకవాతాయనంబులును, [3]విలంబమానముక్తాఫల దామవితానశోభితధవళపర్యంకంబులును, వివిధచిత్రవిన్యాసంబులును, నిరంతరసురభికుసుమఫలభరితపాదపమహోద్యానంబులును, హేమారవిందసౌగంధికబంధురసరోవరంబులును రమణీయరత్న ప్రాసాదవిశేషంబులును మనోహరపరిమళశీతలమందమారుతంబులును, మృదుమధురనినదకీరకోకిలకులకోలాహలంబును గలిగి విశ్వకర్మనిర్మితంబై త్రైలోక్యరాజ్యలక్ష్మీశోభితంబైన మహేంద్ర భవనంబు సొచ్చి.

మ. దితిపుత్త్రుండు జగత్త్రయైకవిభుఁడై దేవేంద్రసింహాసనో
ద్ధతుఁడై యుండ హరాచ్యుతాంబుజభవుల్ దప్పించి భీతిన్ సమా
గతులై తక్కిన యక్షకిన్నరమరుద్గంధర్వసిద్ధాదు లా
నతులై కానుక లిచ్చి కొల్తు రతనిన్ నానాప్రకారంబులన్. 99

శా. ఏ దిక్పాలురఁ జూచి నేఁ డలుగునో యేదేవు బంధించునో
యే దిగ్భాగముమీఁద దాడి చనునో యే ప్రాణులం జంపునో

---

1 బురుజులమీఁది యిండ్లు. 2 సర్వంకష + ఉగ్ర + దైతేయ + ఆజ్ఞా + వశులు = అందఱిని పత్తిడిచేయుచున్న హిరణ్యకశిపునిఆజ్ఞను ననుసరించువారైనవారై. 3 విలంబమాన = వ్రేలాడుచున్న.

యీప్రత్యక్షేశ్వరుఁ డంచు నొండొరులు చాటించారిదు లాస్థానభూ
వేదిన్ మ్రొగ్గిన నిక్కి చూతురు భయావిర్భూతరోమాంచులై. 100

సీ. కోలాహలము మాని కొలువుండుఁడీ సురలార!
తలఁగి దీవింపుఁడీ తపసులార !
ఫణ లెత్తకుండుఁడు నిక్కి పన్నగేంద్రములార !
ప్రణతులై చనుఁడీ దిక్పాలురార !
గానంబు సేయుఁడీ గంధర్వపతులార !
సందడిఁ బడకుఁడీ సాధ్యులార !
యాడుఁడీ నృత్యంబు లప్సరోజనులార !
చేరిక మ్రొక్కుఁడీ సిద్ధులార !

తే. ఘనకర్పూరవాసితసురభిమధుర
భవ్యసూత్రన[1]మైరేయపానజనిత
సుఖవిలసిత సమరారి సొక్కి నాఁడు
శాంతి లేదింక నిప్పుడుఁ జూడు లధిప ! 101

శా. లీలోద్యానలతానివాసములలో లీలావతీయుక్తుఁడై
[2]హాలాపానవినిద్రమానసమదలోలావృత్తతామ్రాక్షుఁడై
కేళిం దేలఁగ నేఁడు తుంబురుఁడు సంగీతప్రసంగంబులన్
వాలాయంబుఁ గిరంగిఁ జేయుచును దేవద్వేషి సుర్వీశ్వరా! 102

క. యాగములు బాగులు ధరణీ
భాగములం జేరుచుండ బలిదెంచి హవి
ర్భాగములు చాన కైకొనుఁ
[3]జాగింపఁడు దైత్యుఁ డమరసంఘంబునకున్. 1(3

సీ. సకలమహాద్వీపసహితవిశ్వంభరా
స్థలిని దున్నక పండు సస్యచయము
కామధేన్వాదుల కరణి సస్యలు గోరు [illegible]
గోర్కులు గగనంబు గురియుచుండు

1 మైరేయపాన = మద్యపానము చేత, 2 హాలాపాన = మద్యపానముచే.
3 పోపనీఁడు. (సాగునట్లు చేయఁడు)

వననిధు లేడును వాహినీసంఘాత
మును [1]వీచులను రత్నములు వహించు
నుర్వీరుహంబులు నొక్కకాలంబున
నఖిలర్తుగుణముల నతిశయిల్లు

తే. నంబుసంపూరితద్రోణు లగుచు నొప్పఁ
బర్వతంబులు సర్వదిక్పాలవివిధ
గుణము లెల్లను దానె కైకొనుచు దైత్య
విభుఁడు త్రైలోక్యరాజ్యసంవృద్ధి నుండ.

వ. ఇట్లు సకలదిక్కులు నిర్జించి లోకైకనాయకుండై తన యిచ్ఛా ప్రకారంబున నింద్రియసుఖంబు లనుభవించుచుఁ దనియక శాస్త్ర మార్గంబు నతిక్రమించి విరించివరజనితదుర్వారగర్వాతిరేకంబున సుపర్వారాతి యైశ్వర్యవంతుండై పెద్దకాలంబు రాజ్యంబు సేయు నెడ.

ఉ. ఎన్నఁడు మాకు దిక్కు గల, దెన్నఁడు దైత్యునిబాధ మాను, మే
మెన్నఁడు వృద్ధిఁ బొందఁ గల, మెవ్వరు రక్షకు లంచు దేవతా
కిన్నరసిద్ధసాధ్యమునిఖేచరనాయకు లాశ్రయించి రా
పన్నగతల్పు భూరిభవబంధవిమోచనుఁ బద్మలోచనున్. 106

వ. ఇట్లు దానవేంద్రుని యుగ్రదండంబునకు వెఱచి యనన్యశరణ్యులై రహస్యంబున నందఱుం గూడికొని. 107

ఉ. ఎక్కడ నున్నవాఁడు జగదీశ్వరుఁ డాత్మమయుండు మాధవుం
డెక్కడి కేఁగె శాంతులు మునీశులు భిక్షులు రారు క్రమ్మఱం
[2]దిక్కుల నెల్ల నెక్కుడు[3]తుదిం జొర [4]దిక్కగు నట్టి దిక్కుకై
మ్రొక్కెద మేము హస్తయుగముల్ ముకుళించి మదీయరక్షకున్.

వ. అని మఱియు నాహారనిద్రలు మాని చిత్తంబులు పరాయత్తంబులు గానీక సమాహితబుద్ధులై భగవంతుఁడును మహాపురుషుండును మహాత్ముండును విశుద్ధజ్ఞానానందమయుండును నైన హృషీకేశునకు నమస్కరించుచున్న యెడ మేఘరవసమానగంభీరనినదంబున దిశలు

1 తరంగములయందు. 2 రక్షించెడువారిలో 3 చావరాంపులలో 4 స్థానము

మ్రోయించుచు సాధులకు నభయంబుగావించుచు దృశ్యమానుండు
గాక పరమేశ్వరుండైన హరి యిట్లనియె. 109

మ. భయమున్ జెందకుఁడయ్య నిర్జరవరుల్! భద్రంబు మీ కయ్యెడున్
జయమున్ లాభము భూతసంతతికి మత్సంచర్యసంప్రాప్తి న
వ్యయమై చేరు; నెఱుంగుడున్ దితిసుతవ్యాపారభాషావిప
ర్యయముల్; గాలము గూడఁ జంపెదఁ జనుండం దాఁక మీ మాత్రోవలన్

ఆ. శుద్ధసాధులందు సురలందు శ్రుతులందు
గోవులందు విప్రకోటియందు
ధర్మపదవియందుఁ దగిలి నా యందు వాఁ
డెన్నఁ దలఁగు నాఁడె హింస నొందు. 111

క. కన్నకొడుకు శమదమసం
పన్నుఁడు నిర్వైరుఁ డనక ప్రహ్లాదుని వాఁ
డెన్నఁడు రోషంబున నా
పన్నత నొందించు నాఁడె పట్టి వధింతున్. 112

శా. [1]వేధోదత్తవరప్రసాదగరిమన్ వీఁ డింతవాఁడై మిముం
బాధం బెట్టుచు నున్నవాఁ డని మదిన్ భావింతు, భావించి నే
సాధింపం దఱి గాదు, కావునఁ గడున్ సైరించితిన్, మీఁదటన్
సాధింతున్ సురలార! నేఁడు సనుఁడా శంకింప మీ కేటికిన్. 113

వ. అని యిట్లు దనుజమర్దనుండు నిర్దేశించిన [2]సలింపులు గుంపులు గొని
మొక్కి రక్కసునిఁ బట్టుట నిక్కం బని తమతమ దిక్కులకుం
జనిరి. హిరణ్యకశిపునకు విచిత్రచరిత్రులు నలువురు పుత్రు లుద్భ
వించి రందు.

ప్రహ్లాదుని చరిత్రము

సీ. తనయందు సకలభూతములందు నొకభంగి సమహితత్వంబున
[3]సమహితత్వంబున జరుగువాఁడు

1 వేధః + దత్త = బ్రహ్మచేనియ్యఁబడిన. 2. [illegible] 3. సమానభావమున

పెద్దలఁ బొడగన్న భృత్యుని కైవడిఁ
జేరి నమస్కృతుల్ సేయువాఁడు
కన్నుదోయికి నన్యకాంత లడ్డం బైన
మాతృభావము సేసి మరలువాఁడు
తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను
దీనులఁ గావఁ జింతించువాఁడు

తే. సఖులయెడ సోదరస్థితి జరపువాఁడు
దైవతము లంచు గురువులఁ దలఁచువాఁడు
లీలలందును బొంకులు లేనివాఁడు,
[1]లలితమర్యాదుఁ డైన ప్రహ్లాదుఁ డధిప. 115

వ. మఱియును. 116

సీ. [2]ఆకారజన్మవిద్యార్థవరిష్ఠుఁడై
గర్వసంస్తంభసంగతుఁడు గాఁడు
వివిధమహానేక[3]విషయసంపన్నుఁడై
పంచేంద్రియములచేఁ బట్టువడఁడు
[4]భవ్యవయోబలప్రాభవోపేతుఁడై
కామరోషాదులఁ గ్రిందుకొనఁడు
కామినీప్రముఖభోగము లెన్ని గలిగిన
[5]వ్యసనసంసక్తి నావంకఁ బోఁడు

ఆ. విశ్వమందుఁ గన్న విన్నయర్థములందు
[6]వస్తుదృష్టిఁ జేసి వాంఛ యిడఁడు

---

1. చక్కని మర్యాదగలవాఁడు, నియమవంతుఁడని యర్థము. 2. రూపు, పుట్టుక, చదువు, సంపద అను వానిచే మిక్కిలి గొప్పవాఁడై. 3. విషయ = శబ్దాదులు. (భోగవస్తు లన్నమాట) 4. భవ్యమైన, వయస్ = ఈడు, బల = బలము, ప్రాభవ = ప్రభుత్వముతో, ఉపేతుఁడై = కూడినవాఁడై. 5. వ్యసనములందుఁటు 6 వస్తుదృష్టిచేసి సర్వము బ్రహ్మ మనెడి దృష్టితప్ప తద్భిన్నమైనవస్తువు లేదని దృష్టిచేసి. 'అవస్తుదృక్' అనిమూలము.

ధరణీనాథ! దైత్యతనయుండు హరిపర
తంత్రుఁ డై [1]హతాన్యతంత్రుఁ డగుచు. 117

ఆ. సద్గుణంబు లెల్ల సంఘంబులై వచ్చి
యసురరాజతనయు నందు నిలిచి
పాసి చనవు విష్ణుఁ బాయని విధమున
నేఁడు దగిలి యుండు నిర్మలాత్మ! 118

మ. పగవారైన సురేంద్రులున్ సభలలోఁ బ్రహ్లాదసంకాశులన్
సుగుణోపేతుల నెందు నే మెఱుఁగ మంచున్ వృత్తబంధంబులం
బొగడం జొత్తురు సత్కవీంద్రులక్రియన్ భూనాథ! మీబోఁటి స
ద్భగవద్భక్తులు దైత్యరాజతనయున్ బాటించి కీర్తింపరే. 119

క. గుణనిధి యగు ప్రహ్లాదుని
గుణము లనేకములు గలవు గురుకాలమునన్
గణుతింప నశక్యంబులు
ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్. 120

వ. ఇట్లు సద్గుణగరిష్ఠుం డయిన ప్రహ్లాదుండు భగవంతుం డయిన వాసు
దేవునియందు సహజసంవర్ధమాన నిరంతర ధ్యానరతుండై. 121

సీ. శ్రీవల్లభుఁడు దన్నుఁ జేరినయట్లైన
జెలికాండ్రు నెవ్వరిఁ జేరమఱచు
నసురారి దనమ్రోల నాడినయట్లైన
నసురబాలురతోడ నాడ మఱచు
భక్తవత్సలుఁడు సంభాషించినట్లైన
బరభాషలకు మాఱుపలుక మఱచు
సురవంద్యుఁ దనలోనఁ జూచినయట్లైనఁ
జొక్కి సమస్తంబుఁ జూడ మఱచు

1 ఇతర తంత్రములు నణఁచినవాఁడు; (ఇతర ప్రవృత్తి లేనివాఁడన్నమాట)

తే. హరిపదాంభోజయుగచింతనామృతమునఁ
నంతరంగంబు నిండినవాఁడైన యతఁడు
[1]నిత్యపరిపూర్ణుఁ డగుచు సన్నియును మఱచి
జడత లేకయు నుండును జడునిభంగి. 122

శా. పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ [2]లక్షించుచున్ సంతత
శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతా[3]స్వాదసం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁడే తద్విశ్వముం భూవరా! 123

సీ. వైకుంఠచింతావివర్జితచేష్టుఁడై
యొక్కఁడు నేడుచు నొక్కచోట
నశ్రాంతహరిభావనారూఢచిత్తుఁడై
యుద్ధతుఁడై పాడు నొక్కచోట
విష్ణుఁ డింతియకాని వేఱొండు లేదని
[4]యొత్తిలి నగుచుండు నొక్కచోట
నలినాక్షుఁ డను [5]నిధానముఁ గంటి నే నని
యుబ్బి గంతులు వైచు నొక్కచోటఁ

ఆ. బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ
బ్రణయహర్షజనితబాష్పసలిల
మిళితపులకుఁడై నిమీలితనేత్రుఁడై
యొక్కచోట నిలిచి యూరకుండు. 124

వ. ఇట్లు పూర్వజన్మపరమభాగవతసంసర్గసమాగతం బైన ముకుంద
చరణారవిందసేవాతిరేకంబున [6]నఖర్వనిర్వాణభావంబు విస్తరిం
చుచు నప్పటప్పటికి దుర్జనసంసర్గనిమిత్తంబునం దనచిత్తం
బన్యాయత్తంబు గానీక నిజాయత్తంబు సేయుచు నప్రమత్తుండును

1 నిత్యపరిపూర్ణుఁడు = ఎల్లప్పుడు బ్రహ్మానుభవముచే తృప్తి నందినవాఁడు 2 చూచుచు
3. ఆస్వాద = ఱొవుటయందు, సంధానుఁడు = చేరికగలవాఁడు. 4. బిగ్గఁగా. 5. నిధి
(గని) 6. అఖర్వ = అడ్డులేని, నిర్వాణభావము = ఆనందభావమును.

సంసారనివృత్తుండును బుధజనవిధేయుండును మహాభాగధేయుం
డును సుగుణమణిగణగరిష్ఠుండును బరమభాగవతశ్రేష్ఠుండును [1]కర్మ
బంధలతాలవిత్రుండును బవిత్రుండును నైన పుత్త్రునియందు విరో
ధించి సురవిరోధి యనుకంపలేక చంపం బంపె నని పలికిన
నారదునకు ధర్మజుం డిట్లనియె. 125

శా. పుత్త్రుల్ నేర్చిన నేరకున్న జనకుల్ పోషింతు రెల్లప్పుడున్
మిత్త్రత్వంబున బుద్ధి సెప్పి దురితోన్మేషంబు వారింతు రే
శత్రుత్వంబుఁ దలంప రెట్టియెడ నా సౌజన్యరత్నాకరుం
బుత్త్రున్ లోకపవిత్రుఁ దండ్రి [2]నెగులుం బొందింప నెట్లోర్చెనో.

ఉ. బాలుఁ బ్రభావిశాలు హరిపాదపయోరుహచింతనక్రియా
లోలుఁ గృపాళు సాధుగురులోకపదానతఫాలు నిర్మల
శీలు సమస్తసభ్యనుతశీలు విఖండితమోహవల్లికా
జాలు న దేల తండ్రి వధిఁ జంపఁగఁ బంపె మునీంద్ర! చెప్పవే.

౭. అధ్యాయము

వ. అనిన నారదుం డిట్లనియె. 128

శా. లభ్యం బైన సురాధిరాజపదమున్ [3]లక్షింపఁ డశ్రాంతమున్
[4]సభ్యత్వంబున నున్నవాఁ డబలుఁడై [5]జాడ్యంబుతో వీఁడు వి
ద్యాభ్యాసంబునఁ గాని తీవ్రమతి గాఁడంచున్ విచారించి [6]దై
త్యేభ్యుం డొక్కదినంబునం బ్రియసుతున్ వీక్షించి సోత్కంఠుఁడై.

క. చదువనివాఁ డజ్ఞుం డగుఁ
జదివిన సదసద్వివేకచతురత గలుగుం
జదువఁగ వలయును జనులకుఁ
జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ!

వ. అని పలికి యసురలోకపురోహితుండును భగవంతుండును నయిన

---

1 కర్మ + బంధ + లతా + లవిత్రుండు_ కర్మబంధము లనెడు తీగెలకు కొడవలి వంటివాడు 2 కష్టమును 3 గుర్తింపఁడు (లెక్క సేయఁడన్న మాట) 4 సాధు స్వభావముతో (మంచితనముతో) 5 మందత్వము. 6 దైత్య + ఇభ్యుఁడు = రాక్షసరాజు.

శుక్రాచార్యకొడుకులఁ [1]బ్రచండవితర్కులఁ జండామర్కుల రావించి
సత్కరించి యిట్లనియె. 131

శా. అంధప్రక్రియ నున్నవాఁడు, పలుకం డస్మత్ప్రతాపక్రియా
[2]గంధం బించుక లేదు, మీరు గురువుల్ గారుణ్యచిత్తుల్ మనో
బంధుల్ మాన్యులు మాకుఁ బెద్దలు, మముం బాటించి యీబాలకున్
గ్రంథంబుల్ సదివించి నీతికుశలుం గావించి రక్షింపరే. 132

వ. అని పలికి వారలకుఁ బ్రహ్లాదు నప్పగించి తోడ్కొని పోఁ బనిచిన
వారును దనుజరాజకుమారునిం గొనిపోయి యతనికి సవయస్కు
లగు [3]సహశ్రోతల నసురకుమారులం గొందఱం గూర్చి, 133

ఉ. అంచితభక్తితోడ దనుజాధిపు గేహసమీపముం బ్రవే
శించి సురారిరాజసుతుఁ జేకొని శుక్రకుమారకుల్ పఠిం
పించిరి పాఠయోగ్యములు పెక్కులు శాస్త్రము లా కుమారుఁ డా
లించి పఠించె నన్నియుఁ జలింపని వైష్ణవభక్తిపూర్ణుఁడై. 134

క. ఏ పగిది వారు సెప్పిన
నా పగిదిం జదువుఁగాని యట్టిట్టని యా
క్షేపింపఁడు తా నన్నియు
రూపించిన మిథ్యలని [4]నిరూఢమనీషన్. 135

శా. అంతం గొన్నిదినంబు లేఁగిన సురేంద్రారాతి శంకాన్విత
స్వాంతుండై నిజనందనుం గురువు లే జాడం బఠింపించిరో
[5]భ్రాంతుం డేమి పఠించెనో పిలిచి సంభాషించి విద్యాపరి
శ్రాంతిం జూచెదఁ గాక నేఁ డని మహాసౌధాంతరాసీనుఁడై. 136

ఉ. మోదముతోడ దైత్యకులముఖ్యుఁడు రమ్మని చీరఁ బంచె బ్ర
హ్లాదకుమారకున్ భవమహార్ణవతారకుఁ గామరోషలో[6]
భాదివిరోధివర్గపరిహారకుఁ గేశవచింతనామృతా
స్వాద[6]కఠోరకుం [7]గలుషజాలమహాగ్రవనీకుఠారకున్. 137

1 తీవ్రములయిన యూహలు గలవారు. (చురుకైన బుద్ధిగలవారనుట) 2 వాసన కొంచెమైనను సంస్కారము లేదన్నమాట. 3 కూడా వినేవాండ్ల (సహాధ్యాయుల) 4 నిలువుగొన్న బుద్ధితో. (దృఢజ్ఞానముతో) 5 పిచ్చివాఁడు 6 కఠోరకున్_గట్టిపడిన వాఁడు 7 పాపపుంజమనెడు కాఁడవికి గొడ్డలియైనవాఁడు.

వ. ఇట్లు దైత్యాచార్యులచేత నాహూయమానుండై ప్రహ్లాదుండు సను
దెంచిన. 138

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తియుతమే [1]యుద్యోగ? [2]మారూఢసం
విత్సంపన్నుఁడ వైతివే చదివితే వేదంబులున్ శాస్త్రముల్?
వత్సా! రమ్మని చేరఁ జీరి కొడుకున్ వాత్సల్యసంపూర్ణుఁడై
[3]యుత్సంగాగ్రముఁ జేర్చి దానవవిభుం డుత్కంఠ దీపింపఁగన్; 139

క. అనుదినసంతోషణములు,
జనితశ్రమతాపదుఃఖసంశోషణముల్
తనయులసంభాషణములు,
జనకులకుం గర్ణయుగళసద్భూషణముల్. 140

వ. అని మఱియుఁ బుత్త్రా! నీ కెయ్యది భద్రంబై యున్నది సెప్పు
మనినఁ గన్న తండ్రికిఁ బ్రియనందనుం డిట్లనియె. 141

ఉ. ఎల్లశరీరధారులకు నిల్లను చీఁకటినూతిలోపలం
ద్రెళ్ళక మీఁదు నే మను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వము న్నతని దివ్యకళామయ మంచు విష్ణునం
దుల్లముఁ జేర్చి తా నడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ! 142

వ. అని కుమారుం డాడిన ప్రతిపక్షానురూపంబు లయిన సల్లాపంబులు
విని దానవేంద్రుండు నగుచు నిట్లనియె. 143

క. ఎట్టాడిన నట్టాడుదు,
రిట్టట్టని పలుక నెఱుఁగ రితరుల శిశువుల్
[4]బెట్టించి యెవ్వ రేమని,
పట్టించిరొ బాలకునకుఁ బరపక్షంబుల్. 144

శా. నాకుం జూడఁగఁ జోద్య మయ్యెడిఁ గదా నాతండ్రి! యీబుద్ధి దా
నీకున్ లోపలఁ దోఁచెనో పరులు దుర్నీతుల్ పఠింపించిరో
యేకాంతంబున భార్గవుల్ వలికిరో యీ దానవశ్రేణికిన్
వైకుంఠుండు గృతాపరాధుఁ డతనిన్ వర్ణింప నీ కేటికిన్. 145

1 ప్రయత్నము 2 ఆరూఢ + సంవిత్ + సంపన్నుఁడు—ఆత్మవిషయమైన దృఢ
జ్ఞానముతోఁ గూడినవాఁడు. 3 ఉత్సంగ + అగ్రమున = తొడమీఁదను. 4 భయపెట్టి.

మ. సురలం దోలుటయో, సురాధిపతులన్ స్రుక్కించుటో, సిద్ధులం
బరివేధించుటయో, మునిప్రవరులన్ బాధించుటో, యక్షకి
న్నర గంధర్వ విహంగ నాగపతులన్ నాశంబు నొందించుటో,
హరి యంచున్ గిరియంచు నేల చెడ మోహాంధుండవై పుత్రకా!

వ. అనినఁ దండ్రిమాటలకుం బురోహితు నిరీక్షించి ప్రహ్లాదుం డిట్ల
నియె. మోహనిర్మూలనంబు సేసి యెవ్వనియందుఁ దత్పరులయిన
యెఱుకగల పురుషులకుం బరులు దా మనియెడు మాయాకృతం
బయిన య[1]సద్గ్రాహ్యంబగు భేదంబు గానంబడ దట్టి పరమేశ్వరునకు
నమస్కరించెద. 147

శా. అజ్ఞుల్ గొందఱు నేము దా మనుచు మాయం జెంది సర్వాత్మకుం
బ్రజ్ఞాలభ్యు [2]దురన్వయక్రమణునిన్ భాషింపఁగా నేర రా
[3]జిజ్ఞాసాపథమందు మూఢులు గదా చింతింప బ్రహ్మాదివే
దజ్ఞుల్ తత్పరమాత్ము విష్ణు నితరుల్ దర్శింపఁగా నేర్తురే. 148

తే. ఇను మయస్కాంతసన్నిధి నెట్లు [4]భ్రాంత
మగు హృషీకేశు సన్నిధి నా విధమునఁ
గరఁగుచున్నది దైవయోగమునఁ జేసి
బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంతమగుచు. 149

సీ. మందారమకరందమాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే [5]మదనములకు
నిర్మల మందాకినీవీచికలఁ దూఁగు
రాయంచ సనునె తరంగిణులకు
లలిత రసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే [6]కుటజములకుఁ

---

1 అసత్ + గ్రాహ్యంబు = అసత్తు మిథ్యగా గ్రహింపదగిన, 2 మనసెఱుఁగుటను ఘటింపని వ్యాపారముకలవానిని "దురన్వయానుక్రమణోఽనిరూప్యతే" అనిమూలం. 3 జిజ్ఞాసాపథమందు = తెలుసుకొనవలయుననే యిచ్ఛానిష్ఠమైన మార్గమునందు. 4 కదలునో 5 మదనము = ఉమ్మెత్త. 6 కొండమల్లి (కొడిసె)

[1]వర్గత్రితయము సెప్పెన
నర్గళమగు మతివిశేషమమర నరేంద్రా! 156

వ. మఱియుగురుండు శిష్యునకు సామదానభేదదండోపాయంబులన్నియు నెఱింగించి నీతికోవిదుం డయ్యె నని నమ్మి నిశ్చయించి తల్లికి నెఱింగించి తల్లిచేత నలంకృతుం డయిన కులదీపకు నవలోకించి.

ఉ. త్రిప్పకు మన్న మా మతము, దీర్ఘములైన త్రివర్గపాఠముల్
దప్పకు మన్న, నేఁడు మన దైత్యవరేణ్యుని మ్రోల నేము మున్
చెప్పినరీతి గాని మఱి సెప్పకు మన్న విరోధిశాస్త్రముల్,
విప్పకు మన్న దుష్టమగు విష్ణుచరిత్రకథార్థజాలముల్. 158

వ. అని బుజ్జగించి దానవేశ్వరుని సన్నిధికిం దోడి తెచ్చిన. 159

సీ. అడుగడ్గునకు మాధవానుచింతనసుధా
మాధుర్యమున మేను మఱచువాని
నంభోజగర్భాదు లభ్యసింపఁగ లేని
హరిభక్తి[2]పుంభావ మైనవాని
మాతృగర్భము సొచ్చి మన్నది మొదలుగాఁ
జిత్త మచ్యుతుమీఁదఁ జేర్చువాని
[3]నంకించి తనలోన నఖిలప్రపంచంబు
శ్రీవిష్ణుమయ మని చెలఁగువాని

తే. వినయకారుణ్యబుద్ధివివేకలక్ష
ణాదిగుణముల కాటపట్టయినవాని
శిష్యు బుధలోకసంభావ్యుఁ జేరి గురుఁడు
ముందటికి [4]ద్రొబ్బి తండ్రికి మ్రొక్కు మనుచు. 160

క. శిక్షించితి మన్యము లగు
పక్షంబులు మాని నీతిపారగుఁ డయ్యెన్

---

1 ధర్మము_అర్థము_కామము. (మోక్షవిషయము తరువాయిగా) 2 పురుషుని స్వరూపముఅయినవాఁడు; భక్తి ప్రహ్లాదుఁడుగా మూర్తీభవించెననుట. అంకించి = భావించి. 4 త్రోసి, గెంటి.

రక్షోవంశాధీశ్వర !
వీక్షింపుము నీకుమారు విద్యాబలమున్. 161

వ. అని పలికిన శుక్రకుమారకు వచనంబు లాకర్ణించి దానవేంద్రుండు దనకు దండప్రణామంబుచేసి నిలుచున్న కొడుకును దీవించి బాహు దండంబులు సాచి దిగ్గన డగ్గఱం దిగిచి గాఢాలింగనంబు సేసి తనతొడలమీఁద నిడుకొని [1]చుంచుదువ్వి [2]చిబుకంబుఁబుడికి చెక్కిలిముద్దుగొని శిరంబుమూర్కొని ప్రేమాతిరేకసంజనిత బాష్పసలిలబిందుసందోహంబుల నతని వదనారవిందంబు దడుపుచు మందమధురాలాపంబుల నిట్లనియె. 162

శా. చోద్యంబయ్యెడి నింతకాల మరిగెఁ జోధించి యే మేమి సం
వేద్యాంశంబులు సెప్పిరో గురువు లేవెంటం బఠింపించిరో
విద్యాసార మెఱుంగఁ గోరెద [3]భవద్విజ్ఞాతశాస్త్రంబులోఁ
బద్యం బొక్కటి సెప్పి సార్థముగఁ దాత్పర్యంబు భాషింపుమా.

శా. నిన్నుం జెచ్చరు నీతిపారమహిమన్ నీతోడి దైత్యార్భకుల్
గన్నా రన్నియుఁ జెప్ప నేర్తురు గదా గ్రంథార్థముల్ దక్షులై
యన్నా ! యెన్నఁడు నీవు నీతివిదుఁ డౌదంచున్ మహావాంఛతో
నున్నాఁడన్ ననుఁ గన్నతండ్రి [4]భవదీయోత్కర్షముం జూపవే. 164

వ. అనినం గన్నతండ్రికిఁ బ్రియనందనుం డయిన ప్రహ్లాదుం డిట్లనియె.

క. చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థముఖ్యశాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ ! 166

మ. [5]తనుహృద్భాషలసఖ్యమున్ [6]శ్రవణముం దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలోనెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీతొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా

1 జుట్టు. 2 గడ్డము. 3 నీవు ఎఱిఁగినశాస్త్రములో. 4 నీయొక్క గొప్పతనము 5 మనోవాక్కాయములయొక్క పొత్తు (త్రికరణశుద్ధి) 6 ఆత్మజ్ఞానము. (సదసద్వివేకము అన్నమాట)

శా. [1]అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ [2]మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూకాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు [3]భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ [4]క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తివర్జితుల [5]రిక్తవ్యర్థసంసారముల్. 168

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు [6]వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి

తే. దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
[7]కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి. 169

సీ. కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే
పవనగుంఫిత[8]చర్మభస్త్రి గాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి ఢక్క గాక
హరిపూజనము లేని హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మిత [9]దర్వి గాక

1 గ్రుడ్డివానికి చంద్రోదయమువంటివి. 2 మూఁగవానిచే మంచిగ్రంథములు చదివించుట వంటివి. 6 బూడిదలో చేసిన హోమములవంటివి. 4 పందికి పరిమళమువంటివి. 5 రిక్త = శూన్యములయిన, వ్యర్థ = పనికిమాలిన, సంసారములు. 6 ప్రదక్షిణము సేయు. 7 భూమికి భర్త, హరి. [వరాహావతారమున భూమికి హరి భర్తయయ్యెనని పురాణము] 8 తోలుతిత్తి. 9 తెడ్డు.

కమలేశుఁ జూడని కన్నులు కన్నులే
[1]తనుకుడ్యజాలరంధ్రములు గాక

ఆ. చక్రిచింత లేని జన్మంబు జన్మమే
[2]తరళసలిలబుద్బుదంబు గాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడి పశువు గాక. 170

సీ. సంసార[3]జీమూతసంఘంబు విచ్చునే
చక్రిదాస్యప్రభంజనము లేక
[4]తాపత్రయాభీలదావాగ్ను లాఱునే
విష్ణుసేవామృతవృష్టి లేక
సర్వంక[5]షాఘౌఘజలరాశు లింకునే
హరిమనీషాబడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబు లడఁగునే
పద్మాక్షునుతిరవిప్రభలు లేక

తే. నిరుపమాపునరావృత్తి నిష్కళంక
ముక్తినిధిఁ గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాంజనము లేక
తామరసగర్భునకు నైన దానవేంద్ర! 171

వ. అని యివ్విధంబున వెఱపు మఱపు నెఱుంగక యులుకుసెడి పలికెడి కొడుకునుడువులు చెవులకు ములుకుల క్రియ నొదవినఁ [6]గటము లదరఁ బెదవులం గఱచుచు నదరిపడి గురుసుతుని గనుంగొని [7]విమతకథనంబులు గఱపినాఁడ వని దానవేంద్రుం డిట్లనియె. 172

1 శరీరమనెడి గోడకు పెట్టిన జాలకట్టులు. (కిటికీ) 2 నీటిబుడగ. 3 సంసారమను మేఘములగుంపు. 4 ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతికము లను భయంకరములైన కార్చిచ్చులు. 5 అఘ + ఓఘ = పాపసమూహములను. 6 కణతలు. 7 విరోధులు.

చ. పటుతరనీతిశాస్త్రచయ పారగుఁ జేసెద నంచు బాలు నీ
వటు గొనిపోయి వానికి ననర్హములైన విరోధిశాస్త్రముల్
కుటిలతఁ జెప్పినాఁడవు భృగుప్రవరుండ వటంచు నమ్మితిం
కటకట ! బ్రాహ్మణాకృతివి గాక యథార్థము బ్రాహ్మణుండవే.

క. ధర్మేతరవర్తనులును
దుర్మంత్రులు నైన జనుల దురితము లొందున్
మర్మములు గలఁచి కల్మష
కర్మల రోగములు వొందు కైవడి విప్రా !

వ. అనిన రాజునకుఁ బురోహితుం డిట్లనియె. 175

ఉ. తప్పులు లేవు మావలన దానవనాథ ! విరోధిశాస్త్రముల్
సెప్పము క్రూరులై పరులు సెప్పరు మీచరణంబులాన సు
మ్మెప్పుడు మీ కుమారునకు నింతయు [1]నైజమనీష యెవ్వరుం
జెప్పెడిపాటి గాదు ప్రతిచింతఁ దలంపుము నేర్పుకైవశీ. 176

క. మిత్రులము పురోహితులము
పాత్రులమే మదియుఁ గాక భార్గవులము నీ
పుత్రుని నిటువలెఁ జేయఁగ
శత్రులమే దైత్యజలధిచంద్రమ ! వింటే. 177

వ. అనిన గురునందనుం గోపింపక దైత్యవల్లభుండు గొడుకు నవలోకించి
యిట్లనియె.

క. ఒజ్జలు సెప్పని యీమతి
మజ్జాతుఁడవైన నీకు మఱి యెవ్వరిచే
[2]సుజ్జాత మయ్యె బాలక !
తజ్జనులం బేరుకొనుము తగ నా మ్రోలన్. 179

వ. అనినఁ దండ్రికిఁ బ్రహ్లాదుం డిట్లనియె. 180

---

1 నైజ + మనీష = సహజముగాఁబుట్టిన బుద్ధి. 2 పుట్టుకొనివచ్చినది.

ఉ. అచ్చపుఁ జీఁకటిం బడి గృహవ్రతులై [1]విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్వితచర్వణు లైనవారికిం
జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిన నైన నిజేచ్ఛ నైన నే
మిచ్చిన నైనఁ గానలకు నేఁగిన నైన హరిప్రబోధముల్. 181

ఉ. కానని వాని నూఁతగొని కానని వాఁడు విశిష్టవస్తువుల్
గానని భంగిఁ గర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణుఁ, గొంద ఱటఁ గందు [2]రకించన వైష్ణవాంఘ్రిసం
స్థానరజోభిషిక్తు లగు సంహృతకర్ములు దానవేశ్వరా ! 182

శా. శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోనాథ ! వే యేటికిన్
గాధల్ [3]మాధవశేముషీతరణిసాంగత్యంబునం గాక దు
ర్మేధన్ దాఁటఁగ వచ్చునే [4]సుతవధూమీనోగ్రవాంఛామద
క్రోధోల్లోలవిశాలసంసృతిమహాఘోరామితాంభోనిధిన్. 183

వ. అని పలికినకొడుకును ధిక్కరించి మక్కువ సేయక రక్కసులఱేఁడు దనతొడలపై నుండనీక గొబ్బున దిగద్రొబ్బి నిబ్బరంబగు కోపంబు దీపింప వేఁడిచూపుల మింట మంటలెగయ మంత్రులం జూచి యిట్లనియె. 184

శా. క్రోడంబై పినతండ్రిఁ జంపెనని తాఁ గ్రోధించి చిత్తంబులో
వీడంజేయఁడు బంటుభంగి హరికిన్ విద్వేషికిన్ భక్తుఁడై
యోడం డక్కట! ప్రాణవాయువులు వీఁ డొప్పించుచున్నాఁడు నా
తోడన్ వైరమువట్టె నిట్టి జనకద్రోహిన్ మహిం గంటిరే. 185

వ. అని రాక్షసవీరుల నీక్షించి యిట్లనియె. 186

---

1 విషయలోలురై. 2 గొప్పవారగు విష్ణుభక్తులపాదముధూళితో నభిషేకింపఁ బడిన వారు. 3 విష్ణువిషయకబుద్ధియను పడవతోడిసంబంధముతో. 4 బిడ్డలు భార్యయను చేపలతో, భయంకరమైన కోరికలతో, గర్వక్రోధములను గొప్పకెరటాలతో, విశాలమైన సంసారమను గొప్పభయావహమైన పరిమితిలేని సముద్రమునందు.

హిరణ్యకశిపుండు ప్రహ్లాదుని బహువిధోపాయంబుల హింసించుట.

శా. [1]పంచాబ్దంబులవాఁడు తండ్రి నగు నా పక్షంబు నిందించి య
త్యంచిద్భీతియు లేక విష్ణునహితుం గీర్తించుచున్నాఁడు వ
ల్దంచుం జెప్పిన మానఁ డంగమునఁ బుత్రాకారతన్ వ్యాధి జ
న్మించెన్ వీని వధించి రండు దనుజుల్ మీ మీ పటుత్వంబులన్.

శా. అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్షసేయుక్రియ నీ యజ్ఞాంగసంద్రోహి దు
స్సంగుం గేశవపక్షపాతి నతనుం జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతిఁ జరించెదం గులము నిర్దోషంబు గావించెదన్. 188

క. హంతవ్యుఁడు రక్షింపను
[2]మంతవ్యుఁడు గాఁడు యముని మందిరమునకున్
గంతవ్యుఁడు వధమున [3]కుప
రంతవ్యుం డనక చంపి రం డీ పనుపున్. 189

వ. అని దానవేంద్రుం డానతిచ్చిన వాఁడికోఱలు గల రక్కసులు పెక్కండ్రు శూలహస్తులై వక్త్రంబులు దెఱచికొని యుబ్బి బొబ్బలిడుచు ధూమసహితదావదహనంబునుం బోలెఁ [4]దామ్రసంకాశంబు లయిన కేశంబులు మెఱయ [5]ఛేదనభేదనదహనంబులు సేయుచు. 190

ఉ. బాలుఁడు రాచబిడ్డఁడు కృపాళుఁడు సాధుఁడు లోకమాన్యసం
శీలుఁడు వీఁ డవధ్యుఁ డని చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై
శూలములం దదంగముల సుస్థిరులై ప్రహరించి యుగ్రతా
చాలత నంటఁగన్ దివిజశత్రుఁడు వ్యగ్రుఁ డయ్యె భూవరా! 191

చ. పలువురు దానవుల్ వొడువ బాలుని దేహము లేశమాత్రము
[6]న్నొలియదు లోపలన్ రుధిర ముబ్బదు కందదు శల్యసంఘమున్.

---

1 ఐదేండ్లవాఁడు. 2 ఆలోచింపఁదగినవాఁడు. 3 మాని విడువఁదగినవాఁడు.
4 తామ్రము = రాగిలో. 5 చీల్చుట పొడుచుట [illegible]

పొలియదు దృష్టివైభవము నష్టము గాదు ముకుందుకాంతియుం
బొలియదు నాతపశ్శ్రమము పుట్టుచు పట్టుచు దీనభావమున్. 192

ఉ. తన్నుఁ నిశాచరుల్ వొడువ దైత్యకుమారుఁడు మాటిమాటికో
పన్నగశాయి! యోదనుజభంజన! యోజగదీశ! యోమహా
పన్నశరణ్య! యోనిఖిలపావన! యంచు నుతించుఁ గాని తాఁ
గన్నుల నీరు దేఁడు భయకంపసమేతుఁడు గాఁడు భూవరా! 193

ఉ. పాఱఁడు లేచి దిక్కులకు బాహువు లొడ్డఁడు బంధురాజిలోఁ
దూఱఁడు ఘోరకృత్య మని దూఱఁడు తండ్రిని మిత్రవర్గముం
జీరఁడు మాతృసంఘమును వసించు సువర్ణగృహంబులోనికిం
దూఱఁడు కావరే యనఁడు తాపము నొందఁడు [1]కంటగింపఁడున్.

వ. ఇట్లు సర్వాత్మకంబై యిట్టి దట్టిదని నిర్దేశింప రాని పరబ్రహ్మంబు దానయై యమ్మహావిష్ణునియందుఁ జిత్తంబు చేర్చి తన్మయుండయి పరమానందంబునం బొంది యున్న ప్రహ్లాదునియందు రాక్షసేంద్రునిచేఁ గింకరులచేతం జేయంబడుచున్న మారణకర్మంబులు పాపకర్మునియందుఁ బ్రయుక్తంబు లైన సత్కారంబులుం బోలె విఫలంబు లగుటం జూచి.

ఉ. శూలములన్ నిశాచరులు [2]త్రుళ్ళక దేహము నిగ్రహింపఁగా
బాలుఁడు నీల్గఁడేఁ బడఁడు పాఱఁడు చావఁడు తండ్రినైన నా
పాలికి వచ్చి చక్రధరుపక్షము మానితి నంచుఁ బాదముల్
ఫాలము సోఁక మ్రొక్కఁ డనపాయత నొందుట కేమి హేతువో.

వ. అని శంకింపుచు. 197

సీ. ఒకమాటు [3]దిక్కరియూథంబుఁ దెప్పించి
కరటి సింధుభటులఁ ద్రొక్కింపఁబంపు

---

1 కంటగింపఁడు = ద్వేషము నొందఁడు (రోఁతపడఁడు) 2 వెనుదీయక (సంకోచింపక) 'త్రుళ్ళక' అనియును పాఠము. అప్పుడు నలుగుడుపడగా అని యర్థముచెప్పవలెను, 3 దిగ్గజ సముదాయమును.

నొకమాటు విషభీకరోరగశ్రేణుల
గడువడి సర్పభక్షుఁ గఱవఁ బంపు
నొకమాటు [1]హేతిసంఘోగ్రాగ్నినలములోన
విసరి కుమారుని వ్రేయఁ బంపు
నొకమాటు [2]కూలంకషాలోలజలధిలోఁ
మొత్తించి శాబకు ముంచఁ బంపు

ఆ. విషముఁ బెట్టఁ బంపు [3]విదళింపఁగాఁ బంపు
దొడ్డకొండచఱులఁ ద్రోయఁ బంపుఁ
బట్టి కట్టఁ బంపు బాధింపఁగాఁ బంపు
బాలుఁ గినిసి దనుజపాలుఁ డధిప. 198

సీ. ఒకవేళ [4]నభిచార హోమంబు సేయించు
నొకవేళ నెండల నుండఁ బంచు
నొకవేళ వానల నుపహతి నొందించు
నొకవేళ రంధ్రంబు లుక్కఁ బట్టు
నొకవేళఁ దమమాయ నొదవించి బెగడించు
నొకవేళ మంచున నొంటి నిలుపు
నొకవేళఁ బెనుగాలి కున్ముఖుఁ గావించు
నొకవేళఁ బాతించు నుర్వియందు

తే. నీరు నన్నంబు నిడనీక నిగ్రహించుఁ
[5]గశల [6]నడిపించు ఱువ్వించు గండశిలలఁ
గదల వ్రేయించు నేయించు ఘనశరములఁ
గొడుకు నొకవేళ సమరారి క్రోధి యగుచు. 199

వ. మఱియు ననేకమారణోపాయంబులఁ బాపరహితుం డైనపాపని
రూపుమాపలేక యేకాంతంబున నంతంతచింతాపరిశ్రాంతుండయి
రాక్షసేంద్రుండు దన మనంబున. 200

---

1 మంటల సముదాయముతో గూడిన భయంకరమైన యగ్నియందు 2 చెలియలికట్టను ఒరయుచున్న పెద్ద కెరటాలతో గూడిన సముద్రమునందు 3 చీల్పగా 4 శత్రుహింసకై చేయు శ్యేనయాగాదికము 5 కశలన్ = కొరడాలచేత 6 అడిపించున్ = కొట్టును (అడుచు)

ఉ. ముంచితి వార్ధులన్, గదల మొత్తితి, శైలతటంబులందు ద్రొ
బ్బించితి, శస్త్రరాజిఁ బొడిపించితి, మీఁద ¹నిభేంద్రపంక్తి ద్రొ
క్కించితి, ధిక్కరించితి, శపించితి, ఘోరదవాగ్నులందుఁ ద్రో
యించితిఁ బెక్కుపాట్ల నలయించితిఁ, జావఁ డిదేమి చిత్రమో! 201

చ. ఎఱుఁగఁడు జీవనౌషధము లెవ్వరు ²భర్తలు లేరు, బాధలం
దఱలఁడు నైజతేజమునఁ దథ్యము జాడ్యము లేదు, మిక్కిలిన్
మెఱయుచునున్నవాఁడు, ఒకనిమేషము దైన్యము నొందఁ, డింక నే
తెఱఁగున ద్రుంతు? వేసరితి, దివ్యము వీని ప్రభావ మెట్టిదో. 202

వ. అదియునుంగాక తొల్లి శునశ్శేపుండను మునికుమారుండు దండ్రి
చేత యాగపశుత్వంబునకు దత్తుండయి తండ్రి తనకు నపకారియని
తలంపక బ్రదికినచందంబున. 203

క. ఆగ్రహమున నేఁ జేసిన
³నిగ్రహములు పసులతోడ నెఱి నొకనాఁడున్
⁴విగ్రహము లనుచుఁ బలుకఁడ
నుగ్రహములుగా స్మరించు నొవ్వఁడు మదిలోన్. 204

వ. కావున వీఁడు మహాప్రభావసంపన్నుఁడు వీని కెందును భయంబు
లేదు, వీనితోడి విరోధంబునం దనకు మృత్యువు సిద్ధించునని నిర్ణ
యించి చిన్నఁబోయి ఖిన్నుండై పరిఖిన్నుండు గాక క్రిందు
సూచుచు విషణ్ణుండై చింతనంబు సేయుచున్న రాజునకు మంతనం
బునఁ జండామర్కు లిట్లనిరి. 205

శా. శుభ్రాభ్యాళివి నీప్రతాపము మహాచోద్యంబు దైత్యేంద్ర! రో
షభ్రూయుగ్మవిజృంభణంబున దిగీశవ్రాతముం బోరులన్
విభ్రాంతంబుగఁ జేసి యేలితి గదా విశ్వంబు, వీఁ డెంత? యీ
⁵దభ్రోక్తుల్ ⁶గుణదోషశూన్యములు చింతం బొంద నీ కేటికిన్. 206

---

1 గొప్పయేనుఁగుల బారుచే 2 భరించువారు 3 శిక్షలు 4 విరోధములు 5 దభ్ర +
ఉక్తుల్ = చిన్నమాటలు (దభ్రము = చిన్నది.) బాలుని మాటలని భావము 6 గుణము,
దోషము లేనివి. లెక్కచేయఁదగినవి కానివన్నమాట.

శా. వక్రింబైన జనుండు వృద్ధగురుసేవం జేసి సుజ్ఞానయో
పక్రాంతిం గా విలసిల్లు మీఁదట వయఃపాకంబుతో బాలకుం
శక్రద్వేషణబుద్ధిఁ జేయుము మదిం జాలింపు మీ రోషముం
శుక్రాచార్యులు వచ్చునంత కితఁడుం సుశ్రీయుతుం డయ్యెడున్.

వ. అని గురుపుత్రులు పలికిన రాక్షసేశ్వరుండు గృహస్థులైన రాజులకు నుపదేశింపఁ దగిన ధర్మార్థకామంబులు ప్రహ్లాదునకు నుపదేశింపుఁ డని యనుజ్ఞ సేసిన, వారు నతనికిఁ ద్రివర్గంబు నుపదేశించిన, నతండు రాగద్వేషంబులచేత విషయాసక్తులైన వారలకు గ్రాహ్యంబులైన ధర్మార్థకామంబులుఁ దనకు నగ్రాహ్యంబు లనియును వ్యవహారప్రసిద్ధికొఱకైన భేదంబుగాని యాత్మభేదంబు లే దనియును ననర్థంబులయం దర్థకల్పన సేయుట [1]దిగ్భ్రమం బనియు నిశ్చయించి గురూపదిష్టశాస్త్రంబులు మంచి వని తలంపక గురువులు దమ గృహస్థకర్మానుష్ఠానంబులకుం బోయిన సమయంబున. 208

క. ఆటలకుఁ దన్ను రమ్మని
పాటించి నిశాటసుతులు భాషించిన [2]దో
షాటకులేంద్రకుమారుఁడు
పాటవమున వారిఁ జీరి ప్రజ్ఞాన్వితుఁడై. 209

క. చెప్పెడ నొక చదువు మంచిది
చెప్పెడిఁ [3]దగులములు సెవులు సిందఱ గొనఁగాఁ
జెప్పెదు మనయెడ నోజలు,
సెప్పెద నొకచదువు వినుఁడు చిత్తము లలరన్. 219

వ. అని రాజకుమారుండు గావునఁ గరుణించి సంగడికాండ్రతోడ [4]నగియొడి చందంబునఁ గ్రీడలాడుచు సమానవయస్కులైన దైత్యకుమారుల కెల్ల నేకాంతంబున నిట్లనియె. 211

1 భ్రాంతి 2 దోషాట = రాక్షసులయొక్క 3 ఆలుబిడ్డల లంకెలు 4 పరిహాసమున కట్లు

౬ అధ్యాయము

ఉ. బాలకులార రండు మనప్రాయపుబాలురు కొందఱుర్విపైఁ
గూలుట గంటిరే? గురుఁడు క్రూరుఁ డనర్థచయంబునందు దు
శ్శీలత సర్గకల్పనముఁ జేసెడి గ్రాహ్యము గాదు శాస్త్రమున్
మేలెఱిఁగించెదన్ వినిన మీకు నిరంతరభద్ర మయ్యెడిన్. 212

వ. వినుండు సకలజన్మంబులందును ధర్మార్థచరణకారణం బయిన మానుషజన్మంబు దుర్లభంబు. అందుఁ బురుషత్వంబు దుర్గమంబు. అదియు శతవర్షపరిమితంబైన జీవితకాలంబున నియతంబై యుండు. అందు సగమంధకారబంధురం బయి రాత్రి రూపంబున నిద్రాది వ్యవహారంబుల నిరర్థకంబయి చను. చిక్కిన పంచాశద్వత్సరంబు లందును బాల కైశోర కౌమారాదివయోవిశేషంబుల వింశతి హాయనంబులు గడచు. కడమ ముప్పదియబ్దంబులు నిద్రియంబుల చేతఁ బట్టువడి దురవగాహంబు లయిన కామ క్రోధ లోభ మోహ మద మత్సరంబులను పాశంబులం గట్టువడి విడివడ సమర్థుండు గాక ప్రాణంబులకంటె మధురాయమానయైన [1]తృష్ణకు లోనై భృత్య తస్కరవణిక్కర్మంబులఁ బ్రాణహానియైన నంగీకరించి పరార్థంబుల నర్థించుచు రహస్యసంభోగచాతుర్యసౌందర్యవిశేషంబుల ధైర్య వల్లికాలవిత్రంబులయిన కళత్రంబులను, మహనీయమంజులమధు రాలాపంబులు గలిగి వశులయిన శిశువులను, శీలవయోరూపధన్య లగు కన్యలను వినయవివేకవిద్యాలంకారులయిన కుమారులను, గామితఫలప్రదాత లగు భ్రాతలను, మమత్వప్రేమదైన్యజనకు లయిన జననీజనకులను, సకలసౌజన్యసింధువు లయిన బంధువులను, ధనకనకవస్తువాహనసుందరంబు లయిన మందిరంబులను, సుకరంబు లైన పశుభృత్యనికరంబులను, వంశపరంపరాయత్తంబు లయిన విత్తంబులను, వర్జింపలేక సంసారంబు [2]నిర్జించు నుపాయంబుఁగానక

---

1 ఆశకు 2 జయించు (టీక)

తంతువర్గంబున నిర్గమద్వారశూన్యం బగు మందిరంబుఁ జేరి చుట్టువడి వెడలెడి పాటవంబు సాలక తగులువడు కీటకంబుచందంబున గృహస్థుండు స్వయంకృతకర్మబద్ధుండై శిశ్నోదరాదిసుఖంబుల బ్రమత్తుండయి నిజకుటుంబపోషణపరవశ్యంబున విరక్తిమార్గంబు దెలియనేరక స్వకీయపరకీయభిన్నభావంబున సంధకారంబునం బ్రవేశించుం గావునఁ [1]కౌమారసమయంబున [2]మనీషాగరిష్ఠుండై పరమభాగవతధర్మంబు లనుష్ఠింపవలయు. దుఃఖంబులు వాంఛితంబులుగాక చేకుఱుభంగి సుఖంబులును గాలానుసారంబులై లబ్ధంబు లగుం గావున వృథాప్రయాసంబున నాయుర్వ్యయంబు సేయం జనదు. హరిభజనంబున మోక్షంబు సిద్ధించు. విష్ణుండు సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు. [3]ముముక్షు వైన దేహికి దేహావసానపర్యంతంబు నారాయణచరణారవింద సేవనంబు కర్తవ్యంబు. 213

సీ. కంటిరే మనవారు ఘనులు గృహస్థులై
        విఫలులై కైకొన్న వెక్కిలితనము
[4]భద్రార్థులై యుండి పాయరు సంసార
        పద్ధతి నూరక పట్టువడిరి
కలయోనులం దెల్ల గర్భాదివ్యథలఁ
        బురుషుండు దేహియై పుట్టుచుండుఁ
దన్నెఱుంగఁడు కర్మతంత్రుండై కడపట
        ముట్టఁడు భవశతములకు నయిన

ఆ. దీన శుభము లేదు దివ్యకీర్తియు లేదు
జగతిఁ బుట్టి పుట్టి చచ్చిచచ్చి
పొరల నేల మనకుఁ బుట్టని చావని
త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి. 214

1 బాల్యమునందు 2 మనీషా + గరిష్ఠుండు = బుద్ధిచే గొప్పవాఁడు 3 మోక్షము కోరువాఁడు 4 శుభము కోరువారు (మోక్షము నభిలషించువారన్నమాట)

శా. [1]హాలాపానవిజృంభమాణమదగర్వాతీతదేహోల్లస
ద్బాలాలోకనశృంఖలానిగళసంబద్ధాత్ముఁడై కేశమున్
[2]వేలానిస్సరణంబు గానక మహావిద్వాంసుఁడుం గామినీ
[3]హేలాకృష్టకురంగశాబక మనున్ హీనస్థితిన్ వింటిరే. 215

ఆ. విషయసక్తులైన విబుధాహితులకేల
[4]మనికి సేయు ముక్తిమార్గవాంఛ
నాదిదేవు విష్ణు నాశ్రయింపుఁడు ముక్త
సంగజనులఁ గూడి శైశవమున. 216

వ. కావున విషయంబులఁ జిక్కనయిన రక్కసులకు హరిభజనంబు శక్యంబు గాదు. రమ్య మయ్యును బాహ్యాంతరప్రయాసగమ్య మని తలంచితిరేనిఁ జెప్పెద. సర్వభూతాత్మకుండై సర్వదిక్కాలసిద్ధుండై బ్రహ్మ కడపలగాఁ గల చరాచరస్థూల సూక్ష్మజీవసంఘంబులందును నభోవాయుకుంభినీసలిలతేజంబు లనియెడు మహాభూతంబులయందును భూతవికారంబు లయిన ఘటపటాదులయందును గుణసామ్యంబయిన ప్రధానమందును గుణవ్యతికరంబైన మహత్తత్త్వాదియందును రజస్సత్త్వతమోగుణంబులయందును భగవంతుం డవ్యయుం డీశ్వరుండు పరమాత్మ పరబ్రహ్మ మనియెడు వాచకశబ్దంబులు గల్గి కేవలానుభవానందస్వరూపకుండు నవికల్పితుండు ననిర్దేశ్యుండు నయిన పరమేశ్వరుండు త్రిగుణాత్మకంబైన తన దివ్యమాయచేత [5]నంతర్హితైశ్వర్యుండై వ్యాప్యవ్యాపకరూపంబులం జేసి దృశ్యుండును ద్రష్టయు భోగ్యుండును భోక్తయు నయి నిర్దేశింపఁదగి వికల్పితుండై యుండు. తత్కారణంబున నాసురభావంబు విడిచి సర్వభూతంబులందును దయాసుహృద్భావంబులు గర్తవ్యంబులు. దయాసుహృద్భావంబులు గల్గిన నధోక్షజుండు సంతసించు. అనంతుం

1 హాలా + పాన = కల్లు త్రాగుటచే 2 ఒడ్డు చేరుట 3 హేలా = విలాసముల చేత ఆకృష్ట = ఆకర్షింపఁబడిన, కురంగశాబకము = లేడిపిల్ల 4 జీవించుట 5 అంతర్హిత + ఐశ్వర్యుఁడు = కప్పఁబడిన యైశ్వర్యము గలవాఁడు

డాద్యంబు హరి సంతసించిన నలభ్యం బయ్యెడిదియు లేదు. జనా
ర్దనచరణసరసీరుహయుగళస్మరణసుధారసపానపరవశుల మైతిమేని
మనకు దైవవశంబున నకాంక్షితంబులై సిద్ధించు ధర్మార్థకామం
బులుఁ గాంక్షితంబై సిద్ధించు మోక్షంబును నేల? త్రివర్గంబును
నాత్మవిద్యయుం దర్క దండనీతి జీవికాదు లన్నియుఁ ద్రైగుణ్య
విషయంబులైన వేదంబువలనం బ్రతిపాద్యంబులు. నిస్త్రైగుణ్య
లక్షణంబునం బరమపురుషుం డైన హరికి నాత్మసమర్పణంబు
సేయుట మేలు. పరమాత్మతత్త్వజ్ఞానోదయంబునం జేసి స్వపర
భ్రాంతి సేయక పురుషుండు [1]యోగావహితత్త్వంబున నాత్మ
వికల్పభేదంబులం గలలోఁ గన్న విశేషంబులభంగి నసత్యం బనక
మిథ్య యని తలంచు నని మఱియుఁ బ్రహ్లాదుం డిట్లనియెను. 217

మ. నరుఁడుం దానును మైత్రితో మెలఁగుచున్ నారాయణుం డింతయున్
వరుసన్ నారదసంయమీశ్వరునకున్ వ్యాఖ్యానముం జేసె మున్;
హరిభక్తాంఘ్రిపరాగశుద్ధతను లేకాంతుల్ మహాకించనుల్
పరతత్త్వజ్ఞులు గాని నేరరు మదిన్ భావింప నీ జ్ఞానమున్. 218

వ. తొల్లి నేను దివ్యదృష్టి గల నారదమహామునివలన సవిశేషంబయిన
యీ జ్ఞానంబును బరమభాగవతధర్మంబును వింటి ననిన వెఱఁగు
పడి దైత్యబాలకు లద్దనుజరాజకుమారున కిట్లనిరి. 219

ఉ. [2]మంటిమి గూడి, భార్గవకుమారకులొద్ద ననేకశాస్త్రముల్
వింటిమి, లేఁడు సద్గురుఁడు వేఱొకఁ డెన్నఁడు, రాజశాల ను
క్కంటికి నైన రాదు సొరఁగా, వెలికిం జన రాదు, నీకు [3]ని
ష్కంటకవృత్తి నెవ్వఁడు [4]ప్రగల్భుఁడు సెప్పె గుణాఢ్య! చెప్పుమా.

క. సేవింతుము నిన్నెప్పుడు
భావింతుము రాజ వనుచు బహుమానములం

---

1 యోగ + అవహితత్వంబున = యోగముతో గూడిన జ్ఞానముతో. 2 బ్రతికితిమి
3 ఏయడ్డమును లేకుండ. 4 దిట్ట = ధీరుఁడు లేక నేర్పరి.

గావింతుము తెలియుము నీ
కీ వింతమతిప్రకాశ మే క్రియఁ గలిగెన్. 221

వ. అని యిట్లు దైత్యనందనులు దన్నడిగినఁ బరమభాగవతకులాలంకారుం డైన ప్రహ్లాదుండు నగి తనకుఁ బూర్వంబునందు వినంబడిన నారదుమాటలు దలంచి యిట్లనియె. 222

8 అధ్యాయము

శా. అశ్రాంతోగ్రతపంబు మందరనగస్థై సల్పించి మాతండ్రి దు
ర్దర్పాంతిం జని యుండఁ జీమగమిచేతన్ భోగిచందంబునన్
భక్షింపంబడెఁ బూర్వపాపములచేఁ బాపాత్మకుం డంచు మున్
రక్షస్సంఘముమీఁద నిర్జరులు సంరంభించి యుద్ధాతులై. 223

శా. ప్రస్థానోచితభేరిభాంకృతులతోఁ [1]బాకారియుం దారు శౌ
ర్యస్థైర్యంబులు సేఁగుఁబెంచినఁ దదీయాటోపవిభ్రాంతులై
[2]స్వస్థేమల్ దిగనాడి పుత్రధన[3]యోషామిత్రసంపత్కళా
ప్రస్థానంబులు డించి పాఱి రసురుల్ ప్రాణావనోద్యుక్తులై. 224

మత్తకోకిలము.

ప్రల్లదంబున వేల్పు లున్మదులై బోఁటి రాజనివాసముం
గొల్లవెట్టి సమస్తవస్తువుఁ గూర్చి తెచ్చి గొని పోవఁగా
నిల్లు సొచ్చి విశంకుఁడై యమరేశ్వరుం డెడలించి మా
తల్లిఁ దాఁ గొనిబట్టెఁ బెగ్గునఁ దత్తఱమ్ము విలపింపఁగాన్. 225

వ. ఇట్లు సురేంద్రుండు మా తల్లిం బట్టికొని పోవుచుండ నమ్ముగుద [4]కురరి యను పులుఁగుక్రియ మొఱలిడఁ బురమున దైవయోగంబున నారదుండు పొడఁగని యిట్లనియె. 226

ఉ. స్వర్భువనాధినాథ! సురసత్తమ! వేల్పులలోన మిక్కిలిన్
నిర్భరపుణ్యమూర్తివి సునీతివి మానినిఁ బట్ట నేల యీ

---

1 ఇంద్రుఁడు (పాక + అరి) 2 స్థేమా = స్థితి 3 యోషా = స్త్రీ 4 పక్షివిశేషము. (ఆకులకుముకిపిట్ట యని కొందరు)

గర్భిణి [1]నాతురన్ విడువు కల్మషమానసురాలు గాదు నీ
దుర్భరరోషమున్ నిలుపు దుర్జయుఁ డైన నిలింపవైరిపై. 227

వ. అనిన వేల్పుఁదపసికి వేయిగన్నులుగల [2]గఱువ యిట్లనియె 228

ఉ. [3]అంతనిదాన మైన దితిజాధిపువీర్యము దీనికుక్షి న
త్యంతసమృద్ధి నొందెడి మహాత్మక! కావునఁ దత్ప్రసూతిప
ర్యంతము బద్ధఁ జేసి జనితార్భకు వజ్రము[4]ధారఁ ద్రుంచి ని
శ్చింతుఁడ నై దితిన్ విడుతు సిద్ధము దానవరాజవల్లభన్. 229

వ. అని పలికిన వేల్పుఱేనికిం దపసి యిట్లనియె. 230

శా. నిర్భీతుండు ప్రశస్తభాగవతుఁ డున్నిద్రుండు జన్మాంతరా
విర్భూతాచ్యుతపాదభక్తిమహిమావిష్టుండు దైత్యాంగనా
గర్భస్థుం డగు బాలకుండు బహుసంగ్రామాద్యుపాయంబులన్
దుర్భావంబునఁ బొంది చావఁడు భవద్ద్రోహంబు విభ్రాంతుఁ డై. 231

వ. అని దేవముని నిర్దేశించిన నతని వచనంబు మన్నించి తానును హరి
భక్తుండు గావున దేవేంద్రుండు భక్తిబాంధవంబున మహా యువ్వను
విడిచి వలగొని సురలోకంబునకుం జనియె. మునీంద్రుండును
మజ్జననియందుఁ బుత్త్రికాభావంబు సేసి యూఱడించి నిజాశ్రమంబు
నకుం గొనిపోయి నీవు పతివ్రతవు, నీ యుదరంబునఁ బరమభాగవ
తుండయిన ప్రాణి యున్నవాఁడు, తపోమహాత్మ్యంబునం గృతా
ర్థుండై నీ పెనిమిటి రాఁగలం, డంతదాక నీ విక్కడ నుండు మనిన
సమ్మతించి. 232

శా. యోషారత్నము [5]నాథదైవత విశాలోద్యోగ మాతల్లి [6]ని
ర్ద్వైషమ్యంబున నాథురాక మదిలో వాంఛించి నిర్దోషయై
యాపద్భీతియు లేక గర్భపరిరక్షేచ్ఛన్ విచారించి శు
శ్రూషల్ సేయుచు నుండె నారదునకున్ సువ్యక్తశీలంబునన్.

---

1 పీడితురాలిని 2 ఘనుఁడు 3 నాశమునకు కారణము (జగన్నాశమునకు హేతువైనది) 4 ధారన్ = అంచుతో 5 భర్తయే దైవముని నమ్మినది. పతివ్రత యన్నమాట 6 విరోధభావము లేక

వ. ఇట్లు దనకుఁ బరిచర్య సేయుచున్న దైత్యరాజకుటుంబినికి నాశ్రితరక్షావిశారదుండైన నారదుండు నిజసామర్థ్యంబున నభయం బిచ్చి గర్భస్థుండ నైన నన్ను నుద్దేశించి ధర్మతత్త్వంబును నిర్మలజ్ఞానంబును నుపదేశించిన, నమ్ముద్దియ దద్దయుం బెద్దకాలంబునాఁటి వినికి గావున నాఁడుది యగుటం జేసి, పరిపాటి దప్పి నూటి లేక మఱచె, నారదుండు నాయెడఁ గృప గల నిమిత్తంబున. 234

క. వెల్లిగొని నాఁటనుండియు
నుల్లసితం బైన దైవయోగంబున శో
భిల్లెడు మునిమత మంతయు
నుల్లంబున మఱవు పుట్ట దొకనాఁ డైనన్. 235

ఆ. వినుఁడు నాదుపలుకు విశ్వసించితి రేని
సతుల కయిన బాల జనుల కయినఁ
దెలియ వచ్చు మేలు [1] దేహాద్యహంకార
దళననిపుణ మైన తపసిమతము. 236

వ. అని నారదోక్తప్రకారంబున బాలకులకుఁ బ్రహ్లాదుం డిట్లనియె. ఈశ్వరమూర్తి యైన కాలంబునం జేసి వృక్షంబు గలుగుచుండ ఫలంబునకు జన్మసంస్థానవర్ధనాపచయక్షీణత్వపరిపాకనాశంబులు ప్రాప్తంబు లయిన తెఱంగున దేహంబులకుం గాని షడ్భావవికారంబు లాత్మకు లేవు. ఆత్మ నిత్యుండు క్షయరహితుండు శుద్ధుండు క్షేత్రజ్ఞుండు గగనాదులకు నాశ్రయుండుఁ గ్రియాశూన్యుండు స్వప్రకాశుండు సృష్టిహేతువు వ్యాపకుండు నిస్సంగుండుఁ బరిపూర్ణుండు నొక్కండు నని వివేకసమర్థంబు లగు నాత్మలక్షణంబులు పన్నెండు నెఱుంగుచు, దేహాదులందు మోహజనకంబు లగు నహంకారమమకారంబులు విడిచి పసిండిగనులుగల నెలవున విభ్రాజమానకనకలేశంబు లైన పాషాణాదులందుఁ బుటంబు వెట్టి వహ్నియోగం

1 దేహాదులయందలి మమత్వమును పోఁగొట్టుటయందు నేర్పుగలది.

బునఁ గరఁగ నూఁది [1]హేమకారకుండు పాటనంబున హాటకంబుఁ బడయుభంగి నాత్మకృతకార్యకారణంబుల నెఱింగెడి నేర్పరి దేహంబునం దాత్మసిద్ధికొఱకు నమన యుపాయంబుల జేసి బ్రహ్మభావంబుఁ బడయు. మూలప్రకృతియు మహానహంకారంబులును బంచతన్మాత్రంబులు నివి యెనిమిదియుం బ్రకృతులనియును, రజస్సత్త్వతమంబులు మూఁడును బ్రకృతిగుణంబులనియుఁ గర్మేంద్రియంబులయిన వాక్పాణిపాదపాయూపస్థంబులును జ్ఞానేంద్రియంబులైన శ్రవణనయనరసనాత్వగ్ఘ్రాణంబులును మనంబును మహీసలిలతేజోవాయుగగనంబులును నివి పదాఱును వికారంబులనియును గపిలాదిపూర్వాచార్యులచేతఁ జెప్పంబడియె. సాక్షిత్వంబున నీయిరువదేడింటిని నాత్మ గూడి యుండు. పెక్కింటి [2]కూటువ దేహము. అదియు జంగమస్థావరరూపంబుల రెండువిధంబు లయ్యె. మూలప్రకృతి మొదలయిన వర్గంబునకు వేఱై మణిగణంబులఁ జొచ్చి యున్న సూత్రంబుచందంబున నాత్మ యన్నింటియందునుం జొచ్చి దీపించు. ఆత్మకు జన్మస్థితిలయంబులు గలవంచు మిథ్యాతత్పరులు గాక వివేకశుద్ధమైన మనంబునం దాత్మ వెదకవలయు. ఆత్మకు నవస్థలు గలయట్టుండుఁ గాని యవస్థలు లేవు. జాగరణస్వప్నసుషుప్తులను వృత్తులెవ్వనిచేత నెఱుంగంబడు నతం డాత్మ యండ్రు. కుసుమధర్మంబులయిన గంధంబులచేత గంధాశ్రయుండయిన వాయువు నెఱింగెడుభంగిం ద్రిగుణాత్మకంబులయి కర్మజన్యంబులయిన బుద్ధిభేదంబుల నాత్మ నెఱుంగం దగునని చెప్పి. 237

సీ. సంసారమిది బుద్ధిసాధ్యము గుణకర్మ
గణబద్ధ మజ్ఞానకారణంబుఁ
గలవంటి దింతియకాని నిక్కము గాదు
సర్వార్థములు మనస్సంభవములు
స్వప్నజాగరములు సమములు గుణశూన్యుఁ
డగు పరమునికి, గుణాశ్రయమున

1 బంగారుపనివాఁడు. 2 కూటము. (పోగు) 3 మనస్సుతోఁబుట్టునవి.

భవవినాశంబులు వాటెల్లి నట్టుండుఁ
బట్టి చూచిన లేవు [1]బాలురార!

తే. కడఁగి త్రిగుణాత్మకము లైన కర్మములకు
జనక మై వచ్చు నజ్ఞానసముదయమును
ఘనతరజ్ఞానవహ్నిచేఁ గాల్చి పుచ్చి
కర్మవిరహితు లై హరిఁ గనుట మేలు. 238

వ. అది గావున గురుశుశ్రూషయు సర్వలాభసమర్పణంబును సాధుజన సంగమంబును నీశ్వరప్రతిమాసమారాధనంబును హరికథాతత్పరత్వంబును వాసుదేవునియందలి ప్రేమయు నారాయణగుణకర్మకథానామకీర్తనంబును వైకుంఠచరణకమలధ్యానంబును విశ్వంభరమూర్తి విలోకనపూజనంబును మొదలయిన విజ్ఞానవైరాగ్యలాభసాధనంబు లైన భాగవతధర్మంబులపై రతి గలిగి సర్వభూతంబులయందు నీశ్వరుండు భగవంతుం డాత్మ గలం డని సమ్మానంబు సేయుచుఁ గామక్రోధలోభమోహమదమత్సరంబులం గెలిచి యింద్రియవర్గంబును బంధించి భక్తి సేయుచుండ నీశ్వరుం డయిన విష్ణుదేవునియందలి[2]రతి సిద్ధించు. 239

సీ. దనుజారిలీలావతారంబులందలి
శౌర్యకర్మంబులు సద్గుణములు
విని భక్తుఁ డగువాఁడు వేడ్కతోఁ బులకించి
కన్నుల హర్షాశ్రుకణము లొలుక
గద్గదస్వరముతోఁ గమలాక్ష వైకుంఠ
వరద నారాయణ వాసుదేవ
యనుచు [3]నొత్తిలిపాడు నాడు [4]నాక్రోశించు
నగుఁ జింతనము సేయు నతి యొనర్చు

1 అజ్ఞానులారా! 2 (అనురాగము) గట్టికొర్కె 'లభతే రతిమ్' అనిమూలము. 'గతి' యనియు పాఠముగలదు. 3 గొంతెత్తి 4 బిగ్గరగాఁబిలుచు, లేక వాపోవు.

తే. మరులు కొనియుండుఁ దనలోన మాటలాడు
[1]వేల్పు సోఁకిన పురుషుని వృత్తి దిరుగు
బంధములఁ బాసి యజ్ఞానపటలిఁ గాల్చి
విష్ణుఁ బ్రాపించుఁ దుది భక్తి వివశుఁ డగుచు. 240

వ. కావున రాగాదియుక్తమనస్కుం డయిన శరీరికి సంసారచక్రనివర్తకం బయిన హరిచింతనంబు బ్రహ్మమందలి నిర్వాణసుఖం బెట్టిదట్టి దని బుధులు దెలియుదురు. హరిభజనంబు దుర్గమంబుగాదు. హరి సకల ప్రాణిహృదయంబులయందు నంతర్యామియై యాకాశంబుభంగి నుండు. [2]విషయార్జనంబుల నయ్యెడిది లేదు. నిమిషభంగురప్రాణులయిన మర్త్యులకు [3]మమతాస్పదంబులును జంచలంబులును నైన పుత్త్రమిత్త్రకళత్రపశుభృత్యబలబంధురాజ్యకోశమణిమందిరమంత్రిమాతంగమహీప్రముఖవిభవంబులు నిరర్థకంబులు. యాగప్రముఖపుణ్యలబ్ధంబులైన స్వర్గాదిలోకభోగంబులు పుణ్యానుభవక్షీణంబులు గాని నిత్యంబులు గావు. నరుండు విద్వాంసుండనని యభిమానించి కర్మంబు లాచరించి యమోఘంబు లయిన విపరీతఫలంబుల నొందు. కర్మంబులు గోరక చేయవలయు. కోరి చేసిన దుఃఖంబులు ప్రాప్తించు. పురుషుండు దేహంబుకొఱకు భోగంబుల నపేక్షించు. దేహంబు నిత్యంబుకాదు. తోడరాదు. మృతంబైన దేహంబును శునకాదులు భక్షించు. దేహి కర్మంబు లాచరించి కర్మబద్ధుండయి క్రమ్మఱం గర్మానుకూలంబయిన దేహంబుఁ దాల్చు. అజ్ఞానంబునం జేసి పురుషుండు కర్మదేహంబుల విస్తరించు. అజ్ఞానతంత్రంబులు ధర్మార్థకామంబులు. జ్ఞానలభ్యంబు మోక్షంబు. మోక్షప్రదాత యగు హరి సకలభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు. తనచేత నయిన మహాభూతంబులతోడ జీవసంజ్ఞితుండై యుండు నిష్కాములై హృదయగతుం డయిన హరిని నిజభక్తిని భజింపవలయు. 241

---

1 పూనకమువచ్చిన. 2 విషయములనుపోగుచేయుట. (భోగసంపాదనము) 3 నాది యనెడి మోహమునకు స్థానములు.

కం. దానవదైత్య[1]భుజంగమ,
మానవగంధర్వసురసమాజములో ల
క్ష్మీనాథుచరణకమల
ధ్యానంబున నెవ్వఁడైన ధన్యతనొందున్. 242

కం. చిక్కఁడు వ్రతములఁ గ్రతువుల
జిక్కఁడు దానముల శౌచశీలతపములం
జిక్కఁడు యుక్తిని, భక్తిని
జిక్కినక్రియ నచ్యుతుండు సిద్ధముసుండీ! 243

కం. చాలదు భూదేవత్వము
సాలదు దేవత్వ మధిక శాంతత్వంబుం
జాలదు హరి మెప్పింప వి
శాలోద్యములార! భక్తి సాలినభంగిన్. 244

ఆ. దనుజభుజగయక్ష దైత్యమృగాభీర
సుందరీవిహంగ శూద్రశబరు
లైనఁ బాపజీవు లైన ముక్తిఁబొందు
రఖిలజగము విష్ణుఁ డనుచుఁ దలఁచి. 245

కం. గురువులు దమకును లోఁబడు
తెరువులు సెప్పెదరు విష్ణు దివ్యపదవికిం
దెరువులు సెప్పరు, చీఁకటిఁ
బరువులు వెట్టంగ నేల బాలకులారా! 246

కం. తెం డెల్ల పుస్తకంబులు
నిం డాచార్యునకు మరల [2]నేకతమునకున్
రండు విశేషము సెప్పెదఁ
బొం డొల్లనివారు కర్మపుంజము పాలై. 247

కం. ఆడుదము మనము [3]హరిరతిఁ
బాడుదమే ప్రొద్దు విష్ణుభద్రయశంబుల్

1 నాగులు. 2 ఏకాంతమునకు. 3 విష్ణువిూఁది ప్రేమతో.

వీడుదము దనుజసంగతి
గూడుదము ముకుందభక్తకోటిం గూటిన్. 248

క. [1]విత్తము [2]సంసృతిపటలము
[3]వ్రత్తము కామాదివైరివర్గంబుల నేఁ
డిత్తము చిత్తము హరికిని
[4]జొత్తము నిర్వాణపదము శుభ మగు మనకున్. 249

వ. అని యిట్లు ప్రహ్లాదుండు రహస్యంబున నయ్యైవేళల రాక్షస కుమారులకు నపవర్గమార్గం బెఱింగించిన వారును గురుశిక్షితంబులైన చదువులు సాలించి నారాయణభక్తి చిత్తంబులం గీలించి యుండుటంజూచి వారల యేకాంతభావంబు దెలిసి వెఱచి వచ్చి శుక్రనందనుండు శక్రవైరి కిట్లనియె. 250

౮ అధ్యాయము

శా. రక్షోబాలుర నెల్ల నీ కొడుకు సేరం జీరి లోలోన నా
శిక్షామార్గము లెల్ల గల్ల లని యాక్షేపించి తా సంతతా
మోక్షాయత్తులఁ జేసినాఁడు మనకుం మోసంబు వాటిల్లె నీ
దక్షత్వంబునఁ జక్కఁజేయ వలయుం దైతేయవంశాగ్రణీ! 251

క. ఉల్లసితవిష్ణుకథనము
లెల్లప్పుడు మాకుఁ జెప్పఁ డీ గురుఁ డని న
[5]న్నుల్లంఘించి కుమారకు
లొల్లరు చదువంగ దానవోత్తమ! వింటే. 252

క. ఉడుగఁడు మధురిపుకథనము
విడివడి జడుపగిదిఁ దిరుగు వికసనమున నే
నొడివిన నొడువులు నొడువఁడు
దుడుకనిఁ జదివింప మాకు దుర్లభ మధిపా! 253

క. చొక్కపు రక్కసికులమున
[6]వెక్కురు జన్మించినాఁడు విష్ణునియందుం

---

1 విచ్చుదము 'విడగొట్టుదము' అని యర్థము. 2 సంసారముయొక్క కూటమి. 3 చీల్చుదము. 4 వెళ్ళుదము. 5 అతిక్రమించి. 6 వికారి. వికృతుఁడు.

నిక్కపు ఘుక్కవవిమువం
డెక్కడి సుతుఁ గంటి రాక్షసేశ్వర! వెఱ్ఱీ. 254

వ. అని యిట్లు గురుసుతుండు సెప్పినఁ గొడుకువలని విరోధవ్యవహారంబులు గర్ణరంధ్రంబుల ఖడ్గప్రహారంబులయి సోఁకిన బిట్టు మిట్టిపడి పాదాహతంబైన భుజంగంబు భంగిఁ బవనప్రేరితంబైన దవానలంబు చందంబున దండతాడితంబయిన కంఠీరవంబు కైవడి భీషణరోషరసావేశ జాజ్వల్యమానచిత్తుండును బుత్త్రసంహారోద్యోగాయత్తుండును గంపమానగాత్రుండును నరుణీకృతనేత్రుండునునై కొడుకును రప్పించి సమ్మానకృత్యంబులు దప్పించి నిర్దయుండై [1]యశనిసంకాశభాషణంబుల నదల్చుచు. 255

శా. సూనున్ శాంతగుణప్రధాను నతిసంశుద్ధాంచితజ్ఞాను [2]న
జ్ఞానారణ్యకృశాను [3]నంజలిపుటీసంభ్రాజమానున్ సదా
శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదనా
ధీనున్ ధిక్కరణంబు సేసి పలికెన్ దేవాహితుం డుగ్రతన్. 256

సీ. అస్మదీయం బగు నాదేశమునఁ గాని
మిక్కిలి రవి మింట మెఱయ వెఱచు
నన్ని కాలములందు ననుకూలుఁడై కాని
విద్వేషియై గాలి వీవ వెఱచు
మత్ప్రతాపానల[4]మందీకృతార్చియై
విచ్చలవిడి నగ్ని వెలుఁగ వెఱచు
[5]నతిశాత మైన నా యాజ్ఞ నుల్లంఘించి
[6]శమనుండు ప్రాణులఁ జంప వెఱచు

తే. నింద్రుఁ డీవల నా మ్రోల నెత్త వెఱచు
నమరకిన్నరగంధర్వయక్షవిహగ

---

1 పిడుగువంటి మాటలు. 2 అజ్ఞానమనెడి యడవిపాఁటికి అగ్నియైనవాఁడు 3 దోసిలొగ్గియున్నవాఁడు. 4 తగ్గింపఁబడిన జ్వాలలు కలవాఁడై. 5 మిక్కిలి తీక్ష్ణమైనది. 6 యముఁడు. (పాపములశమింపఁజేయువాఁడు)

నాగవిద్యాధరావలి నాకు వెఱచు
నేల వెఱవవు పలువ! నీ కేది దిక్కు. 257

శా. ప్రజ్ఞావంతులు లోకపాలకులు శుంభద్ద్వేషు లయ్యున్ మదీ
యాజ్ఞాభంగము సేయ నోడుదురు రోషాపాంగదృష్టిన్ [1]వివే
కజ్ఞానచ్యుత మై జగత్త్రితయముం గంపించు నీ విట్టిచో
నాజ్ఞోల్లంఘన మెట్లు సేసితివి సాహంకారతన్ దుర్మతీ! 258

శా. [2]కంఠక్షోభము గాఁగ నొత్తిలి మహాగాఢంబుగా డింభ! వై
కుంఠుం జెప్పెదు దుర్జయుం డనుచు వైకుంఠుండు [3]వీరవ్రతో
త్కంఠాబంధురుఁ డేని నే నమరులన్ ఖండింప దండింపఁగా
[4]కుంఠీభూతుఁడు గాక రానలడె మద్ఘోరాహవక్షోణికిన్. 269

శా. ఆచార్యోక్తము గాక బాలురకు మోక్షాసక్తిఁ బుట్టించి నీ
వాచాలత్వముఁ జూపి విష్ణు సహితున్ వర్ణించి మద్దైత్యవం
శాచారంబులు [5]సేఁకు సేసితివి మూఢాత్మం గులద్రోహినిన్
నీచుం జంపుట మేలు చంపి కులమున్ నిర్దోషముం జేసెదన్. 260

క. దిక్కులు గెలిచితి నన్నియు
దిక్కెవ్వఁడు రోరి! నీకు? దేవేంద్రాదుల్
దిక్కులరాజులు వే ఱొక
దిక్కెఱుఁగక కొలుతు రితఁడె దిక్కని నన్నున్. 261

క. బలవంతుఁడ నే జగముల
బలములతోఁ జనక వీరభావమున మహా
బలుల జయించితి నెవ్వని
బలమున నాడెదవు నాకుఁ బ్రతివీరుఁడ వై. 262

వ. అనినఁ దండ్రికి మెల్లన వినయంబునఁ గొడు కిట్లనియె. 263

---

1 మంచిచెడ్డల నెఱుఁగు తెలివి, ఈశ్వరవిషయమైన జ్ఞానము. 2 కంఠము బొంగురు వోవునట్లు. 3 వీరవ్రత + ఉత్కంఠా, బంధురుఁడు = యుద్ధము నందలి వేడుక దట్టముగాఁ గలవాఁడు 4. ఓడిపోయినవాఁడు.

క. బలయుతులకు దుర్బలులకు
బల మెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బల మెవ్వఁడు ప్రాణులకును
బల మెవ్వం డట్టి విభుఁడు బల మసురేంద్రా! 264

క. దిక్కులు కాలముతో నే
దిక్కున లే కుండుఁ గలుగుఁ దిక్కుల మొదలై
దిక్కు గల లేని వారికి
దిక్కెవ్వఁడు వాఁడు నాకు దిక్కు మహాత్మా. 265

సీ. కాలరూపంబులఁ గ్రమవిశేషంబుల
నలఘుగుణాశ్రయుం డయిన విభుఁడు
సత్త్వబలేంద్రియసహజప్రభావాత్ముఁ
డై వినోదంబున నఖిలజగము
గల్పించు రక్షించు ఖండించు నవ్యయుం
డన్నిరూపములందు నతఁడు గలఁడు
చిత్తంబు సమముగాఁ జేయుము మార్గంబుఁ
దప్పి వర్తించు చిత్తంబుకంటె

తే. వైరు లెవ్వరు చిత్తంబు వైరి గాక
చిత్తమును నీకు వశముగాఁ జేయు వయ్య
మదయుతాసురభావంబు మానవయ్య!
యయ్య! నీమ్రోల మేలాడ రయ్య! జనులు. 266

ఉ. లోకము లన్నియున్ గడియలోన జయించినవాఁడ వింద్రియా
నీకముఁ జిత్తముం గెలువనేరవు నిన్ను నిబద్ధుఁ జేయు నీ
భీకరశత్రు లార్వురఁ బ్రభిన్నులఁ జేయుము ప్రాణికోటిలో
నీకు విరోధి లేఁ డొకఁడు నేర్పునఁ జూడుము దానవేశ్వరా! 267

క. పాలింపుము [1]శేముషి ను
న్మూలింపుము కర్మబంధముల, సమదృష్టిం

1 బుద్ధిచేత (జ్ఞానముచే)

జాలింపుము సంసారముఁ
గీలింపుము హృదయమందుఁ గేశవభక్తిన్. 268

వ. అనినఁ బరమభాగవతశేఖరునకు దోషాచరశేఖరుం డిట్లనియె. 269

క. చంపినఁ జచ్చెద ననుచును
గంపింపక యోరిపడుచు! కఠినోక్తుల నన్
[1]గుంపించెదు చావునకుం
[2]దెంపరివై వదరువాని తెఱఁగునఁ గుమతీ ! 270

శా. నాతోడం బ్రతిభాషలాడెదు జగన్నాథుండ నాకంటె నీ
భూతశ్రేణికి రాజు లేఁ డొకఁడు; సంపూర్ణప్రభావుండ మ
ద్భ్రాతం జంపిన మున్ను నే వెదకితిం బల్మాఱు నారాయణుం
డేతద్విశ్వములోన లేఁడు; మఱి వాఁ డెం దుండురా దుర్మతీ! 271

క. ఎక్కడఁ గలఁ డేక్రియ నే
చక్కటివర్తించు నెట్టి జాడను వచ్చుం
జక్కడుతు నిన్ను విష్ణుని
బెక్కులు ప్రేలెదవు వాని భృత్యునిపగిదిన్. 272

వ. అనిన హరికింకరుండు శంకింపక హర్షపులకాంకురసంకలితవిగ్రహుం
డై యాగ్రహంబు లేక హృదయంబున హరిం దలంచి నమస్క
రించి బాలవర్తనంబున నర్తనంబు సేయుచు ని ట్లనియె. 273

మ. కలఁ డంభోధిఁ, గలండు గాలిఁ, గలఁ డాకాశంబునం, గుంభినిం
గలఁ, డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ [3]ఖద్యోతచంద్రాత్మలం
గలఁ, డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం
గలఁ, డీశుండు గలండు, తండ్రి! వెదకంగా నేల యీయాయెడన్.

క. ఇందుఁ గలఁ డందు లేఁ డని
సందేహము వలదు, చక్రి [4]సర్వోపగతుం

---

1 అతిక్రమించెదవు. 2 తెంపరి=సాహసించినవాఁడు 3 ఖద్యోతుఁడు=సూర్యుఁడు
4 అంతటను ఉన్నవాఁడు

డెం దెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి! వింటే. 275

వ. అని యివ్విధంబున. 276

మ. హరి సర్వాకృతులం గలం డనుచుఁ బ్రహ్లాదుండు భాషింప, స
త్వరుఁడై యెందును లేఁడు లేఁ డని సుతున్ దైత్యుండు దర్జింప శ్రీ
నరసింహాకృతి నుండె నచ్యుతుఁడు నానాజంగమస్థావరో
త్కరగర్భంబుల నన్నిదేశముల నుద్దండప్రభావంబునన్. 267

వ. అయ్యవసరంబున దానవేంద్రుండు. 278

క. డింభక! సర్వస్థలముల
నంభోరుహనేత్రుఁ డుండు ననుచు మిగుల సం
రంభమున బలికెద వీ
స్తంభంబునఁ జూపఁ గలవె చక్రిన్ [1]గిక్రిన్. 279

క. స్తంభమునఁ జూప వేనిం
[2]గుంభిని నీ శిరముఁ ద్రుంచి కూల్పఁగ రక్షా
రంభమున వచ్చి హరి [3]వి
స్రంభంబున నడ్డపడఁగ శక్తుండగునే. 180

వ. అనిన భక్తవత్సలుని భటుం డిట్లనియె. 281

శా. అంభోజాసనుఁ డాదిగాఁగ దృణపర్యంతంబు విశ్వాత్ముఁడై
సంభావంబున నుండు ప్రోడ విపులస్తంభంబునం దుండడే!
స్తంభాంతర్గతుఁ డయ్యు నుండుటకు నే సందేహమున్ లేదు ని
ర్దంభత్వంబున నేఁడు గానఁబడు బ్రత్యక్షస్వరూపంబునన్. 282

వ. అనిన విని కరాళించి గ్రద్దన లేచి గద్దియ డిగ్గ నుఱికి యొఱఁ
బెట్టిన ఖడ్గంబు వెలికి కేల నమర్చి జళిపించుచు మహాభాగవత
శిఖామణియైన ప్రహ్లాదుని ధిక్కరించుచు. 283

మ. వినరా డింభక! మూఢచిత్త గరిమన్ విష్ణుండు విశ్వాత్మకుం
డని భాషించెద, వైన నిందుఁ గలఁడే యంచున్ మదోద్రేకియై

---

1 గిక్రిన్=చక్రియను పదమునకు నిందాసూచకమైన ప్రయోగము. (హరిగిరి యన్నట్లు) 2 భూమిమీఁద 3 విస్రంభంబునన్=నమ్మకముగా 4 నిష్కపటముగా

దనుజేంద్రుం డరచేత వ్రేసెను మహాదగ్రప్రభా[1]శుంభమున్
[2]జనదృగ్భీషణదంభమున్ [3]హరిజనుస్సంరంభమున్ స్తంభమున్.

శ్రీ హరి నరసింహరూపంబున స్తంభంబునం దావిర్భవించుట.

వ. ఇట్లు దానవేంద్రుండు పరిగృహ్యమాణ వైరుండును, వైరానుబంధ జాజ్వల్యమాన రోషానలుండును, రోషానల[4]జంఘన్యమాన విజ్ఞాన వినయుండును, వినయగాంభీర్యధైర్య జేగీయమాన హృదయుండును, హృదయచాంచల్యమాన తామసుండును, తామసగుణ[5]చంక్రమ్యమాణ స్థైర్యుండును, నై విస్రంభంబున హుంకరించి బాలుని ధిక్కరించి హరి నిందుఁ జూపు మని కనత్కనకమణిమయకంకణ క్రేంకార శబ్దపూర్వకంబుగా దిగ్దంతిదంతభేదనపాటనప్రశస్తం బగు హస్తంబున సభామండపస్తంభంబు వ్రేసిన వ్రేటుతోడన దశదిశలను మిణుంగురులు సెదరం జిటిలి పెటిలిపడి [6]బంభజ్యమానం బగు నమ్మహాస్తంభంబువలనఁ బ్రళయవేళాసంభూత[7]సప్తస్కంధబంధుర సమీరణసంఘటితఘోరరజో[8]ఘుష్యమాణ[9]మహావలాహకవర్గనిర్గత నిబిడనిష్ఠురదుస్సహనిర్ఘాతసంఘనిర్ఘోషనికాశంబు లైన ఛటచ్ఛట స్ఫుటస్ఫుటధ్వని ప్రముఖ భయంకరారావపుంజంబులు [10]జంజన్యమానంబు లయి యెగసి యాకాశకుహరాంతరాళంబు నిరవకాశంబు సేసి నిండినం బట్టుసాలక [11]దోధూయమాన హృదయంబు లయి పరవశంబు లైన పితామహ మహేంద్ర వరుణవాయుశిఖిముఖర చరాచరజంతుజాలంబులతోడ బ్రహ్మాండ

1 శుంభము=ప్రకాశించునది. 2 జనుల చూపులకు భయముగొలుపు డంబముకలది. 3 హరి అవతారముయొక్క యాటోపముకలది. 4 జంఘన్యమాన=నశింపఁజేయఁబడుచున్న 5 మిక్కిలి చలించిపోవుచున్న 6 బ్రద్దలు కొట్టఁబడుచున్న 7 సప్తస్కంధ=ఆవహము మొదలగు ఏడు వాయుస్కంధములచేత, బంధుర=దట్టమైన 8 ధ్వనించుచున్న. 9 మహావలాహక=గొప్పమేఘముల యొక్క 10=ఒకటివెంట నొకటిగా పుట్టుచున్నవై 11 మిక్కిలిగా నెగుర గొట్టబడుచున్న.

కటాహంబు పగిలి [1]పరిస్ఫోటితంబుగాఁ బ్రఫుల్లపద్మయుగళసంకాశభాస్వదచక్రచాపహలకులిశజలచరరేఖాంకితచారుచరణతలుండును చరణచంక్రమణఘనవినమితవిశ్వవిశ్వంభరాభారధౌరేయదిక్కుంభి[2]కుంభీనసకుంభినీధరకూర్మకులశేఖరుండును జలరాశిజాతసంఘాతసంఘాటసంఘటమండిత (ప్రకాండప్రచండ) మహోరుస్తంభయుగళుండును ఘణఘణాయమానమణికింకిణీగణముఖరితమేఖలావలయవలయితపీతాంబరశోభితకటిప్రదేశుండును నిర్జరనిమ్నగావర్తవర్తుల[3]కమలాకరగంభీరనాభివివరుండును ముష్టిపరిమేయవినుతతనుతరస్నిగ్ధమధ్యుండును కులాచలసానుభాగసదృశకర్కశవిశాలవక్షుండును దుర్జనదనుజభటధైర్యలతికాలవిత్రాయమాణరక్షోరాజవక్షోభాగవిశంకటక్షేత్ర[4]విలేఖనచంగలాంగలాయమానప్రతాపజ్వాలసజ్వాలాయమానశరణాగతనయనచకోరచంద్రరేఖాయమాణవజ్రాయుధప్రతిమానభాసమాననిశాతనఖరతరముఖనఖరుండును శంఖచక్రగదాఖడ్గకుంతతోమరప్రముఖనానాయుధమహితమహోత్తుంగమహీధరశృంగసన్నిభ[5]వీరసాగరవేలాయమానమాలికాయమానరాజమాననిరర్గళానేకశతభుజార్గళుండును మంజుమంజీరమణిపుంజరంజితమంజులహారకేయూరకంకణకిరీటమకరకుండలాదిభూషణభూషితుండును [6]త్రివళీయుతశిఖరిశిఖరాభపరిణద్ధబంధురకంధరుండును [7]ప్రకంపనకంపితపారిజాతపాదపల్లవప్రతీకాశకోపావేశసంచలితాధరుండును శరత్కాలమేఘజాలమధ్యధగద్ధగాయమానతటిల్లతాసమానదేదీప్యమానదంష్ట్రాంకురుండును కల్పాంతకాలసకలభువనగ్రసనవిలసనవిజృంభమాణ[8]సప్తజిహ్వాజిహ్వాతులితతరల

---

1 బ్రద్దలు కాఁగా 2 కుంభీనస=పాము (శేషుఁడన్నమాట) 3 కమల + ఆకర=పద్మములకు స్థానమైన 4 విలేఖన=దున్నుటయందు చంగ=సమర్థమైన లాంగలాయమాన=నాగలివంటివై యున్నవియు (గోళ్ళకు శేషణము) 5 వీరులనెడి సముద్రమునకు, వేలాయమాన=చెలియలికట్టలయి యున్న 6 త్రివళీయుత=మూఁడు రేఖలుగల 7 ప్రకంపన=ఓరు గాలి 8 సప్తజిహ్వాజిహ్వా=అగ్నియొక్క నాలుకలు (అగ్నిజ్వాలలన్నమాట)

తటాయమానవిభ్రాజమానజిహ్వంబును మేరుమందరమహాగుహాంతరాళవిస్తారవిపులవక్త్రనాసికారంధ్రంబును నాసికారంధ్రనిస్సరన్నిబిడనిశ్వాసనికరసంఘట్టనసంక్షోభితసంతప్యమానసప్తసాగరంబును పూర్వపర్వతవిద్యోతమానఖద్యోతమండలసదృశసముంచితలోచనంబును లోచనాంచలసముత్కీర్యమాణవిలోలకీలాభీలవిస్ఫులింగవితాన[1]రోరుధ్యమానతారకాగ్రహమండలంబును శక్రచాపసురుచిరాదభ్రమహాభ్రూలతాబంధబంధురభయంకరవదనంబును ఘనతరగండశైలతుల్యకమనీయగండభాగంబును సంధ్యారాగరక్తధారాధరమాలికాప్రతిమమహాభ్రంకష[2]తంతన్యమాన పటుతరసటాజాలంబును సటాజాలసంచాలసంజాతవాతడోలాయమానవైమానికవిమానంబును నిష్కంపితశంఖవర్ణమహోర్ధ్వకర్ణంబును మంథదండాయమానమందరవసుంధరాధరపరిభ్రమణవేగసముత్పద్యమానవియన్మండలమండితసుధారాశికల్లోలశీకరాకారభాసురకేసరంబును [3]పర్వాఖర్వశిశిరకిరణమయూఖ[4]గౌర[5]తనూరుహంబును నిజగర్జానినదనిర్దళితకుముదసుప్రతీకవామనైరావణసార్వభౌమప్రముఖదిగిభరాజకర్ణకోటరంబును ధవళధరాధరదీర్ఘదురవలోకనీయదేహంబును దేహప్రభాపటలనిర్మథ్యమానపరిపంథియాతుధాన[6]నికురంబగర్వాంధకారంబును ప్రహ్లాదహిరణ్యకశిపు[7]రంజనభంజననిమిత్తాంతరంగబహిరంగజేగీయమానకరుణావీరరససంయుతంబును మహాప్రభావంబును నయిన శ్రీనృసింహదేవుం డావిర్భవించినం గనుంగొని. 285

క. నరమూర్తి గాదు కేవల
[8]హరిమూర్తియుఁ గాదు మానవాకారముఁ గే

1 మిక్కిలి అరికట్టఁబడుచున్న 2 విస్తరింపఁజేయఁ బడుచున్న. 3 పర్వ=పూర్ణిమయందు 4 గౌర=తెల్లని 5 వెండ్రుకలు గలవాఁడు. 6 నికురుంబ = సమూహముయొక్క 7 రంజన = రంజింపఁజేయుటకు, భంజన = చంపుటకు, నిమిత్తసూచకమైన, అంతరంగ = లోపలను, బహిరంగ = వెలుపలను, జేగీయమాన = మిక్కిలి స్తుతింపఁబడు కరుణా= కరుణరసముతో, వీరరస=వీరరసముతో, సంయుతుండు=కూడినవాఁడు 8 సింహాకారము.

సరియాకారము నున్నది
హరిమాయారచిత మగు యథార్థము సూడన్. 286

ఉ. తెంపున బాలుఁ జూపినను దీరత, సర్వగతత్వముం బ్రతి
ష్ఠింపఁ దలంచి యిందు నరసింహశరీరముఁ దాల్చి చక్రి శి
క్షింపఁగ వచ్చినాఁడు హరిచే మృతి యంచుఁ దలంతు నైన నా
సొంపును బెంపు నందఱును జూడఁ జరింతు హరింతు శత్రువున్.

నృసింహమూర్తి హిరణ్యకశిపుతోఁ బోరి వధించుట.

వ. అని మెత్తంబడినచిత్తంబున గద యెత్తికొని తత్తఱంబున నార్చుచు నకుంఠితకంఠీరవంబు డగ్గఱు [1]గంధసింధురంబుచందంబున [2]నక్తంచరకుంజరుండు నరసింహదేవున కెదురునడచి తదీయదివ్యతేజోజాలసన్నికర్షంబుసంజేసి దవానలంబు డగ్గఱిన ఖద్యోతంబునుం బోలెఁ గర్తవ్యాకర్తవ్యంబులు దెలియక [3]నిర్గతప్రభుం డయియుండె నప్పుడు. 288

మ. ప్రకటంబై ప్రళయావసానమున మున్ బ్రహ్మాండభాండావరో
ధకమై యున్నతమిస్రమున్ జగము నుత్పాదించుచోఁ ద్రావి సా
త్త్విక తేజోనిధి యైన విష్ణు నెడ నుద్దీపించునే నష్టమై
వికలంబై చెడుఁ గాక తామసులపాపిష్ఠ్యంబు రాజోత్తమా! 289

వ. అంత నద్దానవేంద్రుండు మహోద్దండంబగు గదాదండంబు గిరగిరం ద్రిప్పి నరమృగేంద్రుని వ్రేసిన, నతండు దర్పంబున సర్పంబు నొడిసి పట్టు [4]సర్పపరిపంథి నేర్పున దితిపట్టిం బట్టికొనిన, మిట్టిపడి దట్టించి బిట్టుకట్టలుక నయ్యసురవరుండు దృఢబలంబున నిట్టట్టు జడిసి పట్టు దప్పించుకొని విడివడి [5]దిటదప్పక కుప్పించి యుప్పరం బెగసి విహంగకులరాజచరణనిర్గళితభుజంగంబు తెఱంగున నం దలంగ నుఱికి తన భుజాటోపంబున నక్కంఠీరవుండు కుంఠితుం డయ్యెడి నని తలంచి

1 మదపుటేనుఁగు 2 నక్తంచర=రాక్షసులలో, కుంజరుండు=శ్రేష్ఠుఁడు 3 చెన్ను దఱిగి (వెలవెలఁబోయి) 4 పాములశత్రువు (గరుడుఁడు) 5 దిట=దిటవు (దిట్టము)

కలంగక చెలంగుచుఁ దన్ను నిబిడనిరవధికరంబులనూఁగిన నిలిం
పులు గుంపులు గొని డాఁగి మూఁగి క్రిమ్మఱు నాశ్చర్యయుతజీవనశంకా
కళంకితులై [1]మంతనంబులఁ జింతనంబులు సేయుచు నిరీక్షింప నక్షీణ
సమరదక్షతావిశేషం బుపలక్షించి ఖడ్గవర్మంబులు ధరియించి భూన
భోభాగంబుల వివిధవిచిత్రలంఘనలాఘవంబులం [2]బరిభ్రమణభేదం
బులం గరాళవదనుం డయి యంతరాళంబునఁ దిరుగు సాళువపు
డేగచందంబున సంచరించిన సహింపక, 290

సీ. [3]పంచాననోద్ధూత పావకజ్వాలలు,
భూనభోంతర మెల్లఁ బూరితముగ,
దంష్ట్రాంకురాభీల ధగధగాయితదీప్తి
నసురేంద్రు నేత్రము లంధములుగఁ,
[4]కంటకసన్నిభోత్కట కేసరాహతి
నభ్ర సంఘము భిన్నమై చలింపఁ,
[5]బ్రళయాభ్రచంచలాప్రతిమ భాస్వరములై
[6]ఖరనఖరోచులు గ్రమ్ముకొనఁగ,

తే. [7]సటలు జళిపించి గర్జించి సంభ్రమించి
దృష్టి సారించి బొమలు బంధించి కెరలి
[8]జిహ్వ యాడించి లంఘించి చేత నొడిసి
పట్టె నరసింహుఁ డా దితిపట్టి నధిప ! 291

క. సరకుగొనక లీలాగతి
నురగేంద్రుఁడు మూషికంబు నొడిసినపగిదిన్
నరకేసరి దను నొడిసిన
[9]సురవిమతుఁడు ప్రాణభీతి సుడివడియె నృపా ! 292

1. రహస్యములందు 2. మల్లయుద్ధమునందలి రకరకములయిన తిరుగుడులలో 3. విప్పారిన ముఖమునుండి 4. ముళ్ళవలె నున్న, ఉత్కట = నిక్కిన కేసర = జూలు యొక్క, ఆహతిన్ = దెబ్బచేత 5. ప్రళయకాల మేఘములందలి మెఱుపులవంటి కాంతులు గలవై 6. ఖర = వాడియైన, నఖ = గోళ్ళయొక్క, రోచులు = కాంతులు 7. సటలు = కేసరములు 8. నాలుక 9. దేవశత్రువు.

క. సురరాజవైరి లోఁబడఁ
[1]బరిభావితసాధుభక్తపటలాంహునకున్
నరసింహునకు నుదంచ
త్ఖరతరజిహ్వున [2]కునుగ్రఘనరంహునకున్. 293

వ. అంత. 294

మ. విహగేంద్రుం డహి [3]వ్రచ్చు కైవడి మహోద్వృత్తిన్ నృసింహుండు సా
గ్రహుఁడై యూరువులందుఁ జేర్చి నఖసంఘాతంబులన్ వ్రచ్చె దు
స్సహు దంభోళికఠోరదేహు నచలోత్సాహున్ మహాబాహు [4]నిం
ద్రహుతాశాంతకభీకరున్ ఘనకరున్ దైత్యాన్వయశ్రీకరున్.

శా. చించున్ హృత్కమలంబు, శోణితము వర్షించున్ ధరామండలిం
ద్రెంచుం [5]గర్కశనాడికావళులు, ఛేదించున్ మహావక్షముం,
ద్రుంచున్ మాంసము సూక్ష్మఖండములుగా, దుష్టాసురున్ వ్రచ్చి ద
ర్పించుం, బ్రేవులు కంఠమాలికలు గల్పించున్ నఖోద్భాసియై.

సీ. వక్షఃకవాటంబు వ్రక్కలు సేయుచో
ఘనకుఠారంబుల కరణి నొప్పు,
గంభీరహృదయపంకజము ఛేదించుచోఁ
[6]గుద్దాలములభంగిఁ గొమరు మిగులు
[7]ధమనీవితానంబు దవిలి ఖండించుచోఁ
బటు [8]లవిత్రంబుల పగిది మెఱయు
జఠరవిశా[9]లాంత్రజాలంబుఁ ద్రెంచుచోఁ
[10]క్రకచసంఘంబుల గరిమఁ జూపు

తే. నంకగతుఁడైన దైత్యుని నాగ్రహమున
శస్త్రచయముల నొంపక సంహరించి

---

1 పరిభావిత=తిరస్కరింపఁబడిన (నశింపఁజేయఁబడిన) సాధు=సాధువుల యొక్కయు, భక్తపటల=భక్తసమూహముయొక్క అంహునకున్=అహంకారముకలవారికి. 2 ఉదగ్రమైన, ఘనమైన, రంహునకున్=వేగము కలవానికి. 3 వ్రచ్చు=చీల్చు 4 ఇంద్రునకు, హుతాశ=అగ్నికి, అంతక=యమునికి, భీకరున్=భయము గొల్పువానిని 5 కఠినమైన నాడులగుంపును. 6 తవ్వుగోల (భూమిని జీల్చునది) 7 నరముల ప్రోవులను 8 కొడవండ్లు 9 ఆంత్రజాలంబు=ప్రేవుల పోగులు 10 క్రకచ=రంపములు.

యమరు నరసింహునఖరంబు లతివిచిత్ర
సమర[1]ముఖరంబులై యుండె జనవరేణ్య! 297

క. [2]స్ఫురితవిబుధజనముఖములు
పరివిదళితదనుజనివహపతితనుముఖముల్
[3]గురురుచిజితశిఖిశిఖములు
నరహరిఖరనఖము లమరు [4]నతజనసఖముల్. 298

వ. ఇట్లు కేవలపురుషరూపంబును మృగరూపంబునుం గాని నరసింహ రూపంబున, రేయునుం బవలునుంగాని సంధ్యాసమయంబున, నంతరంగంబును బహిరంగంబునుం గాని సభాద్వారంబున, గగనంబును భూమియునుంగాని యూరుమధ్యంబునఁ, బ్రాణసహితంబులును బ్రాణరహితంబులునుంగాని నఖంబులం ద్రైలోక్యజనహృదయ[5]భల్లుం డయిన దైత్యమల్లుని వధియించి మహాదహానకీలాభీలదర్శనుండును గరాళవదనుండును [6]లేలిహానభీషణజిహ్వుండును శోణితపంకాంకితకేసరుండును నై ప్రేవులు కంఠమాలికలుగ ధరించి కుంభికుంభవిదళనంబు సేసి చనుదెంచు పంచాననంబునుంబోలె దనుజకుంజరహృదయకమలవిదళనంబు సేసి తదీయరక్తసిక్తంబులైన నఖంబులు సంధ్యారాగరక్తచంద్రరేఖల చెలువు వహింప సహింపక లేచి తనకట్టెదుర నాయుధంబు లెత్తుకొని తత్క్షణంబున రణంబునకు [7]నురవణించు రక్కసులఁ బెక్కుసహస్రంబుల జక్రాదికనిర్వక్రసాధనంబుల నొక్కనిఁ జిక్కకుండం జక్కడిచె. ఇవ్విధంబున. 296

శా. రక్షోవీరుల నెల్లఁ ద్రుంచి రణసంరంభంబు సాలించి [8]దృష్టిక్షేపంబు భయంకరంబుగ సభాసింహాసనారూఢుఁడై

---

1 ముఖరంబులు = ధ్వనించునవి. 2 ప్రకాశింపఁజేయబడిన, విబుధజన _ దేవతల యొక్క, ముఖముకలవి, దేవతల కానందము గూర్చునవి యన్నమాట. 3 గురు = గొప్పదగు, రుచి = కాంతిచే జిత = జయింపబడిన శిఖి = అగ్నియొక్క, శిఖములు = జ్వాలలు కలవి. అగ్నిజ్వాలలవలె నెఱ్ఱగా నున్నవన్నమాట. 4 శరణు పొందిన జనులకు సఖములు = మిత్రములు. 5 భల్లుఁడు = భల్లము వంటివాఁడు. (భయంకరుఁడన్నమాట) 6 లేలిహాన = పాము నాలిక వంటి నాలికగలవాఁడు. 7 ఉరవణించు = తోసికొనివచ్చు 8 చూపుల ప్రసారము.

యక్షీనాగస్త్రీసముగ్రా నృసింహుఁడు కరాళాస్యంబుతో నొప్పఁ దర్శ
వీక్షింపం బలికింప నోడి యితరుల్ విభ్రాంతులై డాఁగఁగన్. 300

క. సురచారణవిద్యాధర
గరుడోరగయక్షసిద్ధగణములలో నొ
క్కరుఁ డైన డాయ వెఱచును
నరహరి నయ్యవసరమున నరలోకేశా! 301

క. [1]తర్షంబుల నరసింహుని
హర్షంబులఁ జూచి నిర్జరాంగనలు మహో
త్కర్షంబులఁ గుసుమంబుల
వర్షంబులు గురిసి రుత్సవంబుల నధిపా! 302

వ. మఱియు నయ్యవసరంబున మింట ననేక దేవతావిమానంబులును గంధర్వగానంబులును నప్సరోగణనర్తనసంవిధానంబులును దివ్యకాహళభేరీపటహమురజాదిధ్వానంబులును బ్రకాశమానంబులయ్యె. సునందకుముదాదు లయిన హరిపార్శ్వచరులును విరించి మహేశ్వర మహేంద్రపురస్సరు లగు త్రిదశకిన్నర కింపురుషపన్నగసిద్ధగరుడ గంధర్వచారణవిద్యాధరాదులును బ్రజాపతులును నరకంఠీరవ దర్శనోత్కంఠతు లయి చనుదెంచి. 303

బ్రహ్మాదిదేవతలు శ్రీనృసింహదేవుని వేఱువేఱ స్తుతించుట.

క. కరకమలయుగళ[2]కీలిత,
శిరులై దగ్గఱక భక్తిఁ జేసిరి బహుసం
సరణాబ్ధి[3]తరికి [4]నఖరికి,
[5]నరభోజనహస్తిహరికి నరకేసరికిన్. 304

వ. ఆ సమయంబున దేవత లందఱు వేఱువేఱ వినుతించిరి. అందుఁ గమలాసనుం డిట్లనియె. 305

మ. ఘనలీలాగుణచాతురిన్ భువనముల్ కల్పించి రక్షించి భే
దనముం జేయు దురంతశక్తికి ననంతజ్యోతికిం జిత్రవీ

1 కోరికలతో. 2 చేర్పఁబడిన. 3 సంసారసముద్రముదాటించు నావయైనవాఁడు. 4 గోళ్లుకలవాఁడు. 5 నరభోజన = రాక్షసుఁడనెడి, హస్తి = ఏనుఁగుకు, హరి = సింహమయినవాఁడు.

ర్త్యునికిన్ నిత్యపవిత్రకర్మునికి నే నుత్కంఠతో సన్నుతా
త్మునికిన్ వందన మాచరించెదఁ గృపాపూర్ణప్రసాదాన్వితున్. 306

వ. రుద్రుం డిట్లనియె. 307

చ. అమరవరేణ్య! మీఁదట సహస్రయుగాంతమునందు గాని కో
పమునకు వేళ గాదు సురబాధకుఁడైన ¹తమస్విచరునిన్
సమరమునన్ వధించితివి చాలుఁ బటుత్వము లింక వీఁడు స
ద్విమలుఁడు నీకు భక్తుఁడు పవిత్రుఁడు గావుము భక్తవత్సలా!

వ. ఇంద్రుం డిట్లనియె. 309

సీ. ప్రాణిసంఘముల హృత్పద్మమధ్యంబుల
నివసించి భాసిల్లు నీవ యొకఁడవు;
దింతకాలము దానవేశ్వరుచే బాధ
పడి చిక్కి యున్న యీ యాపన్నజనుల
రక్షించితివి మమ్ము రాక్షసుఁ జంపితి,
²క్రతుహవ్యములు మాకుఁ గలిగె మరల
మంటిమి నీసేవ మఱిగినవారలు
కైవల్యవిభవంబు గాంక్ష సేయ

ఆ. రితరసుఖము లెల్ల నిచ్ఛయింపఁగ నేల?
యస్థిరంబు లివి, యనంతభక్తిఁ
గొలువ నిమ్ము నిన్ను ³ఘోరదైత్యానీక
చిత్తభయదరంహ! శ్రీనృసింహ! 310

వ. ఋషు లిట్లనిరి. 311

మ. భవదీయాదరలీల లోకముల నుత్పాదించి రక్షింప నేఁ
డవి దైత్యేశునిచేత ఛేదితములై హ్రస్వంబులై యుండ నీ
యవినీతుం నరసింహరూపమున సంహారంబు నొందించి వే
దవిధిం గ్రమ్మఱ నుద్ధరించితి గదా ధర్మానుసంధాయివై. 312

వ. పితృదేవత లిట్లనిరి. 313

1. తమస్విని = రాత్రి, చరుఁడు = తిరుగువాఁడు. రాక్షసుఁడు (నిశాచరుఁడన్న మాట.) 2. యజ్ఞహవిర్భాగములు. 3. ఘోరులయిన రాక్షసుల మనసులకు భయము కూర్చు వేగము కలవాఁడా.

శా. చండక్రోధముతోడ దైత్యుఁడు సుధీ శస్త్రంబులన్ మత్తుఁడై
పిండంబుల్ సహితోపకరణంబులుగా నర్పింపంగ మా కీక యు
ద్దండత్వంబునఁ దానె గ్రోలెను మహోదగ్రత్వమున్ వీఁ డిటన్
ఖండింపంబడె నీ [1]నఖంబుల నుతుల్ గావింతు మాస్త్రీశ్వరా! 314

వ. సిద్ధు లిట్లనిరి. 315

క. కుద్ధిస్థుఁడై యోగసాదిక
సిద్ధులు [2]గైకొనిన దైత్యుఁ జీరితివి మహా
యోధను నీకృప మాకును
సిద్ధులు మరలంగఁ గలిగె శ్రీనరసింహా! 316

వ. విద్యాధరు లిట్లనిరి. 317

క. దానవునిఁ జంపి యంత
ర్ధానాదిక విద్య లెల్ల దయతో మరలం
గా నిచ్చితివి విచిత్రము
నీ నిరుపమవైభవంబు నిజము నృసింహా! 318

వ. భుజంగు లిట్లనిరి. 319

క. రత్నములను మత్కాంతా
రత్నంబులఁ బుచ్చికొన్న రక్కసు నురమున్
యత్నమున వ్రచ్చి వైచితి
పత్నులు రత్నములుఁ గలిగి బ్రదికితి మీశా! 320

వ. మనువు లిట్లనిరి. 321

క. దుర్ణయుని దైత్యుఁ బొరిగొని
వర్ణాశ్రమధర్మసేతువర్గము మరలం
బూర్ణము సేసితి వేమని
వర్ణింతుము కొలిచి బ్రదుకువారము దేవా! 322

వ. ప్రజాపతు లిట్లనిరి. 323

మ. ప్రజలం జేయుటకై సృజించితి మమ్ముం బాటించి, దైత్యాజ్ఞచేఁ
బ్రజలం జేయక యింతకాలము మహాభారంబుతో నుంటి, మీ
కుజనున్ నఖమ్ముఁ జీరి చంపితివి సంకోచంబు లే కెల్లచోఁ
బ్రజలం జేయుచు నుండువారము జగద్భద్రాయమాణోదయా!

---

1 నీ గోళ్ళచేత 2 అణిమ, మహిమ మొదలైన యోగసిద్ధులను సాధించిన వారిని

వ. గంధర్వు లిట్లనిరి. 325

క. ఆడుదుము సేయుఁ బగలుం
బాడుదుము నిశాటునొద్ద బాధించు, దయం
జూడఁడు నీచే జమునిం
గూడె మహాపాతకునకుఁ గుశలముగలదే. 326

వ. చారణు లిట్లనిరి. 327

క. భువనజనహృదయభల్లుఁడు
దివిజేంద్రవిరోధి నేఁడు దెగె నీ చేతన్
[1]భవరోగనివర్తక మగు
భవదంఘ్రియుగంబుఁ జేరి బ్రదికెద మీశా! 328

వ. యక్షు లిట్లనిరి. 329

ఉ. భ్రంశము లేని నీ భటుల [2]భంగవిముక్తుల మమ్ము నెక్కి ని
స్సంశయవృత్తి దిక్కులఁ బ్రచారము సేయుచు నుండు వీఁడు [3]ని
స్త్రింశముతోడ; వీనిఁ గడతేర్చితి వాపద మాను నో[4][5]చతు
ర్వింశతితత్త్వశాసక! త్రివిష్టపముఖ్యజగన్నివాసకా! 330

వ. కింపురుషు లిట్లనిరి. 331

క. పురుషోత్తమ [6]నేరము కిం
పురుషుల మల్పులము నిన్ను భూషింపఁగ దు
ష్పురుషు [7]సకలసుజనహృ
త్పరుషుం జంపితివి జగము బ్రదికె సధీశా! 332

వ. వైతాళికు లిట్లనిరి. 333

క. త్రిభువనశత్రుఁడు వడియెను
సభలందును మఖములందు జగదీశ్వర! నీ
శుభగీతములు పఠించుచు
నభయులమై సంచరింతు మార్తశరణ్యా! 334

వ. కిన్నరు లిట్లనిరి. 335

1 సంసారమనెడి రోగమును పోగొట్టునది. 2 భంగమునుండి విడివడిన వారిని. పరాభవ మెఱుఁగనివారిని. 3 నిస్త్రింశము=కత్తి 4 ఇరువదినాలు తత్త్వములను పాలించువాడా! 5 చాలము 6 సర్వ సుజనుల హృదయములకు కఠినుఁడు.

క. ధర్మము దలఁపఁడు లఘుతర
కర్మము సేయించు మమ్ముఁ గలుషాత్మకు దు
ష్కర్ముని జంపితి [1]ప్రసన్నత
శర్మలమై నీదు భక్తి సలిపెదము హరీ! 336

వ. విష్ణుసేవకు లిట్లనిరి. 337

ఉ. [2]సంచితవిప్రశాపమునఁ జండనిశాచరుఁడైన వీని శి
క్షించుట కీడు గాదు కృప సేసితి యీశ్వరభక్తితోడ సే
వించుటకంటె వైరమున వేగమ చేరఁగ వచ్చు నిన్ను; నీ
యంచితనారసింహతను వద్భుత మాపదఁ బాసి రందఱున్. 338

౯ అధ్యాయము

వ. ఇట్లు బ్రహ్మరుద్రేంద్రసిద్ధసాధ్యపురస్సరులైన దేవముఖ్యు లందఱు నెడ గలిగి యనేకప్రకారంబుల వినుతించి రోషసంరంభ విజృంభమాణుం డయిన నరసింహదేవుని డగ్గఱఁ జేర వెఱచి లక్ష్మీదేవిం బిలిచి యి ట్లనిరి. 339

క. హరికిం బట్టపుదేవివి
హరిసేవానిపుణమతివి [3]హరిగతివి సదా
హరిరతివి నీవు సని నర
హరిరోషము డింపవమ్మ [4]హరివరమధ్యా! 340

వ. అనిన నియ్యకొని మహోత్కంఠతోడ నాకలకంఠకంఠి నరకంఠీర వుని [5]యుపకంఠంబునకుం జని. 341

సీ. ప్రళయార్కబింబంబు పగిది నున్నదిగాని
నెమ్మోము పూర్ణేందునిభముగాదు
శిఖిశిఖాసంఘంబు చెలువు సూపెడుఁగాని
చూడ్కి [6]ప్రసాదభాసురముగాదు
వీరరౌద్రాద్భుతావేశ మొప్పెడుఁగాని
భూరికృపారస స్ఫూర్తిగాదు

1 గొప్పసుఖము కలవారమై 2 కూర్పబడిన బ్రాహ్మణ శాపముచే 3 హరియే దిక్కుగాఁగలదానవు 4 సింహము నడుమువంటి నడుము కలదానా: **5 సమీపము 6 అను గ్రహముచేబ్రకాశించునది.**

భయదదంష్ట్రాంకురప్రభలు గప్పెడుఁగాని
దరహసితాంబుజాతంబుగాదు

తే. కఠిననఖరనృసింహవిగ్రహముగాని
కామినీజనసులభవిగ్రహము గాదు
విన్నదియుఁ గాదు తొల్లి నే విష్ణువలనఁ
గన్నదియుఁగాదు భీషణాకార మనుచు. 342

క. పలికెద నని గమకముఁ గొను,
బలికినఁ గడు నలుగు విభుఁడు ప్రతివచనములం
బలుకఁ డని నిలుచు శశిముఖి
బలువిడి హృదయమునఁ జనవు భయమును గదురన్. 343

వ. ఇట్లు నరహరిరూపంబు [1]వారిజనివాసిని వీక్షించి శంకించి శాంతుండై వెనుక డగ్గఱెద నని చింతింపుచున్న వారిజసంభవుండు దద్దేవుని రోషంబు నివారింప నితరుల కలవి గా దని ప్రహ్లాదుం జేరి యిట్లనియె. 344

క. తండ్రి మగుడ రోషమున మీ
తండ్రి నిమిత్తమునఁ జక్రి దారుణమూర్తిన్
[2]వేండ్రము విడువఁడు మెల్లన
తండ్రీ! శీతలునిఁ జేసి దయసేయఁగదే. 345

వ. అనిన నౌఁ గాక యని మహాభాగవతశేఖరుం డయిన బాలకుండు కరకమలంబులు ముకుళించి మందగమనంబున నమందవినయవివేకంబుల నరసింహదేవుని సన్నిధికిం జని సాష్టాంగదండప్రణామంబు సేసిన భక్తపరాధీనుం డగు నయ్యీశ్వరుం డాలోకించి కరుణాయత్తచిత్తుండై. 346

ఉ. ప్రాభవ మొప్ప నుత్కటకృపామతియై కడియంగఁ జీరి సం
శోభితదృష్టిసంఘములఁ జూచుచు బాలునిమౌళియందు లో
కాభినుతుండు పెట్టె నసురాంతకుఁ [3]డుద్భటకాలసర్పభీ
తాభయదానశస్తము ననర్గళమంగళహేతుహస్తమున్. 347

1 కమలాలయ (లక్ష్మి) 2 వేండ్రము = తాపము. (వేడిమిని) 3 భయంకరమైన కాళ సర్పమునుండి భయపడినవారికి అభయము నిచ్చుటలో వాసికెక్కినది.

నద్దంబుఁ జూచిన [1]నళికలలామంబు
ప్రతిబింబితం బగు పగిది మరల

తే. నర్థములు దోఁచుఁ, గావున నధికబుద్ధి
భక్తి సేయంగవలయును భక్తిఁ గాని
మెచ్చఁ డర్థంబు లొసఁగెడు మేరలందుఁ
బరమకరుణుండు హరిభక్తిబాంధవుండు. 352

క. కావున నల్పుఁడ సంస్తుతిఁ
గావించెద వెఱపు లేక కలనేరుపునన్
నీ వర్ణనమున ముక్తికిఁ
బోవు నవిద్యను జయించి పురుషుఁ డనంతా ! 353

సీ. సత్త్వాకరుఁడ వైన సర్వేశ ! నీయాజ్ఞ
శిరముల నిడుకొని చేయువారు
బ్రహ్మాదు లమరులు భయ మందుచున్నారు
నీ భీషణాకృతి నేఁడు సూచి;
రోషంబు మాను నీ రుచిరవిగ్రహములు
కల్యాణకరములు గాని భీతి
కరములు గావు లోకములకు వృశ్చిక
పన్నగంబుల భంగి భయముఁ జేయు

తే. నసుర మర్దించితివి, సాధుహర్ష మయ్యె,
నవతరించిన పనిదీఱె నలుక యేల,
కలుషహారివి సంతోషకారి వనుచు
నిన్నుఁ దలఁతురు లోకులు నిర్మలాత్మ ! 354

మ. ఖరదంష్ట్రాభ్రుకుటీసటానఖయు నుగ్రధ్వానయున్ రక్తకే
సరయున్ [2] దీర్ఘతరాంత్రమాలికయు భాస్వన్నేత్రయు నైన నీ

---

1 నుదుటి యందలి బొట్టు 2 పొడవైన ప్రేగుల మాలలను ధరించినది. (నరసింహ
కృతి)

నరసింహాకృతిఁ జూచి నే వెఱవఁ బ్రాజ్ఞ క్రూరదుర్వారదు
ర్భరసంసారదవాగ్నికిన్ వెఱతు నీ పాదాశ్రయుం జేయవే. 355

వ. దేవా! సకలయోనులందును సుఖవియోగదుఃఖసంయోగసంజనితంబైన శోకానలంబున దందహ్యమానుండనై దుఃఖనివారకంబుగాని దేహాద్యభిమానంబున మోహితుండనై పరిభ్రమించుచున్న యేను నాకుం బ్రియుండవు సఖుండవుఁ బరదేవతవు నైన [1]నీవగు బ్రహ్మగీతంబు లయిన లీలావతారకథావిశేషంబులఁ బఠియించుచు రాగాదినిర్ముక్తుండనై దుఃఖపుంజంబులఁ దరియించి భవదీయచరణకమలస్మరణసేవానిపుణులైన భక్తులం జేరియుండెద. బాలునిఁ దల్లిదండ్రులును, రోగిని వైద్యదత్తం బయిన యౌషధంబును, సముద్రంబున మునింగెడు వాని నావయును దక్కొరులు రక్షింపనేరని తెఱంగున సంసారతాపసంతప్యమానుండై నీచేత నుపేక్షితుండయిన వాని నుద్ధరింప నీవు దక్క నన్యుండు సమర్థుండుగాఁడు. జగంబుల నెవ్వం డేమికృత్యంబు నెవ్వనిచేతం బ్రేరితుండై యేయింద్రియంబులం జేసి యేమిటికొఱకు నెవ్వనికి సంబంధియై యేస్థలంబున నేసమయంబునం దేమిరూపంబున నేగుణంబున నపరంబయిన జనకాదిభావంబున నుత్పాదించి పరంబయిన బ్రహ్మాదిభావంబున రూపాంతరంబునొందించు నట్టి వివిధప్రకారంబులన్నియు నిత్యముక్తుండవు రక్షకుండవు నైన నీవ. నీయంశంబైనపురుషునికి నీయనుగ్రహంబునఁ గాలంబు చేతం బ్రేరితమై కర్మమయంబును బలయుతంబును బ్రధానలింగంబు నైన మనంబును నీమాయ సృజియించు. అవిద్యార్పితవికారంబును వేదోక్తకర్మప్రధానంబును సంసారచక్రాత్మకంబైన యీమనమును నిన్ను సేవింపక నియమించి తరియింప నొక్కండును సమర్థుండు లేడు. విజ్ఞాననిర్జితబుద్ధిగుణుండవు నీవు. నీవలన వశీకృతకార్యసాధనశక్తియైన కాలంబు మాయతోడం

1 నీవి + అగు=నీకు సంబంధించినవి అయిన.

గూఢ షోడశవికారయుక్తంబయిన సంసారచక్రంబుఁ జేయుచుండు.
సంసారదావదహనతంతప్యమానుండనగు నన్ను రక్షింపుము. 356

సీ. జనులు దిక్పాలురసంపదాయుర్విభ
వములు గోరుదురు భవ్యంబులనుచు.
అవియన్ని రోషహాసవిజృంభితంబైన
మాతండ్రి బొమముడిమహిమఁ జేసి
విహతంబులగు; అట్టి వీరుండు నీచేత
నిమిషమాత్రంబున నేఁడు మడిసె.
కావున ధ్రువములు గావు బ్రహ్మాదుల
శ్రీవిభవంబులు జీవితములుఁ

తే. గాలరూపకుఁడగు [1]నురుక్రమునిచేత
విదళితములగు, నిలువవు వేయునేల
యితరమేనొల్ల నీమ్రోల నిది యెఱుకగొంత
గలిగియున్నది గొలుతుఁ గింకరుఁడ నగుచు. 357

మత్తకోకిలము.

ఎండమావులవంటి [2]భద్రము లెల్ల సాధ్యములందు మ
ర్త్యుండు రోగనిదానదేహముతో విరక్తుఁడుగాక యు
ద్దండమన్మథవహ్ని నెప్పుడుఁ దప్తుఁడై యొకనాఁడుఁ జే
రండు పారము దుష్టసౌఖ్యపరంపరాక్రమణంబునన్. 358

ఉ. శ్రీమహిళామహేశసరసీరుహగర్భులకైన నీమహో
ద్దామకరంబుచే నభయదానముసేయవు నేను బాలుఁడం
[3]దామసవంశసంభవుఁడ దైత్యుఁడ నుగ్రరజోగుణుండ [4]ని
స్సీమదయం గరాంబుజము శీర్షముఁ జేర్చుట చోద్యమీశ్వరా! 359

1 ఉరుక్రముఁడు=గొప్ప పరాక్రమము కలవాఁడు. ఉరు విక్రమేణ అని మూలము.
2 శ్రేయస్సులు (సుఖములు) 3 తమోగుణ ప్రధానమైన వంశమునఁ బుట్టినవాఁడను
4 హద్దులేని దయతో (మిక్కిలిదయతో నన్నమాట)

వ. మహాత్మా! సుజనులయిన బ్రహ్మాదులందును దుర్జనులైన మా
యందును సేవానురూపంబుగం బక్షపాతంబులు లేక కల్పవృక్షంబు
చందంబున ఫలప్రదానంబు సేయుదువు. [1]కందర్పసమేతంబగు
సంసారకూపంబునం గూలుచున్న మూఢజనులం గూడి కూలెడు నేను
భవదీయభృత్యుండగు నారదుని యనుగ్రహంబునం జేసి నీకృపకుం
బాత్రుండ నైతి. నన్ను రక్షించి మజ్జనకుని వధియించుట నాయం
దులం బక్షపాతంబు గాదు, దుష్టదనుజసంహారంబును శిష్టభృత్య
మునిజనరక్షాప్రకారంబును నీకు నైజగుణంబులు. విశ్వంబు నీవ,
గుణాత్మకంబయిన విశ్వంబు సృజియించి యందుం బ్రవేశించి హేతు
భూతగుణయుక్తుండవై రక్షకసంహారకాదినానారూపంబుల
నుండుదువు. [2]సదసత్కారణకార్యాత్మకంబయిన విశ్వంబునకుం
బరమకారణంబు నీవ, నీమాయచేత వీఁడు దా నని యెడి బుద్ధి
[3]వికల్పంబు దోఁచుగాని నీకంటె నొండెద్దియు లేదు. బీజంబునందు
వస్తుమాత్రభూతసౌక్ష్మ్యంబును వృక్షంబునందు నీలత్వాది
వర్ణంబునుం గలుగు తెఱంగున, విశ్వంబునకు నీయంద జన్మస్థితిప్రకా
శనాశంబులుం గలుగు. నీచేత నయిన విశ్వంబు నీయంద నిలుపు
కొని తొల్లి ప్రళయకాలపారావారంబునం బన్నగేంద్రపర్యంకం
బునం గ్రియారహితుండవై నిజసుఖానుభవంబు సేయుచు నిద్రితుని
భంగి యోగనిమీలితలోచనుండవై మెలంగుచుం గొంతకాలంబు
నకు నిజకాలశక్తిచేతం బ్రేరితంబులై ప్రకృతిధర్మంబులయిన సత్త్వాది
గుణంబులనంగీకరించి సమాధిసాలించి విలసించుచున్న నీనాభి
యందు వటబీజంబువలన నుద్భవించు వటంబు తెఱంగున నొక్క
కమలంబు సంభవించె. అట్టి కమలంబువలన నాల్గుమోముల
బ్రహ్మ జన్మించి దిశలు వీక్షించి కమలంబునకు నొండయిన
రూపంబు లేకుండుటం జింతించి జలాంతరాళంబుఁ బ్రవేశించి

1 మన్మథునితోఁ గూడిన (కామ వ్యాపారములతోఁ గూడిన దన్నమాట) 2 సదసత్తులకు కారణమైన, కార్యము స్వరూపముగా గలది. శుభాశుభమిశ్రకర్మములవలనఁ దోచునది యని భావము.

జలంబునందు నూఱుదివ్యవత్సరంబులు వెదకి తనజన్మంబునకు [1]నుపాదానకారణంబైన నిన్నుఁ దర్శింప సమర్థుండు గాక, మగిడి కమలంబు కడకుం జని విస్మయంబు నొంది చిరకాలంబు నిర్మలతపంబు సేసి పృథివియందు గంధంబు గనుచందంబునఁ దనయందు నానా సహస్రవదనశిరోనయననాసాకర్ణవక్త్రభుజకరచరణంబులును బహువిధాభరణంబులును మాయాకలితంబులును మహాలక్షణాలంకృతంబులును నిజప్రకాశదూరీకృతతమంబులును బురుషోత్తమురూపంబును నయిన నిన్నుఁ దర్శించె. అయ్యవసరంబున. 360

క. [2]ఘోటకవదనుఁడ వై మధు
కైటభులం దునిమి నిగమగణముల నెల్లం
బాటించి యజున కిచ్చిన
[3]కూటస్థుఁడ వీశ్వరుఁడవు కోవిదవంద్యా! 361

వ. ఇవ్విధంబునఁ గృతత్రేతాద్వాపరంబులను మూఁడుయుగంబులందును దిర్యఙ్మానవమునిజలచరాకారంబుల నవతరించి లోకంబుల ధరించుచు హరించుచు యుగానుకూలధర్మంబులం బ్రతిష్ఠించుచు నుండుదువు. దేవా! యవధరింపుము. 362

సీ. కామహర్షాదిసంఘటితమై చిత్తంబు
భవదీయచింతనపదవి పొరదు
మధురాదిరసముల మరిగి చొక్కుచు జిహ్వ
నీ వర్ణనమునకు నిగుడనీదు
సుందరీముఖములఁ జూడఁ గోరెడిచూడ్కి
తావకాకృతులపైఁ దగులువడదు
వివిధదుర్భాషలు వినఁ గోరు వీనులు
వినవు యుష్మత్కథావిరచనములు

తే. ఘ్రాణ మురవడిఁ దిరుగు దుర్గంధములకు
దనువు గోలుపడదు వైష్ణవధర్మములకు

1 ప్రధాన కారణము=(కుండకు మట్టి యుపాదానకారణము) 2 హయగ్రీవమూర్తివై 3 మూలపురుషుఁడవు(అక్షరుఁడవన్నమాట)

నడఁగి యుండవు కర్మేంద్రియములు పురుషుఁ
గలఁచు, [1]సవతులు గృహమేధిఁ గలఁచునట్లు. 363

వ. ఇవ్విధంబున నింద్రియంబులచేతఁజిక్కినవి స్వకీయపరకీయశరీరంబులందు మిత్రామిత్రభావంబులు సేయుచు జన్మమరణంబుల నొందుచు సంసారవైతరణీనిమగ్నంబయిన లోకంబు నుద్ధరించుట లోకసంభవస్థితిలయకారణుండ వైన నీకుం గర్తవ్యంబు. భవదీయసేవకులమయిన మాయందుఁ బ్రియభక్తులయినవారల నుద్ధరింపుము. 264

మ. భగవద్దివ్యగుణానువర్తనసుధాప్రాప్తైకచిత్తుండనై
బెగడన్ సంసరణోగ్రవైతరణికిన్; భిన్నాత్ములై [2]తావకీ
యగుణస్తోత్రపరాఙ్ముఖత్వమున మాయాసౌఖ్యభావంబులన్
సుగతిం గానని మూఢులం గని మదిన్ శోకింతు సర్వేశ్వరా! 365

వ. దేవా! మునీంద్రులు నిజముక్తికాములయి విజనస్థలంబులం దపంబులాచరింతురు, కాముకత్వంబు నొల్లరు. విశ్వంబున వీరికి నీకంటె నొండుశరణంబు లేదు గావున నిన్ను సేవించెదరు. కొందఱు కాముకులు [3]కరద్వయకండూతిచేతం దనియుని చందంబునఁ దుచ్ఛంబయి పశుపక్షిక్రిమికీటసామాన్యంబయిన మైథునాదిగృహమేధిసుఖంబులం దనియక కడపట నతిదుఃఖవంతు లగుదురు. నీప్రసాదంబు గల సుగుణుండు నిష్కాముండయియుండు. మౌనవ్రతజపతపశ్శ్రుతాధ్యయనంబులును నిజధర్మవ్యాఖ్యానవిజనస్థలనివాససమాధులును మోక్షహేతువులగు. అయిన నివి పదియు నింద్రియజయంబు లేని వారికి భోగార్థంబులయి విక్రయించువారికి జీవనోపాయంబు లయి యుండు. దాంభికులకు [4]వార్తాకరంబు లయి సఫలంబులు గావు. భక్తి లేక భవదీయజ్ఞానంబు లేదు. రూపరహితుండ వైన నీకు బీజాంకురంబులకై వడిఁ గారణకార్యంబు లయిన సదసద్రూపంబులు రెండును బ్రకాశమానంబులగు. ఆ రెంటియందును భక్తియోగంబున బుద్ధిమంతులు మథనంబున దారువులందు వహ్నిం

---

1 సపత్నులు 2 తావకీయ=నీయొక్క 3 చేతులు గోకి కొనుటచే 4 జీవనోపాయములు.

గనియెడు తెఱంగున నిన్నుఁ బొడఁగందురు. పంచభూతతన్మాత్రంబులును ప్రాణంబులు నింద్రియంబులును మనోబుద్ధ్యహంకారచిత్తంబులును నీవ, సగుణంబును నిర్గుణంబును నీవ, గుణాభిమానులయిన జననమరణంబుస నొందు నిబుధు లావృతంబులు గానఁ [1]నిరుపాధికుండవైన నిన్నెఱుంగరు. తత్త్వజ్ఞులయిన విద్వాంసులు వేదాధ్యయనాదివ్యాపారంబులుమాని వేదాంతప్రతిపాద్యుండవగు నిన్ను సమాధివిశేషంబుల నెఱింగి సేవింతురు. అది గావున.

సీ. నీగృహాంగణభూమి నిటలంబు మోవంగ
మోదించి నిత్యంబు మ్రొక్కఁడేని
నీమంగళస్తవనికరవర్ణంబులు
పలుమాఱు నాలుకఁ బలుకఁడేని
నీయధీనములుగా నిఖిలకృత్యంబులఁ
బ్రియభావమున సమర్పింపఁడేని
నీపదాంబుజముల నిర్మలహృదయుఁడై
చింతించి మక్కువఁ జిక్కఁడేని

తే. నిన్నుఁ జెవులార వినఁడేని నీకు సేవ
సేయరాఁడేని బ్రహ్మంబుఁ జెందఁ గలఁడె
యోగియైనఁ దపోవ్రతయోగియైన
[2]వేదియైన మహాతత్త్వవేదియైన. 367

వ. కావున భవదీయదాస్యయోగంబుఁ గృపసేయుమని ప్రణతుండైన ప్రహ్లాదుని వర్ణనంబులకు మెచ్చి నిర్గుణుండైన హరి రోషంబు విడిచి యిట్లనియె. 368

శా. సంతోషించితి నీచరిత్రమునకున్ సద్భద్ర మాగాక నీ
యంతర్వాంఛితలాభ మెల్లఁ గరుణాయత్తుండనై యిచ్చెదం
జింతం జెందకు భక్తకాముఁడ నే సిద్ధంబు దుర్లోకుఁడన్
జంతుశ్రేణికి నన్నుఁ జూచినఁ బునర్జన్మంబు లే దర్భకా! 369

1 ఉపాధిశూన్యుఁడవు. 2 వేదములు కలవాఁడు. వేదములు చదివినవాఁడు. లేదా వేదికలవాఁడు. అగ్నిహోత్రవేదిక కలవాఁడు. యజ్ఞకర్తయని భావము.

ఆ. సకలభావములను సాధులు విద్వాంసు
లఖిలభద్రవిభుఁడ నైననన్నుఁ
గోర్కు లిమ్మటంచుఁ గోరుదు రిచ్చెదఁ
గోఱు మెద్దియైనఁ గుఱ్ఱ! నీవు. 370

౧౦ అధ్యాయము.

వ. అని పరమేశ్వరుండు ప్రహ్లాదునియందుఁ గల సకామత్వంబుఁ దెలియుకొఱకు వంచించి యిట్లానతిచ్చిన, నతండు నిష్కాముం డైన [1]యేకాంతి గావునఁ గామంబు భక్తియోగంబునకు నంతరాయంబని తలంచి యిట్లనియె. ఉత్పత్తిమొదలు కామాద్యనుభవాసక్తి లేని నాకు వరంబులిచ్చెదనని వంచింపనేల? సంసారబీజంబులును హృదయబంధకంబులునయిన గామంబులకు వెఱచి ముముక్షుండనై సేమంబుకొఱకు [2]సేమంబున నిన్నుం జేరితి. కామంబులును నింద్రియంబులును మనశ్శరీరధైర్యంబులును మనీషాప్రాణధర్మంబులును లజ్జాస్మరణలక్ష్మీసత్యతేజోవిశేషంబులును నశించు. లోకంబులందు భృత్యులర్థకాములయి రాజుల సేవింతురు. రాజులుం బ్రయోజనంబులగ్గించి భృత్యులకునర్థంబులొసంగుదురు. అవ్విధంబు గాదు. నాకుం గామంబు లేదు. నీకుం బ్రయోజనంబు లేదు. అయిననుదేవా! వరదుండవయ్యెదవేనిఁగామంబులు వృద్ధిఁబొందనివరంబుఁ గృప సేయుము. కామంబులు విడిచినపురుషుండు నీతోడ సమాన విభుండగు. నరసింహా! పరమాత్మ! పురుషోత్తమ! యనిప్రణవ పూర్వకంబుగా నమస్కరించిన హరి యిట్లనియె. 371

సీ. నీయట్టి సుజ్ఞాన నిపుణు లేకాంతులు
గోర్కులు నాయందుఁ గోర నొల్ల
రట్లైనఁ బ్రహ్లాద! యసురేంద్రభర్తవై
సాగి మన్వంతర సమయ మెల్ల
నిఖిలభోగంబులు నీవు భోగింపుము
కల్యాణబుద్ధి నా కథలు వినుము

1 ఆత్మనిష్ఠాపరుడు. 2 నియమముచే.

సకలభూతములందు సంపూర్ణుఁ డగు నన్ను
యజ్ఞేశు నీశ్వరు నాత్మ నిలిపి
ఆ. కర్మచయము లెల్ల ఖండించి పూజన
మాచరింపు మీశ్వరార్పణముగ
భోగముల నశించుఁ బుణ్యంబు వ్రతములఁ
బాపసంచయములు వాయు నిన్ను. 372

వ. మఱియు మీఁదటఁ గాలవేగంబునం గళేబరంబు విడిచి త్రైలోక్య విరాజమానంబును దివిజరాజగేయమానంబును బరిపూరితదశ దిశంబును నయిన యశంబుతోడ ముక్తబంధుండవై నన్ను డగ్గఱెదవు వినుము. 373

ఆ. నరుఁడు ప్రియముతోడ నాయవతారంబు,
నీయుదారగీత నికరములను
[1]మానసించునేని మఱి సంభవింపఁడు
కర్మబంధచయముఁ గడచిపోవు. 374

వ. అనినఁ బ్రహ్మోదుండి ట్లనియె. 375

సీ. దంష్ట్రివై తొల్లి సోదరుని హిరణ్యాక్షు
నీవు సంపుటఁ జేసి నిగ్రహమున
నూత్తండ్రి రోషనిర్మగ్నుఁడై సర్వలో
కేశ్వరుఁ బరము నిన్నెఱుఁగ లేక
[2]పరిపంథిపగిది నీ భక్తుండనగు నాకు
నపకారములు సేసె నతఁడు నేఁడు
నీ శాంతదృష్టిచే నిర్మలత్వమునొందెఁ
గావున బాపసంఘంబువలనఁ
తే. బాసి శుద్ధాత్మకుఁడు గాఁగ భవ్యగాత్ర!
వరము వేఁడెద నాకిమ్ము వనజనేత్ర!
భక్తసంఘాతముఖపద్మపద్మమిత్ర!
భక్తకల్మషవల్లికాపటులవిత్ర! 376

1. తలపోయునేని. 2. శత్రువువలె.

వ. అనిన భక్తునికి భక్తవత్సలుం డిట్లనియె. 377

మ. [1] నిజభక్తుండవు నాకు నిన్నుఁ గనుటన్ నీతండ్రి [2]త్రిస్సప్తపూ
ర్వజులం గూడి పవిత్రుఁడై శుభగతిన్ వర్తించు విజ్ఞానదీ
పజితానేకభవాంధకారులగు మద్భక్తుల్ వినోదించు దే
శజనుల్ దుర్జనులైన శుద్ధులుసుమీ సత్యంబు దైత్యోత్తమా! 378

సీ. ఘనసూక్ష్మభూతసంఘాతంబులోపల,
నల్లవాంఛలు మాని యెవ్వరయిన
నీచందమున నన్ను నెఱయ సేవించిన,
మద్భక్తులగుదురు మత్పరులకు
గుఱి సేయ నీవ యోగ్యుఁడ వైతి విటమీఁద,
వేదచోదితమైన విధముతోడఁ
జిత్తంబు నామీఁదఁ జేర్చి మీ తండ్రికిఁ,
బ్రేతకార్యములు సంప్రీతిఁ జేయు

తే. మతఁడు రణమున నేడు, నా [3]యంగమర్శ,
నమున నిర్మల దేహుఁడై నవ్యమహిమ
నపగతాఖిలకల్మషుఁ డై తనర్చి,
పుణ్యలోకంబులకు నేఁగుఁ బుణ్యచరిత! 379

వ. అని యిట్లు నరసింహదేవుం డానతిచ్చిన హిరణ్యకశిపునకుం బ్రహ్లా
దుండు పరలోకక్రియలు సేసి, భూసురోత్తములచేత నభిషిక్తుండయ్యె.
అయ్యెడం బ్రసాదసంపూర్ణముఖుండైన శ్రీ నృసింహదేవునిజూచి
దేవతాప్రముఖసహితుండైన బ్రహ్మదేవుం డిట్లనియె. 380

సీ. దేవదేవాఖిల దేవేశ! భూతభా
వన! వీఁడు నాచేత వరమువడసి
మత్సృష్టజనులచే మరణంబునొందక
మత్తుఁడై సకలధర్మములుఁ జెఱచి

1. ఆత్మభక్తుఁడవు. ఇట నిజశబ్దము ఆత్మపర్యాయము. ఆత్మబంధువువంటిదే యీ పదము. ఆత్మరూపమైన భక్తుఁడవు. (నేనేనీవు నీవేనేను అన్నంతవాఁడవు) 2. ఇరువదియొక్క తరముల వెనుకటివారిని 3. శరీరస్పర్శచేత.

నేఁడు భాగ్యంబున నీచేత హతుఁడయ్యెఁ
గల్యాణ మమరె లోకముల కెల్ల
బాలు నీతని మహాభాగవతశ్రేష్ఠు
బ్రతికించితివి మృత్యు భయముఁ బాపి

తే. వరముఁ గృప సేసితివి మేలు వారిజాక్ష!
నీ నృసింహావతారంబు నిష్ఠతోడఁ
దగిలి చింతించువారలు దండధరుని
బాధనొందరు మృత్యువు బారిఁ పడరు. 431

వ. అనిన నరసింహదేవుం డిట్లనియె. 382

క. మన్నించి [1]దేవశత్రుల,
కెన్నఁడు నిటువంటివరము లీకుము పాపో
త్పన్నులకు వరము లిచ్చుట,
పన్నగముల కమృత మిడుట పంకజగర్భా! 383

వ. అని యిట్లానతిచ్చి బ్రహ్మాదిదేవతాసమూహంబుచేఁ బూజితుం డై భగవంతుండైన శ్రీనృసింహదేవుండు తిరోహితుండయ్యె. ప్రహ్లాదుండును శూలికిఁ బ్రణమిల్లి తమ్మిచూలికి వందనంబులు సేసి ప్రజాపతులకు మ్రొక్కి భగవత్కళలైన దేవతలకు నమస్కరించి నంజూచి బ్రహ్మదేవుండు శుక్రాదిమునీంద్రసహితుండై దైత్య దానవరాజ్యంబునకుం బ్రహ్లాదుం బట్టంబు గట్టి యతనిచేతఁ బూజి తుండై దీవించె. అంత నీశానాదినిఖిలదేవతలు వివిధంబులగు నాశీర్వాదంబులచేత నా ప్రహ్లాదునిఁ గృతార్థుం జేసి తమ్మిచూలిని ముందట నిడుకొని నిజస్థానంబునకుఁ జనిరి. ఇట్లు విష్ణుదేవుండు నిజ పార్శ్వచరు లిరువురు బ్రాహ్మణశాపంబునం జేసి ప్రథమజన్మంబున దితిపుత్రులైన హిరణ్యాక్షహిరణ్యకశిపులను వరాహ నారసింహ రూపంబుల నవతరించి వధియించె. ద్వితీయభవంబున రాక్షస జన్మంబుదాల్చిన రావణకుంభకర్ణులను శ్రీరామరూపంబున

1 రాక్షసులకు

సంహరించె. తృతీయజన్మంబున శిశుపాలదంతవక్త్రులను పేరులం బ్రసిద్ధినొందినవారలను శ్రీకృష్ణరూపంబున ఖండించె. ఇవ్విధంబున మూఁడుజన్మంబుల గాఢవైరానుబంధంబున నిరంతరసంభావిత ధ్యానులై వారలు హరినిందాదిపాపవిముక్తులై హరిం గదిసిరని చెప్పి నారదుం డిట్లనియె. 384

ఉ. శ్రీరమణీయమైన నరసింహవిహారము నింద్రశత్రుసం
హారముఁ బుణ్యభాగవతుఁడైన నిశాచరనాథపుత్రసం
చారము నెవ్వఁడైన సువిచారత విన్నఁ బఠించినన్ శుభా
కారముతోడ నేభయముఁ గల్గనిలోకముఁ జెందు భూవరా! 385

మ. జలజాతప్రభవాదులున్ మనములోఁ జర్చించి [1]భాషావళిం
బలుకన్ లేని జనార్దనాహ్వయపరబ్రహ్మంబు మీయింటిలోఁ
జెలియై మేనమఱందియై సచివుఁడై చిత్తప్రియుండై మహా
ఫలసంధాయకుఁడై చరించు టది సౌభాగ్యంబు రాజోత్తమా! 386

త్రిపురాసుర సంహారము.

క. బహుమాయుఁడైన మయుచే,
విహతంబగు స్మరహరుని యశము విఖ్యాతజయా
వహముగ నీ భగవంతుఁడు
మహితాత్ముఁడు మున్నొనర్చె మనుజవరేణ్యా! 387

వ. అనిన ధర్మనందనుం డిట్లనియె. 388

క. ఏకర్మంబున విభుఁడగు
శ్రీకంఠుని యశము మయునిచే సుడివడియెన్
వైకుంఠుఁ డెవ్విధంబునఁ
జేకొని తత్కీర్తి చక్కఁగా నొనరించెన్. 389

వ. అనిన నారదుం డిట్లనియె. 390

క. చక్రాయుధబలయుతు లగు
శక్రాదుల [2]కోహటించి శౌర్యమున నసురుల్

1 వాక్కుల సమూహముచే 2 ఓడి.

[1]సాక్రోశంబున నరిగిరి
విక్రమములు మాని మయుని వెనుకకు నధిపా! 391

వ. ఇట్లు రక్కసులు దన వెనుకఁ జొచ్చిన మాయానిలయుండును
దుర్ణయుండును నైన మయుండు దన విద్యాబలంబున నయోరజత
సువర్ణమయంబులై యెవ్వరికిని లక్షింపరాని గమనాగమనంబు
లును వితర్కింపరాని [2]కర్కశపరిచ్ఛదంబులును గలిగిన త్రిపురం
బుల నిర్మించి యిచ్చిన, నక్తంచరు లందఱు నందుం బ్రవేశించి
కామసంచారులై పూర్వవైరంబుఁ దలంచి సనాయకానీకంబు
లయిన లోకంబుల నస్తోకంబు లయిన నిజబలాతిరేకంబుల శోకంబు
నొందించిన. 392

క. లోకాధినాథు లెల్లను
శోకాతురు లగుచు శరణుజొచ్చిరి దుష్టా
నీకవిదళనాకుంఠున్
శ్రీకంఠున్ భువనభరణచిత్తోత్కంఠున్. 393

వ. ఇట్లు సకలలోకేశ్వరుం డగు మహేశ్వరుం జేరి లోకపాలకులు
ప్రణతులై పూజించి కరకమలంబులు ముకుళించి. 394

క. త్రిపురాలయు లగు దానవు
లపరాజితు లయిన మాకు నశ్రాంతంబున్
వపురాదిపీడఁ జేసెద
రపరాధకులను వధింపు మగజాధీశా! 395

క. దీనులము గాక యుష్మద
ధీనులమై యుండు మేము [3]దేవాహితదో
ర్లీనుల మైనారము బల
హీనుల మగు మమ్ముఁ గావు మీశాన! శివా! 396

వ. అనిన భక్తవత్సలుం డగు పరమేశ్వరుండు శరణాగతులైన గీర్వా
ణుల వెఱవకుం డని దుర్వారబలంబున బాణాసనంబుఁ గేల నంది

1 స+ఆక్రోశము = విచారముతో. 2 కఠినములయిన ఆవరణములు కలవి.
3. రాక్షసుల బాహువులయం దడఁగిపోయినవారము.

కొని యొక్క దివ్యబాణంబు సంధించి త్రిపురంబులపయి నేసిన, మార్తాండమండలంబున వెలువడు మయూఖజాలంబులచందంబునఁ దద్బాణంబువలన దేదీప్యమానంబులై యనేకబాణసహస్రంబు లుప్పతిల్లి కకుప్పులు నిండి మండి తెప్పలుగాఁ గుప్పలు గొని త్రిపురంబులఁ గప్పె. అప్పుడు తద్బాణపావక[1]హేతిసందోహ దందహ్యమానులై గతాసులైన త్రిపురపురనివాసులం దెచ్చి మహాయోగి యైన మయుండు సిద్ధరసకూపంబున వైచిన, 397

క. సిద్ధామృతరసమహిమను
శుద్ధమహావజ్రతుల్యశోభితతను లై
వృద్ధిం బొందిరి దానవు
లుద్ధత [2]నిర్ఘాతపావకోపము లగుచున్. 398

క. కూపామృతరససిద్ధిని
దీపితులై నిలిచియున్న దేవాహితులన్
రూపించి చింతనొందెడు
[3]గోపధ్వజుఁ జూచి చక్రి [4]కుహనాన్వితుఁడై. 399

శా. ఉత్సాహంబున నొక్కపాఁడిమొదవై యూథంబు ఘూర్ణించుచున్
వత్సంబై తనవెంట బ్రహ్మనడవన్ వైకుంఠుఁ డేతెంచి యు
ద్యత్సత్త్వంబునఁ గూపమధ్యరసముం ద్రావెన్ విలోకించుచుం
దత్సౌభాగ్యనిమగ్ను లై మఱచి రాదైత్యుల్ నివారింపఁగన్. 400

వ. ఇట్లు విష్ణుండు మోహనాకారంబున ధేనువయి వచ్చి త్రిపురమధ్యకూపామృతరసంబు ద్రావిన నెఱింగి శోకాకులచిత్తు లయిన రసకూపపాలకులం జూచి మహాయోగి యైన మయుండు వెఱఁగుపడి దైవగతిం జింతించి శోకింపక యి ట్లనియె. 401

ఆ. అమరు లైన దనుజు లైనను నరు లైన,
నెంత నిపుణు లైన నెవ్వ ైన

1 హేతి = జ్వాలలు. 2 నిర్ఘాత = పిడుగునందలి పావక + ఉపములు = నిప్పవంటివారు. 3 గోపధ్వజుఁడు = శివుఁడు (వృషభము టెక్కెమునందుఁ గలవాఁడు). 4 మాయతోఁగూడినవాఁడై. 5 పాడుఁగు.

[1]దైవికార్థచయముఁ దప్పింపఁగా లేరు,
వలదు దనుజులార! వగవ మనకు. 402

వ. అని పలికె. అంత విష్ణుండు నైజంబు లైన ధర్మవిజ్ఞానవిద్యాతపో
విరక్తిసమృద్ధిక్రియాశక్తివిశేషంబుల శంభునికిఁ బ్రాధాన్యంబు
సమర్పించి రథసూతకేతువర్మబాణాసనప్రముఖసంగ్రామసాధనం
బులు సేసినం గైకొని. 403

మ. శరి యై కార్ముకి యై మహాకవచి యై [2]సన్నాహి యై [3]వాహి యై
సరథుం డై సనియంత యై సబలుఁ డై సత్కేతుసచ్ఛత్రుఁ డై
పరమేశుం డొకబాణమున్ విడిచెఁ దద్బాణానలజ్వాలలం
బురముల్ గాలె ఛటచ్ఛటధ్వని నభోభూమధ్యముల్ నిండఁగన్.

వ. ఇట్లు హరుండు దురవగాహంబు లైన త్రిపురంబుల నభిజిన్ముహూ
ర్తంబున భస్మంబు సేసి కూల్చిన, నమరగరుడగంధర్వసిద్ధసాధ్య
యక్షవల్లభులు వీక్షించి జయజయశబ్దంబులు సేయుచుఁ గుసుమ
వర్షంబులు వర్షించిరి, ప్రజలు హర్షించిరి, బ్రహ్మాదులు గీర్తించిరి,
అప్సరసలు నర్తించిరి, దివ్యకాహళదుందుభిరవంబులును మునిజనో
త్సవంబులును బ్రచురంబు లయ్యె. ఇట్లు [4]విశ్వజనీనం బగు త్రిపురా
సురసంహారంబున నఖిలలోకులును సంతసిల్లియుండ నయ్యవసరంబున.

ఆ. తృణకణములభంగి ద్రిపురంబుల దహించి,
పరముఁ డవ్యయుండు భద్రియశుఁడు
శివుఁడు పద్మజాదిజేగీయమానుఁ డై,
నిజనివాసమునకు నెమ్మిఁ జనియె. 406

వ. ఇట్లు నిజమాయావిశేషంబున మర్త్యలోకంబున విడంబించుచున్న
విష్ణునిపరాక్రమవిధానంబులు మునిజనవంద్యమానంబు లై సకల
లోకకల్యాణప్రధానంబు లై యుండు ననిన విని నారదునకు ధర్మ
నందనుం డిట్లనియె. 407

---

1. దైవిక + అర్థచయము = దైవవశమున నేర్పడు విషయసమూహమును
2. యుద్ధసన్నాహము కలవాఁడు. 3. వాహన మెక్కినవాఁడు 4. లోకములకు మేలు
గలిగించునది.

౧౧ అధ్యాయము

నారదుండు ధర్మరాజునకు వర్ణాశ్రమధర్మంబులు దెలుపుట.

సీ. అనఘాత్మ! సకలవర్ణాశ్రమాచారస
మ్మతధర్మ మెయ్యది మానవులకు?
నేధర్మమున నరుం డిద్ధవిజ్ఞానము
భక్తియుఁ బ్రాపించుఁ? బద్మజునకు
సాక్షాత్సుతుండవు సర్వజ్ఞుఁడవు నీకు
నెఱుఁగరానిది ధర్మ మింత లేదు.
నారాయణపరాయణస్వాంతు లనఘులు
శాంతులు సదయులు సాధువృత్తి

ఆ. మెఱయుచున్న ఘనులు మీవంటివా రిద్ది
పరమధర్మ మనుచు భక్తిఁ దలఁతు
రట్టి ధర్మరూప మఖిలంబు నెఱిఁగింపు
వినఁగ నిచ్చ గలదు విమలచరిత! 408

వ. అనిన నారదుండు ధర్మరాజుం జూచి దాక్షాయణియందు నిజాంశంబున నవతరించి భువనశోభనంబుకొఱకు బదరికాశ్రమంబునఁ దపోనిరతుండయి యున్న నారాయణునివలన సనాతనధర్మంబు వింటిని. అది సెప్పెద. సకలవర్ణంబులకు సత్యంబును దయయును నుపవాసాదితపంబును శౌచంబును [1]సైరణయును సదసద్వివేకంబును మనోనియమంబును బహిరింద్రియజయంబును హింస లేమియును బ్రహ్మచర్యంబును దానంబును యథోచితజపంబును సంతోషంబును మార్దవంబును సమదర్శనంబును మహాజనసేవయు [2]గ్రామ్యంబు లయిన కోరికలు మానుటయు, నిష్ఫలక్రియలు విడుచుటయు, మితభాషిత్వంబును దేహంబుగాని తన్ను వెదకి కొనుటయు నన్నోదకంబులు ప్రాణులకుం బంచి యిచ్చుటయుఁ బ్రాణులందు దేవతాబుద్ధియు నాత్మబుద్ధిం జేయుటయు

1. ఓర్పు. 2. తుచ్ఛములు.

శ్రీనారాయణచరణస్మరణ కీర్తన శ్రవణ సేవార్చనసమస్కార దాస్యాత్మసమర్పణసఖ్యంబు లనియెడి త్రింశల్లక్షణంబులు గలుగ వలయు. అందు సత్కులాచారుండయి మంత్రవంతంబు లైన గర్భాదానాదిసంస్కారంబు లవిచ్ఛిన్నంబులుగాఁ గలవాఁడు ద్విజుండు. ద్విజునకు యజనయాజనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహంబు లను షట్కర్మంబులు విహితంబులు. రాజునకుఁ బ్రతిగ్రహవ్యతిరిక్తంబు లయిన యజనాదికర్మంబు లయిదును బ్రజాపాలనంబును బ్రాహ్మణులుగానివారివలన దండశుల్కాదులు గొనుటయు విహితకర్మంబులు. వైశ్యునికిఁ గృషివాణిజ్యగోరక్షణాది కర్మంబులును బ్రాహ్మణకులానుసరణంబును విహితంబులు. శూద్రునకు ద్విజశుశ్రూష సేయ వలయు. 409

సీ. విను కర్షణాదికవృత్తికంటెను మేలు
యాచింప నొల్లని యట్టివృత్తి
ప్రాప్తంబు గైకొని బ్రదుకుకంటెను లెస్స
యనుదినంబును ధాన్య మడిగికొనుట
యాయవారముకంటె నధికకళ్యాణంబు
పఱిగ యేన్నుల ధాన్యభక్షణంబు
శిలవృత్తికంటెను శ్రేయ మాపణముల
బడ్డగింజలు దిని బ్రదుకఁ గనుట

ఆ. [1]యెడరుచోట నృపతి కీనాల్గువృత్తులుఁ
దగుఁ, బ్రతిగ్రహంబు దగదు తలఁప
నాపదవసరముల నధముఁ డెక్కువజాతి
వృత్తినున్న దోషవిధముగాదు. 410

వ. వినుము శిలవృత్తియు నుంఛవృత్తియు ఋతమనియు నయాచిత వృత్తి యమృతమనియు యాచ్ఞావృత్తి మృతమనియుఁ గర్షకవృత్తి ప్రమృతమనియు నెన్నుదురు. అట్టివృత్తులెఱింగి జీవించుట మేలు. వాణిజ్యంబు సత్యానృతమనియు, శ్వవృత్తి నీచసేవ యనియుఁ బలు

1 ఆపదగలిగినప్పుడు.

కుదురు. సర్వవేదమయుండు బ్రాహ్మణుండు. సర్వదేవమయుండు క్షత్త్రియుఁడు. బ్రాహ్మణక్షత్త్రియులకు నీచసేవనంబు కర్తవ్యంబు గాదు. 411

క. దమమును శౌచము: దపమును
శమమును మార్దవముఁ గృపయు సత్యజ్ఞాన
క్షమలును హరిభక్తియు హ
ర్షము నిజలక్షణము లగ్రజాతికి నధిపా! 412

ఉ. శౌర్యము దానశీలముఁ బ్రసాదము నాత్మజయంబుఁ దేజముం
ధైర్యము దేవభక్తియును ధర్మము నర్థముఁ గామమున్ బుధా
చార్యముకుందసేవలును సత్కృతియుం బరితోషణంబు స
ద్వీర్యము రక్షణంబుఁ బృథివీవరశేఖర! రాజచిహ్నముల్. 413

క. ధర్మార్థకామవాంఛయు
నిర్మలగురుదేవవిప్రనివహార్చనముల్
నిర్మలభావముఁ బ్రమదము
[1]శర్మకరత్వమును వైశ్యజనలక్షణముల్. 414

ఉ. [2]స్తేయము లేనివృత్తియు శుచిత్వము సన్నుతియున్ నిజేశులం
మాయలు లేక డాయుటయు మంత్రముఁజెప్పక [3]పంచయజ్ఞముల్
సేయుటయున్ ధరామరుల సేవయు గోవులరక్షణంబు న
న్యాయములేమియున్ మనుజనాథ! యెఱుంగుము శూద్రధర్మముల్

సీ. [4]నిలయము వాటించి నిర్మలదేహ యై
శృంగార మేపారఁ జేయవలయు
సత్యప్రియాలాపచతురయై ప్రాణేశు
చిత్తంబు ప్రేమ రంజింపవలయు
దాక్షిణ్యసంతోష ధర్మమేధాదుల
దైవత మని ప్రియుఁ దలఁపవలయు

1 సుఖముకలిగించుట. 2 దొంగతనము. 3 బ్రహ్మ, పితృ, దేవ, భూత, మనుష్యులను గూర్చి చేయుయజ్ఞములు. 4 ఇల్లు వదలి వెళ్ళక.

నాథుఁ జేపద్ధతి నడచు నాపద్ధతి
నడచి తద్బంధుల నడపవలయు

ఆ. మార్దవమునఁ బతికి మజ్జనభోజన
శయనపానరతులు జరపవలయు
విభుఁడు [1]పతితుఁ డైన వెలఁది పాతివ్రత్య
మహిమఁ బుణ్యుఁ జేసి మనుపవలయు. 416

క. తరుణి దన ప్రాణవల్లభు
హరిభావముగా భజించి యతఁడును దానున్
సిరి కైవడి వర్తించును
హరిలోకమునందు సంతతానందమునన్. 417

క. ఉపవాసంబులు వ్రతములు
దపములు వేయేల భర్తృదైవత మని ని
ష్కపటతఁ గొల్చిన సాధ్వికి
నృపవర! దుర్లభము లేదు నిఖిలజగములన్. 418

వ. మఱియు సంకరజాతు లయిన రజకచర్మకారకనట [2]బురడక [3]కైవర్తకమ్లేచ్ఛభిల్లురగు నంత్యజాతు లేఘ్వరకును, జండాల [4]పుల్కసమాతంగజాతులకును నాయాకులాగతంబు లయినవృత్తులఁ జౌర్యహింసాదులు వర్జించి సంచరింపవలయు. మానవులకుఁ బ్రతి యుగంబున నైసర్గికంబు లైన ధర్మంబులు రెండులోకంబులందును సుఖకరంబు లని వేదవిదులైన పెద్దలు సెప్పుదురు. [5]కాఱుకాఱున దున్నెడు క్షేత్రంబు లావు సెడు. అందు జల్లిన బీజంబులు నిస్తేజంబులై యుండి లెస్సగ నంకురింపవు. నిరంతరఘృతధారావర్షంబున దహనునకు దాహకత్వంబు లేక శాంతిం బొందు. అందు వేల్చిన హవ్యంబులు ఫలింపవు. తద్విధంబున ననవరతకామానుసంధానంబునఁ గామోన్ముఖంబైన చిత్తంబు కామంబులం దనిసి నిష్కామంబై విరక్తి నొందుం, గావున సత్త్వస్వభావంబుతోడ

1 భ్రష్టుఁడైనచో. 2 బురడక = మేదరులు. 3 జాలరులు. 4 కిరాతులు. 5 వర్షకాలము.

నెప్పుడుం దప్పక నిజవంశాచారవిహితకర్మంబున వర్తించు నరుండు మెల్లన స్వాభావికకర్మపరత్వంబు విడిచి ముక్తి నొందు. జాతిమాత్రంబునఁ బురుషునికి వర్ణంబు నిర్దేశింపం బనిలేదు, శమదమాదివర్ణలక్షణవ్యవహారంబులఁ గనవలయు నని మఱియు నారదుం డిట్లనియె.

౧౨ అధ్యాయము

క. క్రమమున వర్ణంబుల చి
హ్నము లెల్లను జెప్పఁబడియె నాశ్రమముల ధ
ర్మము లెఱిఁగించెద నన్నియు
[1]సమదాహితహృదయశూల! సదమలశీలా! 420

వ. వినుము. బ్రహ్మచారి మౌంజీకౌపీనయజ్ఞోపవీతకృష్ణాజినపాలాశదండకమండలుధరుండును సంస్కారహీనశిరోరుహుండును దర్భహస్తుండును శీలప్రశస్తుండును మౌనియునై త్రిసంధ్యంబును బ్రహ్మగాయత్రి జపియించుచు సాయంప్రాతరవసరంబుల నర్కపావకగురుదేవతోపాసనంబులు సేయుచు గురుమందిరంబునకుం జని దాసునిచందంబున భక్తివినయసౌమనస్యంబులు గలిగి వేదంబు సదువుచు [2]నధ్యయనోపక్రమావసానంబుల గురుచరణంబులకు నమస్కరించుచు రేపు మాపును విహితగృహంబుల భిక్షించి భైక్షంబు గురువునకు నివేదించి యనుజ్ఞ గొని మితభోజనంబు గావించుచు నర్హకాలంబుల నుపవసించుచు నంగనలందు నంగనాసక్తులందుం బ్రయోజనమాత్రభాషణంబు లొనర్చుచు గురుపరాంగనలవలన నభ్యంగ[3]కేశప్రసాధనశరీరమర్దనమజ్జనరహస్యయోగంబులు వర్జించుచు గృహంబున నుండక జితేంద్రియత్వంబున సత్యభాషణుండయి సంచరింపవలయు. 421

1 సమద + అహిత - హృదయశూల = మదమెక్కిన శత్రుల హృదయమునకు శూలమయినవాఁడా! 2 వేదము చదువు మొదటను, చివరను. 3 జుట్టు నలంకరించు కొనుట,

ఆ. పొలఁతి దారువహ్ని పురుషుఁ డాజ్యఘటంబు
కరఁగ కుండ రాదు కదిసెనేని
బ్రహ్మచారియైనఁ గూఁతుఁ బట్టకమానఁడు
వడుగు కింతిపొత్తు వలదు వలదు. 422

వ. వినుము. స్వరూపసాక్షాత్కారంబున దేహ బహిరింద్రియాదికంబ యిన యింతయు నాభాసమాత్రంబుగా నిశ్చయించి యెందాఁక జీవుండు స్వతంత్రుఁడయిన యీశ్వరుండు గాకుండు నంతదడవు నంగన యిది, పురుషుండ నే ననియెడి భేదబుద్ధి మానుట కర్తవ్యంబుగాదు. బ్రహ్మచారియతిగృహస్థులం దెవ్వఁడైనఁ జిత్తంబు పరిపక్వంబుగాక యద్వైతానుసంధానంబు సేసిన మూఢుం డగుం గావున రహస్యంబునఁ బుత్రిక నైనం డాయకుండవలయు. 423

చ. శిరమున మేన సంస్కృతులు సేయక చందనభూషణాద్యలం
కరణము లెల్ల మాని ఋతుకాలములన్ నిజభార్యఁ బొందుచుం
దరుణుల జూడఁ బోలక ధృతవ్రతుఁడై మధుమాంసవర్జియై
గురుతరవృత్తితో మెలఁగు కోవిదుఁ డొక్కగృహస్థు భూవరా!

వ. మఱియు ద్విజుండు గృహస్థుండై గురువువలన నుపనిషదంగసహితంబైన వేదత్రయంబును బఠియించి నిజాధికారానుసారంబుగ నర్థవిచారంబు సేసి తన బలంబుకొలంది గురువులకు నభీష్టంబు లొసంగి గృహంబున నొండె వనంబున నొండె నైష్ఠికత్వంబు నాశ్రయించి యొండె బ్రాణులతోడ జీవించుచు గురువునందు నగ్నియందు నాత్మయందు సర్వభూతంబులందు నచ్యుతదర్శనంబు సేయుచు నింద్రియవ్యసనాదిమగ్నుండుగాక యెఱుక గలిగి వర్తించుచు బ్రహ్మంబునొందు. 425

క. వినుము వనప్రస్థునకున్,
మునికథితము లైన నియమములు గల వాచో
ప్పున వనగతుఁడై మెలఁగెడి,
ఘనుఁడు మహర్లోకమునకు గమనించు నృపా! 426

వ. అటమీఁద గృహస్థాశ్రమంబు విడిచి వనంబునకుం జని దున్నక పండెడి నీవారాదికంబు లగ్నిపక్వంబు సేసి యొండె, [1]నామంబులు సేసి యొండె, [2]నర్కపక్వంబులైన ఫలాదు లొండె భక్షింపుచు వన్యాహారంబుల నిత్యకృత్యంబులయిన [3]చరుపురోడాశంబు లొనర్చుచుఁ బ్రతిదినంబును బూర్వసంచితంబులు పరిత్యజించి నూతన ద్రవ్యంబులు సంగ్రహించుచు నగ్నికొఱకుఁ బర్ణశాలయైనఁ బర్వత కందరం బయిన నాశ్రయించుచు హిమ వాయు వహ్ని వర్షాతపంబులకు సహించుచు నఖశ్మశ్రు కేశతనూరుహంబులు ప్రసాధితంబులు సేయక జటిలుండై వసియించుచు దండాజినకమండలు వల్కలపరిచ్ఛదంబులు ధరియించి పండ్రెండైన నెనిమిదైన నాలుగైన రెండైన నొకవత్సరం బయినఁ దపః ప్రయాసంబున బుద్ధినాశంబు గాకుండ మునియై చరించుచు దైవవశంబున జరారోగంబులచేతఁ జిక్కి నిజధర్మానుష్ఠానసమర్థుండు గాని సమయంబున నిరశనవ్రతుండయి యగ్నుల నాత్మారోపణంబు సేసి సన్న్యసించి యాకాశంబునందు శరీరరంధ్రంబులును, గాలియందు నిశ్వాసంబును, తేజంబులోపల [4]నూష్మంబును, జలంబుల రసంబును, ధరణియందు శల్యమాంసప్రముఖంబులును, వహ్నియందు వ్యక్తంబుతోడ వాక్కును, నింద్రునియందు శిల్పంబుతోడఁ గరంబులును, విష్ణునియందు గతితోడఁ బదంబులను, బ్రజాపతియందు రతితోడ నుపస్థంబును, మృత్యువందు విసర్గంబుతోడఁ బాయువును, దిక్కులందు శబ్దంబుతోడ శ్రోత్రంబును, వాయువందు స్పర్శంబుతోడ ద్వక్కును, సూర్యునందు రూపంబుతోడఁ జక్షువులును, సలిలంబులందుఁ బ్రచేతస్సహిత యయిన జిహ్వయు, క్షితియందు గంధసహితంబయిన ఘ్రాణంబును, జంద్రునియందు మనోరథంబులతోడ మనంబును, గవియైన బ్రహ్మయందు బోధంబుతోడ బుద్ధియు, రుద్రు

1 ఆమంబులు=పరిపాకము రానివి 2 ఎండలో నెండినవి. 3 చరువు=హవిస్సు. పురోడాశము=యజ్ఞమునందలి పిండివంట; 4 ఊష్మము=వేఁడిమి.

నియం దహంకారంబుతోడ మమత్వంబును, క్షేత్రజ్ఞునియందు
సత్త్వంబుతోడ జిత్తంబును, బరంబునందు గుణంబులతోడ నైకా
రికంబును, డిందించి యటమీఁదఁ బృథివిని జలంబునందు జలం
బును దేజంబునందుఁ దేజంబును వాయువునందు వాయువును గగ
నంబునందు గగనంబును నహంకారతత్త్వంబునందు నహంకార
బును మహత్తత్త్వంబునందు మహత్తత్త్వంబును బ్రకృతియందు
బ్రకృతిని నక్షరుండైన పరమాత్మయందు లయంబు నొందించి
చిన్మాత్రావశేషితుండయిన క్షేత్రజ్ఞుని నక్షరత్వంబున నెఱింగి
ద్వయరహితుండై దగ్ధకాష్ఠుండైన వహ్నిచందంబున బరమాత్మ
యైన నిర్వికారబ్రహ్మంబునందు లీనుండు గావలయు. 422

క. అనఘ! వనప్రస్థుండై,
చని తద్ధర్మంబు లిట్లు సలుపుచు మఱియున్
మనె నేని సన్న్యసింపం,
జనునట మీఁదటను ముక్తసంగత్వమునన్. 427

వ. ఇట్లు వానప్రస్థాశ్రమంబు జరపి సన్న్యసించి దేహమాత్రావశిష్టుం
డును నిరపేక్షుండును భిక్షుండును నిరాశ్రయుండును నాత్మా
రాముండును సర్వభూతసముండును శాంతుండును సమచిత్తుండును
నారాయణపరాయణుండును నై కౌపీనంబునకు నాచ్ఛాదక
మాత్రంబైనవస్త్రంబు ధరియించి దండాదివ్యతిరిక్తంబులు విసర్జించి
యాత్మపరంబులు గాని శాస్త్రంబులు వర్జించి గ్రహనక్షత్రాది
విద్యలజీవింపక భేదవాదంబులైన తర్కంబులు దర్కింపక యెందును
బక్షీకరింపక శిష్యులకు గ్రంథంబులు వచించి యుపన్యసింపక
బహువిద్యల జీవింపక మత్తాదివ్యాపారంబుల నుల్లసిల్లక పెక్కు
దినంబు లొక్కయెడ వసియింపక యూరూర నొక్కొక్క రాత్రి
నిలుచుచుఁ గార్యకారణవ్యతిరిక్తంబైన పరమాత్మయందు
విశ్వంబు దర్శించుచు సదసన్మయంబైన విశ్వంబునందు బరబ్రహ్మం
బయిన యాత్మ నవలోకించుచు జాగరణస్వప్నసంధిసమయంబుల

నాత్మనిరీక్షణంబు సేయుచు నాత్మకు బంధమోక్షణంబులు మాయామాత్రంబులుగాని వస్తుప్రకారంబున లేవనియును దేహంబునకు జీవితంబు ధ్రువంబు గాదనియును మృత్యువు ధ్రువంబనియును నెఱుంగుచు భూతదేహంబుల సంభవనాశంబులకు మూలంబయిన కాలంబు బ్రతీక్షించుచు నివ్విధంబున జ్ఞానోత్పత్తి పర్యంతంబుఁ జరియించి యటమీఁద విజ్ఞానవిశేషంబు సంభవించినఁ బరమహంసుండై దండాదిచిహ్నంబులు ధరియించి యొండె ధరియింపకయొండె [1]బహిరంగవ్యక్తచిహ్నుండు గాక యంతరంగవ్యక్తంబైన యాత్మానుసంధానంబు గలిగి [2]మనీషియై బాహ్యానుసంధానాభావంబున మనుష్యులకుఁ దనవలన నున్మత్త బాలమూకుల తెఱంగుఁ జూపుచుండ వలయును. 429

ప్రహ్లాదాజగరసంవాదము.

క. మునివల్లభుఁ డజగరుఁ డను
సునయుండు హిరణ్యకశిపుసూనుండును ము
న్నొనరించిన సంవాదము,
విను మీయర్థంబునందు వెలయ సరేంద్రా! 430

వ. తొల్లి భగవత్ప్రియుండయిన ప్రహ్లాదుండు కతిపయామాత్యసమేతుండయి లౌకికతత్వంబు నెఱింగెడుకొఱకు లోకంబుల సంచరించుచు నొక్కనాఁడు కావేరీతీరంబున సహ్యాపర్వతతటంబున ధూళిధూసరితంబు లయిన కరచరణాద్యవయవంబులతోడ గూఢంబైన నిర్మలతేజంబుతోడఁ గర్మాకారవర్ణలింగవర్ణాశ్రమాదుల నెవ్వరికి నెఱుంగఁ బడక నేలనిద్రించుచు [1]నజగరవ్రతధరుండైన మునిం గని డాయం జని విధివత్ప్రకారంబున నర్చించి మునిచరణంబులకు శిరంబు మోపి మ్రొక్కి యతని చరిత్రంబు దెలియ నిచ్ఛయించి యిట్లనియె. 431

1 వెలికిగనఁబడుచిహ్నములు కలవాఁడు. 2 జ్ఞాని. 3 కొండచిలువ వలె కదలికలు లేక నిలుచుట.

సీ. భూమి [1]నుద్యోగియై భోగియైయుండెడి
    నరుసికై నడె మునినాథ! నీవు
ఘనశరీరముదాల్చి కదలవు చిత్త్రము
    వ్యయముకున్నకుఁ గాని ధనము లేదు
ధనవంతునకు గాని తగుభోగములు లేవు
    భోగికిఁ గాని సంపూర్ణమైన
తనువులే దుద్యోగధనభోగములు లేక
    నేల నూరక పడి నిద్ర వోవు

ఆ. నీకు నెట్లు గలిగె నిరుపమదేహంబు
సముఁడ వార్యుఁడవు విశారదుఁడవు
బుద్ధినిధివి జనులఁ బొగడవు దెగడవు
నిద్ర ప్రతిదినంబు నిలుప నేల. 432

వ. అని యిట్లు ప్రహ్లాదుం డడిగిన వికసితముఖుం డయి మునీంద్రుండు
తదీయమధురాలాపసుధారసప్రవాహంబులు కర్ణంబులఁ బరిపూ
ర్ణంబులైన నతని నవలోకించి యిట్లనియె. 433

సీ. అంతరంగికదృష్టి నంతయు నెఱుఁగుదు
    వార్యసమ్మతుఁడ వీ వసురవర్య!
విశ్వజంతువుల [2]ప్రవృత్తినివృత్తుల
    క్షణముల నీయెఱుంగనివి లేవు
భగవంతుఁడగుహరి పాయక నీమనో
    వీథి రాజిల్లుచు [3]వెలుఁగుచోని
క్రమమున బహుళాంధకారంబు బరిమార్చుఁ
    బరమసాత్త్వికుఁడవు భద్రబుద్ధి

ఆ. వైన నీవు నన్ను నడిగెదు గావున
విన్నధర్మమెల్ల విస్తరింతు

1 కృషిచేయువాఁడు. 2 ప్రవృత్తి = కర్మమార్గము, నివృత్తి = జ్ఞానమార్గము.
2 చంద్రునివలె.

నిన్నుఁ జూడఁ గలిగె నీతో సమాటల
నాత్మశుద్ధి గలిగె ననఘచరిత! 434

వ. వినుము ప్రవాహాకారిణియై విషయంబులచేతం బూరింప రాని తృష్ణచేతం బడి కర్మంబులఁ బరిభ్రామ్యమాణుండ నైన నేను నానావిధయోనులయందుఁ బ్రవేశించుచు వెడలుచు నెట్టకేలకు మనుష్యదేహంబు ధరియించి యందు ధర్మంబున స్వర్గద్వారకంబును నధర్మంబున శునకసూకరాదితిర్యగ్జంతుయోనిద్వారంబుల నొంది క్రమ్మఱ మనుష్యుండై పుట్టవలయు నని వివేకించి సుఖరక్షణదుఃఖమోక్షణంబులకొఱకు ధర్మంబు సేయు దంపతులవ్యవహారంబు గని సర్వక్రియానివృత్తి గలిగిన జీవుండు స్వతంత్రుండై ప్రకాశించు నని నిర్ణయించి భోగంబులు మనోరథజాతమాత్రంబులు గాని శాశ్వతంబులు గావని పరీక్షించి నివృత్తుండనై యుద్యోగంబు లేక నిద్రించుచుఁ బ్రారబ్ధభోగంబుల ననుభవించుచు నుండుదు. ఇవ్విధంబునఁ దనకు సుఖరూపంబైన పురుషార్థంబు దనయందుఁ గలుగుట యెఱుంగక పురుషుండు [1]శైవాలజాలనిరుద్ధంబు లైన శుద్ధజలంబుల విడిచి యెండమావులు జలంబు లనిపాఱెడు మూఢుని వడువున సత్యంబుగాని ద్వైతంబుఁ జొచ్చి ఘోరసంసారచక్రపరిభ్రాంతుండై దైవతంత్రంబు లైన దేహాదులచేత నాత్మకు సుఖంబును దుఃఖనాశంబునుం గోరుచు నిరీశుం డైనవాని ప్రారంభంబులు నిష్ఫలంబు లగు. అదియునుంగాక మనుష్యునకు ధనంబు ప్రాప్తంబయిన నది దుఃఖకరంబుగాని సుఖకరంబు గాదు. లోభవంతు లయిన ధనవంతులు నిద్రాహారంబులు లేక రాజచోరయాచకశత్రుమిత్రాదిసర్వస్థలంబులందును శంకించుచు దానభోగంబులు మఱచి యుండుదురు. ప్రాణార్థవంతులకు భయంబు నిత్యంబు. శోకమోహభయక్రోధరాగశ్రమాదులు వాంఛామూలంబులు. వాంఛ లేకుండవలయును. 435

1 నాచుచాచే నావరింపఁబడినవి.

మ. [1]సరఘుల్ గూర్చిన తేనె మానవులకున్ సంప్రాప్య మైనట్లు లో
భరతుల్ గూర్చినవిత్తముల్ పరులకుం బ్రాపించుఁ [2]బ్రాప్తాశి నై
తిరుగం బోని మహోరగంబు బ్రదుకున్ దీర్ఘాంగ మై యుండియుం
జిరకాలం బగు వానివర్తనము నేఁ జింతించి యేకాంతి నై. 436

క. అజగరమును జుంటీఁగయు
నిజగురువులుగాఁ దలంచి నిశ్చింతుఁడ నై
విజనస్థలిఁ గర్మంబుల
గజిబిజి లేకున్నవాఁడ గౌరవవృత్తిన్. 437

సీ. అజినవల్కలదుకూలాంబరంబులు గట్టి
యైనఁ గట్టక యైన నలరుచుండు
నాందోళికారథహయనాగముల నెక్కి
యైన నెక్కక యైన నరుగుచుందుఁ
గర్పూరచందనకస్తూరికాలేప
మైన భూరజమైన నలఁదికొందు
భర్మశయ్యల నైనఁ బర్ణశిలాతృణ
భస్మంబులం దైన బండుచుందు

ఆ. మానయుక్త మైన మానహీనంబైనఁ
దీయనైన మిగులఁ [3]దిక్తమైన
గుడుతు సగుణ మైన గుణవర్జితం బైన
నల్ప మైనఁ జాల నధిక మైన. 438

క. లేదని యెవ్వరి నడుగను
రా దని చింతింపఁ బరులు రప్పించినచోఁ
గా దని యెద్దియు మానను
ఖేదము మోదమును లేక క్రీడింతు మదిన్. 439

1 తేనెటీఁగలు 2 లభించినది తిన్నవాఁడనై 3 చేదయినది.

క. నిందింపఁ బరుల నెన్నఁడు
[1]వందింప, ననేకపీడ వచ్చిన మది [2]నా
క్రందింప విభవముల కా
నందింపఁ బ్రికామవర్తనంబున నధిపా! 440

వ. ఇట్లు గోరికలు లేక యొక్క సమయంబున దిగంబరుఁడనై పిశాచంబుచందంబున నుండుచుఁ బెక్కుదినంబులుం గోలెఁ బెనుఁబాఁప వర్తనంబుఁ గైకొని నిమీలితలోచనత్వంబున నేకాంతభావంబు విష్ణునియందుఁ జేర్చి వికల్పంబు ఛేదగ్రాహకచిత్తవృత్తులఁ జిత్తంబు నర్థరూపవిభ్రమంబు గల మనంబునందు మనంబును నహంకారంబునందు నహంకారంబును మాయయందు మాయను నాత్మానుభూతియందు లయంబు నొందించి సత్యంబు దర్శించుచు విరక్తి నొంది స్వానుభవంబున నాత్మస్థితుండనై యుండుదు. నీవు భగవత్పరుండవు గావున రహస్యంబైన పరమహంసధర్మంబు స్వానుభవగోచరంబైన తెఱంగున నీకు హృద్గోచరం బగునట్లు సెప్పితి ననిన విని. 441

క. ఘను నజగరమునివల్లభు
దనుజేంద్రుఁడు పూజ సేసి తగ వీడ్కొని నె
మ్మనమున సంతోషించుచుఁ
జనియెఁ నిజ గేహమునకు శశికులతిలకా! 442

౧౪ అ ధ్యా య ము

వ. అనిన యుధిష్ఠిరుం డిట్లనియె. 443

క. నన్నుఁబోటి జడగృహస్థుఁడు
మునివల్లభ! యిట్టి పదవి మోదంబుననే
యనువునఁ జెందును వేగమ
వినిపింపుము నేఁడు నాకు విజ్ఞాననిధీ! 444

1 వందింపన్ = పొగడను 2 దుఃఖింపను.

వ. అనిన నారదుం డిట్లనియె. గృహస్థుం డయినవాఁడు వాసుదేవా
ర్పణంబుగా గృహోచితక్రియ లనుసంధించుచు మహామునుల
సేవించి వారలవలన నారాయణదివ్యావతారకథాకర్ణనంబు
సేయుచు నద్యోవిహితకాలంబుల శాంతజనులం గూడి మెలంగుచు
బుత్త్రమిత్త్రకళత్త్రాదిసంగంబులు గలలవంటి వని యెఱుంగుచు
లోపల నాసక్తి లేక సక్తునికైవడి వెలుపలఁ బురుషకారంబులొన
ర్చుచుఁ [1]దగులంబు లేక విత్తంబు లిచ్చి జనకసుతసోదరసఖజ్ఞాతి
జనుల చిత్తంబులు సమ్మదాయత్తంబులు గావించుచు ధనధాన్య
విధానదైవలబ్ధంబులవలన నభిమానంబు మాని యనుభవించుచు
గృహక్షేత్రంబులఁ జొచ్చి యుదరపూరణమాత్రంబు దొంగిలిన
వానిదండింపక భుజగమృగమూషికమర్కటమక్షికాఖరోష్ట్రంబుల
హింసింపక పుత్త్రులభంగి నీక్షించుచు దేశకాలదైవంబులకొలందిని
ధర్మార్థకామంబులఁ బ్రవర్తించుచు శునకపతితచండాలాదుల కైన
భోజ్యపదార్థంబులు దగినభంగి నిచ్చుచు నిజవృత్తిలబ్ధంబు లగు
నశనాదులచేత దేవఋషిపితృభూతమానవుల సంతర్పించుచుఁ బంచ
మహాయజ్ఞావశేషంబుల నంతర్యామిపురుషయజనంబును నాత్మ
జీవనోపాయంబును సమర్థించుచు నుండవలయు. 445

ఆ. జనకగురుల నైనఁ జంపు నర్థమున కై
ప్రాణమైన విడుచు భార్యకొఱకు
నట్టిభార్య బురుషుఁ డతిథిశుశ్రూష సే
యించి గెలుచు నజితు నీశు నైన. 446

ఆ. పరముఁ డీశ్వరుండు బ్రాహ్మణముఖమున,
[2]నాహరించి తుష్టుఁ డయినభంగి
నగ్నిముఖమునందు హవ్యరాసులు గొని,
యైనఁ దుష్టి నొందఁ డనఘచరిత! 447

1. మోహంబు – (అంటు = సక్తి) 2. ఆరగించి

వ. కావున గృహస్థుండు బ్రాహ్మణులందును దేవతలందును మర్త్య పశుపక్షిముఖజంతులందును నంతర్యామియు బ్రాహ్మణాననుండును నైన క్షేత్రజ్ఞునకు సర్వ కోరికలు సమర్పించి సంతర్పణంబు సేయవలయు. భాద్రపదంబునం గృష్ణపక్షంబునందును దక్షిణోత్తరాయణంబులందును రేయుంబగలు సమమైనకాలంబులందును వ్యతీపాతంబులందును దినక్షయంబునందును సూర్యచంద్రగ్రహణంబులందును శ్రవణద్వాదశియందును వైశాఖశుక్లతృతీయయందును గార్తికశుక్లనవమియందును హేమంతశిశిరంబులలోన నాలు గష్టకలందును మాఘశుక్లసప్తమియందును మాఘనక్షత్రంబులతోడం గూడిన పున్నమలందును ద్వాదశితోడం గూడిన యుత్తరాత్రయ శ్రవణానూరాధలందును నుత్తరాత్రయసహితంబు లయిన యేకాదశులయందును జన్మనక్షత్రయుక్తదివసంబులందును మఱియుఁ బ్రశస్తకాలంబులందును జననీజనకబంధుజనులకు శ్రాద్ధంబులును జపహోమస్నానవ్రతంబులును దేవబ్రాహ్మణసమారాధనంబులును నాచరింపవలయు. భార్యకు బుంసవనాదికంబును నపత్యంబునకు జాతకర్మాదికంబును దనకు యజ్ఞదీక్షాదికంబును బ్రేతజనులకు దహనాదికంబును మృతదివసంబున సాంవత్సరికంబును జరుపవలయు.

మ. విను మీదేశములన్ సయోగితతపోవిద్యాన్వితంబైన వి
ప్రనికాయంబు వసించు, నేస్థలములన్ భాగీరథీముఖ్యవా
హిను లుండున్, హరిపూజ లెయ్యెడల భూమిస్త్రప్రకారంబులం
దనరున్, భూవర! యట్టిచోటులఁ దనరున్ ధర్మంబులం జేయఁగన్.

క. హరియందు జగములుండును
హరిరూపము సాధుపాత్ర మందుండు [1]శివం
కరమగు పాత్రము గలిగిన
నరయంగ నది పుణ్యదేశ మనఘచరిత్రా! 450

వ. మఱియుం గురుక్షేత్రంబును గయాశీర్షంబును బ్రయాగంబును బులహాశ్రమంబును నైమిశంబును ఫాల్గునంబును సేతువును బ్రభాసం

1. మంగళప్రదము.

బును. గుశస్థలియును వారణాసియు మథురాపురియును బంపాబిందు సరోవరంబులును నారాయణాశ్రమంబును సీతారామాశ్రమంబును మహేంద్రమలయాదులైన కులాచలంబులును హరిప్రతిమార్చన ప్రదేశంబులును హరిసేవాపరులైన పరమభాగవతులు వసించెడు పుణ్యక్షేత్రంబులును శుభకాముండైనవాఁడు సేవింపవలయు. 451

ఆ. భూనరేంద్ర! యిట్టి పుణ్యప్రదేశంబు
లందు నరుఁడు సేయు నట్టిధర్మ
మల్పమైన నది సహస్రగుణాధిక
ఫలము నిచ్చు హరికృపావశమున. 452

వ. వినుము చరాచరం బయిన విశ్వమంతయు విష్ణుమయం బగుటం జేసి పాత్రనిర్ణయనిపుణులైన విద్వాంసులు నారాయణుండు ముఖ్య పాత్రంబని పలుకుదురు. దేవఋషులును బ్రహ్మపుత్రులైన సనకాదులును నుండ భవదీయ రాజసూయంబున నగ్రపూజకు హరి సమ్మతుండయ్యె. అనేక జంతుసంఘాతసంకీర్ణంబైన బ్రహ్మాండపాదపంబునకు నారాయణుండు మూలంబు. తన్నిమిత్తంబు నారాయణ సంతర్పణంబు సకలజంతుసంతర్పణంబని యెఱుంగుము. ఋషినర [1]తిర్యగమరశరీరంబులు పురంబులు వానియందుఁ దారతమ్యంబుల తోడ జీవరూపంబున భగవంతుండయిన హరివర్తించుటంజేసి పురుషుండనఁ బ్రసిద్ధుండయ్యె. అందుఁ దిర్యగ్జాతులకంటె నధికత్వంబు పురుషునియందు విలసిల్లుటంజేసి పురుషుండు పాత్రంబు, పురుషులలోన హరితనువైన వేదంబును ధరించుచు సంతోషవిద్యాతపోగరిష్ఠుండైన బ్రాహ్మణుండు పాత్రంబు, బ్రాహ్మణులలోన నాత్మజ్ఞానపరిపూర్ణుండయిన యోగి ముఖ్యపాత్రంబని పలుకుదురు. పరస్పర పాత్రంబులకు సహింపని మనుష్యులకుఁ బూజనార్థంబుగాఁ ద్రేతా

1. తిర్యక్=పశువులు, పక్షులు.

యుగంబునందు హరిప్రతిమలు గల్పింపంబడియె. కొందఱు ప్రతి మార్చనంబు సేయుదురు. పాత్రపురుషద్వేషులైనవారలకు నట్టి ప్రతిమార్చనంబు ముఖ్యార్థప్రదంబుగాదు. మందాధికారులకుఁ బ్రతి మార్చనంబు పురుషార్థప్రదం బగును. 453

ఆ. అఖిలలోకములకు హరి దైవతము సూడ
హరికి దైవతము ధరాధినాథ!
పదపరాగలేశ పంక్తిచేఁ ద్రైలోక్య
పావనంబుసేయు బ్రాహ్మణుండు. 454

౧౫ అధ్యాయము

వ. అట్టి బ్రాహ్మణజనులందుఁ గర్మనిష్ఠులుఁ దపోనిష్ఠులు వేదశాస్త్ర నిష్ఠులు జ్ఞానయోగనిష్ఠులు నై కొందఱు వర్తింతురు. అందు జ్ఞాన నిష్ఠునికి ననంతఫలకామి యైన గృహస్థుండు పితృజనుల నుద్దేశించి [1]కవ్యంబులును దేవతలనుద్దేశించి హవ్యంబులును బెట్టుటముఖ్యంబు. దైవకార్యంబునకు నిరువురనైన నొకరినైనఁ బితృకార్యంబునకు మువ్వురనైన నొకరినైన భోజనంబు సేయింపవలయు. ధనవంతున కైనను శ్రాద్ధవిస్తారంబు కర్తవ్యంబుగాదు. దేశకాలపాత్రప్రాప్తకంద మూలఫలాదికంబయిన హరి నైవేద్యంబున విధిచోదితప్రకారంబుగా శ్రద్ధతోడఁ బాత్రంబునందుఁ బెట్టిన యన్నంబు గామదంబయి యక్షయఫలకారి యగు. ధర్మతత్త్వవేదియైనవాఁడు శ్రాద్ధంబులందు మాంసప్రదానంబు సేయక భక్షింపక చరింపవలయు. కంద మూలాదిదానంబున నయ్యెడిఫలంబు పశుహింసనంబున సంభవింపదు. ప్రాణిహింస సేయక వర్తించుటకంటె మిక్కిలి ధర్మంబు లేదు. యజ్ఞవిదులై నిష్కాములయిన [2]ప్రోడలు బాహ్యకర్మంబులు విడిచి యాత్మజ్ఞానదీపంబులందుఁ గర్మమయంబు లయిన యజ్ఞంబుల నాచరింతురు. 455

1 పితృదేవతలకుఁ బెట్టుఅన్నము. 2 నేర్పరులు,

క. పశువులఁ బొరిగొని మనుజులు
విశదములుగఁ జేయు బుధుని వీక్షించి తనున్
[1]విశసనము సేయునో యని
[2]కృశిమన్ బెగడొందు భూతగణము నరేంద్రా! 456

వ. అదిగావున ధర్మవేది యయినవాఁడు దైవప్రాప్తంబు లయిన కంద మూలాదికంబులచేత నిత్యనైమిత్తికక్రియలుఁ జేయవలయు. నిజ ధర్మబాధకంబయిన ధర్మంబును బరధర్మప్రేరితంబయిన ధర్మంబును [3]నాభాసధర్మంబును బాషండధర్మంబును గపటధర్మంబును ధర్మ జ్ఞుండయినవాఁడు మానవలయు. స్వాభావికధర్మంబు పురుషులకు శాంతి సమర్థంబగు. నిర్ధనుండు ధర్మార్థంబు యాత్ర సేయుచు నైన ధనంబు గోరవలదు. జీవనోపాయంబునకు నిట్టట్టుఁ దిరుగక [4]కార్పణ్యంబు లేక జీవించుచు మహాసర్పంబు చెలంగిన సంతోషంబున నాత్మా రాముండై యెద్దియుం గోరక విధిచేత సుగుణునికిం గల సుఖంబు గామలోభంబుల దశదిశలం బరిధావనంబు సేయువానికి సిద్ధింపదు. పాదరక్షలు గలవానికి శర్కరాకంటకాదులవలన భయంబు లేక మెలంగ నలవడుభంగిఁ గామంబువలన నివృత్తి గలవానికి నెల్లకా లంబును భద్రంబగు. ఉపస్థమునకును జిహ్వాస్వాద్యంబునకును బురు షుండు [5]గృహపాలకశునకంబుకైవడి సంచరించుచు సంతుష్టి లేక చెడు. సంతోషిగాని విప్రుని విద్యాతపోవిభవయశంబులు నిరర్థకం బులగు. ఇంద్రియలోలత్వంబున విజ్ఞానంబు నశించు. సకల భూలో కభోగంబులు భోగించియు దిగ్విజయంబు సేసియు [6]బుభుక్షాపిపాసల వలనఁ [7]గామపారంబును హింసవలనఁ గ్రోధపారంబును జేరుట దుర్లభంబు. సంకల్పవర్జనంబునఁ గామంబును గామవర్జనంబునఁ గ్రో ధంబును నర్థానర్థదర్శనంబున లోభంబును దత్త్వానుసంధానంబున భయంబును నాత్మానాత్మవివేకంబున శోకమోహంబులను

---

1 చంపుట. 2 కృశత్వముచేత (చిక్కుటచేత.) 3 ధర్మములట్లు కనబడు అధర్మము. 4 దైన్యము. 5 పెంపుడుకుక్క. 6 ఆకలి దప్పికలవలన. 7 కామము యొక్క అంతు.

సాత్త్వికసేవనంబున దంభంబును మౌనంబున యోగాంతరాయంబును శరీరవాంఛ లేమిని హింసయు హితాచరణంబున భూతజంబయిన దుఃఖంబును సమాధిబలంబున దైవికవ్యథయు ప్రాణాయామాదికంబున మన్మథవ్యథయు సాత్త్వికాహారంబుల నిద్రయు సత్త్వగుణంబున రజస్తమంబులును [1]నుపశమంబున సత్త్వంబును గురుభజనకుశలుఁడై శీలంబున జయింపవలయు. 457

క. హరిమహిమ దనకుఁ జెప్పిన
గురువున్ నరుఁ డనుచుఁ దలఁచి కుంఠితభక్తిం
దిరుగు పురుషు శ్రమ మెల్లను
[2]కరిశౌచముక్రియ నిరర్థకంబగు నధిపా! 453

ఉ. ఈ వనజాతనేత్రుఁ బరమేశు మహాత్ముఁ బ్రధానపూరుషున్
దేవవరేణ్యు సజ్జనవిధేయు ననంతుఁ బురాణయోగసం
సేవితపాదపద్ముఁ దమ చిత్తమునన్ నరుఁడంచు లోకు లి
చ్ఛావిధిఁ జూచుచుందురు సన్మతి లేక నరేంద్రచంద్రమా! 459

వ. వినుము. షడింద్రియంబులలోన నొకటియందుఁ దత్పరులై యిచ్ఛాపూరణవిధానంబులఁ జరితార్థుల మైతి మనువారలు ధారణాధ్యానసమాధియోగంబుల సాధింప లేరు. కృషిప్రముఖంబులు సంసారసాధనంబులు గాని మోక్షసాధనంబులు గావు. కుటుంబసంగంబునఁ జిత్తవిక్షేపం బగు. చిత్తవిజయప్రయత్నంబున సన్న్యసించి సంగంబు వర్జించి మితం బయిన భిక్షాన్నంబు భక్షించుచు శుద్ధవివిక్తసమప్రదేశంబున నొక్కరుండు నాసీనుండై సుస్థిరత్వంబున ప్రణవోచ్చారణంబు సేయుచు రేచకపూరకకుంభకంబులఁ బ్రాణాపానంబుల నిరోధించి కామహతం బయిన చిత్తంబున బరిభ్రమణంబు మాని కామవిసర్జనంబు సేసి మరలు నంతకు నిజనాసాగ్రనిరీక్షణంబు సేయుచు నివ్విధంబున యోగాభ్యాసంబు సేయువాని చిత్తంబు కాష్ఠరహితం బయిన వహ్నితెఱంగున శాంతిం

1. ఉపశమంబునన్. 2 కరిశౌచము = గజస్నానము. అది నీట దిగివచ్చి వెంటనే మట్టి చల్లుకొనుటచే నది చేసిన స్నానము వ్యర్థము.

జెందు. కామాదులచేత వేధింపఁబడక ప్రశాంత సమస్తవృత్తం బయిన చిత్తంబు [1]బ్రహ్మసుఖసమ్మర్శనంబున లీనంబై మఱియు నెఱయ నేరదు. 460

మ. ధరణీదేవుఁడు సన్న్యసించి యతియై ధర్మార్థకామంబులం
బరివర్జించి [2]పునర్విలంబమునఁ దత్ప్రారంభి యై నేని లో
భరతిం గ్రిక్కినకూఁడు మంచిదనుచుఁ భక్షించి జీవించు దు
ర్నరు చందంబున హాస్యజీవనుఁ డగుం నానాప్రకారంబులన్. 461

క. మలమునఁ గ్రిమియును బహు క్రియ
నిలబడు నొడలాత్మగాదు హేయంబనుచుం
దలఁతురు తజ్ఞులు వొగడుదు
రలసత నొడ లాత్మయనుచు నజ్ఞు లిలేశా! 462

ఆ. వ్రతము మానఁదగదు వడుగు గుఱ్ఱనికిని
గ్రియలు మానఁదగదు గృహగతునికి
దపసి కూర నుండఁ దగదు సన్న్యాసికిఁ
దరుణితోడి పొత్తు దగదు తగదు. 463

సీ. రథము మే నెల్ల, సారథి బుద్ధి, యింద్రియ
గణము గుఱ్ఱములు, పగ్గములు మనము,
ప్రాణాదిదశవిధపవనంబు లిరుసు, ధ
ర్మాధర్మగతులు [3]రథాంగకములు,
భవహేతరంబైన బంధంబు చిత్తంబు,
శబ్దాదికములు సంచారభూమి,
యభిమానసంయుతుం డయిన జీవుఁడు [4]రథి,
ఘనతరప్రణవంబు కార్ముకంబు,

తే. శుద్ధజీవుండు బాణంబు, శుభదమైన
బ్రహ్మమంచిత లక్ష్యంబు, పరులు దాఁగ

1 బ్రహ్మానందానుభవముచే. 2 తిరిగి కొంతె యెడములో. 3 చక్రములు.
4 గట్టి యతఁడు (రథముతోయొక్క కూర్పు, చిత్తము.) "సత్త్వం బృహద్బంధుర మీశస్పష్టమ్ సత్త్వం చిత్తం" అని మూలము.

భయమదద్వేషశోకలోభప్రమోహ
మానమత్సరముఖములు మానవేంద్ర! 464

వ. ఇట్లు మనుష్యశరీరరూపంబయిన రథంబు దన వశంబు సేసికొని మహాభాగవతచరణకమలసేవానిశితం బయిన విజ్ఞానఖడ్గంబు ధరియించి శ్రీమన్నారాయణకరుణావలోకనబలంబున రాగాదిశత్రునిర్మూలనంబు గావించి ప్రణవబాణాసనంబున శుద్ధజీవశరంబును సంధించి బ్రహ్మమని యెడి గుఱియందుఁ బడ వేసి యహంకారరథికుండు రథికత్వంబు మాని నిజానందంబున నుండవలయు. అట్టి విశేషంబు సంభవింపని సమయంబున బహిర్ముఖంబులయిన యింద్రియఘోటకంబులు బుద్ధిసారథిసహితంబులై స్వాభిమానరథికునిప్రమత్తత్వంబు దెలిసి ప్రవృత్తిమార్గంబు నొందించి విషయశత్రుమధ్యంబునం గూల్చిన. 465

ఆ. [1]విషయ శత్రులెల్ల విక్రాంతితోడ సా
రథి సమేతుఁడయిన రథికుఁబట్టి
యుగ్రతిమిరమృత్యుయుతమగు సంసార
కూపమధ్యమందుఁ గూల్తు రధిప! 466

వ. వినుము వైదికకర్మంబు ప్రవృత్తంబును నివృత్తంబును నన రెండు దెఱంగులయ్యె. అందుఁబ్రవృత్తంబునఁ బునరావర్తనంబును నివృత్తంబున మోక్షంబును సిద్ధించు. ప్రవృత్తకర్మంబులోన నిష్టాపూర్తంబు లన రెండుమార్గంబులు గలవు. అందు హింసద్రవ్యమయకామ్యరూపంబులయిన దర్శపూర్ణమాసపశుసోమయాగవైశ్వదేవబలిహరణప్రముఖంబు లయిన యాగాదికంబు లిష్టంబులు, దేవతాలయావనకూపతటాక ప్రముఖంబులు పూర్తంబులు. ప్రవృత్తకర్మంబున దేహంబు విడిచి దేహాంతరారంభంబు నొందు దేహి హృదయాగ్రంబు వెలుంగ వానితోడ నింద్రియంబులం గూడి భూతసూక్ష్మయుక్తుండై ధూమదక్షిణాయనకృష్ణపక్షరాత్రిదర్శంబుల వలన

1 విషయముల నెడి శత్రువులు.

సోమలోకంబుఁ జేరి భోగావసానంబున [1]విలీనదేహుండై వృష్టి ద్వారంబునఁ గ్రమంబున నోషధిలతాన్నశుక్లరూపంబులం బ్రాపించి భూమియందు జన్మించు. ఇది పునర్భవరూపం బయిన పితృమార్గంబు. నివృత్తకర్మనిష్ఠుం డయినవాఁడు జ్ఞానదీప్తంబులయిన యింద్రియంబులందుఁ గ్రియాయజ్ఞంబులు యజించి యింద్రియంబుల దర్శనాదిసంకల్పమూలం బయిన మనంబునందు వికారయుక్తంబయిన మనంబును, వాక్కునందు విద్యావిలక్షణ యయిన వాక్కును, వర్ణసముదాయమునందు వర్ణసముదాయంబును, అకారాది స్వరత్రయాత్మకం బయిన యోంకారంబునందు నోంకారంబును, బిందువందు బిందువును, నాదంబునందు నాదంబును, బ్రాణంబునందు బ్రాణంబును, బ్రహ్మమందు నిలుపవలయును. దేవమార్గంబయిన యుత్తరాయణశుక్లపక్షదివాప్రాహ్ణాపూర్ణిమారాకలవలన సూర్యద్వారంబున బ్రహ్మలోకంబునందుఁ జేరి భోగావసానంబున స్థూలోపాధియైన విశ్వుండై స్థూలంబును సూక్ష్మంబునందు లయించి సూక్ష్మోపాధియైన తైజసుండై సూక్ష్మంబును గారణంబునందు లయించి కారణోపాధి యైన ప్రాజ్ఞుండై కారణంబును సాక్షిస్వరూపంబునందు లయించి [2]తురీయుండై సూక్ష్మలయంబునందు శుద్ధాత్ముండై యివ్విధంబున ముక్తుం డగును. 467

ఆ. అమరనిర్మితంబు లైయొప్పు [3]పితృదేవ
సరణు లెవ్వఁ డెఱుఁగు శాస్త్రదృష్టి
నట్టివాఁడు దేహియై మోహమున నొందఁ
డతిశయించు బుద్ధి నవనినాథ! 468

వ. వినుము దేహాదులకుఁ గారణత్వంబున నాదియందును నవధిత్వంబున నంతమందును గలుగుచు బహిరంగంబున భోగ్యంబును నంతరంగంబున భోక్తయు బరంబు నపరంబును జ్ఞానంబును జ్ఞేయంబును

1 కప్పువడిన శరీరముకలవాఁడై. 2 శుద్ధమైన ఆత్మయై. 3 పితృయానము, దేవయానము.

వచనంబున వాచ్యమును నప్రకాశమును బ్రకాశంబును నైన వస్తువునకు వేఱొండు లేదు. ప్రతిబింబాదికంబు వస్తుత్వంబునం జేసి వికల్పితంబై తలంపంబడుభంగి నైంద్రియకంబైన సర్వంబును సర్వత్వంబున వికల్పితంబయి తోఁచుం గాని పరమార్థంబు గాదు. దేహాదికంబులు మిథ్యాత్మకంబులు. వానికి హేతువు లయిన క్షితిప్రముఖంబులకును మిథ్యాత్వం బగుట సిద్ధంబు. పరమాత్మకు నవిద్యచేత నెంతదడవు వికల్పంబుదోఁచు, నంతదడవును భ్రమంబునుం దోఁచు. అవిద్యానివృత్తియైన సర్వంబును మిథ్య యని శాస్త్రవిధినిషేధంబులు కలలోపల మేలుగన్న తెఱంగగు. భావాద్వైత క్రియాద్వైత ద్రవ్యాద్వైతంబులు మూఁడు గల వందుఁ బటతంతున్యాయంబునఁ గార్యకారణంబులందు [1]నస్యైకత్వాలోచనంబు సేసి వికల్పంబు లేదని భావించుట భావాద్వైతంబు, మనోవాక్కాయకృతంబులైన సర్వకర్మంబులను ఫలభేదంబు సేయక పరబ్రహ్మార్పణంబు సేయుట క్రియాద్వైతంబు, పుత్త్రమిత్త్రకళత్రాదిసర్వప్రాణులకుం దనకును దేహంబునకుం బంచభూతాత్మకత్వంబున భోక్తయొక్కండను పరమార్థత్వంబున నర్థకామంబులయెడ నైక్యదృష్టిఁ జేయుట ద్రవ్యాద్వైతంబు, నేర్పున నాత్మతత్త్వానుభవంబున నద్వైతత్రయంబును విలోకించి వస్తుభేదబుద్ధియుఁ గర్మభేదబుద్ధియు స్వకీయపరకీయబుద్ధియు స్వప్నంబులుగాఁ దలంచి ముని యైనవాఁడు మానవలయు. 469

క. వాదములు వేయు నేటికి
వేదోక్తవిధిం జరించు విబుధుఁడు గృహమం
దాదరమున నారాయణ
పాదంబులు గొలిచి ముక్తిపదమున కేగుఁ. 470

శా. భూపాలోత్తమ! మీరు భక్తిగరిమస్ఫూర్తిన్ సరోజేక్షణ
శ్రీపాదాంబుజయుగ్మముం నియతులై సేవించి కాదే మహో

---

1 ఒక టేవస్తువని యెఱి తలంపు.

గోపత్సంఘములోనఁ జిక్కక [1]సమస్తాశాంతనిర్జేతలై
యోపారంగ మఖంబు సేసిరి దివేంద్రప్రభావంబునన్. 471

నారదుని పూర్వజన్మవృత్తాంతము.

వ. వినుము పోయిన మహాకల్పంబునందు గంధర్వులలోన నుపబర్హణుం డను పేర గంధర్వుండనైన నేను సౌందర్యమాధుర్యగాంభీర్యాది గుణంబుల సుందరులకుఁ బ్రియుండనై క్రీడించుచు నొక్కనాఁడు విశ్వసృష్టు లైన బ్రహ్మలు సేయు సత్త్రయాగంబులోన నారాయణకథలు గానంబు సేయుకొఱకు నప్సరోగణంబులును గంధర్వులనుం జీరిన, 472

ఆ. క్రతువులోని కేఁగి గంధర్వగణములోఁ
గలసి పోయి విష్ణుగాథ లచటఁ
గొన్ని పాడి సతులఁ గూడి మోహితుఁడనై
తలఁగి చనితి నంత ధరణినాథ! 473

క. వారిజగంధుల పొత్తున
వారిం గైకొనక తలఁగి వచ్చిన బుధులే
వా రెఱిఁగి శాప మిచ్చిరి
వారింపఁగ రాని రోషవశమున నధిపా! 474

ఆ. పంకజాక్షు నచటఁ బాడక కామినీ
గణము గూడి చనిన కల్మషమున
[2]దగ్ధకాంతి వగుచు ధరణీతలంబున
శూద్రజాతిసతికి సుతుఁడ వగుదు. 475

వ. అని యిట్లు విశ్వస్రష్టలు శపించిన నొక్క బ్రాహ్మణదాసికిం బుత్త్రుండనై జన్మించి యందు బ్రహ్మవాదు లైన పెద్దలకు శుశ్రూష చేసిన భాగ్యంబున నిమ్మహాకల్పంబునందు బ్రహ్మపుత్త్రుండనై జన్మించితి.

1. సమస్త + ఆశాంత + నిర్జేతలు = ఎల్లదిగంతములను గెలిచినవారు.
2. తేజస్సు చెడి.

ఆ. కౌశలమున మోక్షగతికి గృహస్థుఁడే
ధర్మ మాచరించి తగిలి పోవు
నట్టి ధర్మ మెల్ల నతివిశదంబుగాఁ
బలుకఁ బడియె నీకు భవ్యచరిత! 477

మ. అఖిలాధారుఁ [1]డజాదిదుర్లభుఁడు బ్రహ్మంబైన విష్ణుండు నీ
మఖమం దర్చితుఁడై నివాసగతుఁడై మర్త్యాకృతిన్ సేవ్యుఁడై
సఖియై [2]చారకుఁడై [3]మనోదయితుఁడై సంబంధియై మంత్రియై
సుహృదుండయ్యె భవన్మహోమహిమ దాఁ జోద్యంబు ధాత్రీశ్వరా!

వ. అని యిట్లు నారదుండు సెప్పినవృత్తాంతం బంతయు విని ధర్మనందనుండు ప్రేమవిహ్వలుండై వాసుదేవునిం బూజించె. వాసుదేవధర్మనందనులచేతఁ బూజితుండై నారదమునియు దేవమార్గంబునం జనియె. అని శుకయోగీంద్రుండు పాండవపౌత్రునకుం జెప్పెనని సూతుండు శౌనకాదులకుం జెప్పిన. 379

క. రాజీవసదృశలోచన!
రాజీవభవాదిదేవరాజవినుతవి
భ్రాజితకీర్తిలతాన్విత
రాజీవభవాండభాండ రఘుకులతిలకా. 480

మాలిని. ధరణిదుహితృరంతా ధర్మమార్గానుగంతా
నిరుపమనయవంతా నిర్జరారాతిహంతా
గురుబుధసుఖకర్తా కుంభినీచక్రభర్తా
సురభయపరిహర్తా సూరిచేతోవిహర్తా. 481

---

1. అజ + ఆది = బ్రహ్మను మొదలయినవాఁడు (లేదా) అజాది = బ్రహ్మాదులకు దుర్లభుఁడు = దొరకనివాఁడు. 2 సేవకుఁడు. (దూత) 3. మనస్సునకు ప్రియుఁడు.

గద్యము

ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్త్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబయిన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందు ధర్మనందనునకు నారదుండు హిరణ్యాక్షహిరణ్యకశిపుల పూర్వజన్మవృత్తాంతంబు సెప్పుటయు, హిరణ్యకశిపుదితిసంవాదంబును, సుయజ్ఞోపాఖ్యానంబును, యమసల్లాపంబును, బ్రహ్మవరలాభగర్వితుండైన హిరణ్యకశిపుచరిత్రంబును, ప్రహ్లాదవిద్యాభ్యాసకథయును, ప్రహ్లాదహిరణ్యకశిపుల సంవాదంబును, ప్రహ్లాదవచనంబు ప్రతిష్ఠింప హరి నరసింహరూపంబున నావిర్భవించి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదునకు నభయం బిచ్చి నిఖిలదేవతానివహప్రహ్లాదాదిస్తూయమానుండై తిరోహితుండగుటయుఁ, ద్రిపురాసురవృత్తాంతంబును, నీశ్వరుండు త్రిపురంబుల దహించుటయు, వర్ణాశ్రమధర్మవివరణంబును, బ్రహ్లాదాజగరసంవాదంబును, స్వధర్మప్రవర్తకుండగు గృహస్థుండు ముక్తుండగు మార్గంబు నారదుండు ధర్మజునకుఁ దెలుపుటయు, నారదుని పూర్వజన్మవృత్తాంతంబును నను కథలంగల

సప్తమస్కంధము.

సంపూర్ణము

హరిః ఓం తత్సత్, శ్రీ శ్రీనివాసార్పణమస్తు.

శ్రీరస్తు

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర

# భాగవతము

## అష్టమస్కంధము



శ్రీమన్నామ! పయోద
శ్యామ! [1]ధరాభృల్లలామ! జగదభిరామా!
[2]రామా! జనకామ! మహో
ద్దామ గుణస్తోమధామ! దశరథరామా!

### ౧ అధ్యాయము

వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యాన వైఖరీసమేతుండైన సూతుం డిట్లనియె. అట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని. 2

క. వినఁబడియెను స్వాయంభువ
మనువంశము వర్ణధర్మమర్యాదలతో
మనుజుల దనుజుల వేల్పుల
జననంబులు [3]సృష్టలెల్లఁ జనియించుటయున్.

---

1 రాజులలో శ్రేష్ఠుఁడు. 2 స్త్రీజనములపాలి మన్మథుఁడు. 3 బ్రహ్మలు.

ఉ. ఏ మనుకాలమందు హరి యీశ్వరుఁ డేక్రియ సంభవించె? నే
మేమి యొనర్చె? నమ్మనువు లెవ్వరు? యితఁ డేక్రియఁ జేయుచున్నవాఁ
డేమి నటించు మీఁద? గతి యెయ్యది? సజ్జను లెన్నవారు స
న్నేమని చెప్పుచుందురు? మునీశ్వర! నా కెఱిఁగింపవే దయన్. 4

వ. అనిన శుకుం డిట్లనియె. 5

క. ఈ కల్పంబున మనువులు
ప్రాకటముగ నార్వురైరి పదునలువురిలో
లోకముల జనుల పుట్టువు
[1]లోకథితములయ్యె వరుస నఖిలములు నృపా! 6

వ. ప్రథమమనువైన స్వాయంభువునకు నాకూతి దేవహూతులను నిరువురుఁ గూఁతులు గలరు. వారికిఁ గ్రమంబునఁ గపిలయజ్ఞనామంబుల లోకంబులకు ధర్మజ్ఞానబోధనంబు సేయుకొఱకు హరి పుత్త్రత్వంబు నొందె. అందుఁ గపిలుని చరిత్రంబు మున్నె చెప్పంబడియె, యజ్ఞుని చరిత్రంబు చెప్పెద వినుము. 7

మ. శతరూపాపతి గామభోగవిరతిన్ సంత్యక్త భూభారుఁడై
సతియుం దానును గానకేఁగి శతవర్షంబుల్ సునందానదిన్
వ్రతియై యేకపదస్థుఁడై నియతుఁడై [2]వాచంయమస్ఫూర్తితో
గతదోషుండు తపంబు సేసె భువనఖ్యాతంబుగా భూస్థలిన్. 8

వ. ఇట్లు తపంబు సేయుచు స్వాయంభువమనువు తన మనంబులోన.

సీ. సృజించె నెవ్వఁడు [3]చేతనపడకుండ
సృష్టి యెవ్వని[4]చేతచే జనించు
జగములు నిద్రింప జాగరూకత నొంది
యెవ్వఁడు బ్రహ్మాండ మెఱుఁగుచుండు

1 పూర్తిగాఁ జెప్పబడినది. 2 మౌనవ్రతతో. 3 చైతన్యము నొందఁడు.
4 చేతచే = పనిచేత.

నాత్మకాధారంబు సకలంబు నెవ్వఁడే
నెవ్వని నిజధనం బిందవట్టుఁ
బొడఁగానరాకుండుఁ బొడఁగను నెవ్వఁడే
నెవ్వనిదృష్టికి నెదురు లేదు

ఆ. జననవృద్ధివిలయసంగతిఁ జెందక
యెవ్వఁ డెసపకుండు నెల్లయెడలఁ
దన్మహాత్త్వతత్త్వసంజ్ఞ నెవ్వఁడు దాన
విశ్వరూపుఁ డనఁగ విస్తరిల్లు. 10

వ. అని మఱియు నిరహంకృతుండును నిర్గతబుద్ధుండును [1]నిరాశియుఁ బరిపూర్ణుండును ననన్యప్రేరితుండును నృశిక్షాపరుండును నిజమార్గసంస్థితుండును నిఖిలధర్మభావనుండును నైన పరమేశ్వరునకు నమస్కరించెదనని యుపనిషదర్థంబులు పలుకుచున్న మనువుం గనుంగొని. 11

క. రక్కసులు దినఁగఁ గడఁగిన,
వెక్కసముగ యజ్ఞనామ విష్ణుఁడు వారిం
జక్కడిచెఁ జక్రధారల
మిక్కుటముగ వేల్పులెల్ల మేలని పొగడన్. 12

వ. ఇది ప్రథమ మన్వంతరంబు. ఇంక ద్వితీయమన్వంతరంబు వినుము.

సీ. స్వారోచిషుండన [2]సప్తార్చిబిడ్డఁడు
మనువు వానికి నాద్యుమత్సుషేణ
రోచిష్మదాదు లారూఢపుత్త్రులు ధాత్రి
నేలిరి; రోచనుఁ డింద్రుఁడయ్యె.
అధికులు తుషితాదు లమరు లూర్జస్తంబ
ముఖ్యు లాఢ్యులు సప్తమునులు నాఁడు
వేదశిరుం డను విప్రుని దయితకుఁ
దుషితకుఁ బుత్త్రుఁడై తోయజాక్షుఁ

1 విగ్రహవాంఛలు లేనివాఁడు. 2 అగ్నికి కొడుకు.

ఆ. డవతరించెను విభుఁడన నశీత్యష్టస
హస్రమునులు నధికు లయినవారు
ఘను లనుగ్రహింపఁ [1]గౌమారకబ్రహ్మ
చారి యగుచు నతఁడు సలిపె వ్రతము. 14

వ. తదనంతరంబ. 15

సీ. మనువు మూఁడవవాఁడు మనుజేంద్ర! యుత్తముం
డనఁ బ్రియవ్రతునకు నాత్మజుండు
పాలించె నిలయెల్లఁ, బవనసృంజయయజ్ఞ
హోత్రాదు లాతని పుత్త్రు, లధిక
గుణులు వసిష్ఠుని కొడుకులు ప్రమథాదు
లైరి సప్తర్షులు, నమరవిభుఁడు
సత్యజిత్తనువాఁడు సత్యభద్రాద్యులు
సురలు, ధర్మునికి సూనృతకును

ఆ. బుట్టి సత్యనియతిఁ బురుషోత్తముఁడు సత్య
సేనుఁ డనఁగ దుష్టశీలయుతుల
దనుజయక్షపతుల దండించె సత్యజి
న్మిత్రుఁ డగుచు జగము మే లనంగ. 16

వ. చతుర్థమనువు కాలప్రసంగంబు వివరించెద. 17

సీ. మానవాధీశ్వర! మనువు నాలవవాఁడు
తామసుం డనఁగ నుత్తముని భ్రాత
పృథ్వీపతులు కేతువృషనరఖ్యాత్యాదు
లతని పుత్త్రులు పదుగు రధికబలులు
సత్యకహరివీర సంజ్ఞలు వేల్పులు,
త్రిశిఖనామమువాఁడు దేవవిభుఁడు

1 అయిదు సంవత్సరములనుండి బ్రహ్మచర్యము పూనినవాఁడు.

మునులు జ్యోతిరోవ్యోమముఖ్యులు హరివుట్టె
హరిమేధునకుఁ బ్రీతిహారిణియందు;
ఆ. గ్రాహబద్ధుఁ డయిన గజరాజు విడిపించి
ప్రాణభయమువలనఁ బాపి కాచె
హరి దయాసముద్రుఁ డఖిలలోకేశ్వరుఁ
డనిన శుకునిఁ జూచి యవనివిభుఁడు. 18
క. [1]నీరాట[2]వనాటములకుఁ,
బోరాటం బెట్లు కలిగెఁ బురుషోత్తముచే
నారాట మెట్లు మానెను
ఘోరాటవిలోని భద్రికుంజరమునకున్. 19
క. మునినాథ! యీకథాస్థితి
వినిపింపుము వినఁగ నాకు వేడుకపుట్టెన్
వినియెదఁ గర్ణేంద్రియముల
బెనుఁబండువు సేయ మనముఁ బ్రీతింబొందన్. 20
క. ఏకథలయందుఁ బుణ్య
శ్లోకుఁడు హరి సెప్పఁబడును సూరిజనముచే
నాకథలు పుణ్యకథ లని,
యాకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్. 21
వ. ఇవ్విధంబునఁ బ్రాయోపవిష్టుం డైన పరీక్షిన్నరేంద్రుండు బాద
రాయణి నడిగెనని చెప్పి సభాసదులైన మునుల నవలోకించి
సూతుండు పరమహర్ష సమేతుండై చెప్పె. అట్లు శుకుండు రాజున
కిట్లనియె. 22

౨ అ ధ్యా యము

సీ. రాజేంద్ర! విను సుధారాశిలో నొకపర్వ
తము త్రికూటం బనఁ దనరుచుండు
యోజనాయుత మగు నున్నతత్వంబును
సంతియ వెడలుపు నతిశయిల్లుఁ

1. నీర + అటము = మొసలి 2. వన + అటము = అడవిజంతువు (ఏనుఁగు)

గాంచ¹నాయస్స్వరకలధౌతమయములై
మూఁడుశృంగంబులు మొనసియుండుఁ
దటశృంగబహురత్నధాతుచిత్రితములై
దిశలు భూనభములుఁ దేజరిల్లు

తే. భూరిభూజలతాకుంజ పుంజములును
మ్రోసి పఱతెంచు సెలయేటి మొత్తములును
మరిగి తిరిగెడు దివ్యవిమానములును
జఱులుఁ గ్రీడించు కిన్నరచయముఁ గలిగి. 23

వ. అది మఱియును మాతులుంగ లవంగ లుంగ చూత కేతకీ భల్లాతకామ్రాతక సరళ పనస బదరీ వకుళ వంజుళ వట కుటజ కుంద కురవక కురంటక కోవిదార ఖర్జూర నారికేళ సింధువార చందన పిచుమంద మందార జంబూ జంబీర మాధవీ మధూక తాల తక్కోల తమాల హింతాల రసాల సాల ప్రియాళు బిల్వామలక క్రముక కదంబ కరవీర కదళీ కపిత్థ కాంచన కందరాళ శిరీష శింశుపాశోక పలాశ నాగ పున్నాగ చంపక శతపత్ర మరువక మల్లికామతల్లికాప్రముఖనిరంతరవసంతసమయసౌభాగ్యసంపదంకురిత పల్లవిత కోరకిత కుసుమిత ఫలిత లలితవిటపవిటపివీరున్నివహాలంకృతంబును²మణివాలుకానేకవిమలపులినతరంగిణీసంగతవిచిత్రవిద్రుమలతామహోద్యానశుకపికనికరనిశితసమంచితచంచూపుటనిర్దళితశాఖిశాఖాంతరపరిపక్వఫలరంధ్రప్రవర్షితరసప్రవాహబహుళంబునుఁ గనకమయసలిలకాసారకాంచనకుముదకల్హారకమలపరిమళమిళితకబళాహారసంతతాంగీకారభారపరిశ్రాంతకాంతాసమాలింగితకుమారమత్తమధుకరవిటసముదయసమీపసంచారసముదంచితశకుంతకలహంసకారండవజలకుక్కుటచక్రవాకబకబలాకకోయష్టికముఖరజలవిహంగవిసరవివిధకోలాహలబధిరీభూతభూనభోంతరాళంబును, దుహినకరకాంతమరకతకమలరాగవజ్ర

1. ఉక్కు. 2. మణులయొడ పిడిచేఁబుట్టినయిసుక.

వైడూర్యనీలగోమేధికపుష్యరాగమనోహరకనకకలధౌతమణిమయా
నేకశిఖరతటదరీవిహరమాణవిద్యాధరవిబుధ సిద్ధ చారణ గరుడ
గంధర్వ కిన్నర కింపురుష మిథునసంతతసరససల్లాపసంగీతప్రసంగ
మంగళాయతనంబును, గంధగజ గవయ గండభేరుండ ఖడ్గ కంఠీ
రవ శరభ శార్దూల శశ చమర శల్య భల్ల సారంగ సాలావృక
వరాహ మహిష మర్కట మహోరగ మార్జాలాది నిఖిల మృగ
నాథసమూహ సమరసన్నాహసంరంభసంచకితశరణాగతశమనకింక
రంబునై యొప్పు నప్పర్వత సమీపంబునందు. 24

క. [1]భిల్లీ [2]భిల్ల [3]లులాయక
భల్లుక ఫణి ఖడ్గ గవయ వలిముఖ చమరీ
[4]ఝిల్లీ హరి శరభక [5]కిటి
మల్లాద్భుత కాక ఘూక మయమగు నడవిన్. 25

శా. అన్యాలోకనభీకరంబులు [6]జితాశానేకపానీకముల్
వన్యేభంబులు కొన్ని మత్తతనను[7]వ్రజ్యావిహారాగతో
దన్యత్వంబున భూరిభూధరదరీద్వారంబులందుండి సౌ
జన్యక్రీడల [8]నీరుగాలిపడి కాసారావగాహార్థమై. 26

ఆ. అంధకారమెల్ల నద్రిగుహాంతర
వీథులందుఁ బగలు వెఱచి డాఁగి
యెదురు వేచి సంధ్య నినుఁడు వృద్ధతనున్న
వెడలె ననఁగ గుహలు వెడలెఁ గరులు. 27

క. తలఁగవు కొండలకైనను
మలఁగవు సింగములకైన మార్కొనుకడిమిం
దలఁగవు పిడుగులకైనను
నిల బలసంపన్నవృత్తి నేనుఁగుగున్నల్. 28

---

1 బోయత. 2 బోయవాఁడు. 3 కొండదుమ్ము. 4 ఈలపురుగు. 5 కిటి = ఏదుఁబంది. 6 దిగ్గజముల గుంపును మించినవి. 7 అనువ్రజ్యా = అనుసరించు పోవుట యను విహారముచేఁ గలిగిన దప్పికగలవగుట వలన. 8 నీరుగాలి పడి = నీటి మీఁదనుండి వచ్చు గాలి సోకి. (సరోఽనిలం పంకజరేణురూషితం జిఘ్రన్ అని మూలము)

సీ. పులులమొత్తంబులు పొదరిండ్లలోఁ దూఱు
ఘోరభల్లూకముల్ గుహలు సొచ్చు
[1]భూదారములు నేల బొఱియలలోఁ డాఁగు
[2]హరిదంతములకేఁగు హరిణచయము
మడువులఁ జొఱబాఱు మహిషసంఘంబులు
గండశైలంబులఁ గపులు ప్రాఁకు
వల్మీకములు సొచ్చు వనభుజంగంబులు
[3]నీలకంఠంబులు నింగి కెగయు

తే. వెఱచి చమరీమృగంబులు విసరు [4]వాల
చామరంబుల విహరణశ్రమము వాయ
భయదపరిహేల విహరించు భద్రకరుల
గాలి వాఱినమాత్రాన జాలిఁ బొంది. 29

క. మదగజదానామోదముఁ
గదలనితమకములఁ ద్రావి కడుపులు నిండం
బొదలుచుఁ దుమ్మెద కొదమల
కదుపులు జుంజు మ్మ్రటంచు గానము సేసెన్. 30

క. తేఁటి యొకటి యొరుప్రియకును
మాటికి మాటికిని నాగ మదజలగంధం
బేటికని తన్నుఁ బొందెడి
బోటికి నందిచ్చు [5]నిండుఁబోఁటుదనమునన్. 31

క. [6]అంగీకృతరంగన్మా
తంగీమదగంధమగుచు దద్దయు వేడ్కన్
సంగీతవిశేషంబుల
[7]భృంగీగణ మొప్పె [8]ప్రాఁనుపెట్టుడిమాడ్కిన్. 32

---

1 అడవిపందులు. 2 దిగంతములకు. 3 నెమళ్ళు. 4 తోకలనెడి చామరములను. 5 అంగీకరింపఁబడిన యొప్పిడి యాఁడుయేనుఁగుల మదపరిమళము గలదియై (ఆడు ఏనుఁగుల మదవాసనయెడ వలపుగలదై యన్నమాట.) 6 ఆడయేనుఁగుల మదవాసన నొప్పినది. 7 ఆడుతుమ్మెదల గుంపు. 8 నిశ్చేష్టమయినట్లు.

క. [1]వల్లభలు [2]వాఱి [3]మునుపడ
[4]వల్లభ మని మునరి రేని [5]వారణదానం
బొల్లక [6]మధుకరవల్లభు
లుల్లంబులఁ బొందిరెల్ల యుల్లాసంబుల్. 33

వ. అప్పుడు. 34

మ. [7]కలభంబుల్ సెరలాడుఁ బల్వలము లాఘ్రాణించి [9]మట్టాడుచున్
ఫలభూజంబులు రాయుచుం జివురుజొంపంబుల్ ,వడిన్ మేయుచుం
బులులం గాఱనుపోతులన్ మృగములం బోనీక శిక్షించుచుం
గోలఁకుల్ సొచ్చి కలంచుచున్ గిరులపై [10]గొబ్బిళ్లు గోరాడుచున్.

క. తుండంబుల మదజలవృత
గండంబులఁ గుంభములను ఘట్టనసేయం
గొండలు దలక్రిందై పడు,
బెండుపడుఁ దిశలు, నూఁచి బెగడుఁ జగముల్. 36

క. ఎక్కడఁ జూచిన లెక్కకు
నెక్కువయై యడవి నడుచు నిభయూథములోఁ
నొక్కొక్కకరినాథుఁ డెడతెగి
చిక్కె నొక[11]కరేణుకోటి సేవింపంగన్. 37

వ. ఇట్లు వెనుక ముందట నుభయపార్శ్వంబున తృషార్దితంబులై యరుగుదెంచు నేనుంగుగములం గానక తెఱంగుదప్పి తొలంగుడుపడి యీశ్వరాయత్తంబైన చిత్తంబు [12]సంవిత్తంబు గాకుండుటం జేసి తానును దనకరేణుసమయంబును నొక్కతెరువై పోవుచు. 38

---

1 భార్యలు (ప్రియురాండ్రు) 2 పాఱి = పఱువెత్తి 3 ముందుపడగా ముందు కాఁగా. 4 ఇష్టము. 5 ఏనుగుయొక్క మదమును. 6 మగతుమ్మెదలు. 7 పిల్లయేనుఁగులు. 8 పల్వములు = చిన్న నీటిగుండెలు. 9 నడచుచు. 10 దంతములతో కొండలను పొడుచుచు. 11 ఆడయేనుఁగుల గుంపు. 12 సంవిత్తము = తెలివిగలది. (మనసు స్వాధీనములో లేదన్న మాట)

సీ. పల్వలంబుల లేఁత పచ్చిక మచ్చిక
జెలుల కందిచ్చు [1]నచ్చికము లేక
[2]నివురుజొంపములఁ [3]గ్రొవ్వెలయు పూఁగొమ్మలఁ
బ్రాణవల్లభలకుఁ బాలు వెట్టు
ఘనదానశీతలకర్ణతాళంబుల
[4]దయితల చెమటార్పుఁ దనువు లరసి
మృదువుగాఁ గొమ్మల మెల్లన గళములు
నివురుచుఁ బ్రేమతో నెఱపు వలపు

తే. పిఱుఁదు [5]చక్కట్ల డగ్గఱి ప్రేమతోడ
డాసి మూర్కొని దివికిఁ దొండంబు సాఁచు
[6]వెద వివేకించుఁ గ్రీడించు విశ్రమించు
మత్తమాతంగమల్లంబు మహిమతోడ. 39

సీ. తన కుంభముల పూర్ణతకు డిగ్గి యువతుల
కుచములు పయ్యెద కొంగులీఁగఁ
దనయానగంభీరతకుఁ జాల కబలల
యానంబు లందెల నండఁగొనఁగఁ
దనకరశ్రీఁ గని తలఁకి బాలల చిఱు
దొడలు మేఖలదీప్తిఁ దోడు పిలువఁ
దనదంతరుచికోటి తరుణుల నగవులు
ముఖచంద్రదీప్తుల ముసుఁగు దిగువఁ

తే. దనదు లావణ్యరూపంబుఁ దలఁచి చూడ
నంజనాభ్రము కపిలాది[7]హరిదిభేంద్ర
దయితలందఱుఁ దనవెంటఁ దగిలి నడవఁ
గుంభివిభుఁ డొప్పె నొప్పులకుప్పవోలె. 40

1. లోపము లేకుండ. 2. చిగురు గుబురులందు. 3. క్రొవ్వు + ఎలయు = సారము గలిగిన. 4. భార్యలయొక్క. 5. చోటు (వెనుకభాగమని యిచ్చటి యర్థము.) 6. పశుఋతుసమయము. 7. హరిద్ + ఇభ + ఇంద్రదయితలు = దిగ్గజముల భార్యలు.

వ. మఱియు నానాగహనవిహరణమహిమతో మదగజేంద్రంబు మార్గంబుఁ దప్పి పిపాసాపరాయత్తచిత్తంబున మత్తకరేణువుల మొత్తంబునుం దానునుం జని చని. 41

మ. అటఁ గాంచెం గరిణీవిభుండు నవఫుల్లాంభోజకహ్లారమున్
[1]నటదిందీవరవారముం గమఠమీనగ్రాహదుర్వారమున్
వట హింతాల రసాల సాల సుమనోవల్లీ కుటీతీరముం
జటులోద్ధూత మరాళ చక్ర బకసంచారంబుఁ [2]గాసారమున్. 42

వ. ఇట్లనన్యపురుషసంచారంబై నిష్కళంకంబైన యప్పంకజాకరంబుఁ బొడఁగని. 43

సీ. తోయజగంధంబుఁ దోఁగిన చల్లని
మెల్లనిగాడ్పుల మేనులలరఁ
గమలనాళాహార విమలవాక్కలహంస
రవములు చెవులపండువులు సేయ
[3]ఫుల్లదిందీవరాంభోరుహామోదంబు
ఘ్రాణరంధ్రంబుల గారవింప
నిర్మలకల్లోలనిర్గతాసారంబు
వదనగహ్వరముల వాడు దీర్పఁ
తే. త్రిజగదభినవసౌభాగ్య దీప్తమైన
విభవమీక్షణములకును విందుసేయ
నరిగి పంచేంద్రియవ్యవహారములను
మఱచి మత్తేభయూథంబు మడుఁగు సొచ్చె. 44

క. తుండంబులఁ బూరించుచు
గండంబులఁ జల్లుకొనుచు గళగళరవముల్
మెండుకొన వలుఁదకడుపులు
నిండన్ వేదండకోటి నీటిం ద్రావెన్. 45

వ. అప్పుడు. 46

---

1. నటించుచున్న నల్లగలువలగుంపు గలది. 2. మడుఁగు. 3. వికసించు నల్ల గలువలు......

మ. ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీ రెక్కించి పూరించి [1]చం
డభమార్గంబున కెత్తి నిక్కి వడి [2]నుద్ఘాటించి [3]పింజింప నా
రభటిన్ నీరములోనఁ బెల్లెగసి నక్రగ్రాహపాఠీనముల్
నభమం దాడెడు మీనకర్కటముల న్బట్టెన్ సురల్ మ్రాన్పడన్.

వ. మఱియు నగ్గజేంద్రంబు నిరర్గళవిహారంబున. 48

సీ. కరిణీకరోజ్ఝిత[4]కంకణచ్ఛటఁ దోఁగి
సెలయేటి నీలాద్రి చెలువుఁ దెగడు
[5]హస్తినీ హస్త విన్యస్తపద్మంబుల
వేయిగన్నులవాని వెరవు సూపుఁ
గలభసముత్కీర్ణ కహ్లారరజమునఁ
గనకాచలేంద్రంబు ఘనతఁ దాల్చుఁ
గుంజరీ[6]పరిచితకుముదకాండంబుల
ఫణిరాజమండనప్రభ వహించు

ఆ. మదకరేణుముక్తమౌక్తికశుక్తుల
మెఱుఁగు మొగిలుతోడ మేలమాడు
నెదురు లేనిగరిమ నిభరాజమల్లంబు
[7]వనజగేహకేళి [8]వ్రాలునపుడు. 49

వ. మఱియు నా సరోవరలక్ష్మి మదగజేంద్రవివిధవిహారవ్యాకులిత నూతనలక్ష్మీవిభవయై యసంగవిద్యానిరూఢపల్లవప్రబంధపరి కంపితశరీరాలంకార యగు కుసుమకోమలియునుం బోలె [9]వ్యాకీర్ణచికురమత్తమధుకరనికరయు [10]విగతరసవదనకమలయు [11]నిజ స్థానచలితకుచరథాంగయుగళయు [12]లంపటిత జఘనపులినతలయు నై యుండె. అంత. 50

---

1. చండభ=సూర్యునియొక్క మార్గంబునకు. 2. ఇటునటు కదలించి (ఉద్ఘాటించి) 3. పింజింపన్ = నీళ్లుచిలకరింపగా 4. కంకణచ్ఛట = నీటిచుక్కల సమూహము 5 ఆడయేనుఁగులయొక్క 6 పరిచిత = పరిచయముచేయఁబడిన. అందింపఁబడినవి యన్నమాట. 7 తామరకొలనిలోని విహారమునందు 8 అతిశయించునపుడు (మీఱు నపుడు) 9 విరిసినజుట్టువంటి మదించిన తుమ్మెదలు కలవియు. 10 పోయిన రసముగల ముఖమువంటి పద్మముకలదియు. 11 మదస్థానమునుండిచలించిన కుచములవంటి చక్రవాకముల జంటగలదియు. 12 చెదరిన పిఱుదలవంటి యిసుకతిన్నెలుకలదియు

సీ. భుగభుగాయితభూరిబుద్బుదచ్ఛటలతోఁ
గదలుచు దివికి భంగంబు లెగయ
భువనభయంకరఫూత్కారరవమున
ఘోరనక్రగ్రాహకోటి బెగడ
వాలవిక్షేపదుర్వారఘుంఘుమానిల
వశమున ఘుమఘుమావర్త మడరఁ
గల్లోలజాలసంఘట్టనంబులఁ దటీ
తరు లమూలంబులై ధరణిఁ గూల

తే. సరసిలోనుండి పొడగని సంభ్రమించి
[1]యుదరి కుప్పించి లంఘించి హుంకరించి
భానుఁ గబళించి పట్టు[2]స్వర్భానుపగిది
నొక్క మకరేంద్రుఁ డిభరాజు నొడిసిపట్టె. 51

క. వడిఁ దప్పించి కరీంద్రుఁడు
నిడుదకరంబెత్తి వ్రేయ నీరాటంబుం
బొడ వడఁగినట్లు జలముల
వడి కదలకఁ బట్టెఁ బూర్వపదయుగళంబున్. 52

చ. పదములఁ బట్టినం [3]దలఁకుఁ బాటొకయింతయు లేక శూరతన్
మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంతఘట్టనం
జెదరఁగఁ జిమ్మె నమ్మకరిచిప్పలు [4]పాదులుఁ దప్ప నొప్పఱన్.
వదలి జలగ్రాహంబు కరివాలము మూలముఁ జీరెఁ గోరులన్. 53

క. కరిఁ దిగుచు మకరి సరసికిఁ
గరి దరికిని మకరిఁ దిగుచు గరికరి బెరయన్
గరికి మకరి మకరికిఁ గరి
భర మనుచును నతలకుతల భటు లదిరిపడన్. 54

వ. ఇట్లు కరిమకరంబులు రెండును నొండొండ సముద్దండదండంబులై తలపడి నిఖిలలోకాలోకనభీకరంబులై యన్యోన్యవిజయశ్రీ

1 యుదరి=కోపించి. (కోపముచే సంచలించి) 2 రాహువువలె 3 తొట్రుపాటు. (భయము) 4 ధైర్యము

కరంబులై సంక్షోభితకమలాకరంబులై [1]హరిహరియును [2]గిరిగిరియు
నుం దాఁకి పిఱుతివియక పెనంగు తెఱంగున నిరాటంబున
పోరాటంబునం బెనఁగుచు వెలికి లోనికిం దిగుచుచుం గొలంకు
గలంకం బొందఁ గడువడి నిట్టట్టుఁ బడి తడఁబడక బుడబుడానుకా
రంబులై బుగులు బుగుల్లను చప్పుళ్ళతో నురువులుఁ గట్టుచు
జలంబు లుప్పరం బెగయం జప్పరించుచుఁ దప్పక వదనగహ్వా
రంబుల నప్పళించుచు నిశితనితాంతదురంతదంతకుంతంబుల నిం
తింతలు తునియలయి [3]నప్పళంబునం బునుకఁ జిప్పలుఁ గుసుళ్ళుఁ
దప్పి రక్తంబులుఁ గ్రమ్మ దేర నహమ్మని యొక్కుమ్మడిం
జిమ్ముచు నితరేతరసమాకర్షణంబులం గదలక పదంబుల మొదలి
పట్టు వదలక కుదురై వర్తించుచు బరిభ్రమణవేగంబున జలంబులం
దిరుగుచు మకరకమఠకర్కటగండకమండూకాదిసలిలనిలయం
బుల ప్రాణంబులు క్షీణంబులుగా నొండొంటిం దాఁకు రభ
సంబున [4]నిక్కలువడ [5]మ్రొక్కిందొక్కుచు [6]మొనసి చెనసి బెండుపడి
నాఁచుగుల్లసిప్పతండంబులఁ బరస్పరతాడనంబులకు నడ్డంబు
గా నొడ్డుచు [7]నోడక మానక కెలుపు దలంపులు బెట్టినంబు
లై రెట్టింప నహోరాత్రంబులుం బోలెఁ గ్రమక్రమవిజృంభ
మాణంబులై బహుకాలకలహవిహారంబులై నిర్గతనిద్రాహారంబు
లై యవక్రపరాక్రమఘోరంబులై పోరుచున్న సమయంబున. 55

క. జవమును జలమును బలమును
వివిధములుగఁ బోరు కరటి వీరతకు భువిన్
దివి మకరమీనకర్కట
నివహము లొక్కటన మెత్త్రి నిలయము సుఁబొందెన్. 56

శా. ఆటోపంబునఁ జిమ్ము ఉగ్రమ్ముగల వజ్రాభీలదంతంబులం
దాటించున్ మెడఁజుట్టి పట్టి [8]హరిదోర్దండాభశుండాహతిన్

---

1 సింహము సింహమును 2 కొండకొండయును. 3 వేగముగా 4 ఇక్కలు=స్థానములు. పదన్=పదునట్లు 5 గీఱుకొనం దొక్కుచు 6 అతిశయము, అధిక్యము 7 యుద్ధమునకు వెనుదీసి 8 హరి=ఏనుఁగు, దోర్దండమువంటి తొండముయొక్క దెబ్బచేత

నీటం మాటికి మాటికిం దిగువగా నీరాటము న్నీటిపోరాట
నోన్నటమిపాటుఁ జూపుట [1]కరణ్యాటంబు [2]వాచాటమై. 57

వ. అప్పుడు. 58

ఆ. మకరితోడఁ బోరు మాతంగవిభుని నా
క్కరుని డించి పోవఁ గాళ్ళురాక
గోరి చూచుచుండెఁ గుంజరీయూథంబు
మగలు [3]దగులుఁగారె మగువలకును. 59

వ. అంత.

ఆ. [4]జీవనంబు దనకు [5]జీవనంబై యుంట
[6]నలవుఁ [7]జలము నంత కంత కెక్క
మకర మొప్పెఁ డస్సె మత్తేభమల్లంబు
బహుళపక్షశీతభాను పగిది. 61

మ. ఉఱుకుం గుంభయుగంబుపై హరిక్రియన్ హుమ్మంచుఁ
బాదంబులన్ । నెఱయం గంతను వెన్నుదన్ను నెగయు న్హాలా
గతిన్ వాలముం । జఱచున్ నుగ్గుగఁదాఁకు ముంచు మునుగున్
శల్యంబులున్ దంతముల్ । విఱుఁగన్ వ్రేయుచుఁ బొంచి పొంచి
కదియున్ వేదండయూథోత్తమున్. 62

మ. పొడగానం బడకుండ డాఁగు, వెలికిం బోవంగ దా నడ్డమై
పొడసూపుం, జరణంబులం బెనఁగొనుం, బోరాక రారాక బె
గ్గడిలం గూలఁగ [8]దాఁచు, లేచుఁ బటి నుద్ఘాటించు, లంఘించు, బ
ల్విడిఁ జీరుం దగులన్ మలంగు, నోఁటియున్ వేధించుఁ గ్రోధించుచున్.

వ. ఇట్లు [9]విస్మితనక్రచక్రంబయి నిర్వక్రవిక్రమంబున నల్పహృదయ
జ్ఞానదీపంబు నతిక్రమించు మహామాయాంధకారంబునుం బోలె
నంతకంతకు నుత్సాహకలహసన్నాహబహువిధజలావగాహంబయిన
గ్రాహంబు మహాసాహసంబున బోరె మఱియు. 64

---

1 అరణ్యములందిరుగునది. ఏనుగులగుంపు కిది విశేషణము 2 మిక్కిలిగా పలుకుచున్నదై. (అరచుచున్నదన్నమాట) 3 తగులము. (సంబంధము) 4 నీరు 5 ప్రాణాధారము 6 అలవు = సామర్థ్యము (శక్తి) 7 చలము = కసి 8 త్రన్నును, 9 ఆశ్చర్యపడిన మొసళ్లగుంపుకలదై

శా. పాదద్వంద్వము నేలమోపి పవనున్ బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ [1]మాలాకు హత్తించి [2]ని
ష్ఖేదబ్రహ్మపదావలంబనగతిం గ్రీడించు యోగీంద్రు మ
ర్యాదన్ నక్రము విక్రమించెఁ [3]గరిపాదాక్రాంతినిర్వక్రమై. 65

ఆ. [4]వనగజంబు నెగచు వనచారిఁ బొడగని
వనగజంబు గాన వజ్రిగజము
వెల్లనై సురేంద్రు వేచి సుధాంధులు
పట్టఁ బట్టనీక బయలువాఱెఁ గె. 66

ఉ. ఊహ గలంగి [5]జీవనపు టోలమునం బడి పోరుచున్ మహా
మోహలతానిబద్ధపదమున్ విడిపించుకొనంగ లేక సం
దేహముఁ బొందు దేహిక్రియ దీనదశన్ గజముండె భీషణ
గ్రాహదురంతదంతపరిఘట్టితపాద[6]ఖురాగ్రశల్యమై. 67

వ. ఇవ్విధంబున. 68

క. అలయక సొలయక వేసట
నొలయకఁ గరి మకరితోడ నుద్దండత రా
త్రులు సంధ్యలు దివసంబులు
సలిపెం బోరొక్క వేయి సంవత్సరముల్. 69

మ. పృథుశక్తిన్ గజమాజలగ్రహముతోఁ బెక్కేండ్లు పోరాడి సం
శిథిలంబై తనలావు వైరిబలముం జింతించి మిథ్యామనో

---

1 ఆధారము. తీగె పాఁకుటకు పాతిన రాట. 2 దుఃఖరహితమైన బ్రహ్మస్థానము నందుఁబోవు మార్గములో 3 మొసలి పాదముల నాక్రమించుటయందు సూటియైనదై 4 వనగజంబున్ = అడవియేనుఁగును, ఎగచు = ఎగయఁజేసి. వనచారిన్ = (నీటఁదిరుగుదానిని) మొసలిని, పొడగని = చూచి. వజ్రిగజము = ఐరావతము, వనగజంబు గాన = తానును వనగజమే కాఁబట్టి (వనమునందు అనగా నీటిలోఁబుట్టిన గజము. సముద్రము మథించినపుడు పుట్టినదన్నమాట) వెల్లనై = తెలతెలఁబోయి (ఐరావతము తెలుపగుట ప్రసిద్ధమే) సురేంద్రున్ = ఇంద్రుని, సుధాంధులు = దేవతలు, పట్టన్, పట్టనీక, బయలువాఱెఁగె = పాఱిపోయెను. (ఆకాశమునకుఁబాఱెను) 5 జీవనము + ఓలము = నీటిమడుఁగునందు. జీవితపు క్లేశములోఁ పడి అని రెండవయర్థము. 6 ఖుర = డెక్కలయొక్క, అగ్ర = తుదనున్న, శల్యము = ఎముకలుగలది.

రథమింకేటికి దీని గెల్వ సరి, బోటంజాల రాదంచు [1]స
వ్యథమై యిట్లనుఁ బూర్వపుణ్యఫలదివ్యజ్ఞానసంపత్తితోన్. 70

3 అధ్యాయము

శా. ఏరూపంబున దీనిగెల్తు నిట మీఁ దేవేల్పుఁ జింతింతు నె
వ్వారిం జేరుదు నెవ్వ రడ్డమిఁక [2]నివ్వారిప్రచారోత్తమున్
వారింపం దగువార లెవ్వ రఖిల వ్యాపారపారాయణుల్
లేరే మ్రొక్కెద దిక్కుమాలిన మొఱాలింపం బ్రపుణ్యాత్మకుల్.

శా. [3]నానానేకపయూథముల్ వనములోనం బెద్దకాలంబు స
న్మానింపన్ దశలక్షకోటికరిణీనాథుండనై యుండి [4]మ
ద్దానాంభఃపరిపుష్టచందనలతాంతచ్ఛాయలం దుండ లే
కీ నీరాశ నిటేల వచ్చితి భయం బెట్లోకదే యీశ్వరా! 72

ఉ. ఎవ్వనిచే జనించు జగ, మెవ్వనిలోపల నుండు లీనమై,
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ [5]డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁ దానయైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేఁడెదన్. 73

క. ఒకపరి జగములు వెలి నిడి
యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ దానై
సకలార్థసాక్షి యగు న
య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్. 74

క. లోకంబులు లోకేశులు
లోకస్థులుఁ దెగినఁ దుది [6]నలోకం బగు పెం
జీఁకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్. 75

క. [7]నర్తకునిభంగిఁ బెక్కగు
మూర్తులతో నెవ్వఁ డాడు మునులు దివిజులుం

---

1 వ్యథపడినదై 2 ఈవారిప్రగాహోత్తమున్ = ఈ నీటిజంతువులలో మేటిని
3 నానా, + అనేకప = ఏనుఁగులయొక్క యూథముల్ = గుంపులు. 4 మత్ = నాయొక్క, దానాంభస్ = మదజలముచే. 5 మొదలు, నడుము, తుదయు లేనివాఁడు,
6 అలోకము = కనఁబడనిది, 7 నాట్యగానివలె.

గీర్తింప నేర రెవ్వని
వర్ణన మొదు లెఱుఁగ రట్టి వాని నుతింతున్. 76

ఆ. ముక్తసంగులైన మునులు [1]దిదృక్షులు
సర్వభూతహితులు సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యులై కొల్తు రెవ్వని
దివ్యపదము వాఁడు దిక్కు నాకు. 77

సీ. [2]భవము దోషంబు రూపంబుఁ గర్మంబు నా
హ్వయములు గుణము లెవ్వనికి లేక
జగములఁ గలిగించు సమయించుకొఱకు నై
నిజమాయ నెవ్వఁ డిన్నియునుఁ దాల్చు
నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ
[3]కిద్ధరూపికి రూపహీనునకును
[4]జిత్రచారునికి సాక్షికి [5]నాత్మరుచికిని
బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు

ఆ. మాటల నెఱుకల మనములఁ జేరంగఁ
గాని శుచికి సత్త్వగమ్యుఁ డగుచు
నిపుణుఁ డైనవాని నిష్కర్మతకు మెచ్చు
వాని కే నొనర్తు వందనములు. 78

సీ. శాంతున కపవర్గ సౌఖ్యసంవేదికి
నిర్వాణభర్తకు నిర్విశేషు
నకు ఘోరునకు గూఢునకు గుణధర్మికి
సౌమ్యున కధిక విజ్ఞానమయున
కఖిలేంద్రియద్రష్ట కధ్యక్షునకు బహు
క్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి
మూలప్రకృతి కాత్మ మూలున కఖిలేంద్రి
యజ్ఞాపకునకు దుఃఖాంతకృతికి

1 దర్శనముచేయ కోరికకలవారు. 2 పుట్టుక. 3 ప్రసిద్ధములయినరూపములు కలవాఁడు. (సర్వాధిష్ఠానమైనవాఁడనుట) 4 విచిత్రమైన నడవడికలవాఁడు. 5 స్వయంజ్యోతికి.

ఆ. నేతి నసత్యమనెడి నీపత్రోఁ వెలుఁగుచు
నుండు నెక్కటికి మహోత్తరునకు
నిఖిలకారణునకు నిష్కారణునకు న
మస్కరింతు నన్ను మనుచుకొఱకు. 79

క. యోగాగ్ని దగ్ధకర్ములు
యోగీశ్వరు లేమహాత్ము నొందెదుఁగక స
ద్యోగవిభావిత మనముల
బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతున్. ౮0

సీ. సర్వాగమామ్నాయజలధికి నపవర్గ
మయునికి [1]నుత్తమ మందిరునకు
[2]సకలగుణారణిచ్ఛన్నబోధాగ్నికిఁ
దనయంత రాజిల్లు ధన్యమతికి
గుణలయోద్దీపిత గురుమానసునకు సం
వర్తితకర్మనిర్వర్తితునకు
దిశ లేనినాబోఁటి పశువుల పాపంబు
లడఁచువానికి సమస్తాంతరాత్ముఁ

ఆ. డై వెలుంగువాని కచ్ఛిన్నునకు భగ
వంతునకుఁ దనూజ పశు నివేశ
దారసక్తులైన వారికందఁగ రాని
వాని కాచరింతు వందనములు. 81

వ. మఱియును. 82

సీ. వరధర్మకామార్థవర్జితకాములై
విబుధు లెవ్వాని సేవించి యిష్ట
గతిఁ బొందుదురు చేరి కాంక్షించువారి క
వ్యయదేహమిచ్చు నెవ్వాఁడు కరుణ

1. ఉత్తములైనవారే నివాసములుగాఁగలవాఁడు. పుణ్యులందుండు వాఁడనుట.

ముక్తాత్ము లెవ్వని మునుకొని చింతింతు
రానందవార్ధిమగ్నాంతరంగు
లేకాంతు లెవ్వని నేమియు గోరక
భద్రచరిత్రంబుఁ బాడు చుందు

ఆ. రామపేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్మ
యోగగమ్యుఁ బూర్ణు నున్నతాత్ము
బ్రహ్మ మయినవానిఁ బరుని నతీంద్రియు
నీశు [1]దూరు [2]సూక్ష్ము నే భజింతు 83

వ. అని మఱియు నిట్లని వితర్కించె 84

సీ. పావకుం డర్చుల భానుండు దీప్తుల
నెబ్భంగి నిగిడింతు రెట్లుడంతు
రా క్రియ నాత్మకరావళిచేత బ్ర
హ్మాదుల వేల్పుల నఖిలజంతు
గణముల జగముల ఘననామరూపభే
దములతో మెఱయించి తగనడంచు
నెవ్వఁడు మనము బుద్ధీంద్రియంబులుఁ దాన
యై గుణసంప్రవాహంబు నెఱపు

తే. స్త్రీనపుంసకపురుషమూర్తియునుఁగాక
తిర్యగమరనరాది మూర్తియునుఁగాక
కర్మగుణభేద సదసత్ప్రకాశిఁగాక
వెనుక నన్నియుఁ దా నగు విభుఁ దలంతు. 85

1. ప్రకృతికి దూరమైనవాఁడు. 2. అణువుకంటె అణువైనవాఁడు.

క. కలఁ డందురు దీనులయెడఁ,
గలఁ డందురు పరమయోగి గణముల పాలం
గలఁ డందు రన్నిదిశలను,
గలఁడు కలం డనెడువాఁడు గలఁడో లేఁడో. 86

సీ. కలుగఁడే నాపాలి కలిమిసందేహింపఁ
గలిమిలేములు లేకఁ గలుగువాఁడు
నాకడ్డ పడరాఁడె నలి నసాధువులచేఁ
బడిన సాధుల కడ్డపడెడువాఁడు
చూడఁడే నాపాటుఁ జూపులఁ జూడకఁ
జూచువారలఁ గృపఁ జూచువాఁడు
లీలతో నా మొఱాలింపఁడే మొఱఁగుల
మొఱలెఱుంగుచుఁ దన్ను మొఱఁగువాఁడు

తే. యఖిలరూపులుఁ దనరూపమైనవాఁడు
ఆదిమధ్యాంతములు లేక యలరువాఁడు
భక్తజనములదీనుల పాలివాఁడు
వినఁడె చూడఁడె తలఁపడె వేగ రాఁడె. 87

క. విశ్వకరు విశ్వదూరుని
విశ్వాత్ముని విశ్వవేద్యు [1]విశ్వు [2]నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు
నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్. 88

వ. అని పలికి తనమనంబున నగ్గజేంద్రుం డీశ్వరసన్నిధానంబుఁ గల్పించుకొని యిట్లనియె.

శా. లా వొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యెఁ, బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చెఁ, దనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్,
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ, మన్నింపం దగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా! 90

1 విశ్వరూపుని 2 విశ్వముకంటె వ్యతిరిక్తుఁడైనవాని

క. వినుదట జీవులమాటలు
సను దట చనరానిచోట్ల శరణార్థుల కో
యను దట పిలిచిన సర్వముఁ
గను దట సందేహమయ్యెఁ గరుణావార్థీ! 91

ఉ. ఓకమలాక్ష! యో వరద! యో ప్రతిపక్షవిపక్షదూర! కు
య్యో కవియోగివంద్య! సుగుణోత్తమ! యో శరణాగతామరా
నోకహ! యో మునీశ్వరమనోహర! యో విమలప్రభావ! రా
వే కరుణింపవే తలఁపవే శరణార్థిని నన్ను గావవే. 92

వ. అని పలికి మఱియు రక్షితరక్షకుం డైన యీశ్వరుం డాపన్నుం డైన నన్నుఁ గాచుఁ గాక యని నింగి నిక్కి చూచుచు నిట్టూర్పులు నిగిడించుచు [1]బయలాలకించుచు నగ్గజేంద్రుండు మొఱసేయుచున్న సమయంబున. 93

ఆ. [2]విశ్వమయత లేమి వినియు నూరకయుండి
రంబుజాసనాదు లడ్డ పడక
విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు
భక్తియుతున కడ్డ పడఁ దలంచె. 94

మ. అల వైకుంఠపురంబులో నగరిలో నా మూలసౌధంబు దా
పల[3]మందారవనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలో
త్పలపర్యంకరమావినోదియగు నాపన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహిపాహి యనఁ గుయ్యాలించి సంరంభియై.

మ. సిరికిం జెప్పఁడు, శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ, డే
పరివారంబునుఁ జీరఁ, డభ్రగపతిం బన్నింపఁ, [4]డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు [5]వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై. 96

1 శూన్యప్రదేశమున నేదో వినవచ్చినట్లు వినుచు (నిశ్చేష్టుఁడగుచు) 2 విశ్వమున నిండి యుండుట 3 మందారవనము నడిమి అమృతసరస్సు దరినున్న చంద్రకాంతములపై పఱచిన కలువ పూపాన్పునందు 4 చెవికమ్మపై వ్రాలిన జుట్టుముడి. 5 వివాద = ప్రణయ కలహమందు, ప్రోత్థిత = ఆకర్షింపఁబడిన, శ్రీ = లక్ష్మీదేవియొక్క, కుచ = స్తనముల యొక్క, ఉపరి = మీఁదనున్న, చేలాంచల = చీరకొంగు.

వ. ఇట్లు భక్తజనపాలనపరాయణుండును నిఖిలజంతుహృదయారవింద సదనుండును నగు నారాయణుండు కరికులేంద్రవిజ్ఞాపిత నానావిధ దీనాలాపంబు లాకర్ణించి లక్ష్మీకాంతావినోదంబులం దగులు సాలించి సంభ్రమించి దిశలు నిరీక్షించి గజేంద్రరక్షాపరత్వంబు నంగీకరించి నిజపరికరంబు మరల నవధరించి గగనంబున కుద్గమించి వేంచేయునప్పుడు. 97

మ. తనవెంటన్ సిరి, లచ్చివెంట [1]నవరోధవ్రాతమున్, దాని వె
న్కను బక్షీంద్రుఁడు, వానిపొంతను ధనుఃకౌమోదకీశంఖచ
క్రనికాయంబును నారదుండు [2]ధ్వజినీకాంతుండు రా వచ్చిరొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్. 98

వ. తదనంతరంబ ముఖారవిందమకరందబిందుసందోహపరిష్యందనానం దేందిందిర యగు నయ్యిందిరాదేవి గోవిందకరారవిందసమాకృష్య మాణ[3]సంవ్యానచేలాంచలయయి పోవుచు. 99

మ. తన వేంచేయు పదంబుఁ బేర్కొనఁ డనాథస్త్రీజనాలాపముల్
వినెనో, మ్రుచ్చులు మ్రుచ్చిలించిరొ ఖలుల్ వేదప్రపంచంబులన్,
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో, భక్తులం
గని చక్రాయుధుఁ డేఁడి చూపుఁ డని ధిక్కారించిరో దుర్జనుల్. 100

వ. అని వితర్కించుచు. 101

శా. [4]తాటంకాచలనంబుతో భుజనటద్ధమ్మిల్లబంధంబుతో
శాటీముక్తకుచంబుతో నదృఢచంచత్కాంచితో శీర్ణలా
లాటాలేపముతో మనోహరకరాలగ్నోత్తరీయంబుతోఁ
గోటీందుప్రభతో నురోజభరసంకోచద్విలగ్నంబుతోన్. 102

---

1 అంతఃపుర కాంతల సముదాయము 2 సేనాపతి. (విష్వక్సేనుఁడు) 3 సంవ్యాన చేలాంచల = పైఁటచీర చెఱఁగు 4. చలించు చెవికమ్మలు, బుజములఁ జెదరు కొప్పుముడి, పైటదొలంగిన కుచము, విడివడి మెఱయు నొడ్డాణము, నుసినుసి రాలు నుదుటి గంధపుపొడి, చక్కగ చేతబట్టిన యుత్తరీయము, కోటిచంద్రప్రకాశము, పాలిండ్లబరువుచేఁ గిటకిటలాడు నడుము, గలిగి లచ్చి (హరివెంబడించెను.)

క. అడిగెద నని కడువడిఁ జను
నడిగినఁ దను మగుడ నుడుగఁ డని నడ యుడుగున్
వెడవెడ సిడిముడి తడఁబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్. 103

సీ. [1]నిటలాలకము [2]లంట నివుర జుంజు మ్మని
ముఖసరోజమునిండ ముసరుఁ దేంట్లు
[3]నళులఁ జోఁపఁగఁ జిల్క లల్ల నల్లన చేరి
[4]యోష్ఠబింబద్యుతు లొడియ నుఱుకు
శుకములఁ దోలఁ [5]జక్షుర్మీనములకు [6]మం
దాకినీపాఠీనలోక మెసఁగు
మీనపంక్తుల దాఁట [7]మెయిదీఁగతోఁ రాయ
[8]శంపాలతలు మింట [9]సరణిఁ గట్టు

ఆ. శంపలను జయింపఁ జక్రవాకంబులుఁ
గుచయుగంబుఁ దాఁకి క్రొవ్వు సూపు
మెలఁత మొగులపిఱుఁది మెఱుఁగుఁ దీవయుఁ బోలె
జలదవర్ణు వెనుకఁ జనెను నపుడు. 104

మ. వినువీథిన్ జనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్ [10]సురారాతి జీ
వనసంపత్తినిరాకరిష్ణుఁ గరుణావర్షిష్ణు యోగీంద్రహృ
ద్వనవర్తిష్ణు సహిష్ణు భక్తజనబృందప్రాభవాలంకరి
ష్ణు[11]నవోఢోల్లసదిందిరాపరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్. 105

వ. ఇట్లు పొడగని. 106

1. నుదుటిపైవ్రాలిన ముంగురులు 2. అంటన్ + నివురన్ = కవిసి అతిశయించుటకు (వానికంటె తామే నల్లగా నుండుటకు) 3. తుమ్మెదలను 4. దొండపండువంటి పెదవియొక్క కాంతులు 5 కన్నులనెడి చేపలకు 6. గంగయందలి బేడిసచేపలసమూహము ఎసఁగున్ = అతిశయించును. 8. మెఱుపుఁదీఁగలు 9. వరుసలు గట్టును. 10. రాక్షసుల ప్రాణసంపదను నిరాకరించువాఁడు. 11. క్రొత్తపెండ్లికూఁతురట్లు ప్రకాశించు లక్ష్మీదేవి పరిచర్యచేయుచున్న వానిని.

మ. చనుదెంచెన్ ఘనుఁ డల్లవాఁడె హరి పజ్జం గంటిరే లక్ష్మి శం
ఖనినాదం బదె చక్ర మల్లదె భుజంగధ్వంసియున్ వాఁడె క్ర
న్నన యేతెంచె నటంచు వేల్పులు నమో నారాయణాయేతిని
స్వనులై మ్రొక్కిరి మింట హస్తిదురవస్థావక్రికిం జక్రికిన్. 107

వ. అయ్యవసరంబునఁ గుంజరేంద్రపాలనపారవశ్యంబున దేవతానమస్కారంబు లంగీకరింపక మనస్సమానసంచారుండై పోయిపోయి, కొంతదూరంబున శింశుమారచక్రంబునుంబోలె [2]గురుమకరకుళీరమీనమిథునంబై కిన్నరేంద్రుని భాండాగారంబునుం బోలె స్వచ్ఛ[3]మకరకచ్ఛపంబై భాగ్యవంతుని భాగధేయంబునుంబోలె [4]సరాగజీవనంబై వైకుంఠపురంబునుం బోలె [5]శంఖచక్రకమలాంకృతంబై సంసారప్రకారంబునుం బోలె [6]ద్వంద్వసంకులపంకసంకీర్ణంబై యొప్పు నప్పంకజాకరంబుఁ బొడఁగని. 108

మ. కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె స
త్వరితాకంపితభూమిచక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబర[7]శుక్రమున్ బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాం
తరనిర్వక్రముఁ బాలితాఖిలసుధాంధశ్చక్రముం జక్రమున్. 109

వ. ఇట్లువంచిన.

---

1 ఏనుగుదురవస్థను మరలించువానికి 2 గురు=గొప్పవగు, మకర=మొసళ్లు కుళీర=పీతలు, మీన=చేపలు (అనువానియొక్క) మిథునంబై=మిథునములుకలదై (శ్లేష) గొప్ప మకర, కర్కాట, మీన, మిథునరాసులుకలది 3 (శ్లేష) మకరము, కచ్ఛపము అను పేరులుగల కుబేరుని గనులుకలది 4 ఎఱ్ఱనినీరుగలది (శ్లేష) అనురాగముతోఁ గూడిన జీవితముకలది. 5 శంఖములు, చక్రవాకపక్షులు, కమలములుకలది. (శ్లేష) శంఖము, చక్రము, లక్ష్మికలది. 6. నీటిజంతువుల జంటలతో సంకులమైన బురదగలది. (శ్లేష) సుఖదుఃఖాదిద్వంద్వములతో సంకులమైన పాపముతో నిండినది.

శా. అంభోజాకరమధ్యనూతన[1]నలిన్యాలింగనక్రీడ నా
రంభుండైన [2]వెలుంగుఱేని చెలువారన్ వచ్చి నీటన్ గుభుల్
గుంభధ్వానముతోఁ గొలంకువు కలంకం బొందఁగాఁజొచ్చి [3]దు
ష్టాంభోవర్తివసించు చక్కటికి డాయంబోయి [4]హృద్వేగమై. 110

శా. భీమంబై తలఁ ద్రుంచి ప్రాణములఁ బాపెం జక్రమాశక్రియన్
హేమక్ష్మాధరదేహముం జకితవన్యేభేంద్రసందోహముం
గామక్రోధనగేహమున్ [5]గరటిరక్తస్రావగాహంబు ని
స్సీమోత్సాహము [6]వీతదాహము జయశ్రీమోహమున్ గ్రాహమున్.

వ. ఇట్లునిమిషస్పర్శనంబున సుదర్శనంబు మకరితలఁద్రుంచు నవస
రంబున.

క. [7]మకర మొకటి రవిఁ జొచ్చెను
[8]మకరము మఱియొకటి ధనదుమాటున డాఁగెన్
మకరాలయమునఁ దిరిగెఁడు
మకరంబులు కూర్మరాజు మఱువున కరిగెన్. 114

మ. తమముం బాసిన రోహిణీవిభుక్రియన్ దర్పించి సంసారదుః
ఖము వీడ్కొన్న విరక్తచిత్తుని గతిన్ గ్రాహంబు పట్టూడ్చి పా
దము లల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పె సం
భ్రమదాశాకరిణీకరోజ్ఝితసుధాంభస్స్నానవిశ్రాంతుఁడై. 115

శా. పూరించెన్ హరిపాంచజన్యముఁ గృపాంభోరాశిసౌజన్యమున్
భూరిధ్వానచలాచలీకృతమహా భూతప్రచైతన్యమున్
[9]సారోదారశితప్రభాచకితపర్జన్యాదిరాజన్యమున్
దూరీభూతవిపన్నదైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్. 116

౪ అధ్యాయము

మ. మొరసెన్ నిర్జరదుందుభుల్, జలరుహామోదంబులై వాయువుల్
దిరిఁగెం, బువ్వులవానజల్లుఁ గురిసెన్ దేవాంగనాలాస్యముల్

1 తామరలత 2 సూర్యుఁడు 3 దుష్టమైన నీటిజంతువు (మొసలి) 4 మనస్సు వంటి వేగము గలదై. 5 ఏనుగుయొక్క రక్తప్రవాహమున మునింగినది. 6 దప్పిక లేనిది (లేక కాక లేనిది) 7 మకరరాశి యని యిక్కడియర్థము 8 మకరమను పేరుగల ఒక నిధి. 9 మంచి సారముకల తెల్లని కాంతిచే బెదరిపోవు.

పరఁగెన్, దిక్కులయందు జీవ జయశబ్దధ్వానముల్ నిండె, సా
గర ముప్పొంగెఁ [1]దరంగచుంబితనభోగంగాముఖాంభోజమై. 117

క. నిడుద యగు కేల గజమును
మడువున వెడలంగఁ దిగిచి మదజలరేఖల్
దుడుచుచు మెల్లనఁ బుడుకుచు
నుడిపెన్ విష్ణుండు దుఃఖ ముర్వీనాథా! 118

క. శ్రీహరి కరసంస్పర్శను
దేహము దాహంబుమాని ధృతిఁ గరిణీసం
దోహంబుఁ దాను గజపతి
మోహనఘీంకారశబ్దములతో నొప్పెన్. 119

క. కరముల మెల్లన నివురుచుఁ
గర మనురాగమున మెఱసి కలయంబడుచుం
గరి హరికతమున బ్రదికినఁ
గరపీడన మాచరించెఁ గరిణులు మరలన్. 120

సీ. జననాథ! దేవలశాపవిముక్తుఁడై
పటుతరగ్రాహరూపంబుమాని
ఘనుఁడు హూహూనామ గంధర్వుఁ డప్పుడు
తనతొంటి నిర్మల తనువుఁ దాల్చి
హరికి నవ్యయునకు నతిభక్తితో మ్రొక్కి
తవిలి కీర్తించి గీతములు పాడి
యాదేవు కృప నొంది యందంద మఱియును
వినతశిరస్కుఁడై వేడ్కతోడ

ఆ. దళితపాపుఁ డగుచుఁ దనలోకమున కేగు
నపుడు శౌరికేల నంటి తడవ
హస్తిలోకనాథుఁ డజ్ఞానరహితుఁడై
విష్ణురూపుఁడగుచు వెలుఁగుచుండె. 121

1 తరంగ=కెరటములచె, చుంబిత=చుంబింపఁబడిన (తాకఁబడినదన్నమాట) నభోగంగా = ఆకాశగంగయొక్క, ముఖ + అంభోజము = ముఖమనెడి పద్మముకలది (సముద్రపుకెరటము లాకాశముదాఁక లేచినవన్నమాట)

మ. అవనీనాథ! గజేంద్రుఁ డామకరితో నాలంబుఁ గావించె మున్
ద్రవిళాధీశుఁడతండు పుణ్యతముఁ డింద్రద్యుమ్ననాముండు వై
ష్ణవముఖ్యుండు గృహీతమౌననియతిన్ సర్వాత్ము నారాయణున్
సవిశేషంబుగఁ బూజసేసెను మహాశైలాగ్రభాగంబునన్. 122

మ. ఒకనాఁ డానృపుఁ డచ్యుతున్ మనసులో నూహించుచున్ మౌనియై
యకలంకస్థితి నున్నచోఁ [1]గలశజుం డచ్చోటికిన్ రాఁగ లేవక పూజిం
పక యున్న మానిఁ గని నవ్యక్రోధుఁడై మూఢ! లు
బ్ధ! కరీంద్రోత్తమ యోనిఁ బుట్టుమని శాపంబిచ్చె భూవల్లభా! 123

క. మునిపతి నవమానించిన
ఘనుఁ డింద్రద్యుమ్నవిభుఁడు కుంజరయోనిం
జననం బందెను విప్రులఁ
గని యవమానింపఁ దగదు ఘనపుణ్యులకున్. 124

క. కరినాథుఁ డయ్యె నాతఁడు
కరులైరి భటాదులెల్ల గజమైయున్నన్
హరిచరణసేవకతమునఁ
గరివరునకు నధికముక్తి గలిగె మహాత్మా! 125

ఆ. కర్మతంత్రుఁ డగుచుఁ గమలాక్షుఁ గొల్చుచు
నుభయనియతవృత్తి నుండెనేనిఁ
జెడును గర్మమెల్ల శిథిలమై మెల్లన
ప్రబలమగుచు విష్ణుభక్తి చెడదు. 126

క. చెడుఁ గరులు హరులు ధనములుఁ
జెడుదురు నిజసతులు సుతులుఁ జెడు చెనఁటులకుం
జెడక మను నట్టిగుణులకుఁ
జెడని పదార్థములు [2]విష్ణుసేవానిరతుల్. 127

వ. అప్పుడు జగజ్జనకుండగు నప్పరమేశ్వరుండు దరహాసితముఖకమలు
యగు [3]నక్కమల కిట్లనియె. 128

క. బాలా! నావెనువెంటను
[4]హేలన్ వినువీథి నుండి యేతెంచుచు నీ

1 అగస్త్యుఁడు. 2 విష్ణుసేవయందు శ్రద్ధలు. 3 ఆ + కమలకు = లక్ష్మికి 4 విలాసముగా.

చేలాంచలంబుఁ బట్టుట
కాలో నేమంటి నన్ను నంభోజముఖీ! 129

క. ఎఱుఁగుదు తెఱవా! యెప్పుడు
మఱవను సకలంబు నన్ను మఱచినయెడలన్
మఱతు ననియో౽కేఁగి యొఱఁగక
మఱవక యొఱ యిడిరయేని మఱి యన్యములన్. 130

వ. అని పలికిన నరవిందమందిర యగు నయ్యిందిరాదేవి మందస్మిత
చంద్రికాసుందరవదనారవిందయగుచు ముకుందున కిట్లనియె. 131

క. దేవా! దేవరయడుగులు
భావంబున నిలిపి కొలుచు పని నాపనిగా
గోవల్లభ! యే మనియెద [illegible]
నీ వెంటన వచ్చు చుంటి నిఖిలాధిపతీ! 132

క. దీనుల కుయ్యాలింపను
దీనుల రక్షింపమేలు దీవనఁ బొందన్
దీనావన నీ కొప్పును
దీనపరాధీన! దేవదేవ! మహేశా! 133

వ. అని మఱియును సముచితసంభాషణంబుల [1]నంకించుచున్న యప్పర
మవైష్ణవీరత్నంబును సాదరసరససల్లాపమందహాసపూర్వకంబుగా
నాలింగనంబు గావించి సపరివారుండై గరుడగంధర్వసిద్ధవిబుధ
గణజేగీయమానుండై గరుడారూఢుండగుచు హరి నిజసదనంబు
నకుం జనియె. అని చెప్పి శుకయోగీంద్రుం డిట్లనియె. 134

సీ. నరనాథ! నీకును నాచేత వివరింపఁ
బడిన యీకృష్ణానుభావ మైన
గజరాజమోక్షణకథ వినువారికి
యశము లిచ్చును గల్మషాపహంబు
దుస్స్వప్ననాశంబు దుఃఖసంహారంబుఁ
బ్రొద్దున మేల్కాంచి పూతవృత్తి

1 స్తుతించుచున్న.

నిత్యంబుఁ బఠియించు నిర్మలాత్మకులైన
విప్రులకును బహువిభవ మమరు

తే. సంపదలు గల్గుఁ బీడలు శాంతిఁ బొందు
సుఖము సిద్ధించు వర్ధిల్లు శోభనములు
మోక్ష మఱచేతిదై యుండు ముదము సేరు
ననుచు విష్ణుండు ప్రీతుఁడై యానతిచ్చె. 135

వ. అని మఱియు నప్పరమేశ్వరుం డిట్లని యానతిచ్చె. ఎవ్వరేని నపర రాత్రాంతంబున మేల్కాంచి సమాహితమానస్కులయి నన్నును నిన్నును నీసరోవరంబును శ్వేతద్వీపంబును నాకుం బ్రియంబైన సుధాసాగరంబును హేమనగంబును నిగ్గిరికందరకాననంబులను వేత్రకీచకవేణులతాగుల్మసురపాదపంబులను నేనును బ్రహ్మయు ఫాలలోచనుండును నివసించియుండు నక్కొండ శిఖరంబులను గౌమోదకీకౌస్తుభసుదర్శనపాంచజన్యంబులను శ్రీదేవిని శేష గరుడవాసుకిప్రహ్లాదనారదులను మత్స్యకూర్మవరాహాద్యవతారంబులను దదవతారకృతకార్యంబులను సూర్యసోమపావకులను బ్రణవంబును ధర్మతపస్సత్యంబులను వేదంబును వేదాంగంబులను శాస్త్రంబులను గోభూసురసాధుపతివ్రతాజనంబులను జంద్రకాశ్యపజాయాసముదయంబును గౌరీగంగాసరస్వతీకాళిందీసునందాప్రముఖపుణ్యతరంగిణీనిచయంబును నమరులను నమరతరువులను నైరావతంబును నమృతంబును ధ్రువుని బ్రహ్మర్షినివహంబును బుణ్యశ్లోకులయిన మానవులను సమాహితచిత్తులై తలంచువారలకుఁ బ్రాణావసానకాలంబున మదీయంబగు విమలగతి నిత్తునని హృషీకేశుండు నిర్దేశించి శంఖంబు పూరించి సకలామరవందితచరణారవిందుఁడై [1]విహగపరివృఢవాహనుండై వేంచేసె. విబుధానీకంబు సంతోషించెను. అని చెప్పి శుకుండు రాజునకిట్లనియె.

---

1 విహగపరివృఢ = పక్షిరాజు గరుత్మంతుఁడు. వాహనుఁడై = వాహనముగాఁ గలవాఁడై.

౫ అధ్యాయము

క. గజరాజమోక్షణంబును
నిజముగఁ బఠియించునట్టి నియతాత్మ్ములకున్
గజరాజవరదుఁ డిచ్చును
గజతురగస్యందనములు గైవల్యంబున్. 137

క. తామసుతమ్ముఁడు రైవత
నామకుఁ డై వెలసె మనువు నలువురమీఁదన్
భూమికిఁ బ్రతివింధ్యార్జున
నామాదులు నృపులు మనువునందనులు నృపా! 138

సీ. మునులు హిరణ్యరోముఁడు నూర్ధ్వబాహుండు
వేదశీర్షుం డను వీరు మొదలు
నమరులు భూతరయాదులు శుభ్రుని
పత్ని వికుంఠాఖ్యపరమసాధ్వి
యాయిద్దఱకుఁ బుత్త్రుఁ డై తనకళలతో
వైకుంఠుఁ డనఁ బుట్టి వారిజాక్షు
డవనిపై వైకుంఠ మనియెడి లోకంబుఁ
గల్పించె నెల్లలోకములు మ్రొక్క
తే. రమయెనరోక్కలు సేకొనె రాజముఖ్య
తదనుభావంబు గుణములుఁ దలఁపఁదరమె
యీధరారేణుపటలంబు నెఱుఁగవచ్చుఁ
గాని రావయ్య హరిగుణగణము సంఖ్య. 139

వ. తదనంతరంబ. 140

సీ. చ[illegible]స్సూనుండు చా[illegible]షుం డను వీరుఁ
డాఱవమను వయ్యె నవనినాథ!
భూమీశ్వరులు పురుః పురుషసుద్యుమ్నాదు
లాతనినందను లమరవిభుఁడు

మంత్రద్యుమ్నాఖ్యుఁ డమర్త్యులాప్యాదికు
లాహవిష్మద్వీరకాదిఘనులు
మను లందు విభుఁడు సంభూతికి వైరాజు
నకుఁ బుట్టి యజితుండు నాఁగ నొప్పె
ఆ. నతఁడ కాఁడె కూర్మమై మందరాద్రిని
నుదధి జలములోన నుండి మోచె
నతఁడు చువ్వె దివిజు లర్థింప నమృతాబ్ధిఁ
ద్రచ్చి యిచ్చె నా సుధారసంబు. 141

క్షీరసాగర మథన కథాప్రారంభము.

వ. అని పలికిన బరీక్షిన్నరేంద్రుండు మునీంద్రున కిట్లనియె. 142

మ. విను ము న్నేటికిఁ ద్రచ్చె పాలకడలిన్? విష్ణుండు గూర్మాకృతిన్
వనధిం జొచ్చి యదెట్లు మోచె? బలుకవ్వంబైన శైలంబు దే
వనికాయం బమృతంబు నెట్లు వడసెన్? వారాశి నేమేమి సం
జనితంబయ్యె? మునీంద్ర! చోద్యముగదా సర్వంబుఁ జెప్పంగదే.

క. అప్పటినుండి బుధోత్తమ!
చెప్పెడు భగవత్కథా విశేషంబులు నా
కెప్పుడుఁ దనవి జనింపదు
సెప్పఁగదే చెవులు నిండ శ్రీహరికథలున్. 144

వ. అని మఱియు నడుగంబడినవాఁడై యతని నభినందించి హరిప్రసంగంబు సెప్ప నుపక్రమించెను. అని సూతుండు ద్విజుల కిట్లనియె నట్లు శుకుండు రాజుంజూచి. 145

క. [1]కసిమసఁగి యసురవిసరము
[2]లసిలతికల సురల నెగవ నసువులు వెడలం
బసఁ జెడిరి పడిరి కెడసిరి
యసమసమరవిలసనముల [3]నసమెడలి నృపా! 146

1 విజృంభించి. 2 కత్తులు 3 అసము + వడలి = గర్వము తగ్గి, ఉత్సాహము చెడి లేక అవకాశము చెడి.

క. సురపతివరుణాదులతో
సురముఖ్యులు గొంద ఱరిగి సురశైలముపై
సురసుతుఁ డగు నజుఁ గని యా
సురదుష్కృతిఁ జెప్పిరపుడు సొలయుచు నతులై. 147

క. దుర్వాసుశాపవశమున
నిర్వీర్యత జగములెల్ల నిశ్శ్రీకములై
పర్వతరిపులోఁ గూడ న
పర్వము లయి యుండె హతసుపర్వావళులై. 148

ఆ. నెలవు వెడలివచ్చి నిస్తేజులై నట్టి
వేల్పుగములఁ జూచి వేల్పుఁ బెద్ద
పరమపురుషుఁ దలఁచి ప్రణతుఁడై సంఫుల్ల
పద్మవదనుఁ డగుచుఁ బలికెఁ దెలియ. 149

క. ఏనును మీరును గాలము
మానవతిర్యగ్లతాద్రుమస్వేదజముల్
మానుగ నెవ్వనికళలము
వానికి మ్రొక్కెదము గాక వగవఁగ నేలా! 150

క. వధ్యుండు రక్షణీయుఁడు
సాధ్యుఁడు మాన్యుఁ డని లేక సర్వత్రాణా
వధ్యాదు లొనర్చు సతం
[1]డాద్యంతవిధానమునకు సర్వుఁడు మనకున్. 151

క. వరదునిఁ బరము జగద్గురుఁ
గరుణాపరతంత్రు మనము గనుఁగొన దుఃఖ
జ్వరములు సెడు నని సురలకు
[2]సంసిజజని చెప్పి యజితుసదనంబునకున్. 152

వ. అంతఁ దానును దేవతాసమూహంబును నతిరయంబునం జని వినయంబునఁ గానంబడని యవ్విభు నుద్దేశించి దైవికంబులగు వచనంబుల నియతేంద్రియుండై యిట్లని స్తుతియించె. 153

---

1 ఆధి + అంత, విధానమునకున్ = సృష్ట్యాది వాని పనికి, 2 బ్రహ్మ.

సీ. ఎవ్వనిమాయకు నింతయుమోహించిఁ
దఱమి యెవ్వనిమాయ దాఁటరాదు
తనమాయ నెవ్వఁ డింతయు గెల్చినట్టివాఁ
డెవ్వనిఁ బొడగాన రెట్టిమునులు
సర్వభూతములకు సమవృత్తి నెవ్వఁడు
చరియించుఁ దనచేత జనితమయిన
ధరణి పాదములు చిత్తముసోముఁ డగ్నిము
ఖంబు గన్నులు సోమకమలహితులు

తే. చెవులు దిక్కులు రేతంబు సిద్ధజలము
మూఁడు మూర్తులపుట్టిల్లు మొదలి నెలవు
గర్భ మఖిలంబు మూర్ధంబు గగనమగుచు
మలయు నెవ్వఁడు వాని నమస్కరింతు. 154

వ. మఱియు నెవ్వని బలంబున మహేంద్రుండును బ్రసాదంబున దేవ
తలును గోపంబున రుద్రుండును బరుషంబున విరించియు నింద్రి
యంబులవలన వేదంబులును మునులును మేఢ్రంబునఁ బ్రజాప
తియును వక్షంబున లక్ష్మియు ఛాయ వలనఁ బితృదేవతలును
స్తనంబులవలన ధర్మంబును బృష్ఠంబువలన నధర్మంబును శిరంబు
వలన నాకంబును విహాసంబువలన నప్సరోజనంబులును ముఖంబు
వలన విప్రులును గుహ్యంబున బ్రహ్మంబును భుజంబులవలన
రాజులును బలంబును నూరువులవలన వైశ్యులును నైపుణ్యంబును
బదంబులవలన శూద్రులును నవేదంబును నధరంబును లోభంబును
నుపరిరదనచ్ఛదంబువలనఁ బ్రీతియు నాసాపుటంబు వలన ద్యుతియు
స్పర్శంబునఁ గామంబును భ్రూయుగళంబున యమంబును బక్ష్మం
బునఁ గాలంబును సంభవించె నెవ్వనియోగమాయానిర్మితంబులు
(జనితంబులు, విహితంబులు) ద్రవ్య వయః కర్మగుణ విశేషంబులు
చతుర్విధసర్గం బెవ్వనియాత్మతంత్రం బెవ్వనివలన సిద్ధించి లోకం
బులును లోకపాలురును బ్రతుకుచుందురు పెరుఁగుచుందురు దివిజు
లకు నాయువు నంధంబు బలంబునై నగంబులకు నీశుండై ప్రజలకుఁ

బ్రజనుండై ప్రజానవక్రియాకాండనిమిత్తసంభవుండగుజాతవేదుండై యంతస్సముద్రంబున ధాతుసంఘాతంబులం బ్రపచించు బ్రహ్మామయుండై ముక్తికి ద్వారంబై యమృతమృత్యుస్వరూపుండై చరాచరప్రాణులకుఁ బ్రాణంబై యోజస్సహోబలవాయురూపంబులైన ప్రాణేంద్రియాత్మశరీరకేతుండై పరమమహాభూతియగు నప్పరమేశ్వరుండు మాకుఁ బ్రసన్నుండగుంగాక యని మఱియును. 155

క. మొదల జలమిడిన భూజము
దుది నడుమను జల్లదనము దొరకొనుమాడ్కిన్
మొదలను హరికిని మ్రొక్కిన
ముద మొందుదు మెల్లవేల్పు మూకలు నేనున్. 156

క. ఆపన్నులగు [1]దిదృక్షుల
కోపుణ్యా! భవన్ముఖాబ్జ మొయ్యన తఱితోఁ
బ్రాపింపఁ జేయు సంపద
నో పరమదయానివాస! యుజ్జ్వలతేజా! 157

౬ అ ధ్యా య ము

వ. అని యిట్లు దేవగణసమేతుండై యనేకవిధంబులం గీర్తించుచున్న పరమేష్ఠి యందుఁ గరుణించి దయాంగరిష్ఠుండగు విశ్వగర్భుం డావిర్భవించె. 158

మ. ఒకవేయర్కులు గూడి గట్టి కదుపై యుద్యత్ప్రభాభూతితో
నొకరూపై చనుదెంచుమాడ్కి హరి దా నొప్పారె నావేలుపుల్
వికలాలోకనులై విషణ్ణమతులై విభ్రాంతులై మ్రోలఁ గా
నక శంకించిరి కొంతప్రొద్దు విభుఁ గానంబోలునే వారికిన్.

వ. అప్పుడు. 160

సీ. హారకిరీటకేయూరకుండలపాద
కటకకాంచీలతాకంకణాది

[1] దర్శనము కోరువారు.

కౌస్తుభోపేతంబుఁ గౌమోదకీశంఖ
చక్రశరాసనసంయుతంబు
మరకతశ్యామంబు సరసిజనేత్రంబుఁ
గర్ణాభరణకాంతి గండయుగముఁ
గలితకాంచనవర్ణ కౌశేయవస్త్రంబు
శ్రీవనమాలికాసేవితంబు
ఆ. నై మనోహరంబు నై దివ్యసౌభాగ్య
మైన యతనిరూపు హర్షమెసఁగఁ
జూచి బ్రహ్మ హరుఁడు సురలును దానును
బొంగి నమ్రుఁడగుచుఁ బొగడఁ దొడఁగె. 161

క. జననస్థితిలయదూరుని
మునినుతు నిర్వాణసుఖసముద్రుని సుగుణుం
[1]దనుతనునిఁ బృథుల పృథులుని
సనఘాత్ము మహానుభావు నభినందింతున్. 162

క. పురుషోత్తమ! నీ రూపము
పరమశ్రేయంబు భువనపంక్తుల కెల్లన్
[2]స్థిర వైదిక యోగంబున
వరుసను మీయంద కానవచ్చును మాకున్. 163

క. మొదలును నీలోఁ దోఁచెను
దుదియును నటఁ దోఁచె నడుమ దోఁచెను నీవే
మొదలు నడుమ దుది సృష్టికిఁ
గదియఁగ ఘటమునకు మన్ను గతియగు మాడ్కిన్. 164

క. నీ మాయచేత విశ్వము
వేమాఱు సృజింతు వనుచు విష్ణుఁడవనుచున్
ధీమంతులు గుణపదవిని
నేమంబున సగుణుఁడైన నినుఁ గాంతు రొగిన్. 165

1 అణువు కంటెను నణువు, మహత్తుకంటె మహత్తు. 2 చెదరని వేదోక్తమైన సమాధిచే.

ఆ. అన్న మవనియందు, నమృతంబు గోవుల
యందు, వహ్ని సమిధ లందు నమర
యోగవశతఁ బొందు నోజను బుద్ధిచే
నగుణు నిన్నుఁ గాంతు రాత్మవిదులు. 166

మత్తకోకిలము.

పట్టులేక బహుప్రకారవిపన్నచిత్తుల మైతిమే
మెట్టకేలకు నిన్నుఁ గంటి మభీప్సితార్థము వచ్చుఁ బె
న్నెట్టయైన దవానలంబున వేఁగు నేనుఁగు మొత్తముల్
నిట్టవేర్చిన గంగలోపల నీరుగాంచిన చాడ్పునన్. 167

మత్తకోకిలము.

నీకు నేమని విన్నవింతుము నీవు సర్వమయుండ వై
లోకమెల్లను నిండియుండఁగ లోకలోచన! నీ పదా
లోకనంబు శుభంబు మాకును లోకపాలకు లేను నీ
నాకవాసులు నీవ వహ్నిఁ దనర్చు [1]కేతుతతిక్రియన్. 168

వ. అని కమలసంభవప్రముఖులు వినుతిసేసి రని చెప్పి నరేంద్రు
నకు శుకుం డిట్లనియె. 169

శా. ఈరీతిం జతురాననాదినుతుఁడై యేపార [2]జీమూతగం
భీరంబైన రవంబునం బలికె సంప్రీతాత్ముఁడై యీశ్వరుం
డారోహాంచితకాయులన్ ననవిముక్తాపాయులం [3]బ్రియులం
బారబ్ధాగ్రిమహాద్ర్యవోన్మథనవాంఛానల్పులన్ వేల్పులన్. 170

క. ఓనలువ ! యోసురేశ్వర !
యోనిటలతటాక్ష ! యోసురోత్తములారా !
దానవులతోడ నిప్పుడు
మానుగ బోరామిఁగలిగి మనుఁడీ యొప్పున్. 171

వ. అది యెట్లంటిరేని. 172

1 కేతుతతిక్రియన్ = కాంతి సమూహము వలె. 2 మేఘమువలె గంభీరముగా
నున్న. 3 ప్రేమపాత్రులు.

క. ఎప్పుడు జనకుడు సత్త్వము
దొప్పడు నందాఁక రిపులఁ జూచియుఁ దనలోఁ
గప్పికొని యుండవలయును
నొప్పుగ నహిమూషకమున కొదిఁగిన భంగిన్. 173

క. అమృతోత్పాదన యత్నము
విమలమతిం జేయుటొప్పు వేల్పులు వినుఁడీ!
యమృతంబుఁ ద్రావి జంతువు
లమృతగతిన్ బ్రదుకుచుండు నాయుర్వృద్ధిన్. 174

సీ. పాలమున్నీటిలోపల సర్వతృణలతౌ
షధములు దెప్పించి చాలవైచి
మందరశైలంబు మంథానముగఁ జేసి
తనర వాసుకిఁ దరి త్రాడు సేసి
నా సహాయతచేత నలి నందఱును మీరు
తరువుఁడు వేగమ తంద్రు లగుచు
ఫలము మీఁదయ్యెడు బహుళదుఃఖంబులఁ
బడుదురు దైత్యులు పాపమతులు

ఆ. అలసటేమి లేక యఖిలార్థములుఁ గల్గు
[1]విషధిలోన నొక్క విషము పుట్టుఁ
గలఁగి వెఱవ వలదు కామరోషంబులు
వస్తుచయమునందు వలదుచేయ. 175

వ. అని యాదేశించి. 176

క. అంతాదిరహితుఁ డచ్యుతుఁ
డంతర్ధానంబు నొందె నజఫాలాక్షుల్
సంతోషంబునఁ దమతమ
కాంతాలయములకుఁ జనిరి గౌరవ మొప్పన్. 177

1 నీరధి (సముద్రము) (విషము=నీరు)

క. కయ్యంబు సేయ నొల్లక
నెయ్యంబున నతులు వెట్టి నిర్జరనికరం
బియ్యప్పనములు వెట్టుచుఁ
దియ్యంబునఁ గొల్చె బలిని దేవద్వేషిన్. 178

క. పస సెడి తనకును వశమై
సుసరముతో గొల్చుచున్న సురసంఘములన్
గసిమసఁగి చంపఁ బూనిన
నసురుల వారించె బలియు నతినయయుక్తిన్. 179

వ. అట్లు వారించి వైరోచని రాక్షససముదయంబున కిట్లనియె. 180

క. పగవారు శరణు చొచ్చిన
మగతనములు నెఱపఁ దగదు మగవారలకున్
దగు సమయ మెఱుఁగ వలదే
మగటిమిఁ బాటింప వల దమర్త్యులతోడన్. 181

వ. అని పలికి కొలువు కూటంబున సురనికరపరివృతుండై నిఖిలలోక రాజ్యలక్ష్మీసహితుండై యఖిలవిబుధవీరవిజయాహంకారనిజాలంకారుండై సుఖంబునం గొలువున్న విరోచననందనుం గని శచీ విభుం డుత్తమ సచివుండును బోలె సాంత్వవచనంబుల శాంతిం బొందించి పురుషోత్తమశిక్షితంబైన నీతిమార్గంబున శంబరునికిం బ్రియంబు సెప్పి యరిష్టనేమి ననునయించి త్రిపురవాసులగు దానవుల నోడంబఱచి జంభునిసమ్మతంబు సేసికొని హయగ్రీవుని [2]విగ్రహంబు మాన్చి నముచితారకబాణాసురులతో సఖ్యంబు నెఱపి విప్రచిత్తికిం బొత్తు హత్తించి శకునివిరోచనప్రహేతులకుఁ బోరామి సూపి మయమాలిసుమాలిప్రముఖులకు మైత్రి యెఱింగించి కుంభనికుంభులకు సౌజన్యంబుఁ గైకొలిపి పౌలోమకాల

1 సుసరము = మంచినడతతో 2 వైరము.

కేయనివాతకవచాదులయెడ బాంధవంబు ప్రకటించి వజ్రదంష్ట్రికి నశక్తుండై యితర దానవదైత్యసమూహంబువలన నతిస్నేహంబు సంపాదించి మనకు నక్కసెలియంద్రబిడ్డలకు [1]నోడ్డారంబు లేమిటికి నేకకార్యపరత్వంబున నష్టంబులేక బ్రిమకుద మన్యోన్యవిరోధంబులేల? తొల్లి యన్యోన్యవిరోధంబున నలంగితి మిదిమొదలు దనుజదివిజసముదయంబులకు రాజు విరోచననంద నుండ. మనమందఱు మతని పంపు సేయంగలవారము. ఉభయకులంబును వర్ధిల్లునట్టి యుపాయం బెఱింగింతు నని యమృతజలధి మథన ప్రారంభకథనంబు దెలియంజెప్పె. అట్లు సురాసురయూథంబులు బలి బలారాతిప్రముఖంబులై పరమోద్యోగంబున సుధాసంపాద నాయత్తచిత్తులై యైకమత్యంబు నొంది యమందగమనంబున మందర నగంబునకుం జని. 182

సీ. [2]వాసవవర్ధకి వాఁడిగాఁ [3]జఱచిన
కుద్దాలముఖములఁ గొంత దవ్వి
ముసలాగ్రముల సొన్పి మొదలిపాఁతగలించి
దీర్ఘపాశంబులఁ ద్రిండు సుట్టి
పెకలించి బాహుల బీడించి కదలించి
పెల్లార్చి తమతమ పేరు వాడి
పెఱికి మీఁదికినెత్తి పృథులహస్తంబులఁ
దలల భుజంబులఁ దరలకుండ

తే. నాని మెల్లన [4]కుఱుతప్పు టడుగు లిడుచు
భార మధికంబు మఱవక పట్టుఁ డనుచు
మందరనగంబుఁ దెచ్చి రమందగతిని
దేవదైత్యులు జలరాశి దెరువువట్టి. 183

క. మందరము మోవనోపమి
నందఱుపైఁ బడియె నదియు నతి చోద్యముగాఁ

1 ఒడ్డారంబులు = పంతములు (ప్రతిస్పర్ధలు) 2 ఇంద్రశిల్పి (విశ్వకర్మ) 3 సాఁగఁగొట్టిన. 4 కుఱు తప్పుటడుగులు = కుఱుచయొక్క రూపాంతరము కుఱు శబ్దము. (చిన్న చిన్న తప్పుటడుగులు)

గొందఱు నేలం గలిసిరి
కొందఱు నుగ్గయిరి చనిరి కొందఱు భీతిన్. 184

క. ఏలా హరికడ కేఁగితి
మేలా దొరఁకొంటి మధికహేలన శైలో
న్మూలనము సేసి తెచ్చితి
మేలా పెక్కండ్రు మడిసి రేలా నడుమన్. 185

క. ఏటికి మముఁ బనివంచెను
నేటికి దమబోఁటివారి కింతలు పను లిం
కేటికి రాఁడు రమేశ్వరుఁ
డేటి కుపేక్షించె మఱవ నేటికి మనలన్. 186

వ. అని [1]కులకుధరపతనజన్యంబగు దైన్యంబు సహింపనోపక పల
వించుచున్న దివిజదితిజులభయంబు మనంబున నెఱింగి సకల
వ్యాపకుండగు హరి తత్సమీపంబున. 187

మ. గరుడారోహకుఁడై గదాదిధరుఁడై కారుణ్యసంయుక్తుఁడై
[2]హరికోటిప్రభతో నొహో వెఱవకుం డంచుం బ్రదీపించి త
ద్గిరిఁ గేలన్ సలువొంద గందుకము మాడ్కిం బట్టి క్రీడించుచు
న్గరుణాలోకసుధన్ సురాసురుల ప్రాణంబుల్ సమర్థించుచున్.

క. వారలు గొలువఁగ హరియును
[3]వారాన్నిధి కరుగు మనఁగ వసుధాధరమున్
వారిజనయనునిఁ గొంచు న
వారితగతిఁ జనియె విహగవల్లభుఁ డఱుతన్. 189

క. చని జలరాశితటంబున
వనజాక్షుని గిరిని డించి వందనములు స
ద్వినుతులు సేసి ఖగేంద్రుఁడు
[4]పనివినియెను భక్తినాత్మ భవనంబునకున్. 190

వ. అప్పుడు. 191

---

1 కులపర్వతముయొక్క 2 హరికోటి = కోటిమంది సూర్యులయొక్క, ప్రభతో = ప్రకాశముతో 3 సముద్రము. 4 సెలవు పుచ్చుకొనెను.

౭ అధ్యాయము.

సీ. భూనాథ! వినవయ్య భోగీంద్రు వాసుకిఁ
బిలిపించి యతనికిఁ బ్రియము సెప్పి
ఫలభాగ మీ నొడఁబడి సమ్మతునిఁ జేసి
మెల్లన చేతుల మేను నివిరి
నీవకా కెవ్వరు నేర్తు రీపని కియ్య
కొమ్మని యతని నైకోలు వడసి
కవ్వంపుఁగొండ నిష్కంటకంబుగఁ జేసి
ఘూర్ణించి యతని భోగంబుఁ జుట్టి
ఆ. కడఁగి యమృతజలధిఁ గలశంబుఁ గావించి
త్రచ్చు నవసరమునఁ దలఁపు లమర
బద్ధవస్త్ర కేశభారులై యారెండు
గములవారు తరువఁ గదిసి రచట. 192

వ. తదనంతరంబ. 193

క. హరియును దేవానీకము
నురగేంద్రునితలలు పట్ట నుద్యోగింపన్
హరిమాయాపరవశులై
సురవిమతులు కూడి పలుకఁ జొచ్చిరి కడిమిన్. 194

మత్తకోకిలము.
స్వచ్ఛమైన ఫణంబు మీరలు సక్కఁ బట్టి మథింపఁగాఁ
బుచ్ఛ మేటికి మాకుఁ బట్టఁగ బూరుషత్వము గల్గి మే
మచ్చ మైన తపోబలాఢ్యయనాన్వయంబులవార మై
యిచ్ఛయింతుమె తుచ్ఛవృత్తికి నిందు మాను ఫణాగ్రముల్. 195

వ. అని పలుకు దనుజులం జూచి. 196

క. విస్మయముఁ బొంది దానవ
ఘస్మరుఁ డహిఫణము విడువఁ గైకొని యసురుల్
విస్మితముఖులై యార్చి ర 197
విస్మితముగఁగొనిరి సురలు వీఁకం దోఁకన్.

వ. ఇట్లు సముత్కర్షణసాహాయ్యభాగసన్నయంబు తేర్పఱచుకొని దేవతలు పుచ్ఛంబును బూర్వదేవతలు ఫణంబులుం బట్టి పయోరాశి మధ్యంబునం బర్వతంబు నెట్టి పరమాయత్తచిత్తులై యమృతార్థంబు త్రిప్పుచున్న సమయంబున. 198

క. విసు విసుఁడని ఫణి పలుకఁగఁ
గడుభరమున మొదలఁ గుదురు గలుగమి ¹గడనై
బుడబుడరవమున నఖిలము
వడవడ వడఁకఁగ మహాద్రి వార్ధి మునింగెన్. 199

ఉ. గౌరవమైన భారమునఁ గవ్వపుఁగొండ ధరింప లేక దో
స్సారవిహీనులై యుభయసైనికులుం గనుసిగ్గుతో ²నకూ
పారతటంబునం బఱిరి పౌరుషముం జెడి పాండవేయ యె
వ్వారికి నేరఁబోలు బలవంతపు దైవము నాక్రమింపఁగన్. 200

క. వననిధిజలములలోపల
మునిఁగెడి గిరిఁ జూచి దుఃఖమునఁ జింతాబ్ధిన్
మునిఁగెడి వేల్పులఁ గనుఁగొని
వనజాక్షుఁడు వార్ధినడుమ వారలు సూడన్. 201

కూ ర్మా వ తా ర క థా ప్రా రం భ ము.

సీ. ³సరసనై లక్షయోజనముల వెడలుపై
కడుఁ గఠోరము నైన ⁴కర్పరమును
నద నైన బ్రహ్మాండ మైన నాహారించు
ఘనతరం బగు ముఖగహ్వరంబు
సకలచరాచర జంతురాసుల నెల్ల
మ్రింగి లోఁగొను నట్టి మేటికడుపు
విశ్వంబుపై నేఱు విశ్వంబుపైఁ బడ్డ
నాఁగినఁ గదలని యట్టికాళ్ళు

తే. వెలికి లోనికిఁ జనుదెంచు విపులతుండ
మంబుజంబులఁ బోలెడు నక్షియుగము

---

1 కడవు + ఐ = ఒఱగఁబడినదై 2 సముద్రతీరమునందు 3 చదునైనదై 4 తాబేటి వెన్నుచిప్ప.

సుందరంబుగ విష్ణుండు సురలతోడి
కూర్మి నెలుపొంద నొకమహాకూర్మ మయ్యె. 202

మ. కమఠంబై జలరాశిఁ జొచ్చి లఘుముక్తాశుక్తిచందంబునన్
సమదద్రీంద్రము నెత్తి వాసుకి మహానాగంబుతో లీలతో
నమరేంద్రాదులు వాళికంపములతో నానాఁగదే బాపురే
కమలాక్షా! శరణంచు భూదిశలు నాకాశంబునుం ద్రోయఁగన్.

వ. ఇవ్విధంబున. 204

క. తరిగాండ్రలోన నొకఁ డట
[1]తరిగడవకుఁ గుదురు నాఁక త్రాడఁట చేరుల్
దరిగవ్వంబును దానఁట
హరిహరి హరిచిత్రలీల హరియే యెఱుఁగున్. 205

ఆ. జలధిఁ గడవసేయ శైలంబుఁ గవ్వంబు
సేయ భోగిఁ ద్రాడు సేయఁ దరువ
సిరియు సుధయుఁ బడయ శ్రీవల్లభుఁడుఁ దక్క
నొరుఁడు శక్తిమంతుఁ డొండు గలఁడె. 206

ఆ. గొల్లవారిబ్రదుకు గోఱఁ దనవచ్చునె
గొల్లరీతిఁ బాల కుప్ప ద్రచ్చి
గొల్లలైరి సురలు గొల్లయ్యె విష్ణుండు
సేటు లేనిమందు సిరియుఁ గనిరి. 207

వ. ఇట్లు సురాసురయూథంబులు హరిసనాథంబు లయి కవచంబులు [2]నెట్టంబులు వెట్టికొని పుట్టంబులు పిరిచుట్లు సుట్టికొని కరంబులుఁ గరంబుల నప్పళించుచు భుజంబులు భుజంబుల నొరయుచు లెండు లెండు దరువఁ దొడంగుఁడు రండని యమందగతిం బెరుగుఁద్రచ్చు మందగొల్లలచందంబున మహార్ణవమధ్యంబున మంథాయమాన మందరమహీధరవిలగ్నభోగిభోగాద్యంతంబులం గరంబులం జేమల్చుచుఁ బెనుబొబ్బలం బ్రహ్మాండకటాహంబు నిర్భరంబయి గుబ్బు గుబ్బని యురులు కొండకవ్వంబుగుత్తి జిఱజిఱం దిరుఁగు వేగంబున

1 పెరుగు త్రచ్చు కడవ 2 గుండ్రపాగలు (శిరస్త్రాణము)

ఛటచ్ఛాయమానంబులును బుగులుబుగుల్లను చప్పుళ్లప్పరం
బెగసి లెక్కకు మిక్కిలి చుక్కల కొమ్మల చెక్కుల [1]నిక్కలువడు
మిసిమిగల మీఁది మీఁగడ పాలతేట నిగ్గుఁ దుంపరలపరంపరల
వలన నిజకరక్రమక్రమాకర్షణపరిభ్రాంతఫణిఫణాగర్భసముద్భూత
నిర్భరవిషకీలికీలాజాలంబుల నప్పటప్పటికి నుప్పతిల్లిన దప్పిం గొం
డొకమందగతిం జెందక యకూపారవేలాతటకుటజకుసుమగుచ్ఛ
పిచ్ఛిలస్వచ్ఛమకరందసుగంధిగంధవహంబులం గ్రొంజెమట నీటి
పెనువఱదగము లొత్తిళ్ళనిగుర నొండొరులం బరిహసించుచుఁ [2]బేరు
వాడి విలసించుచు మేలు మేలని యుగ్గడించుచుఁ గాదు కాదని
భంగించుచు నిచ్చ మెచ్చని మచ్చరంబులవలన వనధినలమాన
వైశాఖవసుంధరాధరపరివర్తనసముజ్జనితఘుమఘుమారావంబును
మథనగుణాయమానమహాహీంద్రముఖముహుర్ముహురుచ్ఛలిత
భూరిఘోరఫూత్కారఘోషంబును గులకుధరపరిక్షేపణాక్షోభిత
సముల్లంఘనసమాకులితంబులై వెఱచఱచిగుబురుగుబురులైయొరలు
కమఠ కర్కట కాకోదర మకర తిమి తిమింగిల మరాళ చక్రవాక
బలాక భేక సారసానీకంబుల మొఱలునుం గూడికొని
ముప్పిరిగొని దనుజదివిజభటాట్టహాసతర్జనగర్జనధ్వనులు [3]నలుపురియై
మొత్తినట్లైన దిశదిగంతభిత్తులను బేఁర్చెత్తి పెల్లగిలం ద్రుళ్ళుచుఁ
గకురు పొడుచుచు నొకఁడొకనికంటె నదియునుం గడపుచుం గలు
గఁ ద్రిచ్చుచుఁ బంతంబు లిచ్చుచు సుధాజననంబుఁ జింతించుచు
నూతనపదార్థంబులకు నెమళ్ళు సూచుచు నెంతపడవు ద్రొత్తుమని
హారి నడుగుచు నెడపడనిశ్రమకంబుల నంతకంతకు మురువు డింపక
త్రిచ్చు సమయంబున. 207

క. అప్పాలవెల్లిలోపల
నప్పటికప్పటికి మందరాగము దిరుగం

---

1 స్థానములు పడు (గుర్తులుపడు) 2 పేరువాడి = నామోద్ఘాటనము చేసి, నేను ఫలానా యని ఆత్మోత్కర్షకు గానుబేరు చెప్పికొని 3 నలువురియై = పెనవేసికొని (సమ్మరముయి) (పెనగొని)

జిహ్వానము నిండె నజాండము
సెప్పెడి దే మఱునచెవులు సింపుఱ గనియెన్. 209

వ. అంత నప్పయోరాశిమధ్యంబున. 210

క. ఎడమం గుడి మునుపు దిరుగుచు
గుడి నెడమను వెనుకఁ దిరుగఁ గులగిరి గ్రక్కిం
గడలెడల సురలు నసురులుఁ
దోడితోడి ఫణిఫణము మొనలుఁ దుమికియు దిఁగవన్. 211

క. వడిగొని కులగిరిఁ దరువఁగ
జడనిధి ఖగమకరకమఠఝషఫణిగణముల్
సుడివడఁ దడఁబడఁ గలఁకుల
బడు భయపడి నెగసి బయలఁ బడు నరలిపకా. 212

క. అమరాసురకరపరి
భ్రమణాధరాధరపరేంద్రభ్రమణం బను దాఁ
గమఠేంద్రువీపు తీఁటను
శమియింపఁగఁ జాలదయ్యె జగతీనాథా! 213

వ. తదనంతరంబ. 214

క. ఆలోలజలధిలోపల
నాలో నహి విడిచి సురలు నసురులుఁ బఱవం
[1]గీలాకోలాహలమై
హాలాహలవిషము పుట్టె నవనీనాథా! 215

వ. అదియునుం బ్రళయకాలాభీలఫాలలోచనలోచనానలశతంబు చం
దంబున నమందంబై విలయదహనసహస్రంబులైనకి వడ్డై, కడ
పటి పట్టపగలింటి వెలుంగుల లక్ష తెఱంగున దుర్లక్షితంబై,
తుది రేయి కలిసిన మొగులుగములవలసంబడు బలుచీఁకటుల
వడువున బెడిదంబై, పంచభూతంబులుం దేజోరూపంబులైన
చాడ్పున దుస్సహంబై, భుగభుగాయమానంబులైన పొగలును

1. మంటలచే పెద్ద రొదకలదై.

చిటచిటాయమానంబులైన విస్ఫులింగంబులును ధగధగాయమానంబులైన కెంజిమంటలును గలిగి, మహార్ణవమధ్యంబున మందరనగంబు మంథరంబుగం దిరుగుచుండ జనియించి పటపటాయమానంబై నింగికిం బ్రాంగి దిశలకుం గేలుసాచి బయళ్ళు ప్రబ్బికొని తరిగవ్వంపుం గొండ సంకగొనక నిగిడి, కడలి నలుగడలకుం బఱచి నరుల కులికి సురాసురసముదయంబులం దరికొని గిరివరగుహాగహ్వరంబుల సుడివడక కులశిఖరిశిఖరంబుల [1]నెరగలివడి గహనంబులదహించి కుంజమంజరీపుంజంబుల భస్మంబుసేసి జనపదంబు లేర్చి నదీనదంబు లెరియించి దిక్కుంభికుంభంబులు నిక్కలువడ నిక్కి తరణితారామండలంబులపై మిట్టించి మహర్లోకంబు దరికొని యుపరిలోకంబునకు [2]మూలుగొనలిడి సుడివడి మునుకొని బ్రహ్మాండకోశంబు సిటిలిపడక చాటి పాతాళాది లోకంబులకు ప్రేల్వాటి సర్వలోకాధికంబై శక్యంబుగాక యెక్కడం జూచినం దానయై, కురంగంబు క్రియం గ్రేళ్ళుఱుకుచు, భుజంగంబు విధంబున నోడియుచు, సింగంబు భంగి లంఘించుచు, విహంగంబు పగిది నెగయుచు, మాతంగంబు పోలికి నిలువంబడుచు, నిట్లు హాలాహలవిషానలంబు జగంబులం గోలాహలంబు సేయుచున్న సమయంబున [3]పొలసు పొగల మిడుంగుజాలకు నిల్వక దేవతలును, నేలం గూలిన రక్కసులును, మ్రగ్గిన తారకలును, గిటడంగిన కిన్నరమిథునంబులును, గమరిన గంధర్వవిమానంబులును, జీకాకుపడిన సిద్ధచయంబులును, జిక్కువడిన గ్రహంబులును, జెందజెవందలయిన వర్ణాశ్రమంబులును, నిగిరిపోయిన నదులును, నింకిన సముద్రంబులును, గాలిన కాననంబులును, బ్రాగిలిన పురంబులును, బ్రానుంగుపడిన పురుషులును, బ్రాక్కపడిన పుణ్యాంగనాజనంబులును, బగిలిపడిన పర్వతంబులును, భస్మంబులైన ప్రాణిసంఘంబులును, వేగిన లోకంబులును, వివశలైన దశలును, నొడ్డగెడపులైన భూజచయం

1. కాల్పుచు. 2. అలముకొని (శాఖోపశాఖలుగా నిస్సరిల్లి). 3. పొలసు[illegible]ంచు, పొగలన్ జ్వాలలయందు.

బలువు, నటవటలైన భూములును, నైయకాలనిలయకాలంబై
తోఁచుచున్న సమయంబున. 216

క. [1]ఒడ్డారించి విషంబున
కడ్డము చనుదెంచి కావ నధికులు లేమిన్
[2]గొడ్డేటి మ్రింది రాలన
బిడ్డన నెడలేక జనులు పృథ్వీనాథా! 217

వ. అప్పుడు. 218

మ. చని కైలాసముఁ జొచ్చి శంకరుని వాసద్వారముం జేరి యీ
శుని దౌవారికు లడ్డపడ్డఁదల మంచుం జొచ్చి కుయ్యో మొఱో
విను మాలింపుము చిత్తగింపుము దయన్ వీక్షింపుమం చంబుజా
సనముఖ్యుల్ గని రార్తరక్షణకళాసంరంభునిన్ శంభునిన్. 219

క. వారలు దీనతవచ్చుటఁ
గూరిమితో నెఱిఁగి దక్షుకూఁతురుఁ దానుం
జేరోలగమున నుండి ద
యారతుఁడై చంద్రచూడుఁ డవసర మిచ్చెన్. 220

వ. అప్పుడు భోగిభూషణునకు సాష్టాంగదండప్రణామంబులు గావించి
ప్రజాపతిముఖ్యు లి ట్లని స్తుతించిరి. 221

సీ. భూతాత్మ! భూతేశ! భూతభావనరూప!
దేవ! మహాదేవ! దేవవంద్య!
యీలోకముల కెల్ల నీశ్వరుండవు నీవ
బంధమోక్షములకుఁ బ్రభుఁడ వీవ
యార్తశరణ్యుండ వగు గురుండవు నిన్నుఁ
గోరి భజింతురు కుశలమతులు
సకలసృష్టిస్థితిసంహారకర్తవై
బ్రహ్మవిష్ణుశివాఖ్యఁ బరఁగు దీవు

1. ప్రతిఘటించి (ఎదురుకొని). 2. గుత్తగొని.

ఆ. పరమగుహ్య మయిన బ్రహ్మంబు సదసత్త్వ
మంబు నీవ శక్తిమయుఁడ వీవ
శబ్దయోని వీవ జగదంతరాత్మవు
నీవ ప్రాణ మరయ నిఖిలమునకు. 222

క. నీయంద సంభవించును
నీయంద వసించి యుండు నిఖిలజగములున్
నీయంద లయముఁ బొందును
నీయుదరము సర్వభూతనిలయము రుద్రా! 223

సీ. అగ్నిముఖంబు పరాపరాత్మక మాత్మ
కాలంబు గతి, [1]రత్నగర్భ పదము,
శ్వసనంబు నీయూర్పు, [2]రసన [3]జలేశుండు,
దిశలుఁ గర్ణంబులు, దివము నాభి,
సూర్యుండు గన్నులు, శుక్లంబు సలిలంబు,
జఠరంబు జలధులు, సదలు శిరము
సర్వౌషధులు రోమచయములు, శల్యంబు
లద్రులు, మానస మమృతకరుఁడు,

తే. ఛందములు ధాతువులు, ధర్మసమితి హృదయ,
మాస్యపంచక ముపనిష దాహ్వయంబు,
నయిన నీరూపు పరతత్త్వ మై. శివాఖ్య
మై స్వయంజ్యోతియై యొప్పు నాద్య మగుచు. 224

క. కొందఱు గలఁ డందురు నినుఁ
గొందఱు లేఁడందు రతఁడు గుణిగాఁ డనుచుం
గొందఱు గలఁ డని లేఁ డని
కొందల మందుదురు నిన్నుఁ గూర్చి మహేశా! 225

సీ. తలఁపఁ బ్రాణేంద్రియద్రవ్యగుణస్వభా
వుఁడవు కాలక్రతువులును నీవ

1 భూమి. 2 నాలుక. 3 వరుణుఁడు.

¹సత్యంబు ధర్మ మక్షరము ²ఋతంబును
    నీవ ముఖ్యుండవు నిఖిలమునకు
ఛందోమయుండవు సత్త్వరజస్తమ
    శ్చక్షుండవై యుందు సర్వరూప!
కామపురాధ్వరకాలగరాదిమహా
    తద్రోహభయము చోద్యంబుగాదు

తే. లీల లోచనవహ్నిస్ఫులింగశిఖల
నంతకాదులఁ గాల్చిన యట్టినీకు
రాజఖండావతంస! పురాణపురుష!
దీనరక్షక! కరుణాత్మ! దేవ దేవ! 226

ఆ. మూఁడుమూర్తులకును మూఁడులోకములకు
మూఁడుకాలములకు మూలమగుచు
భేద మగుచుఁ దుది నభేదమై యొప్పారు
బ్రహ్మమనఁగ నీవ ఫాలనయన! 227

క. సదసత్తత్త్వపరాపర
సదనం బగు నిన్నుఁ బొగడ జలజభవాదుల్
వెదవ్రులుఁ గదలుప నెఱతురు
వదలక నినుఁ బొగడ నెంతవారము రుద్రా! 228

మత్తకోకిలము.
బాహుశక్తిసురాసురుల్ సని పాలవెల్లి మథింప హా
లాహలంబు జనించె నేరి కలంఘ్యమై భువనంబు గో
లాహలంబుగఁ జేసి చిచ్చును ³లాగముంగొని ప్రాణిసం
దోహముం బ్రదికింపవే దయ దొంగలింపఁగ నీశ్వరా! 229

క. ⁴లంపటము నివారింపను
సంపదఁ గృప సేసి జయము సంపాదింపం

1 సత్యము_విహితమైన యాగము. 2 ఋతము = అవిహిత [illegible]. 3. చుల్కన (లాఘవము, లఘుత్వము) 4. ఆపద (శ్రమ) సక్కి గుర్తి [illegible] ము [illegible] జెప్పవచ్చును.

జంపెడివారి సహింపను
సొంపారఁగ నీక చెల్లు సోమార్ధధరా! 230

క. నీకంటె నొండెఱుంగము
నీకంటెం బరులు గావ నేరరు జగముల్
నీకంటె నొడయఁ డెవ్వఁడు
లోకంబుల కెల్ల నిఖిలలోకస్తుత్యా! 331

వ. అని మఱియు నభినందించుచున్న ప్రజాపతిముఖ్యులం గని సకల భూతసముండగు సర్వదేవుండు దనప్రియసతి కిట్లనియె.

శివుండు దేవప్రార్థితుండై హాలాహలమును బానము సేయుట.

క. కంటే జగముల దుఃఖము
వింటే జలజనితవిషము వేఁడిమి ప్రభవై
యుంటకు నార్తులయాపద
గెంటింపఁగ ఫలము గాదె కీర్తి మృగాక్షీ! 2?3

క. ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన
ప్రాణుల రక్షింపవలయుఁ బ్రభువుల కెల్లం
బ్రాణుల కీశ్వరు నాథులు
ప్రాణంబులు నిమిషభంగురము లని మగువా! 234

క. పరహితము సేయు నెవ్వఁడు
పరమహితుం డగును భూతపంచకమునకుం
బరహితమె పరమధర్మము
పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ! 235

క. హరి మది నానందించిన
హరిణాక్షీ! జగంబు లెల్ల నానందించున్
హరియును జగములు మెచ్చఁగ
గరళము వారించు టొప్పుఁ గమలదళాక్షీ! 236

క. శిక్షింతు హాలహలమును
భక్షింతును మధురసూక్ష్మఫలరసము క్రియన్

రక్షింతుఁ బ్రాణికోట్లను
వీక్షింపుము నీవు నేఁడు వికచాబ్జముఖీ! 237

వ. అని పలికిన ప్రాణవల్లభునకు వల్లభ దేవా! దేవరచిత్తంబు కొలంది నవధరింతుగాక యనిపలికె నని చెప్పిన నమ్మునీంద్రుం డిట్లనియె.

మ. అమరన్ లోకహితార్థమంచు నభవుండే గాకయంచాడెఁ బో యమరుల్ భీతిని మ్రింగవే యనిరి వో యంభోజగర్భాదులుం దముఁగావన్ హరలెమ్ము లెమ్మనిరి వో తాఁ జూచి కన్గంట న య్యుమ ప్రాణేశ్వరునెట్లు మ్రింగుమనె నయ్యుగ్రానలజ్వాలలన్.

వ. అనిన శుకుం డిట్లనియె. 240

క. మ్రింగెడువాఁడు విభుం డని
మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగు మనె సర్వమంగళ
మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో. 241

మ. తనచుట్టున్ సురసంఘముల్ జయజయధ్వానంబులన్ బొబ్బిడన్ ఘనగంభీరరవంబుతో శివుఁడు లోకద్రోహి హుం పోకు ర మ్మని కెంగేలఁ దెమల్చి కూర్చి [1]కడిగా సంకించి జంబూఫలం బని సర్వంకషమున్ మహావిషము నాహారించె హేలాగతిన్. 242

వ. అయ్యవిరళమహాగరళదహనపానసమయంబున. 243

మ. కదలం బాఱవు పాఁపపేరు లొడలన్, ఘర్మాంబుజాలంబు పుట్టదు, నేత్రంబులు నెఱ్ఱగావు, నిజజూటచంద్రుఁడుం గందఁడున్, వదనాంభోజము వాడ, దావిషము నాహ్వానించుచో డాయుచోఁ బదిలుండై కడిసేయుచోఁ దిగుచుచో భక్షించుచో మ్రింగుచోన్.

క. ఉదరము లోకంబులకును
సదనంబగు టెఱిఁగి శివుఁడు చటులవిషాగ్నిం
గుదురుకొనఁ గంఠబిలమునఁ
బదిలంబుగ నిలిపె సూక్ష్మఫలరసముక్రియన్. 245

1. ముద్దగా.

క. మెచ్చిన మెచ్చుఁగ గలిగిన
నిచ్చిన నీ వచ్చుఁగాక యిచ్చ నొరులకుం
జిచ్చుఁ గడిఁగొనఁగ వచ్చునె
[1]చిచ్చఱరూ పచ్చపడిన శివునకుఁ దక్కన్. 246

ఆ. హరుఁడు గళమునందు హాలాహలము వెట్టఁ
[2]గప్పుఁ గలిగి తొడవు కరణిఁ జొప్పె
సాధురక్షణంబు సజ్జనులకు నెన్న
భూషణంబుగాదె భూవరేంద్ర! 247

వ. తదనంతరంబ. 248

క. గరళంబుఁ గంఠబిలమున
హరుఁడు ధరించుటకు మెచ్చి యహా సా యనుచున్
హరియు విరించియు నుమయును
సురనాథుఁడుఁ బొగడి రంత సుస్థిరమతితోన్. 249

క. హాలాహలభక్షణకథ
హేలాగతి విన్న వ్రాయ నెలమిఁ బఠింపన్
[3]వ్యాళానలవృశ్చికముల
పాలై చెడ రెట్టిజనులు భయవిరహితులై. 250

వ. మఱియు నారత్నాకరంబు సురాసురులు ద్రచ్చు నెడ. 251

౬ అధ్యాయము.

పాలకడలిం దరువునెడ నైరావతాదులు జనించుట.

క. తెల్లని మేనును నమృతము
జిల్లన జల్లించు పొదుఁగు శితశృంగములుం
బెల్లుగ నర్థులకోర్కులు
వెల్లిగొలుపు మొదవు పాలవెల్లిం బుట్టెన్. 252

ఆ. అగ్నిహోత్రి యనుమ నాసురభిని దేవ
మునులు పుచ్చుకొనిరి మున్నెఱిఁగి

---

1 అగ్నిస్వరూపము, అచ్చుపడిన = మూర్తీభవించిన. 2 నలుపు. 3 పాములు, అగ్ని, తేళ్లు, అనువాని వాలము.

విబుధసంఘములకు వెరవుతో నధ్వర
హవులు వెట్టుకొఱకు నవనినాథ! 253

వ. మఱియు నా జలరాశియందు. 254

క. సచ్చంద్రపాండురంబై
యుచ్చైశ్శ్రవ మనఁగ దురగ మొగి జనియించెం
బుచ్చికొనియె బలిదైత్యుం
డిచ్చఁగొనం డయ్యె నింద్రుఁ డీశ్వరశిక్షన్. 255

క. ఒఱపగు నఱిమును బిఱుఁదును
నెఱిఁదోఁకయు ముఖము సిరియు నిర్మలఖురముల్
కుఱుచచెవులుఁ దెలిఁగన్నులు
దఱచగు [1]కందంబుఁ జూడఁ దగు నాహరికిన్. 256

వ. అంత నా పాలకుప్పయందు. 257

క. దంతచతుష్టాహతిశై
లాంతంబులు విఱిగిపడఁగ నవదాతకుభృ
త్కాంతంబగు నైరావణ
దంతావళ ముద్భవించె ధరణీనాథా! 258

క. తడలేని నడపు వడిఁగల
యొడలును బెనునిడుదకరము నురుకుంభములున్
బెడఁగై యువతుల మఱపపు
నడకలకున్ మూలగురు వనఁగ నొప్పెన్. 259

వ. మఱియు నత్తరంగిణీవల్లభు మథించు నయ్యెడ. 260

ఆ. ఎల్లఋతువులందు నెలరారు తరువమై
యిందిరావిరులతోఁట కేపు దెచ్చి
కోరి వచ్చువారి కోర్కుల నీనెడు
[2]వేల్పుమ్రాను పాలవెల్లిఁ బుట్టె. 261

---

1 మూఁపురము. 2. కల్పవృక్షము.

వ. మఱియునుం గొండకవ్వంబునం గడలి మథింప నప్సరోజనంబు జనించె నంత. 262

క. క్రొక్కారుమెఱుఁగు మేనులుఁ
గిక్కిఱిసిన చన్నుఁగవలుఁ [1]గ్రిస్సిననడుముల్
పిక్కటిలియున్న [2]తుఱుములుఁ
జక్కని చూపులును దివిజపతులకు నొప్పెన్. 263

వ. వెండియు నా రత్నాకరంబునందు సుధాకరుం డుద్భవించి విరించి యనుమతంబునఁ దన యథాస్థానంబునం బ్రవర్తించుచుండె నంత.

క. తొలుకారు మెఱుఁగు క్రైవడి
తళతళ మని మేను మెఱవ ధగధగ మనుచున్
గలుముల నీనెడుచూపులఁ
జెలువంబుల [3]మొదలిటెంకి సిరిపుట్టె నృపా! 265

సీ. పాలమున్నీటిలోపలి మీఁది మీఁగడ
మిసిమిజిడ్డునఁ జేసి మేనువడసి
క్రొక్కారుమెఱుఁగుల కొనల క్రొత్తళుకుల
మేనిచే గల నిగ్గు మెఱుఁగుసేసి
నాఁటినాఁటికిఁ బ్రోది నవకంపుఁదీవల
[4]నునుఁబోద నెయ్యంబు నూలుకొలిపి
క్రొవ్వారు కెందమ్మి కోలఁకునఁ బ్రొద్దునఁ
బొలసిన వలపులఁ బ్రోది పెట్టి

తే. పసిఁడిచంపకదామంబు బాగుఁ గూర్చి
వాలు క్రొన్నెలచెలువున వాఁడిదీర్చి
జాణతనమునఁ జేతుల జడ్డు విడిచి
నలువ యీకొమ్మనొగిఁ జేసి నాఁడు నేఁడు. 266

క. కెంపారెడు నధరంబును
[5]జంపారెడి నడుము సతికి శంపారుచులన్

---

1. కృశించిన (సన్నమైన). 2. జుట్టు (వేనలి). 3. మొదటిస్థానము. 4. లేత వృక్షమూలములయొక్క. 5. జంపు + ఆరెడి = సన్నమగు.

సొం పారు మోముఁ గన్నులుఁ
బెం పారుచు నొప్పు గొప్పపిఱుఁదును గుచముల్. 267

వ. అని జనులు వొగడు చుండ. 268

సీ. తరుణికి మంగళస్నానంబు సేయుంత
మని పెట్టె నిందుఁడు ననర్ఘ మైన
మణిమయపీఠంబు, మంగళవతు లైన
వేలుపుగరితలు విమలతోయ
పూర్ణంబు లైయున్న పుణ్యాహకలశంబు
లిడిరి, పల్లవముల నిచ్చె భూమిఁ,
గడిమి గోవులు పంచగవ్యంబులను నిచ్చె,
మలసి వసంతుండు మధు వొసంగె,

తే. మునులు గల్పంబుఁ జెప్పిరి మొగిలుగములు
పణవగోముఖకాహళపటహమురజ
శంఖవల్లకీవేణునిస్వనము లిచ్చెఁ
బాడి రాడిరి గంధర్వపతులు సతులు. 269

క. పండితసూక్తులతోడుతఁ
దుండంబులు సాఁచి తీర్థతోయము లెల్లం
దుండముల ముంచి దిగ్వే
దండంబులు జలకమార్చెఁ దరుణీమణికిన్. 270

సీ. కట్టంగఁ బచ్చని పట్టుఁబుట్టపుదోయి
ముదితకుఁ దెచ్చి సముద్రుఁ డిచ్చె
మత్తాళినికరంబు [1]మధ్వాశ మూఁగిన
వైజయంతీమాల వరుణుఁ డిచ్చెఁ
గాంచనకేయూరకంకణకింకిణీ
కటకాదులను విశ్వకర్మ యిచ్చె
భారతి యొకమంచి తారహారము నిచ్చెఁ
బాణిపద్మము నిచ్చెఁ బద్మభవుఁడు

1. తేనెపై కోరికచే. (మధు + ఆశన్).

ఆ. [1]కుండలీవ్రజంబు కుండలముల నిచ్చె
ఋత్విజులు భద్ర మైన నుతులు సేసె
నెల్లలోకములకు నేలికసాని వై
బ్రదికె దనుచు దిశలు పలికె నధిప! 271

వ. మఱియును. 272

సీ. పలుకుల నమృతంబు సిలుక నెవ్వానితో
భాషించె వాఁడెపో బ్రహ్మ యనఁగ
నెలయించి కెంగేల నెవ్వని వరియించె
వాఁడె లోకములకు వల్లభుండు
మొయిదీఁగె నెవ్వని మేనితోఁ గదియించె
వాఁడెపో పరమసర్వజ్ఞమూర్తి
నెలఁతుక యెప్పుడు నివసించె నేయింట
నాయిల్లు పరమగు నమృతపదము

ఆ. నింతి చూపువాఱె నెవ్వోటి కచ్చోటు
జిష్ణుధనదధర్మజీవితంబు
గొమ్మ పిన్ననగవు గురుతరదుఃఖని
వారణంబు సృష్టికారణంబు. 273

వ. మఱియు నక్కొమ్మ నెమ్మనంబున. 274

సీ. భావించి యొకమాటు బ్రహ్మాండ మంతయు
నాటల బొమ్మరిల్లని తలంచుఁ
బోలించి యొకమాటు భువనంబు లన్నియుఁ
దనయింటిలో [2]దొంతు లని తలంచుఁ
బాటించి యొకమాటు బ్రహ్మాదిసురులను
దన యింటిలో బొమ్మలని తలంచు
గొనకొని యొకమాటు కుంభినీచక్రంబు
నలవడ బొమ్మపీటని తలంచు

1. పాముల సమూహము. 2. వస్తువుల వరుసలు.

ఆ. సొలసి యొక్కమాటు సూర్యేందురోచుల
నచటిదీపకళిక లని తలంచు
భామ యొక్కమాటు భారతీమర్గల
నాత్మసఖు లటంచు నాదరించు. 275

వ. తదనంతరంబ. 276

ఆ. చంచరీకనికరఝుంకారనినదంబు
దనరు నుత్పలముల దండవెట్టి
మేఘకోటినడిమి మెఱుఁగుఁ బుత్తడిమాఁక
సురలనడుమ నిల్చె సుందరాంగి. 277

క. ఆకన్నులు నా చన్నులు
నాకురు లాపిఱుఁదు నడుము నాముఖ మాన
వ్యాకారముఁ గని వేల్పులు
సీకాకునఁ బడిరి కలఁగి శ్రీహరి దక్కన్. 278

వ. అట్లు నిలిచి దశదిశలం బరివేష్టించి యున్న యక్షరక్షస్సిద్ధసాధ్య దివిజగరుడగంధర్వచారణప్రముఖనిఖిలయూథంబులం గనుం గొని యప్పురాణప్రౌఢకన్యాకారత్నంబుఁ దన మనంబున నిట్లని వితర్కించె. 279

సీ. [1]ఐమువ నె యుండ నలపడ దొకచోట
నొకచోట సవతితో నోర్వరాదు
తగ నొకచోట సంతతవైభవంబుఁ గా
దొకచోట వేఁడిమి నుండఁ బోల
దొకచోటఁ గరుణలే దొక్కింత వెదకిన
నొకచోట దగ్గఱి యుండఁ బెట్ట
నెఱయంగ నొకచోట నిలుకడ సాలదు
చర్చింప నొకచోట జడతగలదు

ఆ. కొన్ని చోట్ల కామగుణ గరిష్ఠంబులు
క్రోధసంయుతములుఁ గొన్ని మొకలు

1. పుణ్యస్త్రీ.

గొన్ని మోహాలాభకుంచితంబులుఁ గొన్ని
ప్రమదమత్సరానుభావకములు. 280

వ. అని సకల సత్పురుషజనవర్తనంబులు మానసించి పరిహరించి.

సీ. అమర ముకుందుఁడు వరుఁడై యుండ వచ్చును
వరుసకు సవతు లెవ్వరును లేరు
వెలయంగ నశ్రాంతవిభవ మీతని యిల్లు
శృంగారచందనశీతలుండు
గలఁగఁ డెన్నఁడు శుద్ధకారుణ్యమయమూర్తి
విమలుండు గదిసి సేవింప వచ్చు
నెఱి నాఁడి తిరుగఁడు నిలుకడఁ గలవాఁడు
సకలకార్యములందు జడత లేదు

ఆ. సాధుచరితుఁడు షడ్వర్గరహితుండు
నాథుఁ డయ్యెనేని నడప నోపు
నితఁడె భర్త యనుచు నింతి సరోజాక్షుఁ
బుష్పదామకమునఁ బూజ సేసె. 282

క. ఇందీవరదామమున ము
కుందునిఁ బూజించి తనకుఁ గూడి వసింపన్
మందిరముగఁ దద్వక్షము
నందంద సలజ్జదృష్టి నాలోకించెన్. 283

ఆ. మోహపుంజువలన ముద్దియ దల యెత్తు
సిగ్గువలన బాల శిరము వంచు
నింతి వెఱపువలన నెత్తదు వంపదు
తనదు ముఖము ప్రాణదయితుఁ జూచి. 284

క. హరి సూచిన సిరి సూడదు
సిరి సూచిన హరియుఁ జూడ సిగ్గును బొందున్
హరియును సిరియునుఁ దమలో
సరిఁజూపులఁ జూచి మరుఁడు సందడి సేసెన్. 285

చ. జగముల తండ్రియై తనరు శౌరి జగంబులతల్లి నిందిరం
దగ నురమందుఁ దాల్చె నటఁ దత్కరుణారసదృష్టిచేఁ బ్రజల్
మగుడఁగఁ దొంటిభంగి నతిమంగళసాధ్విపతిత్వసంపదన్
నెగడిన లోకముల్ గని రనేక శుభంబులఁ బొంది రత్తఱిన్. 286

వ. అట మున్న యబ్ధిరాజు దనయందున్న యమూల్యంబయిన కౌస్తుభంబు పేరటి యనర్ఘమణిరాజంబు నయ్యంబుజాక్షునకు సమర్పించిన దానిం దనవక్షస్స్థలంబున ధరియించె. అప్పు డయ్యాదిలక్ష్మియు శ్రీవత్సకౌస్తుభవైజయంతీవనమాలికాతారహారాద్యలంకృతంబైన పుండరీకాక్షు వక్షస్స్థలంబున వసియించె నయ్యవసరంబున. 287

శా. మ్రోసెన్ శంఖమృదంగవేణురవముల్ మున్నాడి పెంజీఁకటుల్
వాసెన్ నర్తనగానలీలలసురల్ భాసిల్లి రార్యుల్ జగ
ద్వ్యాసుల్ విష్ణుని బ్రహ్మరుద్రముఖరుల్ తల్లింగమంత్రంబులం
బ్రాసక్తిన్ వినుతించి రుల్లసితపుష్పశ్రేణి వర్షించుచున్. 288

క. ఆపాలవెల్లికూఁతురు
దీపుల చూపులను దోఁగి తిలకింపఁ బ్రజల్
చేపట్టిరి సంపదలనుఁ
బ్రాపించెను మేలు జగము బ్రదికె నరేంద్రా! 289

క. పాలేటి రాచకన్నియ
మే లారెడు చూపులేక మిఱుమిఱు కంచుం
జాలిం బురపురఁ బొక్కుచుఁ
దూలిరి రక్కసులు కీడు దోఁచిన నధిపా! 290

క. వారిధిఁ దరువఁగ నంతట
వారుణి యను నొక్కకన్య వచ్చిన నసురుల్
వారిజలోచనసమ్మతి
వారై కైకొనిరి దాని వారిజనేత్రిన్. 291

వ. మఱియుం దరువం దరువ నప్పయోరాశియందు. 292

సీ. తరుణుండు దీర్ఘదోర్దండుండు గంబుకం
ధరుఁడు పీతాంబరధారి స్రగ్వి
లాసితభూషణాలంకృతుం డరుణాక్షుఁ
డున్నతోరస్కుఁ డత్యుత్తముండు
నీలకుంచితకేశనివహుండు జలధర
శ్యాముండు మృగరాజసత్త్వశాలి
మణికుండలుఁడు రత్నమంజీరుఁ డచ్యుతు
నంశాంశసంభవుం డమలమూర్తి

ఆ. భూరియాగభాగ భోక్త ధన్వంతరి
యనఁగ నమృతకలశ హస్తుఁ డగుచు
నిఖిలవైద్యశాస్త్రనిపుణుఁ డాయుర్వేది
[1]వేల్పువెజ్జుఁ గడలి వెడలివచ్చె. 293

వ. తదనంతరంబ. 294

ఆ. అతని చేతనున్న యమృతకుంభము చూచి
[2]కెరలువొడిచి సురలఁ గికురు వెట్టి
పుచ్చుకొనిరి యసురపుంగవు లెల్లను
మాఱులేని బలిమి మానవేంద్ర! 295

వ. వెండియు. 296

ఆ. చావులేని మందు చక్కఁగ మనకబ్బె
ననుచుఁ గడవ నసుర [3]లాఁచికొనిన
వెఱచి సురలు హరికి మొఱలు వెట్టిరి సుధా
పూర్ణఘటము వోయెఁ బోయె ననుచు. 297

శ్రీవిష్ణుమూర్తి మోహినీస్వరూపంబు నొందుట.

వ. ఇట్లు శరణాగతులైన వేల్పుల దైన్యంబు వొడగని భృత్యజనకామదుండగు నప్పరమేశ్వరుండు మీరలు దుఃఖింప వలవదు. నేను నామాయాబలంబునం జేసి మీయర్థంబు మరల సాధించెద నని

1 దేవవైద్యుఁడు (ధన్వంతరి) 2 రేఁగి (ఉప్పొంగి) 3 అపహరించుకొనఁగా

పలికె. తత్సమయంబున నయ్యమృతపూరంబు నేమ త్రావుదుమని తమకించు దైత్యదానవజనంబులలోపల నమంగళంబగు కలి సంభవించిన కతంబునఁ బ్రబలు లగు రక్కసుల విలోకించి సత్త్రయాగంబునందు నడచు చందంబునఁ దుల్యప్రయాసహేతువులగు సురలును సుధాభాగంబున కర్హులగుదురు గావునఁ బంచికుడుచుట కర్తవ్యంబిది సనాతనం బగుధర్మం బగుటం జేసి యయ్యమృతకుంభంబు విడువుం డని దుర్బలు లగు నిశాచరు లజాతమత్సరులై ప్రబలులైన తమవారల వారించుచున్న సమయంబున. 298

ఆ. ఒకనిచేత నుండ నొకఁడు బలిష్ఠుఁడై
పుచ్చుకొనిన వానిఁ బోదుగఁ బట్టి
యంతకంటె నధికుఁ డమృతకుంభము నెత్తి
కొంచుఁ బాఱెఁ బరులుఁ గుయ్యిడంగ. 299

వ. అంత. 300

సీ. మెత్తనియడుగుల మెఱుఁగారుజానువు
లరఁటికంబములవోలైనతొడలు
ఘన మగు జఘనంబుఁ గడు లేతనడుమును
బల్లవారుణకాంతి పాణియుగము
గడుదొడ్డపాలిండ్లుఁ గంబుకంఠంబును
బింబాధరముఁ జంద్రబింబముఖముఁ
దెలిగన్నుఁగవయును నలికుంతలంబులు
బాలేందుసన్నిభఫాలతలము

తే. నమరఁ గుండలకేయూరహారకంక
ణాదు లేపార మంజీరనాద మొప్ప
నల్లనవ్వులఁ బద్మదళాక్షుఁ డసుర
పతుల నడఁగింప నాఁడురూపంబుఁ దాల్చె. 301

వ. అయ్యవసరంబున జగన్మోహనాకారంబున. 302

సీ. పాలిండ్లపైనున్న పయ్యెద జాఱించు
జాఱించి మెల్లన జక్కనొత్తు
దళ్కుదళ్కను గండ ఫలకంబు లొలయించు
నొలయించి కెంగేల నుజ్జగించుఁ
గటుమెఱుంగులు వాఱు కడకన్ను లల్లార్చు
నల్లార్చి ఱెప్పల నంటఁగొలుపు
నవరసదరహాసచంద్రికఁ జిలికించుఁ
జిలికించి కెమ్మోవిఁ జిక్కుపఱచు
తే. దళితధమ్మిల్లకుసుమగంధమ్ము నెఱపుఁ
గంకణాదిఝుణంకృతుల్ గడలుకొలుపు
నొడలికాంతులు పట్టులే కులుకఁబాఱు
[1]సన్నవలిపంపుఁ బయ్యెద [2]సౌకళింప. 303

౯ అధ్యాయము

వ. ఇవ్విధంబున నక్కపట యువతీరత్నంబు జగన్మోహన దేవతయునుం బోలె నెమ్మొగంబు తానికి మత్తిల్లిన తేఁటిమొత్తంబులన్ గెలిచి చిగురుజొంపంబుల నెడగలుగ గడియుచు మురియుచుండ రాక్షస వరులు గనుంగొని. 304

సీ. అవుఁగదే లావణ్య మవుఁగదే మాధుర్య
మవుఁగదే సతి నవయౌవనాంగి
యెటనుండి వచ్చితి వేమి యిచ్చించెదు
నీనామ మెయ్యది నీరజాక్షి
యమర గంధర్వ సిద్ధాసుర చారణ
మనుజకన్యలకు నీ మహిమ గలదె
ప్రాణచిత్తేంద్రియపరిణామదాయివై
నిర్మించెఁ బోవిధి నిన్నుఁగరుణ
తే. వసిత గశ్యపుసంతతివార మేము
భ్రాతలము సురలకు సిద్ధపౌరుషులము

1 సన్నని మడుఁగు. (ధౌతవస్త్రము) 2 తూఁగాడఁగా,

జ్ఞాతులకు మాకు నేకార్థసంగతులకుఁ
బాలుదీఱని యర్థంబు పంచి యిమ్ము. 305

క. సభ యైయుండెద మిందఱ
మభయంబున వచ్చుకొలఁది నమృతంబును నీ
విభరాజగమన తప్పక
విభజింపు విపక్షపక్షవిరహితమతివై. 306

వ. అని మందలించిన దైత్యులం గని మాయాయువతీరూపుండగు
హరి తనవాఁడి వాలు జూపుటంపఱలవలన వారల [1]తాలుముల
నగలించి చిఱునగవు లెగయ మొగమెత్తి యిట్లనియె. 307

క. సుందరులగు పురుషులఁ గని
పొందెదు నాయందు నిజము పుట్టెనె మీకున్
బృందారకరిపులారా!
చెందరు కామినుల విశ్వసింపరు పెద్దల్. 308

క. పలుకులు మధురసధారలు
దలఁపులు నానాప్రకార దావానలముల్
చెలుములు సాలావృకములు
చెలువల సమ్మతులు వేదసిద్ధాంతములే. 309

క. నా నేర్చుకొలఁది మీకును
మానుగ విభజించి యిత్తు మానుఁడు శంకం
గానిం డనవుడు నిచ్చిరి
దానవు లమృతంపుఁ గడవఁ దరుణీమణికిన్. 310

క. ఆశాంతాలోకనములు
నాశీతలభాషణములు నాలాలితముల్
రాశిపరంపర లగుచుం
బాశములై వారినొక్కి బంధించె నృపా! 311

వ. ఇట్లు సుధాకలశంబు కేల నందికొని మందస్మితభాషణంబుల సుం
దరీరూపుం డగు ముకుందుండు మేలుఁగీడనక మేనుఁ బంచి

---

1 తాలిమి + లు=ఓర్పులు=(ధైర్యములు)

ఇచ్చిన తెఱంగున నంగీకరించుట కర్తవ్యం బనవుడు నగుం గాక యని సురాసురదైత్యదానవసమూహం బుపవసించి కృతస్నానులై హోమంబు లాచరించి విప్రులకు గోభూహిరణ్యాదిదానంబులు సేసి తదాశీఃప్రవచనంబులు గైకొని ధవళపరిధానులై గంధమాల్యధూపదీపాలంకృతం బగు కనకరత్నశాలామధ్యంబునం బ్రాగగ్రకుశపీఠంబులం బూర్వదిశాభిముఖులై పంక్తులుఁగొని యున్న సమయంబున. 312

క. శ్రోణీభరకుచయుగభర
వేణీభరములను డస్సి వివిధాభరణ
శ్రేణి యయి యువిద వచ్చెను
బాణిసరోజమున నమృతభాండముఁ గొంచున్. 313

క. భాసురకుండలభాసిత
నాసాముఖకర్ణగండనయనాంచలయై
శ్రీసతి యగు సతిఁ గని దే
వాసురయూథంబు మోహమందె నరేంద్రా! 314

వ. అప్పుడు. 315

క. అసురుల కమృతము వోయుట
వోసఁగదు పాములకుఁ బాలు వోసిన మాడ్కిన్
డోసఁ గగు నంచును వేఱొక
దెసఁ గూర్చుండంగఁ బెట్టె దేవహితులన్. 316

వ. ఇట్లు రెండుపంక్తులుగా నేర్పరచి. 317

సీ. వేగిరపడకుఁడీ వినుఁడు దానవులార!
తడవు సేయకవత్తు దైత్యులార!
యటు ప్రక్కఁ గూర్చుండుఁ డని కన్ను లల్లార్చి
చనుగవపయ్యెద జాఱఁదిగిచి
వదినె మఱందుల వావులు కల్పించి
మర్మంబు లెడలించి మఱుఁగు సేసి

మెల్లనినగవుల మేనులు మఱపించి
కడుజాణమాటలఁ గాకుపఱచి

ఆ. యసురవరుల నెల్ల నడకించి సురలను
దడవు సేయవలదు ద్రావుఁ డనుచు
వచ్చుకోలఁది నమృతవారి విభాగించెఁ
దరుణి దివిజులెల్లఁ దనిసిపోగఁ. 318

వ. అయ్యవసరంబున. 319

సీ. మనకు వేల్పులకును మందట లేకుండఁ
బంచి పెట్టెదనని పడఁతి పూనెఁ
దా నేలతప్పును తప్పదు తరళాక్షి
గాక రమ్మనుచు వేగంబ చీర
మఱుమాట లాడదో మఱచిచూడకుండునో
చనుగవఁ గప్పునో చాలుననుచు
నొండాడఁ గలుగుచు యొక్కింత సోలయునో
మనయెడఁ గందునో మగువ యనుచు

ఆ. నెలతఁ జూడ్కిగముల నీరై కరంగుచుఁ
బ్రణయభంగభీతి బద్ధులగుచు
నూరకుండ్రుగాని యువిద తే తెమ్మని
యడుఁగ జాలరైరి యసురవరులు. 320

వ. అప్పుడు. 321

మ. అమరవ్రాతములోనఁ జొచ్చి దివిజుండై [1]రాహు [2]పీయూషపా
నము సేయంగని చంద్రభాస్కరులు సన్నల్ సేయ నారాయణుం
డమరారాతిశిరంబు చక్రహతిఁ దున్మాడెన్ సుధాసిక్తమై
యమరత్వంబును జెందె మూర్ధముఁ దదన్యాంగంబు నేలంబడెన్.

ఆ. అజుఁడు దానిశిరము నంబరవీథిని,
గ్రహముసేసిపెట్టి గారవించె

1. రాహువు, 2. అమృతపానము,

వాఁడు పర్వములను వైరంబు దప్పక
భానుచంద్రములను బట్టుచుండు. 323

క. ఒకబొట్టుఁ జిక్కకుండఁగ
సకలసుధారసము నమరసంఘంబులకుం
బ్రకటించి పోసి హరి దన
సుకరాకృతిఁ దాల్చె నసురవరులు బెగడన్. 324

మ. అమరుల్ రక్కసులుం బ్రయాసబలసత్త్వార్థాభిమానంబులన్
సములై లబ్ధవికల్పులైరి యమరుల్ సంశ్రీయముం బొంది ర
య్యమరారుల్ బహుదుఃఖముల్ గనిరి తామత్యంతదోర్గర్వులై
కమలాక్షున్ శరణంబు వేఁడని జనుల్ కల్యాణసంయుక్తులే. 325

౧౦ అధ్యాయము.

దేవాసురయుద్ధము.

క. దానవు లమృతము ద్రావం
బూని పయోరాశిఁ దఱచి పొగిలిన మాడ్కిన్
శ్రీనాథపరాఙ్ముఖు లగు
హీనులు వొందంగఁ జాల రిష్టార్థంబుల్. 326

క. శోధించి జలధి నమృతము
సాధించి నిలింపవైరి చక్రవర్తులన్
రోధించి సురల [1]కడిఁ హరి
బోధించి ఖగేంద్రు నెక్కి పోయె నరేంద్రా! 327

క. శుద్ధముగ సురల కమృతము
సిద్ధించిన నసురవరులు సిడిముడిపడుచుం
గ్రుద్ధులు నానాయుధస
న్నద్ధులు నయి యుద్ధమునకు నడచిరి బలిమిన్. 328

క. ధన్యులు వైరోచనిశత
మన్యుప్రముఖులు మదాభిమానులు దమలోన్

1. ఆహారము.

నన్యోన్యరణము [1]బాహా
సిన్యాసంబులను బేర్చి చేసిరి కడిమిన్. 329

మ. అరుదై కామగమై మయాసురకృతంబై లోకితాలోక్యమై
వరశస్త్రాస్త్రసమేతమై తరళమై వైహాయసంబై మహా
సురయోధాన్వితమైన యానమున సంశోభిల్లెఁ బూర్ణేందుసు
స్థిరకాంతిన్ బలిచామరధ్వజచమూదీప్తస్థితిన్ ముందటన్. 330

వ. మఱియు నముచి శంబర బాణ ద్విమూర్ధ కాలనాభ శకుని జంభాయోముఖ ప్రహేతి హేతి భూతసంతాప హయగ్రీవ కపిలేల్వలోత్కల మేఘదుందుభి మయ త్రిపురాధిప విప్రచిత్తివిరోచన వజ్రదంష్ట్రతారకారిష్టారిష్టనేమిశుంభనిశుంభ శంకు శిరః ప్రముఖులను, పౌలోమకాలకేయులును, నివాతకవచప్రభృతులును, దక్కిన చండయోధులునుం గూడికొని యరదంబులం దురగంబుల మాతంగంబుల హరిణంబుల హరి కిరి శరభ మహిష గవయ ఖడ్గ గండభేరుండ చమరీ జంబుక శార్దూల గోవృషాది మృగంబులను, గంక గృధ్ర కాక కుక్కుట బక శ్యేన హంసాది విహంగంబులను, దిమి తిమింగిలాది జలచరంబులను, నరులను, నసురసురనికరవికృత విగ్రహరూపంబులగు జంతువులను నారోహించి తమకు నడియాలంబులగు గొడుగులు పడగలుజోడుఁ గైదువులు పక్కెరలు బొమిడికంబులు మొదలగు [2]పోటుముట్లాయితంబుగఁ గైకొని వేఱువేఱ మొనలై విరోచననందనుండగు బలిముందట నిలువంబడిరి. దేవేంద్రుండును నైరావతారూఢుండై వైశ్వానర వరుణ వాయు దండధరాద్యనేకనిర్జరవాహినీసందోహంబునుఁ దాను నెదురుపడి పిఱుతివియక మోహరించె నట్లు సంరంభసన్నాహసముత్సాహంబుల రెండుదెఱంగుల వారునుం బోరాడు వేడుకల మీఁటగు మాటల సందడించుచున్న సమయంబున. 331

సీ. వజ్రదంష్ట్రాంచితవ్యజనంబులును బర్హ
చామరంబులు సితచ్ఛత్రములును

---

[1]హస్తములందు ఖడ్గములనుంచుట [2]యుద్ధసాధనములు. ఆయుధములు.

జిత్రవర్ణధ్వజచేలంబులును వాత
చలితోత్తరోష్ణీషజాలములును
జప్పాళ్ళ నెసఁగు భూషణకంకణంబులుఁ
జండాంశురోచుల శస్త్రములును
వివిధఖేటకములు వీరమాలికలును
బాణపూర్ణములైన తూణములును

ఆ. నిండి పెచ్చు రేఁగి నిర్జరాసురవీర
సైన్యయుగ్మకంబు సాలనొప్పె
గ్రాహతతులతోడఁ గలహంబునకు వచ్చు
సాగరములభంగి జనవరేణ్య! 332

క. భేరీభాంకారంబులు
వారణఘీంకారములును వరహరిహేషల్
భూరిరథనేమిరవములు
ఘోరములై పెల్లగించెఁ గులశైలములన్. 333

వ. ఇవ్విధంబున నుభయబలంబులును మోహరించి బలితో నింద్రుం
డును దారకునితో గుహుండును హేతితో వరుణుండును బ్రహే
తితో మిత్త్రుండును గాలనాభునితో యముండును మయునితో
విశ్వకర్మయు శంబరునితోఁ ద్వష్టయు విరోచనితో సవితయు
నముచితోఁ బరాజితుండును వృషపర్వునితో నశ్విదేవతలును
బలిసుతబాణాదిపుత్త్రశతంబులతో సూర్యుండును రాహువుతో
సోముండును బులోమునితో ననిలుండును శుంభనిశుంభులతో
భద్రకాళీదేవియు జంభునితో వృషాకపియును మహిషునితో
విభావసుండును నిల్వలవాతాపులతో బ్రహ్మపుత్త్రులును దుర్మర్ష
ణునితోఁ గామదేవుండును నుత్కలునితో మాతృకాగణంబును
శుక్రునితో బృహస్పతియు నరకునితో శనైశ్చరుండును నివాత
కవచులతో మరుత్తులును గాలేయులతో వసువు లమరులును
బౌలోములతో విశ్వేదేవగణంబును గ్రోధవశులతో రుద్రులును
నివ్విధంబునం గలిసి పెనంగి ద్వంద్వయుద్ధంబు సేయుచు మఱియు

రథికులు రథికులను పదాతులు పదాతులను వాహనారూఢులు వాహనారూఢులనుం దాఁకి సింహనాదంబులు సేయుచు నట్టహాసంబులిచ్చుచు నాహ్వానంబులొసంగుచు నన్యోన్యతిరస్కారంబులు సేయుచు బాహునాదంబుల విజృంభించుచుఁ బెనుబొబ్బల నుబ్బి రేఁగుచు హుంకరించుచు నహంకరించుచు ధనుర్గుణంబులఁ [1]టంకరించుచు శరంబుల నాటించుచుఁ బరశువుల నఱకుచుఁ జక్రంబులం జెక్కుచు శక్తులం దునుముచుఁ గశలం బెట్టుచుఁ గుఠారంబులఁ బొడుచుచు గదల నడచుచుఁ గరంబులఁ బొడుచుచుఁ గరవాలంబుల వ్రేయుచుఁ బట్టిసంబుల నొంచుచుఁ బ్రాసంబులం ద్రెంచుచుఁ బాశంబులం గట్టుచుఁ బరిఘంబుల మొత్తుచు ముసలంబుల మోఁదుచు ముద్గరంబుల ఝుళిపించుచు ముష్టివలయంబుల ఘట్టించుచుఁ దోమరంబుల నఱుముచు శూలంబులఁ జిమ్ముచు నఖంబులం జీరుచుఁ దరుశైలంబుల ఱువ్వుచు నుల్ముకంబులం జూఁడుచు నిట్లు బహువిధంబులం గలహవిహారంబులు సలుపు నవసరంబున భిన్నంబులైన శిరంబులును విచ్ఛిన్నంబులైన కపాలంబులును వికలంబులైన కపోలంబులును జిక్కువడిన కేశబంధంబులును భగ్నంబులైన దంతంబులును గృత్తంబులైన భుజంబులును ఖండితంబులైన కరంబులును విదళితంబులైన మధ్యంబులును వికృతంబులైన వదనబింబంబులును వికలంబులైన నయనంబులును వికీర్ణంబులయిన కర్ణంబులును విశీర్ణంబులైన నాసికలును విఱిగిపడిన యూరుదేశంబులును విసంధులయిన పదంబులునుఁ జిరిగిన [2]కంకటంబులును రాలిన భూషణంబులును వ్రాలిన కేతనంబులును గూలిన ఛత్రంబులును మ్రగ్గిన గజంబులును నుగ్గయిన రథంబులును నుఱుమైన హయంబులునుఁ జిందఱవందఱలైన భటసమూహంబులును నొఱలెడు కొఱప్రాణంబులును బొఱలెడు మేనులును నుబ్బియాడెడు భూతంబులును బాఱెడు రక్తప్రవాహంబులును గట్టలుగొన్న మాంసంబులును

1. 'టంటం' అని ధ్వనింపఁజేయుచు (నాఁ మ్రోయించుచు) 2. కవచములు.

నెగసి తిరిగెడి కబంధంబులును గలకలంబులు సేయు కంకగృధ్రాది
విహంగంబులు నయి యొప్పు నప్పో రతి ఘోరంబయ్యె నప్పుడు.

శా. నాకాధీశుఁ బదింట మూఁట గజమున్ నాల్గింట గుఱ్ఱంబులన్
ఏకాస్త్రంబున సారథిం జొనిపె దైత్యేంద్రుండు దా నాక స
ల్లోకాధీశుఁడు ద్రుంచి యన్నిటిని దోడ్తో నన్నిభల్లంబులన్
రాకుండన్ రిపువర్గముం దునిమె గీర్వాణారి యగ్గింపఁగన్. 335

సీ. తన తూపు లన్నియుఁ దరమిడి శక్రుండు
నఱికిన జోదు విన్ననువు మెఱసి
బలి మహాశక్తిచేఁ బట్టిన నదియును
నతఁడు ఖండించె నత్యద్భుతముగ
మఱి పాశశూలతోమరములు గైకొన్న
దోడ్తోడ నవియును దునిమివైచె
నంతటఁ బోక యొయ్యాది వాఁడు సాగించెఁ
దొడరి తా నదియును దురుముసేసె

ఆ. నసురభర్త విరథుఁడై తన పగఱకు
నాఁపఁబడక వివిధకపటవృత్తి
నేర్పు మెఱసి మాయ నిర్మించె మింటను
వేల్పుగములు సూచి వెఱఁగుపడఁగ. 336

వ. ఇట్లు దానవేంద్రుని మాయావిశేషవిధానంబున సురానీకంబులపైఁ బర్వతంబులు వడియె. దావాగ్నిదందహ్యమానతరువర్షంబులు గురిసె. [1]సటంకశిఖరనికరశిలాసారంబులు గప్పె. మహోరగదందశూకంబులు గఱచె. వృశ్చికంబులు మీటె. వరాహవ్యాఘ్రసింహంబులు గదిసి విదళింపన్ దొడఁగొనియె. వనగజంబులు మట్టిమల్లాడం జొచ్చె. శూలహస్తులు దిగంబరులు నై రంపు రండని బలురక్కసులు శతసహస్రసంఖ్యలు భేదనచ్ఛేదనభాషణంబులాడం దొడంగిరి. వికృతవదనులు గదాదండధారులు నాలంబితకేశభారులు

1 టంకములనఁటి (నాఁడే) కొనల సమూహములుగల రాళ్ల యొక్క వర్షము. టంకమనఁగా ఏత్తి, కాసము, లేక గొడ్డలి యని చెప్పవలయును.

విహ్వలులు నై యనేక రాక్షసవీరులు పోనీకు పోనీకుఁడు తునుము తునుముం డని వెను తగిలిరి. పరుషగంభీరనిర్ఘాతసమేతంబులయిన జీమూతసంఘాతంబులు వాతాహతంబులై యుప్పతిల్లిన నిప్పుల కుప్పలు మంటలు ప్రోవులుం గురిసె. మహాపవనవిజృంభితంబైన కార్చిచ్చు ప్రళయానలంబుచందంబునం దరికొనియె. ప్రచండ జంఝానిలప్రేరితసముత్తుంగతరంగావర్తభీషణంబయిన మహార్ణవంబు సెలియలికట్ట దాఁటి వెల్లివిరిసిన ట్లమేయంబయి యుండె, ఆసమయంబునం బ్రళయకాలంబునుంబోలె మిన్ను మన్నును రేయుంబగలు నెఱుంగ రాదయ్యె. అయ్యవసరంబున. 337

క. ఆ యసురేంద్రుని బహుతర
మాయాజాలంబులకును మాఱెఱుఁగక వ
జ్రాయుధముఖరాదిత్యు ల
పాయంబున బొంది చిక్కువడిరి నరేంద్రా! 338

వ. అప్పుడు. 339

క. ఇ య్యసురులచేఁ జిక్కితి
మెయ్యది దెరు వెందుఁ జొత్తుఁ మిటు వోలయఁగ దే
యయ్యా! దేవ! జనార్దన!
కుయ్యో కుయ్యో యటంచుఁ గూయిడి రమరుల్. 340

వ. అని మొఱ యిడు నవసరంబున. 341

మ. విహగేంద్రాశ్వనిరూఢుఁడై మణిరమావిభ్రాజితోరస్కుఁడై
బహుశస్త్రాస్త్రమహాభుజాకలితుఁడై భాస్వత్కిరీటాదిదు
స్పహుఁడై నవ్యపిశంగచేలధరుఁడై సంఫుల్లపద్మాక్షుఁడై
విహితాలంకృతితోడ మాధవుఁడు దా వెంచేసె నచ్చోటికిన్. 342

చ. అసురుల మాయ లన్నియును నబ్జదళాక్షుఁడు వచ్చి నంతటన్
గసిబిసియై [1]నిరర్థమయి గ్రక్కునఁ బోయెను నిద్రనొంది సం
తసమున మేలుకొన్నగతిఁ దాల్చి చెలంగిరి వేల్పు లందఱుం
బస సెడ కే లయుండు హరిపాదపరిష్కృతి సేయ నాపదల్. 343

1 అర్థములేనివై, పనికిమాలినవై,

వ. అయ్యెడ. 344

ఆ. కాలనేమి ఘోర కంఠీరవము నెక్కి
తార్క్ష్యశిరము శూలధారఁ బొడువ
నతని పోటుముట్టు హరి గేల నంకించి
దానఁ జావఁ బొడిచె దైత్యవరుని. 345

క. పడపడి మాలిసుమాలులు
బెదరించినఁ దలలుఁ దుంచెఁ బృథుచక్రహతిన్
గదఁ గొని గరుడుని ఱెక్కలు
సెదరించిన మాల్యవంతు శిరమున్ ద్రెవ్వేసెన్. 346

౧౧ అధ్యాయము

వ. ఇట్లు పరమపురుషుండగు హరికరుణాపరత్వంబునం బ్రత్యుపలబ్ధమనస్కులైన వరుణవాయువాసవప్రముఖులు పూర్వంబున నెవ్వరెవ్వరితోఁ గయ్యంబు సేయుదురు వారు వారలం దలపడి నొప్పించి రయ్యవసరంబున. 347

క. బాహుబలంబున నింద్రుఁడు
సాహసమున బలిని గెలువ సమకట్టి సము
త్సాహమున వజ్ర మెత్తిన
హాహానినదంబు సేసి రఖిలజనములున్. 348

వ. ఇట్లు సముద్యతభిదురహస్తుండై యింద్రుండు దనపురోభాగంబునం బరాక్రమించుచున్న విరోచననందను నుపలక్షించి యిట్లనియె.

మ. జగతిన్ వైరి మొఱంగి గెల్చుటదియున్ శౌర్యంబె ధైర్యంబె తా
మగవాఁడయ్యును దన్నుఁ దానెఱిఁగి సామర్థ్యంబునుం గల్గియున్
బగవానిం గని డాఁగెనేని మొయి నూపం జాలఁడేనిం గటా
నగరే బంధులు దిట్టరే బుధులుఁ గన్యల్ గూర్తురే దానవా! 350

శా. మాయల్ సేయఁగ రాదు పో నగవులే మాతోడి పోరాటముల్
దాయా! చిక్కితి వ్రక్కలించెద వసిన్ [1]దంభోళిధారాహతిన్

1 వజ్రముయొక్క అంచుచేతనైన దెబ్బచే.

నీయిష్టార్థము లెల్లఁ జూడుము వెసన్ నీవారలం గూడుకో
నీయాటోపము నిర్జరేంద్రు! డడఁచున్ నేఁడాజిలో దుర్మతీ! 351

వ. అని యుపాలంభించిన విని విరోచననందనుం డిట్లనియె. 352

శా. నీవే పోటరివే సురేంద్ర తెగడన్ నీకేల గెల్పోటముల్
లేవే యెవ్వరిపాలఁ బోయినవి మేల్గీడుల్ విరించ్యాదులుం
ద్రోవంజాలుదు రెవ్విధానమున సంతోషింప శోకింప నా
దైవం బేమి కరస్థలామలకమే దర్పోక్ష్యులుం బాడియే. 353

ఆ. జయము లపజయములు సంపదలాపద
లనిలచలితదీపికాంచలములు
చంద్రకళలు మేఘచయములు దరఁగలు
మెఱుఁగు లమరవర్య! మిట్టిపడకు. 354

వ. అని యి ట్లాక్షేపించి. 355

క. వీరుఁడు దానవనాథుఁడు
నారసముల నింద్రు మేన నాటించి మహా
ఘోరాయుధకల్పము లగు
శూరాలాపములు సెవులఁ జొనిపెన్ మరలన్. 356

వ. ఇట్లు తథ్యవాదియైన బలిచే నిరాకృతుండై. 357

క. శత్రువు నాక్షేపంబునఁ
[1]దోత్రాహతగజముభంగిఁ ద్రుళ్లుచు బలి నా
వృత్రారి వీచివైచిన
గోత్రాకృతి నతఁడు నేలఁ గూలె నరేంద్రా! 358

క. చెలికాని పాటుఁ గనుఁగొని
బలిసఖుఁడగు జంభుఁ డతులబాహాశక్తిం
జెలితనము సాలనెఱపుచు
నిలునిలు మని పేఁకఁ దాఁకె నిర్జరనాథున్. 359

1 తోత్రము = బరిగోల.

క. పంచాననవాహనుఁడై
చంచద్గద జంభుఁడెత్తి శైలారిని దాఁ
కించి సురేభంబును నొ
ప్పించి విజృంభించి యార్చి నేర్చెం గడిమిన్. 360

క. వీఁక సెడి ఘనగదాహతిఁ
దోఁకయు గదలింపలేక దుస్సహపీడన్
మోఁకరిలఁ బడియె నేలను
సోఁ కోర్వక దిగ్గజంబు సుడివడి గొంచున్. 361

వ. అయ్యెడ. 362

క. సారథి వేయిహయంబుల
తే రాయితపరచి తేర దేవేంద్రుఁడు దా
నారోహించెను దైత్యుఁడు
దారత మాతలిని శూల ధారం బొడిచెన్. 363

ఆ. శూలనిహతి నొంది స్రుక్కక యార్చిన
సూతు మెఱవకంచు సురవిభుండు
వానిశిరముఁ దునిమె వజ్రఘాతంబున
దైత్యసేనలెల్ల దల్లడిల్ల. 364

చ. చని సురనాథుచేఁ గలన జంభుఁడు సచ్చుట నారదుండు సె
ప్పిన విని వానిభ్రాతలు గభీరబలాధికుఁ డాబలుండు పా
కనముచు లాపురందరునిఁ గాంచి ఖరోక్తులఁ దూలనాడుచున్
ఘనజలధారలన్ నగముఁ గప్పిన చాడ్పునఁ గప్పి రమ్ములన్. 365

సీ. విబుధలోకేంద్రుని వేయుగుఱ్ఱంబుల
నన్నికోలల బలుఁ డదరనేసె
నిన్నూట మాతలి నిన్నూట రథమును
నొకొక్క నింద్రుఁ బ్రత్యంగకమును
వేధించెఁ బాకుండు వింటవాఁ డస్త్రంబు
లేయుటఁ దొడుగుట యెఱుఁగరాదు

కనకపుంఖంబుల కాండంబు లొక్క పది
యేనింట నముచియు నేసి యార్చె

ఆ. బలిమి నిట్లు ముగురు పగవాని రథసూత
సహితు ముంచి రస్త్రజాలములను
వనజలోకసఖుని వానకాలంబున
మొగిలుగములు మునుఁగ ముంచునట్లు. 366

వ. అయ్యవసరంబున. 367

మ. అమరారాతులబాణజాలముల పాలై పోయితే చెల్లరే
యమరాధీశ్వర! యంచు ఖిన్నతరులై యంభోధిలోఁ జంచల
త్వమునం గ్రుంకు వణిగ్జనంబులక్రియన్ దైత్యాధిపవ్యూహమ
ధ్యమునం జిక్కిరి వేల్పులందఱు విపద్ధ్వానంబులం జేయుచున్.

శా. ఓహో! దేవతలార! కుయ్యిడకుఁ డే నున్నాఁడ నం [1]చంబుభృ
ద్వాహుం డాశరబద్ధపంజరము నంతం జించి తేజంబునన్
వాహోపేతరథంబుతోడ వెలికిన్ వచ్చెన్ నిశాంతోల్లస
న్మాహాత్మ్యంబునఁదూర్పునంబొడుచు నామార్తాండుచందంబునన్.

వ. ఇట్లు వెలువడి. 370

చ. విఱిగిన సేనఁ గాంచి సురవీరుఁ డొహో యని బిట్టు చీరి క్రి
మ్మఱఁ బురికొల్పి పాకబలమస్తకముల్ నిశితాస్త్రధారలన్
నెఱసినతీక్ష్ణవజ్రమున నేలకు వ్రాల్చెను వానిచుట్టముల్
వెఱచిరి తచ్చమూపతులు విహ్వలులై చెడి పాఱి రార్తితోన్.

వ. అప్పుడు నముచి నిలువంబడి. 372

మ. తనచుట్టంబులఁ జంపె వీఁడనుచు నుద్యత్క్రోధశోకాత్ముఁడై
[2]కనకాంతంబును [3]నశ్మసారమయమున్ ఘంటాసమేతంబు నై
జనదృగ్దుస్సహమైన శూలము నొగిన్ సారించి వైచెన్ సురేం
ద్రునిపై దీన హతుండవౌదని మృగేంద్రుం బోలి గర్జించుచున్.

---

1 మేఘవాహనుఁడు (ఇంద్రుఁడు,) 2 బంగారపుపొన్నుగలది. 3 ఇనుముచేఁజేయఁ
బడినది.

శా. ఆకాశంబున వచ్చుశూలమును జంభారాతి ఖండించి నా
నాకాండంబుల వానికంఠము దెగన్ దంభోళియున్ వైచె; న
స్తోకేంద్రాయుధమున్ సురారిగళముం ద్రుంపంగ లేదయ్యె వాఁ
డాకంపింపక నిల్చె దేవవిభుఁ డత్యాశ్చర్యముం బొందఁగన్.

వ. ఇట్లు నిలిచి యున్న నముచిం గనుంగొని వజ్రంబు ప్రతిహతం
బగుటకు శంకించి బలభేది దనమనంబున. 375

సీ. కొండలఱెక్కలు ఖండించి వైచుచోఁ
వజ్ర మెన్నఁడు నింత వాఁడిసెడదు
వృత్రాసురాదుల విదళించుచో నిది
దిరుగ దెన్నఁడు పనిఁ దీర్చికాని
యిందుండఁ గానొకో యేను, దంభోళియుఁ
గాదొకో యిది ప్రయోగంబు సెడెనొ
దనుజాధముఁడు మొన తాఁకుఁ దప్పించెనో
భిదురంబు నేఁడేల బెండువడియె

ఆ. ననుచు వజ్రి వగవ [1]నార్ద్రశుష్కంబులఁ
జావకుండఁ దపము సలిపె నీతఁ
డితర మెద్దియైన నింద్ర ప్రయోగింపు
వైళ మనుచు దివ్యవాణి పలికె. 376

వ. ఇట్లాదేశించిన దివ్యవాణిపలుకు లాకర్ణించి పురందరుండు.

ఆ. ఆత్మబుద్ధిఁ దలఁచి యార్ద్రంబు శుష్కంబు
గాని సాధనంబు [2]ఫేన మనుచు
నది యమర్చి దాన నమరులు మెచ్చంగ
నముచిశిరముఁ ద్రుంచె నాకవిభుఁడు. 378

వ. అయ్యవసరంబున. 397

సీ. పురుహూతు [3]నర్గించి పుష్పాంజలులు సేసి
మునులు దీవించిరి ముదముతోడ,

1 తడసినదానిచేత, ఎండినదానిచేత. 2 నురుఁగు 3 స్తుతించి

గంధర్వముఖ్యులు ఘనులు విశ్వావసుఁ
డును బరావసుఁడు నింపెనయఁ బాడి,
రమరాంగనాజను లాడిరి, దేవతా
దుందుభులును మ్రోసె, దురమునందు
వాయువహ్నికృతాంతవరుణాదులును [1]బ్రతి
ద్వంద్వులఁ గెల్చి రుద్దండవృత్తి

తే. నల్పమృగముల సింహంబు లట్లు తోలి
రమరవర్యులు దనుజుల నదటువాయ
నజుఁడు పుత్త్రు నారదుఁ డరుగఁ బంచె
దైత్యహరణంబు వారింప ధరణినాథ! 380

వ. వచ్చి సురలకు నారదుం డిట్లనియె. 381

శా. సిద్ధించెన్ సురలార! మీ కమృతమున్ శ్రీనాథసంప్రాప్తులై
వృద్ధిం బొందితి రెల్లవారలను విద్వేషుల్ మృతిం బొంది రీ
యుద్ధం బేటికి నింకఁ జాలుఁ బనిలే దోహో [2]పురే యంచు సం
బద్ధాలాపములాడె మాన్పె సురలం బాండవ్యవంశాగ్రణీ! 382

వ. ఇట్లు నారదవచననియుక్తులై రాక్షసులతోడి సంగ్రామంబు చాలించి సకలదేవముఖ్యులును [3]త్రివిష్టపంబునకుం జనిరి. హతశేషులైన దైత్యదానవులు విషణ్ణులైన బలిం దోడ్కొని పశ్చిమశిఖరంబుఁ జేరిరి. విధ్వంసమానకంధరులై వినష్టదేహులగు యామినీచరుల నెల్లను శుక్రుండు మృతసంజీవని యైన తన విద్యా పెంపునం జేసి బ్రదికించె. బలియును భార్గవానుగ్రహంబున వినతశరీరవేదనుండై పరాజితుండయ్యును [4]లోకకాలవిచక్షణుం డగుటం జేసి దుఃఖపడక యుండెనని చెప్పి రాజునకు శుకుం డిట్లనియె.

---

1 శత్రువులను 2 'బాగు'_అవ్యయము 3 స్వర్గము 4 లోకమునకు, కాలమునకుఁ గల సంబంధమునుగూర్చిన వివేకముగలవాఁడు.

౧౨ అధ్యాయము

సీ. కైలాసగిరిమీఁద ఖండేందుభూషణుం
డొకనాఁడు గొలువున నున్నవేళ
నంగనయై విష్ణుఁ డసురుల వంచించి
సురలకు నమృతంబు [1]సూఱలిడుట
విని దేవియును దాను వృషభేంద్రగమనుఁడై
కడువేడ్క భూతసంఘములు గొలువ
మధుసూదనుం డున్న మందిరంబున కేఁగి
పురుషోత్తమునిచేతఁ బూజవడసి

తే. తానుఁ గూర్చుండి పూజించె దనుజవైరిఁ
గుశలమే మీకు మాకునుఁ గుశలమనుచు
మధురభాషల హరిమీఁద మైత్రి నెఱపి
హరుఁడు పద్మాక్షుఁ జూచి యిట్లనియె బ్రీతి. 384

సీ. దేవ జగన్మయ దేవేశ జగదీశ
కాలజగద్వ్యాపకస్వరూప
యఖిలభావములకు నాత్మయు హేతువు
నైన యీశ్వరుఁడ వాద్యంతములకు
మధ్యంబు బహియును మఱిలోపలయు లేక
పూర్ణమై యమృతమై భూరిసత్య
మానందచిన్మాత్ర మవికార మాద్య మ
నన్య మశోకంబు నగుణ మఖిల

తే. సంభవస్థితిలయమూలసంభకంబు
నైన బ్రహ్మంబు నీవ నీ యంఘ్రియుగము
నుభయసంగవిశిష్టులై యున్నమునులు
గోరి కైవల్యకాములై కొల్తు రెపుడు. 385

1. మూలకట్టు విప్పనిమ్ము సేయుట (వదలివేయుట).

సీ. భావించి కొందఱు బ్రహ్మంబు నీవని
 తలపోసి కొందఱు ధర్మమనియుఁ
ఒప్పించి కొందఱు సదసదీశ్వరుఁడని
 సంవిఁ గొందఱు శక్తి సహితుఁడనియుఁ
చింతించి కొందఱు చిరతరుం డవ్యయుఁ
 డాత్మతంత్రుఁడు పరుం డధికుఁ డనియుఁ
దొడరి యూహింతురు తుది సవ్యయద్వయ
 సదసద్విశిష్టసంశ్రయుఁడ వీవు
తే. తలఁప నొక్కింత వస్తుభేదంబుఁ గలదె
కంకణాదులు పసిఁడి యొక్కటియ కాదె
[1]కడలు పైక్కొన వార్ధియొక్కటియ కాదె
భేదమంచును నిను వికల్పింపవలదె. 386

సీ. యద్విలాసము మఱి చ్చాదు తెలియంగరు
 నిత్యుండవై యున్న నిను నెఱుఁగ
యన్మాయ నంధులై యమరాసురాదులు
 వనరెద రఁటయున్న వాని కెంత
యేరూపమునఁ బొంద కేపారుదువు నీవు
 రూపివై సకలంబు రూపుసేయ
రక్షింపఁ జెఱుపఁ గారణమైన సచరాచ
 రాఖ్యమై విలసిల్లు డంబరమున
తే. ననిలుఁ డేరీతి విహరించు నట్లు నీవు
గలసి వర్తింతు సర్వాత్మకత్వమొప్ప
జగములకు నెల్లబంధమోక్షములు నీవ
నీవ సర్వంబుఁ దలపోయ నీరజాక్ష! 387

మ. ఘనతన్ నీ[2]మగపోఁడుముల్ పలుమఱుం గన్నారఁ గన్నారము
న్నిను విన్నారము; చూడ మెన్నఁడును మున్ నీయాఁడుఁ జందంబు; మో

1 తరంగము. 2 పురుషచర్యలు.

హీని నై దైత్యులఁ గన్నుఁ బ్రామి యమృతం బిందాదిదేవాళి కి
చ్చిననీరూపముఁ జూపుమా కుతుకముం జిత్తంబునం బుట్టెడిన్. 388

క. మగవాఁడ వయ్యు జగములఁ
దగిలించి చిక్కులను బెట్టు దంటకు నీకున్
మగువతనంబున జగములఁ
[1]దగులము బొందింప నెంత దడవు ముకుందా! 389

వ. అని పలుకుచున్న శూలపాణిచే నపేక్షితుండై విష్ణుండు భావగం
భీరం బగు నవ్వు నివ్వటిల్ల నవ్వామదేవున కిట్లనియె. 390

శా. శ్రీకంఠా! విను నీవ యేమఱకుమీ చిత్తంబు రంజించెదన్
నాకద్వేషుల మ్రాఁగుఁ జేయుటకునై నాఁ డేను గైకొన్న కాం
తాకారంబు * [2]జగద్విమోహనము నీకై చూపెదం జూపెదం
◆ గైకో నర్హములందు కాముకులు సంకల్పప్రభావంబులన్. 391

హరి దనమోహినీరూపంబుచే నీశ్వరుని మోహింపఁ జేయుట

వ. అని పలికి కమలలోచనుం డంతర్హితుం డయ్యె. అయ్యుమా
సహితుం డయిన భవుండు విష్ణుం డెటువోయెనో యెందుఁ జొచ్చెనో
యని దశదిశలం గలయ నవలోకించుచుండం దనపురోభాగంబున.

సీ. ఒకయెలదోఁటలో నొకపీథి నొకనీడఁ
కుచకుంభయుగళమీఁదఁ గొంగు దలఁగఁ
గబరికాబంధంబుఁ గంపింప నుదుటిపైఁ
[4]జికురజాలంబులు సిక్కుపడఁగ
[5]ననుమానమై మధ్య మల్లాడఁ జెక్కులఁ
గర్ణకుండలకాంతి గంతులిడఁగ
[6]నారోహభరమున నడుగులుఁ దడఁబడ
దృగ్దీప్తిసంఘంబు దిశలఁ గప్ప

---

1 చిక్కులఁ బెట్టుట (మోహమునొందించుట) 2 లోకముల మోహపెట్టునది. 3 జుట్టుముడి. (కొప్పు) 4 ముంగురులు. 5 అనుమానమై = ఉన్నదా లేదా యన్నట్లుండి. 6 పిఱుదుల బరువుచే. * జగన్నిమజ్జనము— అని పాఠము. అప్పుడు జగములను ముంచి వేయునది అని యర్థము చెప్పవలెను. ◆ "కామినాం బహుమంతవ్యం సంకల్పప్రభవోదయమ్" అను మూలమున కీపాఠము సరిపడలేదు. పాఠములు చూడవలెను.

తే. వామకరమున జాఱిన వలువఁ బట్టి
కనకనూపురయుగళంబు గల్లనంగఁ
గంకణంబుల ఝణఝణత్కార మెసఁగ
బంతిచేనాడు ప్రాయంపు టింతిఁ గనియె. 393

వ. కని మున్ను [1]మగువ మరగి సగమయిన మగవాఁ డమ్మగువ వయోరూపగుణవిలాసంబులు దన్ను నూరింపం గనుఱెప్ప వ్రేయక తప్పక చూచి మెత్తనయిన చిత్తంబున. 394

శా. ఈకాంతాజనరత్న మెవ్వరిదొకో యీ యాఁకరూపంబు మున్నే
కల్పంబులయందుఁ గాన; [2]మజుఁడీ యింతిన్ సృజింపంగఁ దా
లేకుం జెల్లనిజంబు వల్లభత నీ లీలావతిం జేరఁగా
నేకాంతుండుఁ గలండొ? క్రీడలకు నా కీయింతి సిద్ధించునే. 395

వ. అని మఱియుం [3]జెఱకువిలుతుని [4]మొఱవడిఁ బరపిన నెఱబిరుదు వెఱంగుపడం దెఱవ పుఱిమికొనిన తుఱుముబిగిముడి వదలి కదలి భుజముల మెడల నొడలనదరి చెదరిన కురుల నొసలిమృగమద తిలకంపుటసలు మసల, విసవిస నగుమొగము మెఱుంగులు దశదిశలం బసలుకొలుపఁ, జఱుఁగవ మెఱయఁ, నునుఁ జెమటం దడంబడి పులకరములు గులకరములు గొన, హృదయానందకందం బగు కందుకంబు గరారవిందంబునం దమర్చి యక్కునం జేర్చి చెక్కున హత్తించి చుబుకంబుమోపి చూచుకంబులంగదియించి నఖంబుల మీటుచు మెల్ల మెల్లన [6]గెల్లాడు కరకమలంబులం గనకమణి వలయంబులు ఝణఝణయనం గుచకలశంబు లొండొంటి నొరయ నెడమఁ గుడిం దడంబడఁ గ్రమ్మఱనెగురఁ, జిమ్ముచు నెగురఁ జిమ్మి తనకుఁదానె కొన్ని చిన్ని పన్నిదంబులు సేసికొని బడుగునడుము బెడఁకి వడవడవడంక [7]సరిత్రిసరులుఁ గలయం బడఁ దిరుగుచు తిరుఁగునెడఁ బెనఁకువలుగొనఁ, జెవులతొడవుల

---

1 అర్ధనారీశ్వరుఁడు 2 బ్రహ్మ యీ యింతిన్ ఇదివఱకు కల్పములందు "సృజింపఁగ లేకుంట ఎల్లనిజంబు" అని అన్వయింపవలసియున్నది. నడుమ 'తాన్' అనునది వ్యర్థభాసము కల్పించుచున్నది. 3 మన్మథుని 4 సామర్థ్యమును (ధైర్యము) 5 హరించిన. (పోఁగొట్టి) 6 ధ్వనించు 7 కంఠహారములు

మచులు గటముల నటనములు సలుపఁ, [1]బవిరితిరిగి యొడియుచు, నొడిసి కెలంకులఁ జడియుచు, జడిసి జడనుపడక వలువ నెలవు వదలి దిగంబడం గటిస్థలంబునఁ గాంచీకనకమణికింకిణులు మొరయఁ జరణకటకమ్ములు గల్లుగల్లుమనం గరకంకణమణిగణములు మెఱయ వెసఁ గొని యుఱికిపట్టుచుఁ బట్టి పుడమిం బడవైచి పాటు నెరపిన మింటికెగసి గొటుక కరంబునం గరంబు దిరంబయి పలుమఱు నెగయనడుచుచు నెగయునెడం దిగంబడుతఱిని నీలంపు మెఱుఁగుగుదిగ్గుపోగపగ్గంబుల వలలువైచి రాఁదిగిచినపగిది వెను కొనంగ విలోకనజాలంబులు నిగిడించుచు మగిడించుచుఁ, గరలాఘవంబున నొకటి పది నూఱు వేయిసేసి నేర్పులు వాటించుచు నరుణాచరణకమలరుచుల నుదయశిఖరిశిఖరతరణికరణి సేయుచు ముఖచంద్రచంద్రికలఁ జంద్రమండలంబులు గావించుచు నెడనెడ నురోజమార్గ నిర్గతచేలాంచలంబు జక్కనొత్తుచుఁ, గపోలఫలకాలోల ఘర్మజలబిందుబృందంబుల నఖాంకురంబుల నోసరించుచు, నరుణాధరబింబఫలభ్రాంతసమాగతరాజకీరంబులం జోపుచు, ముఖసరోజపరిమళాసక్తమత్తమధుకరంబుల నివారించుచు, మందగమనాభ్యాసకుతూహలాయత్తమరాళయుగ్మంబులకుం దలంగుచు, విలాసవీక్షణానందితమయూరమిథునంబులకు నెడగలుగుచుఁ, బొదరిండ్ల[2]యీఁజుములకుం బోక మలంగుచు, సరసకిసలయాస్వాదకాముకకలకంఠదంపతులకుం దూరమగుచు, దీఁగయుయ్యెలలనూఁగుచు మాధవీమండపంబులెక్కుచుఁ గుసుమరేణుపటలంబుల[3]గుబ్బళ్ళ ప్రాఁకుచు మకరందస్యందబిందుబృందంబు నుత్తరించుచుఁ [4]గృతకశైలంబుల నారోహించుచుఁ బల్లవపీఠంబులం బథిశ్రమంబు వుచ్చుచు లతాసౌధభాగంబులఁ బొడసూపుచు నున్నతకేతకీస్తంభంబుల నొరగుచుఁ బుష్పదళఖచిత[5]వాతాయనంబులందొంగిచూచుచుఁ గమలకాండపాలికల నాలంబించుచుఁ జంపకగేహాళీమధ్యంబుల నిలువం

1 గుండ్రముగాఁదిరిగి. 2 గుబురులు. 3 గుబ్బళ్లు = గుట్టలు: పూలపుప్పొడి గుట్టలు **పడియున్న**దన్నమాట (గుబ్బలి × లు). ప్రాఁకుచు = ఎక్కుచు. లేదా సుడిదిరుగుచు. అనవచ్చు. 4 విలాసార్థము ఏర్పఱుపఁడిన కొండలు. 5 కిటికీలు.

బడుచుఁ గదళికాపత్త్రికవాటంబుల నుద్ఘాటించుచుఁ బరాగనిర్మిత [1]సాలభంజికానివహంబుల నాదరించుచు మణికుట్టిమంబుల మురియుచుఁ జంద్రకాంతవేదికల నోలయుచు రత్నపంజరశారికానివహంబులకుం జదువులు సెప్పుచుఁ గోరినక్రియం జూచుచుఁ జూచిన క్రియ మెచ్చుచు మెచ్చినక్రియ వెఱఁగుపడుచు వెఱఁగుపడిన క్రియ మఱచుచు మఱవక యేకాంతం బగు నవ్వనాంతంబున ననంతవిభ్రమంబుల జగన్మోహినియై విహరించుచు నున్న సమయంబున. 396

ఆ. వాలుఁగంటి వాఁడి వాలారుఁ జూపుల
శూలి ధైర్య మెల్లఁ గోలుపోయి
తఱలి యెఱుక లేక మఱచె గుణంబుల
నాలి మఱచె నిజగణాలి మఱచె. 397

వ. అప్పుడు. 398

ఆ. ఎగుర వైచి పట్ట నెడ లేమిఁ జేదప్పి
వ్రాలుబంతి గొనఁగ వచ్చు నెడను
బడఁతి వలువ వీడి పడియె మారుతహతిఁ
జంద్రధరుని మనము సంచలింప. 399

మ. రుచిరాపాంగిని వస్త్రబంధనపరన్ రోమాంచవిభ్రాజితం
గుచభారానమితం [2]గరద్వయపుటీగూఢీకృతాంగిం జల
త్కచబంధం గని మన్మథాతురత నా కంపించి శంభుండు ల
జ్జ చలింపం దనకాంత సూడఁ గదిసెం జంద్రాస్య కేల్దమ్మికిన్.

ఆ. పదము సేర వచ్చు ఫాలాక్షుఁ బొడగని
చీర వీడి పడిన సిగ్గుతోడ
మగువ నగుచుఁ దరులమాటున డాఁగెను
వేల్పుఱేఁడు నబల వెంటఁ బడియె. 401

మ. ప్రబలోద్వృత్తకరేణిం గరీంద్రుఁడు రమింపన్ వచ్చులీలన్ శివుం
డబలా! పోకుము పోకుమీ యనుచు డాయం బోటి కెంగేలఁ ద

1. బొమ్మల సమూహములను, 2. రెండుచేతులచేతను గప్పఁబడిన శరీరముకలది.

తత్కబరీబంధము వట్టి సంభ్రమముతోఁ గౌఁగిళ్ళనోలార్చె నం
తబహిఃప్రక్రియ నెట్టకేనిఁ గదియం దద్బాహునిర్ముక్తయై. 402

సీ. వీడి వెన్నున నాడు వేణీభరంబుతో
జఘనభారాగతశ్రాంతితోడ
మాయామానవఘోటియై మరలి చూచుచుఁ బాఱు
విష్ణు నద్భుతకర్ము వెంటఁదగిలి
యీశాను మరల జయించె మరుం డనఁ
గరిణి వెన్కను కరి కరణిఁ దాల్చి
కొండలు నేఱులుఁ గోనలు వనములు
దాఁటి శంభుఁడు ననం దన్మహాత్ము

తే. నిర్మలామోఘవీర్యంబు నేలమీఁదఁ
బడినచో టెల్ల వెండియుఁ బైఁడి యయ్యె
ధరణి వీర్యంబువడఁ దన్నుఁ దానెఱింగి
[1]దేవమాయాజడత్వంబు దెలిసె హరుఁడు. 403

క. జగదాత్మకుఁ డగు శంభుఁడు
మగిడెను హరి నెఱిఁగి తనదు మాహాత్మ్యమునన్
విగతత్రపుఁడై నిలిచెను
మగువతనం బుడిగి హరియు మగవాఁ డయ్యెన్. 404

ఆ. కాము గెలువవచ్చుఁ [2]గాలారిఁ గావచ్చు
మృత్యుజయముఁ గలిగి మెఱయవచ్చు
నాఁడువారి[3]చూపుటంపఱఁ గెలువంగ
వశముగాదు త్రిపురవైరి కైన. 405

వ. ఇట్లు పురుషాకారంబు వహించిన హరి హరున కిట్లనియె. 406

సీ. నిఖిలదేవోత్తమ! నీ కొక్కరుఁడు దక్క
నెవ్వఁడు నా మాయ నెఱుఁగ నేర్చు
మానిని యైన నా మాయచే మునుఁగక
ధృతిమోహితుండ వై తెలిసి తీవు

---

1 దేవమాయవలనఁ దనకుఁ గలిగిన జడత్వమును (మందబుద్ధిని) 2 కాల + అరి కాలమునకు శత్రువు 3 చూపులనెడి బాణములను.

కాలరూపంబునఁ గాలంబుతోడ నా
యందుచు నీమాయ యధివసించు
నీమాయ నన్ను జయింపనేరదు నిజ
[1]మకృతాత్మలకు నెల్ల ననుపలభ్య

తే. మిపుడు నీసిస్థ పెంపున నెఱిఁగి తనుచు
సత్కరించిన సఖ్యంబు సాల నెఱిపి
దక్షతనయగణంబులుఁ దన్నుఁ గొలువ
భవుఁడు విచ్చేసెఁ దననిజభవనమునకు. 407

శా. పారావారము ద్రచ్చుచో గిరిసముద్యద్భారమై కచ్ఛపా
కారుండైన రమేశువర్తనము నాకర్ణింపఁ గీర్తింప సం
సారాంభోనిధిలో మునుంగు కుజనుల్ సంశ్రేయముంబొంది వి
స్తారోదారసుఖంబుఁ జెందుదురు తథ్యంబెంతయుఁ భూవరా! 408

మ. ఎలమిన్ దైత్యుల నాఁడురూపమున మోహింపించి పీయూషముం
జలితాపన్నులకున్ సురోత్తములకుం జక్కన్ విభాగించి ని
ర్మల రేఖన్ విలసిల్లు శ్రీవిభుని దన్మాయావధూరూపముం
దలఁతున్ మ్రొక్కెదునాత్మలోనదురితధ్వాంతార్కరూపంబుగన్.

౧౩ అధ్యాయము

వ. అని చెప్పి శుకుం డిట్లనియె. 410

తే. నరవరాధీశ! యిప్పుడు నడచుచున్న
వాఁడు సప్తమమనువు వైవస్వతుండు
శ్రాద్ధదేవుండనందగు జనవరేణ్య!
పదురు నందను లతనికిఁ బ్రకటబలులు. 411

వ. వార లిక్ష్వాకుండును నభగుండును ధృష్టుండును శర్యాతియు నరిష్యంతుండును నాభాగుండును దిష్టుండును గరూశకుండును బృషధ్రుండును వసుమంతుండును ననువారు పదుగురు రాజులు, పురందరుం డనువాఁ డింద్రుం, డాదిత్యమరుదశ్వివసురుద్రసంజ్ఞలుఁ గల వారు దేవతలు గౌతమకశ్యపాత్రివిశ్వామిత్రజమదగ్నిభరద్వాజ వసిష్ఠు లనువారు సప్తర్షులయి యున్నవారు. అందుఁ గశ్యపున కదితి

1 మనసు గెలువనివారు. లేక ఆత్మజ్ఞానము లేనివారు.

గర్భంబున విష్ణుండు వామనరూపుండై జనియించి యింద్రావరజుం డయ్యె. ఇప్పు డేను మన్వంతరంబులు సెప్పంబడియె. రాఁగల మన్వంతరంబులును శ్రీహరిపరాక్రమంబునుం జెప్పెద దత్తావధానుండ వై వినుమని శుకుం డిట్లనియె. 412

సీ. జననాథ! సంజ్ఞయు ఛాయయు ననువారు
గల రర్కునకు విశ్వకర్మ తనయ
లిరువురు వల్లభ లిట మున్న చెప్పితిఁ
బరఁగు దృతీయము బడబ యనఁగ
సంజ్ఞకు యముఁడును శ్రాద్ధదేవుండును
యమునయుఁ బుట్టిరి హర్ష మెసఁగ
ఛాయకుఁ దపతియు సావర్ణియును శనై
శ్చరుఁడునుఁ గలిగిరి సంవరణుఁడు

తే. దపతి నాలిఁగఁ గైకొనెఁ దా వరించి
యశ్వియుగళంబు బడబకు నవతరించె
వచ్చు నష్టమవసువు సావర్ణి వాఁడు
తపము సేయుచు నున్నాఁడు ధరణినాథ! 413

క. ఒకపరి నూచిన వెంకియు
నొకపరి సూడంగ లేక యుండు సిరుల్కై
యొకనొకని చేటు వేళకు
నొకఁ డొక్కఁడు మనువుఁగాచి యుండు నరేంద్రా! 414

వ. సూర్యసావర్ణిమన్వంతరంబున సతనితనయులు నిర్మోహవిరజస్కాద్యులు రాజులును సుతపోవిరజోమృతప్రభులనువారు దేవతలును గాఁ గలరు. గాలవుండును దీప్తిమంతుండును బరశురాముండును ద్రోణపుత్రుఁడగు నశ్వత్థామయుఁ గృపుండును మజ్జనకుండగు బాదరాయణుండును ఋష్యశృంగుండును సప్తర్షులయ్యెదరు. వార లిప్పుడు దమతమయోగబలంబుల నిజాశ్రమమండలంబులఁ జరియించుచున్నవారు. విరోచననందనుండగు బలి యింద్రుండయ్యెడు నని చెప్పి శుకుం డిట్లనియె. 415

సీ. బలి మున్ను నాకంబు బలిమిఁ జేకొన్న
వామనుండై హరి వచ్చి వేఁడఁ
బాదత్రయం బిచ్చి భగవన్నిబద్ధుఁడై
సురమందిరముకంటె సుభగమైన
సుతలలోకంబున సుస్థితి నున్నాఁడు
వెత లేక యటమీఁద [1]వేదగుహికి
నాసరస్వతికిఁ దా నట సార్వభౌముఁడు
నాఁ బ్రభు వయి హరి నాకవిభునిఁ

ఆ. బదవిహీనుఁ జేసి బలిఁదెచ్చి నిలుపును
బలియు నిర్జరేంద్రపదము నొందు
[2]నింద్రపదము హరికి నిచ్చినకతమున
దానఫలము సెడదు ధరణినాథ! 416

వ. అట మీఁదటికాలంబున వరుణనందనుం డగు దక్షసావర్ణి తొమ్మి
దవ మను వయ్యెడు. అతని కొడుకులు ధృతకేతుదీప్తకేతుప్రము
ఖులు రాజులును, బరమరీచిగర్గాదులు నిర్జరులును నద్భుతుం డను
వాఁ డింద్రుండును, ద్యుతిమత్ప్రభృతులగు వారలు ఋషులును,
నయ్యెదరు. అందు. 417

ఆ. దనుజహరణుఁ డంబుధార కాయుష్మంతు
నకు జనించి రక్షణంబు సేయ
మూఁడులోకములను మోదంబుతో నేలు
నద్భుతాఖ్య నొప్పు నమరవిభుఁడు. 418

వ. మఱియు నుపశ్లోకసుతుం డగు బ్రహ్మసావర్ణి దశమ మనువయ్యెడి.
తత్పుత్త్రులు భూరిషేణాదులు భూపతులును హవిష్మత్ప్రముఖులు
మునులును శంభుండను వాఁ డింద్రుండును విబుద్ధాద్యులు నిర్జరు
లును నయ్యెదరు. అందు. 419

1. వేదగుహి వేదములను గుహగలది. వేదములందు దాగియున్నదన్నమాట "వేదగుహ్యాం సరస్వత్యాః" అని మూలము. 2. "రాద్ధ మింద్రపదం భుక్త్వా తతస్సిద్ధి మవాప్స్యతి" అని మూలము. ఇది మూలమునకు సరిపడుట లేదు.

ఆ. విశ్వసృజునియింట విభుఁడు విషూచికి
సంభవించు నంశసహితుఁ డగుచుఁ
జెలిమి శంభుతోడఁ జేయు విష్వక్సేనుఁ
డనఁగ జలముఁగాచు నవనినాథ! 420

వ. మఱియుం దదాగమిష్యత్కాలంబున ధర్మసావర్ణి పదునొకండవ మనువయ్యెడి. మనుతనూజులు సత్యధర్మాదులు పదుండ్రు ధరణీపతులును, విహంగమకామగమననిర్వాణరుచు లనువారు సురలును, వైధృతుఁ డనువాఁ డింద్రుండును, నరుణాదులు ఋషులును నయ్యెదరు. అందు. 421

ఆ. అంబుజాతనేత్రుఁ డాసూర్యసూనుఁ డై
ధర్మసేతు వనఁగఁ దగ జనించి
వైభవాఢ్యుఁ డగుచు వైధృతుఁ డలరంగఁ
గరుణఁ ద్రిజగములనుఁ గావఁ గలఁడు. 422

వ. మఱియుఁ దద్భవిష్యత్సమయంబున భద్రసావర్ణి పండ్రెండవ మనువయ్యెడి నతని నందనులు దేవవదుపదేవదేవశ్రేష్ఠాదులు వసుధాధిపతులును, ఋతుధాముం డనువాఁ డింద్రుండును, హరితాదులు వేల్పులునుఁ, దపోమూర్తి తపాగ్నీధ్రగాదులు ఋషులును నయ్యెదరు. అందు. 423

ఆ. జలజలోచనుండు సత్యతపస్సూనృ
తలకు సంభవించుఁ దనయుఁ డగుచు
ధరణిఁ గాచు నంచిత స్వధామాఖ్యుఁ డై
మనువు సంతసింప మానవేంద్ర! 424

వ. మఱియుం దదేష్యత్కాలంబున నాత్మవంతుం డగు దేవసావర్ణి పదుమూఁడవ మను వయ్యెడి మనుకుమారకులు చిత్రసేనవిచిత్రాదులు జగతీనాయకులును సుకర్మసుత్రామసంజ్ఞలు గలవారు బృందారకులును దివస్పతి యనువాఁ డిద్రుండును నిర్మోహతత్త్వదర్శాద్యులు ఋషులును నయ్యెదరు. అందు. 425

ఆ. ధరణిదేవహోత్ర దయితకు బృహతికి
యోగవిభుఁడు నాఁగ నుద్భవించి
వనజనేత్రుఁ డా దివస్పతి కెంతయు
సౌఖ్యమాచరించు జగతినాథ! 426

వ. మఱియు నట వచ్చుకాలంబున నింద్రసావర్ణి పదునాలవ మను
వయ్యెడి. మను నందనులు గభీరవస్త్వాదులు రాజులును, బవిత్ర
చాక్షుషు లనువారు దేవగణంబులును, శుచి యనువాఁ డింద్రుం
డును, నగ్నిబాహుశుచిశుక్రమాగధాదులు ఋషులును నయ్యెదరు.
అందు.

తే. తనర సత్రాయణునకు వితానయందు
భవము నొందెడి హరి బృహద్భానుఁ డనఁగ
విస్తరించుఁ [1]గ్రియాతంతు విసరములను
నాకవాసులు ముద మంద నరవరేణ్య! 428

క. జగతీశ! త్రికాలములనుఁ
బొగ డొందు మనుప్రకారములు సెప్పఁ బదెం
దగఁ బదునలువురు మనువులుఁ
దెగ యుగములు వేయు నడవ దివ మజన కగున్. 429

౧౪ అధ్యాయము.

వ. అనినఁ బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 430

ఆ. ఈ పదంబు లందు నీమనుప్రముఖుల
నెవ్వఁడునుచు? వార లేమికతన
నధికవిభవులైరి? హరియేల జనియించె?
నెఱుఁగ బలుకు నాకు సిద్ధచరిత! 431

వ. అనినం బారాశర్యకుమారుం డిట్లనియె. 432

సీ. మనువులు మునులును మనుసుతు లింద్రులు
నమరులు హరియాజ్ఞ నడఁగువారు

1. కర్మ కలాపములను.

యజ్ఞాదు లందఱు హరిపౌరుషాకృతు
లామనువులు దత్సహాయశక్తి
జగముల నడపుదు రోగి నాల్గుయుగముల
కడపటఁ గాలసంగ్రస్తమైన
నిగమచయంబును నిజతపోబలముల
మరలఁ గాంతురు ఋషివరులు దొంటి

తే. పగిది ధర్మంబు నాలుగు పాదములను
గలిగి వర్తిల్లు మనువులు గమలనేత్రు
నాజ్ఞఁ దిరుగుదు రేలుదు రవనిపతులు
జగతి భాగించి తమతమ సమయములను. 433

వ. మఱియుం బ్రాప్తులయినవారల నింద్రపదంబులను బహుప్రకారంబుల దేవపదంబులను హరి ప్రతిష్ఠించుచుండు వారలు విహిత కర్మంబుల జగత్ప్రియంబునుం బరిపాలింతురు. లోకంబులు సువృష్టులై యుండు. 434

సీ. యోగీశ్వరూపుఁడై యోగంబుఁ జూపుచు
మౌనిరూపమునఁ గర్మంబుఁ దాల్చు
సర్గంబు సేయుఁ బ్రజాపతిరూపుఁడై
యింద్రుఁడై దైత్యుల నేపడంచు
జ్ఞానంబు నెఱిఁగించుఁ జతుర సిద్ధాకృతిఁ
గాలరూపమునఁ బాకంబుసేయు
నానావిధాకార నామరూపంబులఁ
గర్మలోచనులకుఁ గానఁబడఁడు
ఆ. చనిన రూపములను జనురూపముల నింకఁ
జనఁగనున్న రూపచయము నతఁడు
వివిధుఁడై యనేక వృత్తుల వెలిఁగించు
విష్ణుఁ డవ్యయుండు విమలచరిత! 435

౧౫ అధ్యాయము.

వామనచరిత్రకథాప్రారంభము.

వ. అనిన భూవరుం డిట్లనియె. 436

మ. బలి నంభోరుహనేత్రుఁ డేమిటికినై పాదత్రయిన్ వేఁడె? ని
శ్చలుఁడున్ బూర్ణుఁడు లబ్ధకాముఁడు రమాసంపన్నుఁడై తాఁ బర
స్థలికిన్ దీనునిమాడ్కి నేలచనియెం? దప్పేమియున్ లేక ని
ష్కలుషుణ్ బంధన మేలచేసెను? వినం గౌతూహలం బయ్యెడిన్. 437

వ. అనిన శుకుం డిట్లనియె. 438

సీ. పురుహూతుచే నోడ్చి పోయి భార్గవులచే
బలి యెట్టకేలకు బ్రదికి వారి
చిత్తంబురాఁ గొల్చి శిష్యుఁడై వర్తింప
వారు నాతనిభక్తివలన మెచ్చి
విశ్వజిద్యాగంబు విధితోడఁ జేయింప
భవ్యకాంచనపట్టబద్ధరథము
సర్కవాజులఁ బోలు [1]హరులుఁ గంఠీరవ
ధ్వజము మహాదివ్య ధనువుఁ బూర్ణ

తే. తూణయుగళంబుఁ గవచంబుఁ దొలుతహోమ
పావకుం డిచ్చె నమ్లానపద్మమాలఁ
గలుషహరుఁడగు తనతాత కరుణ నొసఁగె
సోమసంకాశశంఖంబు శుక్రుఁ డిచ్చె. 439

వ. ఇవ్విధంబున. 440

క. పాణియు రథియుఁ గృపాణియుఁ
[2]తూణియు ధన్వియును స్రగ్వి తురగియు [3]దేహ
త్రాణియు ధిక్కృతవిమత
ప్రాణియు మణికనకవలయపాణియు నగుచున్. 441

మ. పలుదానంబుల విప్రులం దనిపి [4]తద్భద్రోక్తులం బొంది పె
ద్దలకున్ మ్రొక్కి విశిష్టదేవతల నంతర్భక్తిఁ బూజించి ని

1 గుఱ్ఱము. 2 అమ్ములపొదిగలవాఁడు 3 కవచము కలవాఁడు 4 వారిమంగళా శీర్వచనములను

ర్మలుఁ బ్రహ్లాదునిఁ జీరి నమ్రశిరుఁడై రాజద్రథారూఢుఁడై
వెలిఁగెన్ దానవభర్త శైలశిఖరోద్వేల్లద్దవాగ్నిప్రభన్. 442

క. దండితమృత్యుకృతాంతులు
ఖండితసురసిద్ధసాధ్యగంధర్వాదుల్
పిండితదిశు లమరాహిత
దండాధీశ్వరులు సములు దన్నుం గొలువన్. 443

క. చూపుల గగనము మ్రింగుచు
నేపున దివి భువియు నాత లీతల సేయన్
రూపించుచు దనుజేంద్రుఁడు
ప్రాపించెను దివిజనగరపథము నరేంద్రా! 444

వ. ఇట్లు బలవంతుఁడగు బలి సురేంద్రుని సాధింప సమకట్టి దండగమనంబు సేసి [1]నిడుదపయనంబులం జని చని. 445

మ. కనియెం బుణ్యజనౌకమున్ విగతరోగస్వప్నపీడాన్నఖా
దనసంశోకముఁ బుష్పపల్లవఫలోద్దామద్రుమానీకమున్
స్వనితోద్ధూతపతాకముం [2]బ్రవిచరద్వైమానికానీకమున్
ఘనగంగాసలిలైకమున్ మఘవయుక్తశ్రీకమున్ [3]నాకమున్.

వ. కని రక్కసులఱేఁడు వెక్కసంబై [4]చాల్పుగల [5]వేల్పులనెలవు దఱియం జొచ్చి చెచ్చెర ముందటికిం జనిచని ముందట నెడపడక మొన మోపి యిగురుచు చిగురు తలిరాకుజొంపంబున నన మొగుడు మొగ్గ యరవిరినెఱివిరి గుత్తి పిందె పూఁప దోరగాయ పండు గెలకతండంబుల వ్రేగులాఁగ లేక మూఁగి వీఁగివ్రేఁకలగు మ్రాఁకుల ప్రోకలకుఁ బేట లగు పెందోఁటలును, దోఁటల గాటంబులై నివ్వటిల్లు [6]మవ్వంపుఁ గ్రొవ్విరులకుఁ [7]గవలువివ్వక [8]కసిమసలు కలిగి ముసరి కొసరి పూని పోని తేనియలాని [9]పిసరు గలిగి [10]మసరు కవిసి క్రొవ్వి రిమ్మగొని జుమ్ముజుమ్మనుచు జంజాటించు తేఁటిదాఁటులును, దాఁటువడక నాఁటుకొని పూ విడుచు

1 దీర్ఘప్రయాణములచేత 2 లెస్సగా సంచరించు దేవతల సంఘము గలది. 3 స్వర్గమును 4 వైశాల్యము 5 స్వర్గము 6 కోమలములైన 7 జంటలు 8 ఒకానొక ధ్వని 9 వేగము. 10 ఆవేశము.

కూడి జోడువీడక క్రొమ్మావులకమ్మనికొమ్మల నిమ్ముల మసరి పసిమిగలకిసలయమ్ములు వాసంగమెసంగి [1]కిసరుపడక [2]కసరు సెడి బిట్టురట్టడితనంబు లలమి మించి [3]కరాళించు కోయిలల మొత్తంబులును, మొత్తంబులై చిత్తంబుల మత్తంబులుగఁ దత్తఱంబునం దియ్యనిపండ్లకుఁ గయ్యంబులు సేసి చయ్యన [4]నేసరేఁగి [5]జేసంబులు [6]గాసంబులు గొని వాసికెక్కి పలుబాస లాడుచు బహుప్రకారంబు లగు కీరంబులునుఁ, గీరంబులకు సరిఁగడచి మింటనంట నెగసి పెట్టలం బట్టి చీరి యిట్టట్టు చనక నెట్టుకొని నెలవుల వ్రాలుచు నింపుగలరవమ్ములుఁ గలుఁగు [7]కలరవమ్ములును గలరవమ్ము లలరం [8]దొలంకుల కొలంకుల కెలంకులఁ గడంకల బ్రియల నిడుకొని క్రిమ్మి దొమ్మి సేసి మెలదమ్మితూఁడుల వాఁడులగు చంచువులం జించి మెక్కి చొక్కి మిక్కిలి కలఁకలం బడుచు నలబలంబులు సేయు కలహంసంబులును, హంసరుచిజనిత వికసనముల వికవిక నగుచుం బసఁగలిగి మిసమిసమెఱచు పసిఁడి కెందమ్ము లిందిరామందిరమ్ముల చందమ్ములుగ నందమ్ము లగు కొలంకులును, కొలంకుల కరళ్ళఁ దశీసి వడవడ వడంకుచు నల్లిబిల్లులు గొనిసాఁగిన తీగెయిండ్లగండ్ల యీఱముల [9]దోరములు సెడి పలువిరుల కమ్మవలపుల వ్రేఁగునం దూఱలేక యీడిగిలం బడుగాడ్పులును, గాడ్పులవలన నెగసి గగనమున విరిసి పలువన్నెలం జెన్నగు మేలుకట్టుఁ బుట్టంబుల తెఱంగున దట్టంబులయిన కుసుమపరాగంబులును, బరాంగంబుల సరాగంబులగు వాఁగుప్రవంతలచెంతలగుంపులుగొనిగఱికిజొంపంబుల [10]లంపులుదిని [11]మంపులు గొని పెల్లునెదుర్లు వెట్టుచు నొదుఁగుల పొదుగులు గదల వాడల వాడలజాడలం బరుగు లిడు దూడల క్రీడల వేడుకలం గూడుకొని యిండ్లవాకిండ్లకుం జేరి పౌరులకోరికల [12]కనుసారిక లగుచు

1 కిసరు పడక = కోపింపక 2 కసరుచెడి = లజ్జ విడిచి. 3 గద్దించు. 4 (కూతలు వెట్టు) 5 విజృంభించి. 6 పేసెములు. 7 ఆహారములు 8 పావురములు 9 కొలంకులు = అలలు. 10 దోరములు = ద్వారము 11 దొంగమేఁతలు. 12 మంపులు = మత్తు (మైకము) 13 అనుసారికలు = అనుసరించునవి.

సమృతంబుఁగురియు కామధేనువులునుఁ గామధేనువులకు నిలువ
నీడలగుచు నడిగిన జనమ్ములకు ధనమ్ములు ఘనమ్ముగఁబడుకుకల్ప
తరువులును, కల్పతరువుల పల్లవమంజరులఁ గుంజరులకు విఱిచి
యిచ్చుచు మచ్చికలకలిమి నిచ్చ మెచ్చుచు గృతకగిరులచఱుల
సిరులనడరు పడఁతులనడలకు గురువులగుచు మెఱయు మురువుల
నొత్తరించు మత్తేభంబులును, నిభంబుల సరస నొరసికొని వరుసఁ
బరుసఁదనము లెసలి సుకరము లగు మకరతోరణస్తంభంబులును,
తోరణస్తంభంబులచేరువని నిలిచి చెఱకువిలుతుం డొఱవెఱకిన
బెడిదము లగు నవకంపుమెఱుఁగుం [1]జిగురుటడిదముల తెఱంగున
నిలుకడసంపదలు గలుగు [2]శంపల సొంపునం గరచరణాది శాఖలు
గల చంద్రరేఖలపోఁడిమిని వాహినిగల మోహినీవిద్యల గ్రద్దనఁ
జూపులకుం దీపు లొదవించుచు మర్మకర్మంబు వశంబు లరయు
యశంబులు గలిగి యనూనంబు లగు విమానంబు లెక్కి చచ్చి
వచ్చిన సచ్చరిత్రులకుం జెచ్చెర నెదురు చని తూఁకొని తోడ్కొని
పోవు రంభాదికుంభికుంభకుచలకలకలంబులును, గలహంసకారండవ
కోకసారసబృందసుందరసుందరియు నిందీవరారవిందనందనిందిం
దిరయు [3]నభంగయు [4]సభంగయునగు గంగ నింగికిం బ్రాఁగెనోయని
మిగుల దిగులుపడఁ బొగడ్తల కెక్కిన యగడ్తలును, నగడ్తల
మిన్నేటి లేటసీటనీటులీనుపాటి నూటిచల్లులాటల మేటికూటువలు
గొనుచు నేచిన [5]ఖేచరకన్యకావారంబులును, వారవనితాసుపూ
జితవిరాజిత దేహళీపాటనంబులగు గోపురకనకకవాటంబులును,
గవాటవేదికాఘటితమణిగణకిరణోదారంబులగు నింద్రనీలస్తంభగం
భీరతలునుగంభీరవిమలకమలరాగపాలికామాలికావారంబులగుచతు
ర్ద్వారంబులును, ద్వారదేశంబుల చావిళ్ళం గావ ళ్ళుండి ప్రొద్దువోక
పెద్దరక్కసుల వేల్పులకయ్యంబులు నెయ్యంబులం జెప్పికొనుచున్న
యత్రశస్త్రధారులు శూరులునయిన మహాద్వారపాలకవీరులును,
వీరరసజలధివేలోదారంబులయి శుద్ధస్ఫటికబద్ధమహోత్తానంబులగు

1 చిగురుకత్తులు. 2 మెఱుపులు 3. నభంగ = ఆకాశమునందుండునది.
4. సభంగ = కెరటములతోఁ గూడినది. 5. దేవకన్యకల సంఘము.

సోపానసుభగాకారంబులును, సుభగాకారప్రదీపంబులగు వజ్రమహారజత[1]వప్రంబులును, వప్రోపరివప్రజకుడ్యశిరోభాగచంద్రకాంత తరుణహిమకరకిరణముఖరంబులగు [2]సాలశిఖరంబులును, శిఖరస్తోమధామనికృత్తతారకంబులును, దారకారమణిశిలాకతోరంబు లగుచు మిగుల గరిత యగు నగరిసిరి మీఁజినమరు మొగులు వోడగని నిలుకడలకు నలువ నడిగికొని పడసిన పసిఁడి తెరలవలువల బెడంగునం దోరంబులగు ప్రాకారంబులును, ప్రాకారకాంచనాంచితయుద్ధసన్నద్ధమహోఖర్వగంధర్వవాహినీపాలకంబులగు [3]మరకతాట్టాలకంబులును, నట్టాలకోత్తుంగవజ్రమయస్తంభోదంచనంబులును, బరభటప్రాణవంచనంబులు సముదంచనంబులునగు [4]దంచనంబులును, దంచనంబుల తుదలు రథంబులచురుసులు నొరసికొనం గోటయీనలియావలి తివియని దివియలకరణి రుచిరములగుచుఁ బచరించు నహిమకరహిమకరమండలంబులును, హిమకరమండలంబు నిద్దంపుటద్దంబని మూఁగి తొంగిచూచుచు నలికఫలకంబులఁ [5]గులకములుఁ గొను [6]నలకములం [7]దుంపి తిలకములం దెఱంగుపఱుచుకొను సమయముల వెనుక నోదిఁగి కదిసి ముకురంబులం బ్రతిఫలితులైనపతులితరసతుల రతుల కనుమతులని [8]కనుకనిఁ మరలి నీడతలంగినఁ గలంగిచని కాంతలువోలయ నలయు ముగుదలకు నేకాంతంబులై గగనసముత్సేధంబులైనరాజసౌధంబులును, సౌధంబుల సీమలముత్తియంపుసరులతోడి నిబ్బరపుగుబ్బచన్నులచెన్నులం బ్రక్కలం జుక్కలపదవులుండ మంకితసౌధశిఖరంబులకు శృంగారంబులయిన [9]భృంగారంబులును, భృంగారశయనజాలతోలి కానిశ్రేణికాదివిశేషరమ్యంబు లయిన హర్మ్యంబులును, హర్మ్యకనకగవాక్షరంధ్రనిర్గతకర్పూరకుంకుమాగరుధూపధూమంబులును, ధూమంబులు జీమూతస్తోమంబు లని ప్రేమంబు లుబ్బ గొబ్బునం [10]డబ్బాటు

1. కోటలు. 2. ప్రాకారములమీఁది శిఖరములు. 3. అట్టాలకము = కోటబురుజు. 4 ఫిరంగులు. 5 గుమిగూడు 6 ముంగురులను 7 తొలఁగించి. 8 తొట్రుపాటుతో (సంభ్రమముతో) 9 బంగారు గిండి. 10 అకస్మాత్తుగా.

పబ్బంబు లబ్బె నని మరులుఁగొని పురులవన్నియల సిరులు [1]సరులు గొనం [2]గుటవిటపములఁ దటపెట నటించుచుఁ బలుకులు విరిసి [3]కికురువోడుచు వలఱేని [4]మఱువుఁజదువుల టీక లనం గేక లిడు నెమిళ్ళును, నెమిళ్ళపురుల నారలునారులగు రతనంపు విండ్ల నినదము లను తలంపుల దోఁకలు జడిసి వీఁకలు మెఱసి మూఁకలుఁ గొని దివి కెగరి రవికిం గవిసిన రాహువుక్రియం దివిఁ దడంబడు పడగలును, బడగలును గొడుగులును దమకు నాలంబులకు [5]నడియాలంబులుగఁ దోరంబులైన సారంబుల బీరంబులు మెఱసి బెబ్బులులగబ్బునం గరులసిరుల సింగంబులభంగుల శరభంబులరభసంబుల ధూమకేతువులరీతుల వైరింజీరికిం గొనక శంకలుడిగి ఱంకెలిడుచు లంకెలై లెక్కకు మిక్కిలి యగుచు రక్కసుల చక్కటి [6]యెక్కటికయ్యముల దయ్యము లెఱుంగం దిరుగు వీరభటకదంబంబులును, గదంబకరవాలశూలాదుల మెఱుంగులు మెఱపుల తెఱంగులం దిశల చెఱంగులం దుఱంగలింప నేమినినదంబులు దలములగు నుఱుములుగ [7]నడమొగిళ్ళ పెల్లునం బ్రివర్షితరథికమనోరథంబులగు రథంబులగములును, గములుఁ గొని గమనవేగంబువలన [8]హరిహరుల నగి గాలిం జాలింబడం గేలికొని ఘనంబులగు మనంబులం దెగడి నెగడు సురంగంబులగు తురంగంబులును, రంగదుత్తుంగవిశదమదకల [9]కరటికటతటజనితమదసలిలకణగణవిగళితదశశతనయనభుజసరళమిళితలలితనిఖిలదిగధిపతిశుభకరకనకకటకఘటితమణిసముదయసముదితరేణువర్గదుర్గమంబులయిన నిర్వ్యాక్రిమార్గంబులును, మార్గస్థలోపరిగతాగతశతశతాయుతానేకగణనాతీతరోహణాచలతటవిరాజమానంబులగు విమానంబులును, విమానవిహారమాణసుందరసుందరీసందోహసంవాదితభూరిభేరీవీణాపణవమృదంగకాహళశంఖాదివాదనానూనగానసాహిత్యనృత్యవిశేషంబులును, విశేష

1 గుత్తులు గూడగా (గుంపుకొనగా అనియర్థము) 2 చెట్టుకొమ్మలయందు. 3 వంచించు 4 రహస్యపు చదువులు (కామశాస్త్రములన్నమాట) 5 గుర్తులుగా. (అడ్డెయాళం) చిహ్నము కల రాజధ్వజాదికము. 6 అసహాయమైన యుద్ధము 7 నడచుచున్న మేఘములు 8 సూర్యుని గుఱ్ఱములను. 9 కరటి = ఏనుఁగు.

రత్నసంఘటితశృంగారశృంగాటక వాటికా దేహ దేహళీప్రదీపంబులు
ను, దీపాయమానమానితసభామండపఖచితరుచిరచింతారత్నంబు
లునుం గలిగి, రత్నాకరంబునుం బోలె ననిమిషకౌశిక వాహినీవిశ్రు
తంబయి, శ్రుతివాక్యంబునుంబోలె నకల్మషసువర్ణప్రభూతంబయి,
భూతపతికంఠంబునుం బోలె [1]భోగిరాజకాంతంబయి, కాంతాకుచం
బునుం బోలె [2]సువృత్తంబయి, వృత్తజాతంబునుం బోలె సదా
[3]గురులఘునియమాభిరామంబయి, రామచంద్రుని తేజంబునుంబోలె
[4]ఖరదూషణాదిదోషాచరానుపలబ్ధంబయి, [5]లబ్ధవర్ణుచరిత్రంబునుం
బోలె [6]విమలాంతరంగద్యోతమానంబయి, మానధనుని నడవడి
యునుంబోలె [7]సన్మార్గభాతిసుందరంబయి, సుందరోద్యానంబునుం
బోలె [8]రంభాంచితాశోకపున్నాగంబయి, పున్నాగంబునుం బోలె
[9]సురభిసుమనోవిశేషంబయి, శేషాహిమస్తకంబునుం బోలె [10]నున్న
తక్షమావిశారదంబయి శారదసముదయంబునుం బోలె ధవళజీమూ
తప్రకాశితంబయి, సితేతరాజినదానంబునుం బోలె [11]సరసతిలోత్త
మంబయి, యుత్తమపురుషవచనంబునుంబోలె ననేకసుధారసప్రవ
ర్షంబై, వర్షాదియునుంబోలె [12]నుల్లసదింద్రగోపంబయి, గోపతిమూ
పురంబునుంబోలె [13]విచక్షణార్యాలంకృతంబయి, కృతార్థంబయిన

1 (1) సర్పరాజు (2) భోగములు కల రాజులు 2 (1) మిక్కిలి గుండ్రనిది (2) ఉత్తమ ప్రవర్తన గలది. 3 (1) పెద్ద పిన్నయను భేదముచే నింపైనది. (2) గురువులు లఘువులను మాత్రాభేదము కలది. 4 (1) తీవ్రదూషణములు మొదలయిన దోషములు చేయువారికిఁ బొందరానిది. (2) ఖరుఁడు, దూషణుఁడు మొదలయిన రాక్షసులకు జేరరానిది. 5 కీర్తిశాలి. 6 (1) స్వచ్ఛమైన మనస్సుచేఁ బ్రకాశించునది. (2) స్వచ్ఛమై మనోహరమైన రంగస్థలములచేఁ బ్రకాశించునది. 7 (1) మంచి మార్గము యొక్క కాంతిచే చక్కనిది. (2) ఆకాశమార్గమందలి కాంతిచే నందమైనది. 8 (1) రంభా + అరటులు, అంచిత = ఒప్పెడి అశోకములు, పున్నాగములు కలది (2) రంభా = రంభతో, అంచిత = ఒప్పెడి, పున్నాగంబు = ఉత్తమ పురుషులు కలది 9 (1) సురభి = పరిమళించు, సుమనస్ = పువ్వులచే, విశేషమయినది. 2 సురభి = కామధేనువు తోడను, సుమనస్ = దేవతలచేతను, విశేషమయినది. 10 (1) ఎక్కువ 11 (1) రసముతోఁ గూడిన మంచినువ్వులు కలది. (2) సరసురాలైన తిలోత్తమయను నప్సరసకలది. 12 (1) ఇంద్రగోపములను పురుగులు కలది. [2] ఇంద్రునివలని రక్షణను కలది. 13 (1) విచక్షుస్ = ముక్కంటిచేతను (శివునిచేతను) ఆర్యా = పార్వతిచేతను అలంకృతము(2) విశేషదృష్టికల పెద్దలచే అలంకృతము.

యమరావతీనామనగరంబు సేరం జని కోటచుట్టునుం బట్టు గలుగ బలంబులం జలంబున విడియంబంచి పొంచి మార్గంబు లెల్ల నరికట్టుకొని యేమఱకయుండెను. అంత. 447

క. [1]మాయరు నగవులకును గను
మాయరుకాలంబుకతన ముదియరు ఖలులన్
డాయరు [2]పుణ్యజనంబులఁ
బాయరు సురరాజువీటిప్రమదాజనముల్. 448

వ. అప్పుడు. 449

క. దుర్భరదానవశంఖా
విర్భూతధ్వనులు నిండి విబుధేంద్రవధూ
గర్భములు వగిలి లోపలి
యర్భకతతు లావు రనుచు నాక్రోశించెన్. 450

వ. అంత. 451

సీ. బలి వచ్చి విడియుట బలభేది వీక్షించి
గట్టిగాఁ గోటకుఁ గాపు వెట్టి
దేవవీరులుఁ దాను దేవతామంత్రిని
రప్పించి సురవైరి రాకఁ జెప్పి
ప్రళయానలునిభంగి భాసిల్లుచున్నాఁడు
ఘోరరాక్షసులను గూడినాఁడు
మన కోడి చని నేఁడు మరలవీఁ డేతెంచె
నేతపంబున వీని కింత వచ్చె

ఆ. నీదురాత్మకునకు నెవ్వఁడు దోడయ్యె
నింక వీనిగెల్వ నేది త్రోవ
యేమి సేయువార మెక్కడి [3]మగఁటిమి
[4]నెదురుమోహరింప నెవ్వఁ డోపు. 452

క. మిక్రింగెడు నాకాశంబును
బొంగెడు నమరాద్రికంటెఁ బొడవై వీఁడున్

---

1 మలినము పడరు లేక నశింపరు. 2 పుణ్యాత్ములను. 3 పౌరుషము(పరాక్రమము)
4 ఎదురు తిరుగుటకు (ఎదురు వ్యూహముపన్నుటకు)

మ్రింగెడుఁ గాలాంతకుక్రియ
భంగించును మరలఁబడ్డఁ బంకజగర్భున్. 453

క. ఈరాదు రాజ్య మెల్లనుఁ
బోరాదు రణంబు సేయఁ బోయితిమేనిన్
రారాదు దనుజుచేతను
జారా దిటమీఁద నేమి జాడ మహాత్మా! 454

వ. అనిన సురరాజునకు సురాచార్యుం డిట్లనియె. 455

సీ. వినవయ్య! దేవేంద్ర! వీనికి సంపద
బ్రహ్మవాదులు భృగుప్రవరు లర్థి
నిచ్చిరి రాక్షసు నెదురను నిలువంగ
హరి యీశ్వరుఁడు దక్క నన్యజనులు
నీవును నీసముల్ నీకంటె నధికులుఁ
జాలరు. రాజ్యంబు చాలునీకు
విడిచి పోవుట నీతి విబుధనివాసంబు
విమతులు నలఁగెడు వేళసూచి

తే. మరలి మఱునాఁడు వచ్చుట మామతంబు.
విప్రబలమున వీనికి వృద్ధివచ్చె.
వారిఁగైకొననిట మీఁద వాఁడి సెడునుఁ
దలఁగు మందాఁక రిపుఁ బేరు దలఁపవలదు. 456

క. పరు గెలువ వలయు నొండెను
సరి పోరఁగవలయు నొండె జావలెనొండెన్
సరి గెలుపు మృతియు దొరకమి
సరసంబుగ మున్న తొలఁగి చనవలె నొండెన్. 457

వ. అనినఁ [1]గార్యకాలప్రదర్శి యగు బృహస్పతివచనంబు విని కామ
రూపులై దివిజులు త్రివిష్టపంబు విడిచి తమతమ పొందుపట్లకుం
జనిరి. బలియునుం బ్రతిభటవివర్జిత యగు దేవధాని నధిష్ఠించి జగ
త్త్రయంబునుం దనవశంబు సేసికొని విశ్వవిజయుండై పెద్దకాలంబు

1 కార్యమునకుఁ బూనవలసిన సమయమును దెలుపువాఁడు.

రాజ్యంబు సేయుచుండె. శిష్యవత్సలు లగు భృగ్వాదు లతనిచేత శతాశ్వమేధంబులు సేయించిరి. తత్కాలంబున. 458

శా. అర్థుల్ వేఁడరు, దాతలుం జెడరు, [1]సర్వారంభముల్ పండుఁ, బ్రి
త్యర్థుల్ లేరు, మహోత్సవంబులనుదే వాగారముల్ వొల్చుఁ, బూ
ర్ణార్థుల్ విప్రులు, వర్షముల్ గురియుఁ గాలార్హంబులై ధాత్రికిన్
సార్థంబయ్యె వసుంధరాత్వ మసురేంద్రాధీశు రాజ్యంబునన్. 459

వ. అంత. 460

౧౬ అధ్యాయము

సీ. తనతనూజులపోవ్రిలు దనుజులు గొనుటయు
వేల్పు లెల్లను డాఁగ వెడలుటయును
భావించి సురమాత పరితాపమునఁ బొంది
వగ ననాథాకృతి వనరుచుండ,
నాయమ్మ పెనిమిటి యగుకశ్యపబ్రహ్మ
మఱియొకనాఁడు సమాధి మాని
తనకుటుంబిని యున్న ధామమునకు నేగి
నాతిచే విహితార్చనములు వడసి

ఆ. వంది వ్రాలి కుంది వాడినయిల్లాలి
వదనవారిజంబు వడుపుఁ జూచి
చేరఁ దిగిచి మగువ చిబుకంబు వుడుకుచు
వారిజాక్షి! యేల వగచె దనుచు. 461

వ. అమ్మహాత్ముం డిట్లనియె. 462

మ. తెఱవా! విప్రులు పూర్ణులే! చెలఁగునే దేవార్చనాచారముల్?
తఱితో వేలుతురే గృహస్థులు? సుతుల్ ధర్మానుసంధానులే?
నెఱి నభ్యాగతకోటి కన్నమిడుదే! నీరంబునుం బోయుదే?
మఱి లే కర్థుల దాసులన్ సుజనులన్ మన్నింపుదే పైదలీ! 463

1 సర్వప్రయత్నములు 2 మఱిలేక = తరువాత యనుటలేక. (తరువాత తరువాత యనకుండా) (లేదా) యింకొకటిలేక అనఁగా వేఱొకపని లేకయని యర్థము.

ఆ. అన్నమైనఁ ¹దక్రమైనఁ దోయంబైన
శాకమైన దనకుఁ జరగుకొలఁది
నతిథిజనుల కడ్డ మాడక యిడరేని
లేమ వారు కలిగి లేనివారు. 464

వ. మఱియు. 465

ఆ. నెలఁత విష్ణునకును నిఖిలదేవాత్మున
²కాననంబు శిఖియు నవనిసురులు
వారు దనియఁ దనియు వనజాతలోచనుఁ
డతఁడుఁ దనియ జగము లన్నిఁ దనియు. 466

క. బిడ్డలు వెఱతురె నీకఱ
గొడ్డంబులు సేయ కెల్ల కోడండ్రును మా
³ఱొడ్డారింపక నడతురె
⁴యొడ్డము గాకున్న దే మృగేక్షణ యింటన్. 467

వ. అని పలికినం బతికి సతి యిట్లనియె. 468

ఉ. ప్రేమ యొకింత లేక దితి బిడ్డలు బిడ్డలబిడ్డలున్ మహా
భీమబలాఢ్యులై తనదు బిడ్డల నందఱఁ దోలి సాహసా
క్రామితవైరు లయ్యు నమరావతినేలుచు నున్నవారు నీ
కేమని విన్నవింతు హృదయేశ్వర! మేలుఁదలంచి చూడవే! 469

క. అక్కాచెల్లెండ్రయ్యును
దక్కరు నాతోడిపోరుఁ దానున్ దితియున్
రక్కసులు సురల మొత్తఁగ
నక్కట వల దనదు చూచు నౌనౌ ననుచున్. 470

సీ. ⁵ఎండకన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు
పలుపంచలును జాలిఁ బడియె నేఁడు

1. మజ్జిగ. 2. అననంబు = ముఖము. 3. ఒడ్డారింపక = ద్వేషించు. (వ్యతిరేకించు). 4. అడ్డంకి (నిరోధము). 5. ఎండయన్న నేమో యెఱుఁగనిది అంతఃపురమందే మసలునది. సుకుమారురాలన్నమాట.

త్రిభువనసామ్రాజ్యవిభవంబుఁ గోల్పోయి
దేవేంద్రుఁ డడవులఁ దిరిఁగె నేఁడు
కలిమి గారాబు బిడ్డలు జయంతాదులు
[1]శబరార్భకుల వెంటఁ జనిరి నేఁడు
నమరుల కాధారమగు నమరావతి
యసురుల కాటపట్టయ్యె నేఁడు

ఆ. బలి జగములనెల్ల బలియుచు నున్నాఁడు
వాని గెలువరాదు వాసవునకు
యాగ భాగమెల్ల నతఁ డాహరించునుఁ
గడఁగి సురల కొక్క కబళమీఁడు. 471

క. ప్రజలకు నెల్లను సముఁడవు
ప్రజలను గడుపారఁ గన్న బ్రహ్మవు నయ్యుం
బ్రజలందు దుష్టమతులను
నిజముగ శిక్షింపవలదె నీవు మహాత్మా! 472

మ. సురలన్ సభ్యుల నాప్తులన్ విబుధులన్ శోకంబువారించి ని
ర్జరధానిన్ నిలుపంగ రాత్రిచరులన్ శాసింప సత్కార్యమే
వెర వేరీతి ఘటిల్లు నట్టి క్రమమున్ వేగంబ చింతింపవే
కరుణాలోకసుధాఝురిం దనుపవే కళ్యాణసంధాయకా! 473

వ. అనిన మనోవల్లభపలుకు లాకర్ణించి ముహూర్తమాత్రంబు చిం
తించి విజ్ఞానదృష్టి నవలంబించి భావికాలకార్యంబు విచారించి
కశ్యపబ్రహ్మ యిట్లనియె. 474

మ. జనకుం డెవ్వఁడు జాతుఁ డెవ్వఁడు [3]జనిస్థానంబు లెచ్చోటు సం
జననం బెయ్యది మేను లేకోలఁదిఁ సంసారంబు లేరూపముల్
వినుమా యింతయు విష్ణుమాయ దలఁపన్ వేఱేమియున్ లేదు మో
హ నిబంధంబు నిదాన మింతటికి జాయా! విన్నఁబో నేటికిన్. 475

వ. అను నయ్యనునుం గాలోచితకార్యంబు సెప్పెను. 476

1. బోయ పిల్లలు. 2. పుట్టినవాఁడు. 3. జన్మస్థలము.

మ. భగవంతుం బరముం జనార్దనుఁ గృపాపారీణు సర్వాత్మకున్
జగదీశున్ హరిసేవ సేయు మతఁడున్ సాంగత్యముం బొంది నీ
కగు నిష్టార్థములెల్ల నిచ్చు నిఖిలార్థావాప్తి సేకూరెడిన్
భగవత్సేవలఁ బొందరాదె బహుసౌభాగ్యంబులం బ్రేయసీ!

వ. అనిన గృహస్థునకు గృహిణి యిట్లనియె. 478

క. నారాయణుఁ బరమేశ్వరు
నేరీతిఁ దలంతు? మంత్ర మెయ్యది? విహితా
చారంబు లేపరికారములు?
లారాధన కాలమెట్టి? యానతి యీవే! 479

వ. అనినఁ గశ్యపప్రజాపతి సతికిఁ బయోభక్షణం బనువ్రతం బుపదే
శించి తాత్కాలంబునఁ దన్మంత్రంబును దద్విధానంబును దదుప
వాసదానభోజనప్రకారంబులును నెఱిఁగించెను.

౧౭ అధ్యాయము

వ. అదితియును ఫాల్గునమాసంబున శుక్లపక్షంబునఁ బ్రథమదివసంబు
నన్ దొరకొని పండ్రెండు దినంబులు హరిసమర్పణంబుగా వ్రతం
బుసేసి వ్రతాంతంబున నియతయైయున్నయెడఁ జతుర్బాహుండును
బీతవాసుండును శంఖచక్రగదాధరుండును నైన నేత్రంబుల కగో
చరుండైన నారాయణదేవుండు ప్రత్యక్షంబైనం గనుంగొని. 480

క. కన్నుల సంతోషాశ్రులు
చన్నులపైఁ బఱవఁ బులకజాలము లెసఁగన్
సన్నతులును సన్నుతులును
నున్నతరుచిఁ జేసి నిటలయుక్తాంజలియై. 481

క. చూపుల శ్రీపతిరూపము
నాపోవక త్రావి త్రావి హర్షోద్ధతయై
[1]వాపుచ్చి మందమధురా
లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్. 482

1. నోరు తెఱచి (నోరెత్తి) బిగ్గరగా అన్నమాట.

సీ. యజ్ఞేశ విశ్వంభరాచ్యుతశ్రవణ మం
గళనామధేయ లోకస్వరూప
యాపన్నభక్తజనార్తివిఖండన
దీనలోకాధార తీర్థపాద
విశ్వోద్భవస్థితివిలయకారణభూత
సంతతానంద శశ్వద్విలాస
యాయువు దేహంబు ననుపమలక్ష్మియు
వసుధయు దివముఁ ద్రివర్గములును

తే. వైదికజ్ఞానమును ముక్తి వైరిజయము
నిన్నుఁ గొలువని నరులకు నెఱయఁగలదె
వినుతమందార గుణహార వేదసార
ప్రణతవత్సల పద్మాక్ష పరమపురుష. 483

ఆ. అసురవరులు సురల నదలించి బెదరించి
నాక మేలుచున్ననాఁటనుండి
కన్నకడుపుఁగాన కంటఁ గూరుకు రాదు
కడుపుఁబొక్కు మాన్పి కావవయ్య. 484

వ. అనిన విని దరహసితవదనుండయి యాశ్రితకామధేనువైన యప్పర
మేశ్వరుం డిట్లనియె. 485

శా. నీకోడండ్రును నీకుమారవరులున్ నీనాథుఁడున్ నీవు సం
శ్లోకింపన్ సతులుంబతుల్ మిగుల సమ్మోదింప రాత్రించరుల్
శోకింపన్ భవదీయగర్భమునఁ దేజోమూర్తి జన్మించెదన్
నాకున్ వేడుక పుట్టు నీసుతుఁడనై నర్తించి వర్తింపఁగాన్. 486

మ. బలిమిన్ దైత్యులఁ జంపరాదు వినయోపాయంబునంగాని; సం
చలనం బొందకు నేను నీనియతికిన్ సద్భక్తికిన్ మెచ్చితిన్;
బలివిద్వేషియు నా నిలింపగణముం [1]పౌలోమియున్ మెచ్చ దై
త్యులరాజ్యంబు హరింతు నింద్రునికి నిత్తున్ దుఃఖ మింకేటికిన్.

1. శచి (పులోముని కూతురు)

క. నీరమణుని సేవింపుము
నారూపము [1]మానసించి నలినీగర్భా
గారంబు వచ్చి చొచ్చెద
గారామునఁ బెంప వమ్మ కరుణన్ నన్నున్. 488

క. ఏలింతు దివము సురలనుఁ
బాలింతు మహేంద్రియువతి భాగ్యశ్రీలం
దూలింతు దానవుల ని
ర్మూలింతు [2]రిపుప్రియాంగముల భూషణముల్. 489

వ. అని యిట్లు భక్తజనపరతంత్రుం డగు పురాణపురుషుం డానతిచ్చి తిరోహితుం డయ్యె. అయ్యదితియుఁ గృతకృత్య యై సంతోషంబునఁ దనమనోవల్లభుం డగు కశ్యపు నాశ్రయించి సేవించు చుండె. అంత నొక్క దివసంబున. 490

ఆ. ఘనసమాధినుండి కశ్యపుఁ డచ్యుతు
నంశ మాత్మ నోలయ నదితియందుఁ
దనదువీర్య మధికతరము సేర్చెను గాలి
శిఖిని దారువందుఁ జేర్చినట్లు. 491

వ. ఇట్లు కశ్యపచిరతరతపస్సంభృతవీర్యప్రతిష్ఠితగర్భయై సురల తల్లి యుల్లంబున నుల్లసిల్లుచు నుండె నంత. 492

క. చలచల నై పిదపిద నై
గలలం బై కరుడు గట్టి గళనాళముతోఁ
దల యేర్పడి [3]గర్భం బై
[4]నెలమసలం [5]జీరచిక్కె నెలఁతకు నధిపా! 493

క. నెలఁతకుఁ జూలై నెలరె
న్నెల లై మఱి మూఁడు నాల్గు నెల లై వరుసన్
నెల లంత కంత కెక్కఁగ
నెలలును దగ్గఱియె నసురనిర్మూలతకున్. 494

---

1. మనస్సులో నిలిపి (ధ్యానించి) 2. శత్రుభార్యల మేని నగలను. 3. గర్భస్థశిశువు - ఏర్పడి. 2. నెలతప్పగా. 3. కాన్పుఅయ్యెను. (చీరచాలలేదని యర్థము.)

క. మహితతర మేఘమాలా
పిహితాయుతచండభాను బింబప్రభతో
విహితాంగంబులఁ గశ్యపు
గృహిణీగర్భమున శిశువు గ్రీడించె నృపా! 495

క. తనకడుపున నొక యిఱువునఁ
వనరుహగర్భాండభాండ వనధిచయంబుల్.
గొనకొని జగములు నిడుకొని
తనుగతిఁ గడు నడఁగి మడఁగి తనరెను బెడఁగై. 496

వ. అంత నక్కాంతాతిలకంబు క్రమక్రమంబున. 497

మ. నిలిపెన్ ఱెప్పల బృందిమన్, విశదిమన్ నేత్రంబులం, జూచుకం
బుల నాకాళిమ, మేఖలం ద్రఢిమ, నెమ్మోముమారఁగాఁ బాండిమ,
న్వలిమిం జన్నుల, శ్రోణిపాళి గరిమ, న్మధ్యంబునన్ [1]బృంహిమ,
న్వలితాత్మన్ లఘిమన్, మహామహిమ మేనన్, గర్భదుర్వారమై.

క. పెట్టుదురు నుదుట భూతిని
బొట్టిడుదురు మేనఁ బట్టుఁ బుట్టపుదోయిం
బెట్టుదురు వేల్పులమ్మకుఁ
గట్టుదురు సురక్ష పడఁతిగర్భంబునకున్. 499

వ. ఇవ్విధంబున. 500

తే. [2]విశ్వగర్భుఁడు దనగర్భ వివరమందు
బూటపూటకుఁ బూర్ణుఁడై పొటకరింప
బ్రేఁక జూలాలితనమున వేల్పుఁ బెద్ద
పొలఁతి కంతట నీళ్లాడు ప్రొద్దు లయ్యె. 501

వ. తదనంతరంబునం జతురాననుం డరుగుదెంచి యదితి గర్భపరిభ్రమ
విభ్రముండగు నప్పరమేశ్వరు నుద్దేశించి యిట్లని స్తుతియించె. 5(2

1. పెంపు, (లావు) 2. విశ్వము గర్భమందుఁ గలవాఁడు. (విశ్వంభరుఁడు).

సీ. త్రిభువన జయరూఢ దేవ త్రివిక్రమ
పృథులాత్మ [1]శిపివిష్ట [2]పృశ్నిగర్భ
ప్రీత [3]త్రినాభ [4]త్రిపృష్ఠ జగంబుల
కాద్యంతమధ్యంబు లరయ నీవ
జంగమస్థావర జననాదిహేతువు
నీవ కాలంబవై నిఖిల మాత్మ
లోపల ధరియింతు, లోనిజంతుల నెల్ల
[5]స్రోతంబులోఁ గొను చొప్పదోఁప.

తే. బ్రహ్మలకు నెల్ల సంభవ భవన మీవ
దివమునకుఁ బాసి దుర్దశ దిక్కులేక
శోకవార్ధి మునింగిన సురల కెల్లఁ
దేల నాధార మగుచున్న తెప్ప వీవ. 503

క. విచ్చేయు మదితిగర్భము
చెచ్చెర వెలువడి మహాత్మ! చిరకాలంబున్
విచ్చలవిడి లే కమరులు
ముచ్చట పడియున్న వారు ముదమందింపన్. 504

౧౮ అధ్యాయము.

వామనమూర్త్యావిర్భావఘట్టము.

వ. అని యిట్లు కమలసంభవుండు వినుతిసేయు నయ్యవసరంబున. 505

మ. రవిమధ్యాహ్నమునం జరింప గ్రహతారాచంద్రభద్రస్థితిన్
శ్రవణద్వాదశినాఁడు శోణనభిజిత్సంజ్ఞాతలగ్నంబునన్

1. శిపి = పశువు, జీవుఁడు, వారియందంతర్యామియై ప్రవేశించినవాఁడు. శిపివిష్టుడు లేక శిపులు అనగా కిరణములు. వానిచే వేష్టితుఁడు. 2. అదితికిపూర్వజన్మమున పృశ్నియను పేరుగలదు. ఆమె గర్భము అనగా శిశువు కాన పృశ్నిగర్భుఁడు (హరి) లేదా గర్భుఁడు అనవచ్చును. 3. మూఁడులోకములు నాభియందుఁ గలవాఁడు. 4. మూఁడులోకముల పృష్ఠమునందు అనగా మీఁదుగానున్నవాఁడు త్రిపృష్ఠుఁడు. 5. ప్రవాహము.

భువనాధీశుఁడు పుట్టె వామనగతిం బుణ్యవ్రతోపేతకున్
దివిజాధీశ్వరు మాతకుం బరమపాతివ్రత్యవిఖ్యాతకున్. 506

వ. మఱియు నద్దేవుండు శంఖచక్రగదాకమలకలితచతుర్భుజుండునుఁ బిశంగవర్ణవస్త్రుండును మకరకుండలమండితగండభాగుండును శ్రీవత్సవక్షుండును నలినచక్షుండును నిరంతరశ్రీవిరాజితరోలంబకదంబవిలంబితవనమాలికాపరిష్కృతుండును మణికనకాంచితకాంచీవలయాంగదకిరీటహారనూపురాలంకృతుండునుఁ గమనీయకంఠకౌస్తుభాభరణుండును నిఖిలజనమనోహరణుండును నై యవతరించిన సమయంబున. 507

శా. చింతం బాసిరి యక్షతార్క్ష్యసుమనస్సిద్ధోరగాధీశ్వరుల్
సంతోషించిరి సాధ్యచారణమునీశబ్రహ్మవిద్యాధరుల్
గాంతిం జెందిరి భానుచంద్రములు రంగద్గీతవాద్యంబులన్
గంతుల్ వైచిరి మింటఁ గింపురుషులున్ గంధర్వులుం గిన్నరుల్.

క. [1]దిక్కులకావిరి వాసెను
నెక్కువ నిర్మలత నొందె నేడు పయోధుల్
[2]నిక్కె మెఱు నిలిచె ధరణియుఁ
జుక్కలతోఁ ద్రినయును విప్రసురసేవ్యములై. 509

క. ముంపుఁగొని విరులవానల
జొంపంబులు గురియు సురలు [3]సుమనోమధువుల్
తుంపర లెగయఁ బరాగపు
రొంపుల భూభాగ మతినిరూపితమయ్యెన్. 510

వ. తదనంతరంబ. 511

ఆ. ఈ మహానుభావుఁ డెట్లింతకాలంబు
నుదరమందు నిలిచి యుండె ననుచు
నదితి వెఱఁగుపడియె నానందజయశబ్ద
ములను గశ్యపుండు మొగి నుతించె. 512

1. నలుపు. 2. నిక్కు మెఱుపున్, విలాసముతో (ఒప్పుతో). 3. పూలతేనెలు.

వ. అంత నవ్విభుండు సాయుధసాలంకారం బగు తన దివ్యరూపంబు నుజ్జగించి రూపాంతరం బంగీకరించి కపటవటుచందంబున నుప నయనవయస్కుండైన వామనబాలకుండై తల్లిముందటం గుమార సముచితాలాపంబు లాడుచుం గ్రీడించు సమయంబున నదితియుం దనయవిలోకనపరిణామపారవశ్యంబున. 513

ఆ. నన్నుఁ గన్నతండ్రి! నాపాలి దైవమ!
నాతపఃఫలంబ! నాకుమార!
నాదుచిన్నినడుగ నాకులదీపక!
రాఁగదయ్య భాగ్యరాశి వగుచు. 514

క. అన్నా! రమ్మని డగ్గఱఁ
జన్నులపాలేఱుపాఱ సంశ్లేషిణియై
చిన్నారి మొగము నివురుచుఁ
గన్నారం జూచెఁ గన్నకడుపై యుండన్. 515

క. [1]పురుడీబోటికి నిందిర
పురు డంబిక గాక యొరులు పురుడే యనుచున్
బురుటాలికిఁ బదిదినముల
పురుడు ప్రవర్తించి రెలమిఁ [2]బుణ్యపుగరితల్. 516

వ. అంత నబ్బాలునకు సంతసంబున మహర్షులు కశ్యపప్రజాపతిం బురస్కరించుకొని సముచితోపనయనకర్మకలాపంబులు సేయిం చిరి. సవిత సావిత్రి నుపదేశించె. బృహస్పతి యజ్ఞోపవీతంబునుఁ, గశ్యపుండు ముంజియుఁ, గౌపీనం బదితియు, ధరణి కృష్ణాజినం బును, దండంబు వనస్పతి యగు సోముండును, గగనాధిష్ఠాన దేవత ఛత్రంబునుఁ, గమండలువు బ్రహ్మయు, సరస్వతి యక్ష మాలికయు, సప్తర్షులు కుశపవిత్రంబులు నిచ్చిరి మఱియును. 517

క. భిక్షాపాత్రిక నిచ్చెను
యక్షేశుఁడు వామనునకు, నక్షయమగుచున్

1. సాటి, 2. పుణ్యస్త్రీలు,

సాక్షాత్కరించి పెట్టెను
భిక్షకు భవాని పూర్ణభిక్ష సరేంద్రా! 518

క. శుద్ధబ్రహ్మర్షి సమా
రాద్ధుండై విహితమంత్రరాజిఁ జదువుచుం
బోద్ధంబగు ననలంబున
వృద్ధాచారమున వటుఁడు వేల్చెన్ గడఁకన్. 519

బలిచక్రవర్తి కడకు వామనమూర్తి యేతెంచుట.

వ. ఇట్లు కృతకృత్యుండైన [1]మాయామాణవకుండు దేశాంతరసమాగతులగు బ్రాహ్మణులం గొందఱ నవలోకించి యిట్లనియె. 520

క. వత్తురె విప్రులు వేఁడఁగ
నిత్తురె దాతలును వేడ్క నిష్టార్థములం
దెత్తురె మీరును సంపద
లిత్తెఱఁగున దానవీరుఁ డెవ్వఁడొ సెప్పుఁడా! 521

వ. అనిన నఖిలదేశీయులగు భూసురు లిట్లనిరి. 522

మ. కలరుం దాతలు నిత్తురుం ధనములుం గామ్యార్థముల్ గొంచువి
ప్రులు నేనెంతురుగాని యీవిని బలింబోలన్ [2]వదాన్యుండు లేఁ
డలఘుండై యొనరించె సద్వ్రతశతం బాభార్గవానుజ్ఞచే
బలి వేఁడం బడయంగ వచ్చు బహుసంపల్లాభముల్ వామనా!

వ. అని తెలియం జెప్పిన బ్రాహ్మణులవచనంబు లాలకించి లోకంబులకుం బ్రీతి పుట్టింపఁ బయనంబై లాభవచనంబులుఁ గైకొనుచుఁ దల్లిదండ్రుల వీడ్కొని శుభముహూర్తంబునం గదలి. 524

క. ప్రక్షీణదివిజవల్లభ
రక్షాకరతంత్రుఁ డగుచు రాజీవాక్షుం
డాక్షణమున బలియింటికి
భిక్షాగమనంబు సేసెఁ బేసజీకముతోన్. 525

1 మాయాబ్రహ్మచారి. 2 దాత.

క. హరిహరి సిరి యురమునఁ గల
హరి హరిహయుకొఱకు దనుజు నడుగం జనియెన్
బరహితరతమతియుతు లగు
దొరలకు నడుగుటయు నొడలితొడవగుఁ బుడమిన్. 526

క. సర్వప్రపంచగురుభర
నిర్వాహకుఁ డగుటఁ జేసి నెఱిఁ జను దేరన్
[1]ఖర్వుని క్రేఁగు సహింపక
నుర్వీస్థలి గ్రుంగె మ్రొగ్గె నురగేంద్రుండున్. 527

వ. ఇట్లు సని చని. 528

క. శర్మద [2]యమదండక్షత
వర్మద నతికఠినముక్తి వనితాచేతో
[3]మర్మద నంబునివారిత
దుర్మద నర్మదఁ దరించెఁ ద్రోవన్ వటుఁడున్. 529

వ. దాఁటి తత్ప్రవాహంబున కుత్తరతటంబునందు. 530

శా. చండస్ఫూర్తి వటుండు గాంచె [4]బహుశాఖాజల్పనిర్ఘాటంబు [5]ను
ద్దండాహూతమునీభ్యబిభ్యదమృతాంధస్సిద్ధసంఘాటంబు వే
దండాశ్వధ్వజినీకవాటము మహోద్యద్ధూమసంఛన్నమా
ర్తాండస్యందనఘోటమున్ బలిమఖాంతర్వేదికావాటమున్. 531

వ. కని దానవేంద్రుని హయమేధవాటి దఱియం జొచ్చు నయ్యవసరంబున. 532

శా. శంభుండో హరియో పయోజభవుఁడో చండాంశుఁడో వహ్నియో
[6]దంభాకారత వచ్చెఁ గాక ధరణిన్ ధాత్రీసురుం డెవ్వఁడీ

1 పొట్టివాఁడు. 2 యముని దండమువలనఁ గలుగు దెబ్బలకుఁ గవచనము నొసంగునది. (యమదండనము దగులనీదని యర్థము) 3......మర్మగ = రహస్యము తెలుపునది. 4 పెక్కురీతుల పలుకు రక్కసులుగలది. 5 ఉద్దండ = అధికముగా, ఆహూత = పిలువఁబడిన ముని + ఇభ్య = మునిశ్రేష్ఠులవలన, బిభ్యత్ = బెదరుచున్న, అమృతాంధస్ = దేవతలయొక్కయు, సిద్ధ = సిద్ధులయొక్కయు, ఘాటంబు = సమూహము కలది.
6. మాయావేషముతో.

[1]శుంభద్యోతనుఁ డీమనోజ్ఞతనుఁ డంచున్ విస్మయభ్రాంతులై
సంభాషించిరి బ్రహ్మచారిఁ గని తత్సభ్యుల్ రహస్యంబుగన్. 533

క. గుజగుజలు వోవువారును
గజిబిజిఁ బడువారుఁ జాలఁ గలకలపడుచున్
గజిబిజి యైరి సభాస్థలిఁ
బ్రజలెల్లను బొట్టివడుగు పాపని రాకన్. 534

వ. ఆసమయంబున బలి సభామండపంబుఁ దఱియం జొచ్చి. 535

సీ. చవులుగాఁ జెవులకు సామగానంబులు
సదువు నుద్గాతల చదువు వినుచు
మంత్రతంత్రార్థసంబంధభావములు పే
ర్కొనెడి హోతలతోడఁ గూడికొనుచు
హోమకుండంబులందున్న త్రేతాగ్నుల
వెలిఁగించు యాజకవితతిఁ గనుచు
దక్షులై బహువిధాధ్వరవిధానంబులు
సెప్పెడు సభ్యులఁ జేరఁ జనుచుఁ

తే. [2]బెట్టుఁగోరెడు వేడుక వట్టుపఱుచు
నదితిపుట్టువు లచ్చికినాటపట్టు
గోరి చరియించె సభలోనఁ గొంతదడవు
పుట్టువెన్నుఁడు నెఱుఁగని పొట్టివడుఁగు. 536

వ. మఱియును. 537

క. వెఱచుచు వంగుచు వ్రాలుచు
[3]నఱిముఱిఁ [4]గబురులకుఁ జనుచు హరిహరియనుచున్
మఱుఁగుచు నులుకుచు డిఱడిఱఁ
[5]గురుమట్టపుఁబడుచు వడుగుఁ గొంత నటించెన్. 538

---

1. ప్రశస్తముగా ప్రకాశించువాఁడు. 2. పెట్టు = ఈవి(దానము) 3. అఱిముఱిన్ = తొట్రుపాటుతో (చిడిముడిపాటు) 4. కబురులు = మాటలు 'కబర్' అను హిందూస్థానీపదమునుండి యేర్పడినది. 5. మిక్కిలి పొట్టివాఁడు.

క. కొందఱతోఁ జర్చించును
గొందఱతో [1]జటలు సెప్పు గోష్ఠిం జేయుం
గొందఱతోఁ దర్కించును
గొందఱతో ముచ్చటాడుఁ గొందఱ నవ్వున్. 539

వ. మఱియు ననేకవిధంబుల నందఱకు నన్నిరూపులై వినోదించుచు.

క. వెడ వెడ నడకలు నడచుచు
నెడనెడ నడుగిడఁగ నడరి యిల దిగఁబడఁగా
బుడిబుడి నొడువులు నొడువుచుఁ
జిడిముడి తడఁబడఁగ వడుగు సేరెన్ రాజున్. 541

వ. ఇట్లు డగ్గఱి మాయాభిక్షుకుండు రక్షోవల్లభుం జూచి యిట్లనియె.

మ. ఇతఁడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్నికాలాదిది
క్పాలగర్వాపనయప్రవర్తి గతలోభస్ఫూర్తి నానామఖ
వ్రతదానప్రవణానువర్తి [2]సుమనోరామామనోభేదనో
ద్ధతచంద్రాతపకీర్తి సత్యకరుణాధర్మోల్లసన్మూర్తి దాన్. 543

వ. అని కుశపవిత్రాక్షతసంయుతంబగు దక్షిణహస్తంబు సాచి
యిట్లనియె. 544

ఉ. స్వస్తి జగత్త్రయీభువనశాసనకర్తకు [3]హాసమాత్రవి
ధ్వస్తనిలింపభర్తకు నుదారపదవ్యవహర్తకున్ మునిం
ద్రస్తుతమంగళాధ్వరవిధానవిహర్తకు నిర్జరీగళ
న్యస్తసువర్ణసూత్రపరిహర్తకు దానవలోకభర్తకున్. 545

వ. అని దీవించి కరచరణాద్యవయవంబులు ధరించిన వేదరాశియుం బోలె ముందట నకుటిలుండును జటిలుండును సదండఛత్రుండునుఁ గక్షలంబితభిక్షాపాత్రుండునుఁ గరకలితజలకమండలుండును మనోహరవదనచంద్రమండలుండును మాయావాదననటుండును నగు వటునిం గని దినకరకిరణవిహీతంబులైన గ్రహంబుల

1. వేదము చెప్పుటలో విశేషము. జట, ఘన మొదలయినవి. 2. దేవతాస్త్రీల మనస్సును తికమక పఱుపఁజాలిన వెన్నెలవంటి కీర్తిగలవాఁడు. 3. చిఱునవ్వుమాత్రముచే ధ్వంసము చేయఁబడిన యింద్రుఁడు గలవాఁడు.

చందంబునఁ దిరోహితులై భృగువులుఁ గూర్చున్నయెడల లేచి
సేమంబడిగి తియ్యనిమాటల నాదరించిరి. బలియును నమస్కరించి
తగినగద్దియ నునిచి పాదంబులుఁ దుడిచి తన ప్రాణవల్లభ [1]పసిండి
గిండియల నుదకంబులువోయ వటుకొమరునిచరణంబులఁ గడిగి
తడియొత్తి తత్సమయంబున.

ఆ. వటుని పాదశౌచవారి శిరంబునఁ
బరమభద్ర మనుచు బలివహించె
నేజలము గిరీశుఁ డింపుజూటుఁడు దేవ
దేవుఁ డుద్వహించె ధృతి శిరమున. 547

వ. మఱియు నయ్యజమానుం డభ్యాగతున కిట్లనియె. 548

మ. వటుగా! యెవ్వరివాఁడ వెవ్వఁడవు సంవాసస్థలం బెయ్యది
య్యెడకున్ నీవరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మముం
గడుధన్యాత్ముఁడ నైతి నీమఖము యోగ్యం బయ్యె నాకోరికల్
గడతేఱెన్ సుహుతంబులయ్యె శిఖులుం గల్యాణమిక్కాలమున్.

మ. వరచేలంబులొ [2]మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హరులో రత్నములో రథంబులొ విశిష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీఖండమొ కాక యేమడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా! 550

౧౮ అధ్యాయము

వ. అని ధర్మయుక్తంబుగాఁ బలికిన వైరోచనివచనంబులు విని సంతో
షించి యీశ్వరుం డిట్లనియె. 551

సీ. ఇది నాకు నెల వని యేరీతిఁ బలుకుదు
నొక చో టనక యొందు నుండ నేర్తు
నెవ్వనివాఁడ నం చేమని నుడువుదు
నాయంతవాఁడనై నడవనేర్తు
నీ నడవడి యని యెట్లు వక్కాణింతుఁ
బూని [3]ముప్పోకల బోవనేర్తు

1 బంగారు చెంబులచే. 2 నాణెములలో నొకరకము. 1. మూఁడు + పోకలు = ముల్లోకములు (లేక) మూఁడుగుణముల వెంటను.

నదినేర్తు నిదినేర్తు నని యేలఁ జెప్పంగ
నేరుపు లన్నియు నేన నేర్తు

తే. నోరులుఁ గారు నాకు నోరులకు నే నోదు
నొంటివాఁడఁ జుట్టమొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లి గలదు చెప్పెద నా [1]టెంకి
సుజనులందుఁ దఱచు సొచ్చి యుందు. 553

వ. అది యట్లుండ నిమ్ము.

సీ. జననాథ ! నీమాట సత్యంబు సత్కీర్తి
దంబు కులార్హంబు ధర్మయుతముఁ
గరుణానువర్తులు ఘనసత్త్వమూర్తులు
కాని మీకులమందుఁ గలుగ రొరులు
రణభీరువులు [2]వితరణభీరువులు లేరు
ప్రత్యర్థు లర్థులు ప్రబ్బికొనిన
దానశౌండీమమునఁ దనుపుదు రధికులై
మీతాత లందఱు మేటిమగలు

ఆ. మీ కులంబునందు మెఱయుఁ బ్రహ్లాదుండు
మింటి చంద్రుమాడ్కి మేలిరుచులఁ
బృథితకీర్తితోడ భవదీయవంశంబు
నీరరాశిభంగి నెగడుచుండు. 554

వ. తొల్లి మీముత్తాత హిరణ్యాక్షుండు విశ్వజయంబుసేసి గదాయుధుండై భూతలంబునఁ బ్రతివీరులం గానక సంచరింప విష్ణుండు వరాహరూపంబున నతని నమయించె. తద్భ్రాతయగు హిరణ్యకశిపుండదివిని హరిపరాక్రమంబునకు నాశ్చర్యంబునొంది తనజయంబును బలంబునుం బరిహసించి గ్రద్దన నుద్దవిడి నద్దనుజమర్దను మందిరంబునకుం జనియె. అప్పుడు. 555

---

1. నివాసము. 2. వితరణ = దానముసేయు, భీరువులు = బెదరువారు. (ఇచ్చినఁ దఱిగి పోవునని భయపడువారన్నమాట).

రాజ్యంబు సేయుచుండె. శిష్యవత్సలు లగు భృగ్వాదు లతనిచేత శతాశ్వమేధంబులు సేయించిరి. తత్కాలంబున. 458

శా. అర్థుల్ వేఁడరు, దాతలుం జెడరు, [1]సర్వారంభముల్ పండుఁ, బ్రి
త్యర్థుల్ లేరు, మహోత్సవంబులనుదే వాగారముల్ వొల్చుఁ, బూ
ర్ణార్థుల్ విప్రులు, వర్షముల్ గురియుఁ గాలార్హంబులై ధాత్రికిన్
సార్థంబయ్యె వసుంధరాత్వ మసురేంద్రాధీశు రాజ్యంబునన్. 459

వ. అంత. 460

౧౭. అధ్యాయము

సీ. తనతనూజులపోవ్రులు దనుజులు గొనుటయు
వేల్పు లెల్లను డాఁగ వెడలుటయును
భావించి సురమాత పరితాపమునఁ బొంది
వగ ననాథాకృతి వనరుచుండ,
నాయమ్మ పెనిమిటి యగుకశ్యపబ్రహ్మ
మఱియొకనాఁడు సమాధి మాని
తనకుటుంబిని యున్న ధామమునకు నేగి
నాతిచే విహితార్చనములు వడసి

ఆ. వంది వ్రాలి కుంది వాడినయిల్లాలి
వదనవారిజంబు వసువుఁ జూచి
చేరఁ దిగిచి మగువ చిబుకంబు పుడుకుచు
వారిజాక్షి! యేల వగచె దనుచు. 461

వ. అమ్మహాత్ముం డిట్లనియె. 462

మ. తెఱవా! విప్రులు పూజ్యులే! చెలఁగునే దేవార్చనాచారముల్?
తఱితో వేలుతురే గృహస్థులు? సుతుల్ ధర్మానుసంధానులే?
నెఱి నభ్యాగతకోటి కన్నమిడుదే! నీరంబునుం బోయుదే?
మఱి లే కర్థుల దాసులన్ సుజనులన్ మన్నింపుదే పైదలీ! 463

1 సర్వప్రయత్నములు 2 మఱిలేక = తరువాత యనుటలేక. (తరువాత తరువాత యనకుండా) (లేదా) యింకొకటిలేక అనఁగా వేఱొకపని లేకయని యర్థము.

ఆ. అన్నమైనఁ [1]దక్రమైనఁ దోయంబైన
శాకమైన దనకుఁ జరగుకొలఁది
నతిథిజనుల కడ్డ మాడక యిడరేని
లేమ వారు కలిగి లేనివారు. 464

వ. మఱియు. 465

ఆ. నెలఁత విష్ణునకును నిఖిలదేవాత్మున
[2]కాననంబు శిఖియు నవనిసురులు
వారు దనియఁ దనియు వనజాతలోచనుఁ
డతఁడుఁ దనియ జగము లన్నిఁ దనియు. 466

క. బిడ్డలు వెఱతురె నీకఱ
గొడ్డంబులు సేయ కెల్ల కోడండ్రును మా
[3]ఓడ్డారింపక నడతురె
[4]యొడ్డము గాకున్నదే మృగేక్షణ యింటన్. 467

వ. అని పలికినం బతికి సతి యిట్లనియె. 468

ఉ. ప్రేమ యొకింత లేక దితి బిడ్డలు బిడ్డలబిడ్డలుఁ మహా
భీమబలాఢ్యులై తనదు బిడ్డల నందఱఁ దోలి సాహసా
క్రామితవైరు లయ్యు నమరావతి నేలుచు నున్నవారు నీ
కేమని విన్నవింతు హృదయేశ్వర ! మేలుఁదలంచి చూడవే ! 469

క. అక్కా-చెల్లెండ్రయ్యును
దక్కరు నాతోడిపోరుఁ దానున్ దితియున్
రక్కసులు సురల మొత్తఁగ
నక్కట వల దనదు చూచు నోనో ననుచున్. 470

సీ. [5]ఎండకన్నెఱుఁగని యిందునిని యిల్లాలు
పలుపంచలును జాలిఁ బడియె నేఁడు

1. మజ్జిగ. 2. ఆననంబు = ముఖము. 3. ఒడ్డారింపక = ద్వేషించు. (వ్యతిరేకించు). 4. అడ్డంకి (నిరోధము). 5. ఎండయన్నదేమో యెఱుఁగనిది అంతఃపురవంగదే మసలునది. సుకుమారురాలన్న మాట.

త్రిభువనసామ్రాజ్యవిభవంబుఁ గోల్పోయి
దేవేంద్రుఁ డడవులఁ దిరిఁగె నేఁడు
కలిమి గారాబు బిడ్డలు జయంతాదులు
[1]శబరార్భకుల వెంటఁ జనిరి నేఁడు
నమరుల కాధారమగు నమరావతి
యసురుల కాటపట్టయ్యె నేఁడు

ఆ. బలి జగములనెల్ల బలియుచు నున్నాఁడు
వాని గెలువరాదు వాసవునకు
యాగ భాగమెల్ల నతఁ డాహరించునుఁ
గడఁగి సురల కొక్క కబళమీఁడు. 471

క. ప్రజలకు నెల్లను సముఁడవు
ప్రజలను గడుపారఁ గన్న బ్రహ్మవు నయ్యుం
బ్రజలందు దుష్టమతులను
నిజముగ శిక్షింపవలదె నీవు మహాత్మా! 472

మ. సురలన్ సభ్యుల నార్తులన్ విరథులన్ శోకంబువారించి ని
ర్జరధాత్రిన్ నిలుపంగ రాత్రిచరులన్ శాసింప సత్కార్యమే
వెర వేరీతి ఘటిల్లు నట్టి క్రమమున్ వేగంబ చింతింపవే
కరుణాలోకసుధార్ఝరిం దనుపవే కళ్యాణసంధాయకా! 473

వ. అనిన మనోవల్లభ పలుకు లాకర్ణించి ముహూర్తమాత్రంబు చిం
తించి విజ్ఞానదృష్టి నవలంబించి భావికాలకార్యంబు విచారించి
కశ్యపబ్రహ్మ యిట్లనియె. 474

మ. జనకుం డెవ్వఁడు జాతుఁ డెవ్వఁడు [3]జనిస్థానంబు లెచ్చోటు సం
జననం బెయ్యది మేను లేకొలఁదిఁ సంసారంబు లేరూపముల్
వినుమాయింతయు విష్ణుమాయ దలఁపన్ వేఱేమియున్ లేదు మో
హ నిబంధంబు నిదాన మింతటికి జాయా! విన్నఁబో నేటికిన్. 475

వ. అను నమ్మునినుం గాలోచితకార్యంబు సెప్పెప. 476

1. బోయ పిల్లలు. 2. పుట్టినవాఁడు. 3. జన్మస్థలము.

మ. భగవంతుం బరముం జనార్దనుఁ గృపాపారీణు సర్వాత్మకున్
జగదీశున్ హరిసేవ సేయు మతఁడున్ సాంగత్యముం బొంది నీ
కగు నిష్టార్థము లెల్ల నిచ్చు నిఖిలార్థావాప్తి సేకూరెడిన్
భగవత్సేవలఁ బొందరాదె బహుసౌభాగ్యంబులం బ్రేయసీ!

వ. అనిన గృహస్థునకు గృహిణి యిట్లనియె. 478

క. నారాయణుఁ బరమేశ్వరు
నేరీతిం దలంతు? మంత్ర మెయ్యది? విహితా
చారంబు లేపరికరము?
లారాధన కాలమెద్ది? యానతి యీవే! 479

వ. అనినఁ గశ్యపప్రజాపతి సతికిఁ బయోభక్షణం బనువ్రతం బుపదే
శించి తత్కాలంబును దన్మంత్రంబును దద్విధానంబును దదుప
వాసదానభోజనపరికరంబులును నెఱింగించెను.

౧౭ అధ్యాయము

వ. అదితియును ఫాల్గుణమాసంబున శుక్లపక్షంబునఁ బ్రథమదివసంబు
నన్ దొరకొని పండ్రెండు దినంబులు హరిసమర్పణంబుగా వ్రతం
బు సేసి వ్రతాంతంబున నియతయై యున్నయెడఁ జతుర్బాహుండును
బీతవాసుండును శంఖచక్రగదాధరుండును నై నేత్రంబుల కగో
చరుండైన నారాయణదేవుండు ప్రత్యక్షంబైనం గనుంగొని. 480

క. కన్నుల సంతోషాస్రులు
చన్నులపైఁ బఱవఁ బులకజాలము లెసఁగన్
సన్నతులును సన్నుతులును
నున్నతరుచిఁ జేసి నిటలయుక్తాంజలియై. 481

క. చూపుల శ్రీపతిరూపము
నాపోవక త్రావి త్రావి హర్షోపేతయై
[1]వాపుచ్చి మందమధురా
లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్. 482

1. నోరు తెఱచి (నోరెత్తి) బిగ్గరగా అన్నమాట.

సీ. యజ్ఞేశ విశ్వంభ రాచ్యుతశ్రవణ మం
గళనామధేయ లోకస్వరూప
యాపన్నభక్తజనార్తి విఖండన
దీనలోకాధార తీర్థపాద
విశ్వోద్భవస్థితివిలయకారణభూత
సంతతానంద శశ్వద్విలాస
యాయువు దేహంబు ననుపమలక్ష్మియు
వసుధయు దివముఁ ద్రివర్గములును

తే. వైదికజ్ఞానమును ముక్తి వైరిజయము
నిన్నుఁ గొలువని నరులకు నెఱయఁగలదె
వినుతమందార గుణహార వేదసార
ప్రణతవత్సల పద్మాక్ష పరమపురుష. 483.

ఆ. అసురవరులు సురల నదలించి బెదరించి
నాక మేలుచున్ననాఁటనుండి
కన్నకడుపుఁగాన కంటఁ గూరుకు రాదు
కడుపుఁబొక్క మాన్పి కావవయ్య. 484

వ. అనిన విని దరహాసితవదనుండయి యాశ్రితకామధేనువైన యప్పర
మేశ్వరుం డిట్లనియె. 485

శా. నీకోడండ్రును నీకుమారవరులున్ నీనాథుఁడున్ నీవు సం
శ్లోకింపన్ సతులుంబతుల్ మిగుల సమ్మోదింప రాత్రించరుల్
శోకింపన్ భవదీయగర్భమునఁ దేజోమూర్తి జన్మించెదన్
నాకున్ వేడుక పుట్టు నీసుతుఁడనై నర్తించి వర్తింపఁగాన్. 486

మ. బలిమిన్ దైత్యులఁ జంపరాదు వినయోపాయంబునంగాని; సం
చలనం బొందకు నేను నీనియతికిన్ సద్భక్తికిన్ మెచ్చితిన్ ;
బలివిద్వేషియు నా నిలింపగణముం [1]పౌలోమియున్ మెచ్చ దై
త్యులరాజ్యంబు హరింతు నింద్రునికి నిత్తున్ దుఃఖ మింకేటికిన్.

1. శచి (పులోముని కూతురు)

క. నీరమణుని సేవింపుము
నారూపము ¹మానసించి నలినీగర్భా
గారంబు వచ్చి చొచ్చెద
గారామునఁ బెంప నమ్మ కరుణన్ నన్నున్. 488

క. ఏలింతు దివము సురలనుఁ
బాలింతు మహేంద్రయువతి భాగ్యశ్రీలం
దూలింతు దానవుల ని
ర్మూలింతు ²రిపుప్రియాంగముల భూషణముల్. 489

వ. అని యిట్లు భక్తజనపరతంత్రుం డగు పురాణపురుషుం డానతిచ్చి తిరోహితుం డయ్యె. అయ్యదితియుఁ గృతకృత్య యై సంతోషంబునఁ దనమనోవల్లభుం డగు కశ్యపు నాశ్రయించి సేవించు చుండె. అంత నొక్క దివసంబున. 490

ఆ. ఘనసమాధినుండి కశ్యపుఁ డచ్యుతు
నంశ మాత్మ నొలయ నదితియందుఁ
దనదువీర్య మధికతరము సేర్చెను గాలి
శిఖిని దారువందుఁ జేర్చినట్లు. 491

వ. ఇట్లు కశ్యపచిరతరతపస్సంభృతవీర్యప్రతిష్ఠగర్భయై సురల తల్లి యుల్లంబున నుల్లసిల్లుచు నుండె నంత. 492

క. చలచల నై పిదపిద నై
గలలం బై కరుడు గట్టి గళనాళముతోఁ
దల యేర్పడి ³గర్భం బై
⁴నెలమసలం ⁵జీరచిక్కె నెలఁతకు నధిపా! 493

క. నెలఁతకుఁ జూలై నెలరె
న్నెల లై మఱి మూఁడు నాల్గు నెల లై వరుసన్
నెల లంత కంత కెక్కఁగ
నెలలును డగ్గఱియె నసురనిర్మూలతకున్. 494

1. మనస్సులో నిలిపి (ధ్యానించి) 2. శతృభార్యల మేని నగలను. 3. గర్భస్థ శిశువు – ఏర్పడి. 2. నెలతప్పగా. 3. కాన్పుఅయ్యెను. (చీరచాలలేదని యర్థము.)

క. మహితతరమేఘమాలా
పిహితాయుతచండభాను బింబప్రభతో
విహితాంగంబులఁ గశ్యపు
గృహిణీగర్భమున శిశువుఁ గ్రీడించె నృపా! 495

క. తనకడుపున నొక యిఱువునఁ
వనరుహగర్భాండభాండ వనధిచయంబుల్
గొనకొని జగములు నిడుకొని
తనుగతిఁ గడు నడఁగి మడిఁగి తనరెను బెడఁగై. 496

వ. అంత నక్కాంతాతిలకంబు క్రమక్రమంబున. 497

మ. నిలిపెన్ వెప్పల బృందిమన్, విశదిమన్ నేత్రంబులం, జూచుకం
బుల నాకాళిమ, మేఖలం ద్రిఢిమ, నెమ్మోమారఁగాఁ బాండిమ,
న్బలిమిం జన్నుల, శ్రోణిపాళి గరిమ, న్మధ్యంబునన్ [1]బృంహిమ,
న్బలితాత్మన్ లఘిమన్, మహామహిమ మేనన్, గర్భదుర్వారమై.

క. పెట్టుదురు నుదుట భూతిని
బొట్టిడుదురు మేనఁ బట్టుఁ బుట్టపుదోయిం
బెట్టుదురు వేల్పులమ్మకుఁ
గట్టుదురు సురక్ష పడఁతిగర్భంబునకున్. 499

వ. ఇవ్విధంబున. 500

తే. [2]విశ్వగర్భుఁడు దనగర్భ వివరమందు
బూటపూటకుఁ బూర్ణుఁడై పొటకరింప
వ్రేఁక జూలాలితనమున వేల్పుఁ బెద్ద
పొలఁతి కంతట నీళ్ళాడుప్రొద్దు లయ్యె. 501

వ. తదనంతరంబునం జతురాననుం డరుగుదెంచి యదితి గర్భపరిభ్రమ
విభ్రముండగు నప్పరమేశ్వరు నుద్దేశించి యిట్లని స్తుతియించె. 502

1. పెంపు, (లావు) 2. విశ్వము గర్భమందుఁ గలవాఁడు. (విశ్వంభరుఁడు).

సీ. త్రిభువన జయరూఢ దేవ త్రివిక్రమ
పృథులాత్మ [1]శిపివిష్ట [2]పృశ్నిగర్భ
ప్రీత [3]త్రినాభ [4]త్రిపృష్ఠ జగంబుల
కాద్యంతమధ్యంబు లరయ నీవ
జంగమస్థావర జననాదిహేతువు
నీవ కాలంబవై నిఖిల మాత్మ
లోపల ధరియింతు, లోనిజంతుల నెల్ల
[5]స్రోతంబులోఁ గొను చొప్పుదోఁప.

తే. బ్రహ్మలకు నెల్ల సంభవ భవన మీవ
దివమునకుఁ బాసి దుర్దశ దిక్కులేక
శోకవార్ధి మునింగిన సురలకెల్లఁ
దేల నాధార మగుచున్న తెప్ప వీవ. 503

క. విచ్చేయు మదితిగర్భము
చెచ్చెర వెలువడి మహాత్మ! చిరకాలంబున్
విచ్చలవిడి లే కమరులు
ముచ్చట పడియున్న వారు ముదమందింపన్. 504

౧౮ అధ్యాయము.

వామనమూర్త్యావిర్భావ ఘట్టము.

వ. అని యిట్లు కమలసంభవుండు వినుతిసేయు నయ్యవసరంబున. 505

మ. రవిమధ్యాహ్నమునం జరింప గ్రహతారాచంద్రభద్రస్థితిన్
శ్రవణద్వాదశినాఁడు శోణనభిజిత్సంజ్ఞాతలగ్నంబునన్

1. శిపి = పశువు, జీవుఁడు, వారియందంతర్యామియై ప్రవేశించినవాఁడు. శిపివిష్టుఁడు లేక శిపులు అనగా కిరణములు. వానిచే వేష్టితుఁడు. 2. అదితిపూర్వజన్మమున పృశ్నియను పేరుగలదు. ఆమె గర్భము అనగా శిశువు కాన పృశ్నిగర్భుఁడు (హరి) లేదా గర్భుఁడు అనవచ్చును. 3. మూఁడులోకములు నాభియందుఁ గలవాఁడు. 4. మూఁడులోకముల పృష్ఠమునందు అనగా మీఁదుగానున్నవాఁడు త్రిపృష్ఠుఁడు. 5. ప్రవాహము.

వ. అనిన విని. 602

మ. బలిదైత్యేంద్రకరద్వయీకృతజలప్రక్షాళనవ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు సాఁచె యోగిసుమనస్సంప్రార్థితశ్రీదముం
[1]కలితానమ్రరమాలలాటపదవీకస్తూరికాశాదమున్
నలినామోదము [2]రత్ననూపురితనానావేదముం బాదమున్. 604

క. సురలోకసముద్ధరణము
[3]నిరతశ్రీకరణ [4]మఖిలనిగమాంతాలం
కరణము భవసంహరణము
హరిచరణము నీటఁ గడిగె నసురోత్తముఁడున్. 605

వ. ఇట్లు ధరణీసురపతిచరణప్రక్షాళనంబు సేసి వామపాదంబు గడిగి తత్పావనజలంబు శిరంబునం జల్లుకొని వార్చి దేశకాలాదిపరిగణనంబు సేసి. 606

శా. విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్యవిదే త్రిపాదధరణిం దాస్యామి యంచుం [5]గ్రియా
క్షిప్రుండై దనుజేశ్వరుండు వటుకుం జేయిచ్చి పూజించి బ్ర
హ్మక్రీడితమ్మని ధారవోసె భువనం బాశ్చర్యముం బొందఁగన్. 607

వ. తత్కాలంబున. 608

ఆ. నీరధారఁ బడఁగ నీక యడ్డంబుగాఁ
గలశరంధ్ర మాఁప గాను దెలిసి
హరియుఁ [6]గావ్యనేత్ర మటఁ గుశాగ్రంబున
[7]పొడువ నేకనేత్రుఁడయ్యె నతఁడు. 609

వ. అంత. 610

---

1 కలిత = ఒప్పుచున్న. ఆనమ్ర = వంగిన. రమా = లక్ష్మీదేవియొక్క, లలాటపదవీ = నుదుటియందలి కస్తూరికాశాదమున్ = కస్తూరీపంకముకలది. (లచ్చి తన నుదుట నున్న కస్తూరిబొట్టు అంటుకొనునట్లు పాదమునకు నమస్కరించునని భావము) 2 రత్నపు టందెలట్లున్న యన్నివేదములు కలది. (వేదములే పాదములకు రత్ననూపురములట్లున్నవని భావము. 3 ఎల్లప్పుడు శ్రీని గలిగించునది. 4 సర్వవేదాంతములను అలంకరించునది. 5 క్రియను జరుపుటలోఁ ద్వరగలవాఁడై 6 శుక్రునికన్ను. 7 పొడువగా.

మ. అమరారాతికరాక్షతోజ్ఝితపవిత్రాంభఃకణశ్రేణికిం
గమలాధీశ్వరుఁ డొడ్డె [1]ఖండితదివౌకస్స్వామిజిన్మస్తముం
గమలాకర్షణసుప్రశస్తము [2]రమాకాంతాకుచోపాస్తమున్
విమలశ్రీకుచశాతచూచుకతటీవిన్యస్తమున్ హస్తమున్. 611

క. మునిజననియమాధారను
[3]జనితాసురయువతినేత్రజలకణధారన్
దనుజేంద్రనిరాధారను
వనజాక్షుఁడు గొనియె [4]బలివివర్జితధారన్. 612

ఆ. కమలనాభు నెఱిఁగి కాలంబు దేశంబు
నెఱిఁగి శుక్రుమాట లెఱిఁగి నాశ
మెఱిఁగి పాత్ర మనుచు నిచ్చె దానము బలి
మహి వదాన్యుఁడొరుఁడు మఱియుఁ గలఁడె? 613

క. బలి సేసిన దానమునకు
నలినాక్షుఁడు నిఖిలభూతనాయకుఁ డగుటం
గలకల మని దశదిక్కులు
బళిబళి యని పొగడె భూతపంచక మనఘా! 614

క. క్షితిదానమిచ్చు నతఁడును
నతికాంక్షఁ బరిగ్రహించు నతఁడును దురిత
చ్యుతులై శతవత్సరములు
శతమఖలోకమునఁ గ్రీడ సలుపుదు రెలమిన్. 615

వ. అట్లుగావున నేదానంబును భూదానంబునకు సదృశంబు గానేరదు గావున వసుంధరాదానం బిచ్చితి వుభయలోకంబులం గీర్తిసుకృతంబులు వడయుమని పలికి యమ్మాయావటుం డిట్లనియె. 616

---

1 ఖండింపఁబడిన. దివౌకస్స్వామిజిత్ = ఇంద్రుని జయించినవారియొక్క, మస్తమున్ = మస్తకములుకలది. (ఇంద్రశత్రువులయిన దానవులు తలలు పగులఁగొట్టిన దన్నమాట) హరి హస్తమున కిది విశేషణము. 2. లక్ష్మీదేవియొక్క స్తనములందుండునది. 3. జనిత=పుట్టింపఁబడిన, ఆసురయువతి = రాక్షసస్త్రీలయొక్క, నేత్రజలకణధారన్ = అశ్రుబిందువు ధారలుకలది. 4, బలిచే వదలఁబడిన నీటిధారను.

క. ఇదయేమి వేఁడితని నీ
మది వగవక ధారవోయు మా సత్యము పెం
పొదవఁగ గోరినయర్థం
బిదియిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్. 617

వ. అని పలికిన వటునిపలుకులకు హర్షనిర్భరచేతస్కుండై వైరోచనుండు,

ఆ. పుట్టి నేర్చుకొనెనో పుట్టకనేర్చెనో
యిట్టి బుద్ధు లిట్టి పొట్టివడుగు
పొట్టనున్నవెల్ల [1]బూమెలు సని నవ్వె
యెఱిమి ధరణిదాన మిచ్చె నపుడు. 619

వామనమూర్తి విశ్వరూపము నొంది విజృంభించుట-

ఆ. గ్రహమునీంద్రసిద్ధగంధర్వకిన్నర
యక్షిపక్షిదేవతాహిపతులు
వొగడి రతని పెంపుఁ, బుష్పవర్షంబులు
గురిసె, దేవతూర్యకోటి మొరసె. 620

వ. ఇట్లు ధారాపరిగ్రహంబు సేసి. 621

శా. ఇంతింతై వటుఁ డింతయై మఱియుఁ దానింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై [2]మహర్వాటిపై
నంతై [3]సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై. 622

మ. రవిబింబం బుపమింపఁ [4]బాత్రమగు ఛత్త్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై కళాభరణమై సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్.

వ. ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకం బగు విశ్వరూపంబు ధరియించిన భువియును నభంబును దివంబును దిశలును దిశాభిద్రంబులును

1. మాయలు (వంచనలు). 2. మహర్లోకముపై. 3. సత్యలోకమువరకు నెదిగినవాఁడు. (సత్యలోకమనగా బ్రహ్మలోకము). 4. తగియుండును.

సముద్రంబులునుఁ జలచరభూతనిచయంబులుం దానయై యేకీభ
వించి క్రమక్రమంబున భూలోకంబునకుం బైనై భువర్లోకంబు
నతిక్రమించి సువర్లోకంబును దలకడచి మహర్లోకంబు దాఁటి జనో
లోకంబునకు మీఁదై తపంబునకు నుచ్చ్రితుండై సత్యలోకంబు
కంటె నౌన్నత్యంబు వహించి మొదల [1]దిక్కులు సంధులు రంధ్ర
ములు లేకుండ నిండి మహామహిమాన్వితుండై చరణతలంబున
రసాతలంబునుఁ బాదంబుల మహియును జంఘల మహేంద్రంబు
లును జానువులఁ బతత్రిసమూహంబులును నూరువుల నింద్ర
సేన మరుద్గణంబులును వాసస్థలంబున సంధ్యయు గుహ్యంబునఁ
బ్రజాపతులును జఘనంబున దనుజులును నాభిని నభంబును నుద
రంబున నుదధిసప్తకంబును నురంబునఁ దారకానికరంబును హృద
యంబున ధర్మంబును నరోజంబుల ఋతసత్యంబులును మనం
బునఁ జంద్రుండును వక్షంబునఁ గమలహస్తయగు లక్ష్మియుఁ
గంఠంబున సామాదిసమస్తవేదంబులును భుజంబుల బురందరాది
దేవతలునుఁ గర్ణంబుల దిశలును శిరంబున నాకంబును శిరోజంబుల
మేఘంబులును నాసాపుటంబున వాయువును నయనంబుల
సూర్యుండును వదనంబున వహ్నియు వాణి [2]నఖిలచ్ఛందస్సముద
యంబును [3]రసనంబున జలేశుండును భ్రూయుగళంబున విధినిషే
ధంబులును ఱెప్పల నహోరాత్రంబులును లలాటంబునఁ గోపంబును
నధరంబున లోభంబును స్పర్శంబునఁ గామంబును రేతంబున
జలంబును బృష్ఠంబున నధర్మంబును [4]గ్రమణంబుల యజ్ఞంబులును
ఛాయల మృత్యువును నగవులవలన ననేకమాయావిశేషంబులును
రోమంబుల నోషధులును నాడీప్రదేశంబుల నదులును నఖంబుల
శిలలును బుద్ధి నజుండును బ్రాణంబుల దేవర్షిగణంబులును గాత్రం
బున జంగమస్థావరజంతుసంఘంబులును గలవాఁడయి జలధర
నినదశంఖశార్ఙ్గసుదర్శనగదాదండఖడ్గాక్షయబాణతూణీర

---

1. ఇఱుము = ఇఱుకు(?). 2. సర్వచ్ఛందస్సుల సమూహము. 3. [illegible] 4. క్రమణంబులన్ = అడుగులు వేయుటలలో (నడకలలో నన్నమాట.)

విభ్రాజితుండును మకరకుండలకిరీటకేయూరహారకటకకంకణకౌస్తుభమణిమేఖలాంబరవనమాలికావిరాజితుండును సునందనంద జయవిజయప్రముఖపరిచరవాహినీసందోహపరివృతుండును నమేయతేజోవిరాజితుండును నై బ్రహ్మాండంబు దనమేని కప్పుతెఱంగున నుండ విజృంభించి. 624

మ. ఒకపాదంబున భూమిఁ గప్పి దివి నే నొంటన్ నిరోధించి యొం
డొకటన్ మీఁదిజగంబులెల్లఁ దొడి నొం డొంటన్ విలంఘించి ప
ట్టక బ్రహ్మాండకటాహముం బెటిలి వెండ్రంబై పగుల్ గాన రా
నొకఁడై [1]వాగ్దృగలభ్యుఁడై హరివిభుం డొప్పారె విశ్వాకృతిన్.

ఆ. ఒకపదంబు క్రింద నుర్వి పద్మమునంటి
కొన్న పంకలవము కొమరు దాల్చె
నొకటిమీఁదఁ దమ్మి కొదిగిన తేఁటి నా
వెలసె మిన్ను నృప! త్రివిక్రమమున. 626

వ. తత్సమయంబున. 627

ఆ. జగము లెల్లదాఁటి చనిన త్రివిక్రము
చరణనఖరచంద్రచంద్రికలను
[2]పానుఁగుపడియె [3]సత్యమున బ్రహ్మతేజంబు
దినకరునిరుచుల దివియ వోలె. 628

౨౧ అధ్యాయము.

సీ. భవబంధములఁ బాసి బ్రహ్మలోకంబునఁ
గాపురంబులు సేయు ఘనులు రాజు
లామరీచ్యాదులు నా సనందాదులు
నా దివ్యయోగీంద్రు లచట నెపుడు
మూర్తిమంతంబులై మ్రోయు పురాణత
ర్కామ్నాయనియమేతిహాసధర్మ

1. మాటలకు చూపులకు నందనివాఁడై. 2. పానుఁగుబడియె = కాంతి తగ్గిపోయి యుండెను. (వెలవెలఁ బోయెను.) 3. సత్యలోకమునందు.

సంహితాదులు గురుజ్ఞానాగ్నినిర్దగ్ధ
కర్ములై మఱియును గలుగునట్టి
తే. వారలెల్లఁ జొచ్చి వచ్చి సర్వాధిపు
నంఘ్రిఁ జూచి మ్రొక్కి రధికభక్తిఁ
దమమనంబులందుఁ దలఁచు [1]నిధానంబుఁ
గంటిమనుచు నేఁడు మంటిమనుచు 629

మ. తనపుట్టిల్లిదె పొమ్మటంచు నజుఁడుం దన్నాభి పంకేరుహం
బు నిరీక్షించి నటించి యున్నతపదంబుం జూచి తత్పాదసే
చనముం జేసెఁ గమండలూదకములం జల్లించి తత్తోయముల్
వినువీధిం బ్రవహించె దేవనదినా విశ్వాత్మకీర్తిప్రభన్. 630

వ. తత్సమయంబున. 631

సీ. యోగమార్గంబున నూహించి బహువిధ
పుష్పదామంబులఁ బూజ సేసి
దివ్యగంధంబులుఁ దెచ్చి సమర్పించి
ధూపదీపములఁ దోడ్తోడ నిచ్చి
భూరిలాజాక్షతంబులు సల్లి ఫలములుఁ
గానిక లిచ్చి రాగములఁ బాడి
శంఖాదిరవములు జయఘోషములుఁ జేసి
కరుణాంబునిధి! త్రివిక్రమ! యటంచు
ఆ. బ్రహ్మ మొదలు లోకపాలురుఁ గొనియాడి
రెల్లదిశల వనచరేశ్వరుండు
జాంబవంతుఁ డరిగి చాటె భేరిధ్వని
వెలయఁజేసి విష్ణు విజయమనుచు. 632

క. అన్నిజగంబులఁ దానై
యున్నజగన్నాథుఁ జూడ నొగి భావింపం
గ న్నందక మన మందక
సన్నుతులం జేసి రపుడు సభ్యులు బలియున్. 633

1. గని. (రాశి)

వ. అంత నొయ్యన పూర్వప్రకారంబున వామనాకారంబు వహించి యున్నవామనునిం గని పదత్రయవ్యాజంబున నితండు సకలమహీమండలంబు నాక్రమించె. కపటవటురూపతిరోహితుం డగు విష్ణుం డని యెఱుంగక మనదానవేంద్రుండు సత్యసంధుండు గావునమాటఁ దిరుగక యిచ్చె. అతనివలన నేరంబు లేదు. ఈకుబ్జుం డప్రతిహత తేజః ప్రభావంబున [1]సజ్జకట్టుగా నిజ్జగంబులం బరిగ్రహించి పర్జన్యాదులకు విసర్జనంబు సేయం దలంచియున్నవాఁడు. ఈ పాఱునిం దూఱి పాఱనీక నిర్జించుటఁ గర్జంబని తర్జనంబులును గర్జనంబులునుఁ జేయుచు వజ్రాయుధాదిమరుజ్జేత లగు హేతి ప్రహేతి విప్రచిత్తి ముఖ్యులయిన రక్కసులు పెక్కం డ్రుక్కుమిగిలి యుద్ధంబునకు సన్నద్ధులై పరిశుపట్టిసభల్లాదిసాధనంబులు ధరియించి కసిమసంగి ముసరికొని దశదిశలఁ బ్రసరించినఁ జూచి హరిపరిచరులు సునంద నందజయజయంతవిజయప్రబలోద్బలకుముదకుముదాక్షతార్క్ష్య పుష్పదంతవిష్వక్సేనశ్రుతదేవసాత్వతప్రముఖులగు దండనాథులయుతవేదండసముద్దండబలులుఁ దమతమ యూథంబుల నాయుధంబుల తోడం గూర్చుకొని దానవానీకంబులం బరలోకంబున కనుచువారలై వారల నెదుర్కొని కదనంబునకున్ [2]బరవసంబు సేయుచున్నం గనుంగొని శుక్రశాపంబుఁ దలంచి దనుజవల్లభుం డిట్లనియె. 634

సీ. రాక్షసోత్తములార ! రండు పోరాడక
కాలంబు గాదిది కలహమునకు ;
సర్వభూతములకు సంపదాపదలకు
బ్రభువైన దైవంబుఁ బరిభవింప
మన మోపుదుమె ? తొల్లి మనకు రాజ్యంబును
సురలకు నాశంబు సొరిది నిచ్చి
విపరీతముగఁ జేయు వేల్పు నేమందము
మనపాలి భాగ్యంబు మహిమగాక ;

1. సిద్ధముగా. 2. ధైర్యముచేయుచుండఁగా.

తే. వెఱచి పలునూఱుఁ బాఱెడి విష్ణుభటులు
మిమ్ము [1]నెగచుట దైవంబు [2]మేరగాదె
మనకు నెప్పుడు దైవంబు మంచిదగుచు
నాఁడు గెలుతము పగవారి నేఁడు వలదు. 635

వ. అదియునుం గాక.

క. బలుదుర్గంబులు సచివులు
బలములు మంత్రౌషధములు బాహుశేనుపియుం
గలిగియు సామోపాయం
బులఁ గాల మెఱింగి నృపుఁడు వోరుట యొప్పున్. 637

వ. అట్లు గావున రణంబున శత్రులఁ కిప్పుడోడనుడు మోహరించుట కార్యంబుఁ గాదు మనకుం దగు కాలంబున జయింతము నలంగక తొలంగుం డనిన దలంగి భాగవతభటవలాయితులై చిక్క రక్కసులు రసాతలంబునకుం జనిరి. అంత హరిహృదయ్యుం బెఱింగి తార్క్ష్యనందనుండు [3]యాగసుత్యాహంబున వారుణపాశంబులనసుర వల్లభుని బంధించెను. అంత. 638

క. బాహులుఁ బదములుఁ గట్టిన
శ్రీహరి కృపగాక యేమి సేయుదు నని సం
దేహింపక బలి నిలిచెను
హాహారవమెసఁగె దశదిగంతములందున్. 639

క. సంపద సెడియును దైన్యము
గంపంబును లేక తొంటికంటెను బెంపుం
దెంపును నెఱుకయు ధైర్యము
వంపనిసురవైరిఁ జూచి వటుఁ డిట్లనియెన్. 640

సీ. దానవ! త్రిపదభూతల మిత్తు నంటివి
ధరణిఁ జంద్రార్కు లంబాఁడ నుండు

1. ఎగయించుట. ('నెగయు' అనియు రూపము కలదు.) 2. ఏర్పాటు. 3. సుత్యా + అహంబున = సోమపానము చేయువలసినరోజు. సోమయాగమునకు నెడిరోజున నని యర్థము.

రంతభూమియు నొక్క యడుగయ్యె నాకును
స్వర్లోకమును నొక్క చరణమయ్యె;
నీసొమ్ము సకలంబు నేఁడు రెండడుగులు
గడమపాదమునకుఁ గలదె భూమి
నిచ్చెద నన్నర్థి మీఁని దురాత్ముండు
నిరయంబు వొందుట నిజముగాదె

తే. కాన దుర్గతికినిఁ గొంత కాల మరుగు
కాక యిచ్చెదవేని వేగంబ నాకు
నిపుడు మూఁడవపదమున కిమ్ముఁ జూపు
బ్రాహ్మణాధీనములు ద్రోవ బ్రహ్మవశమె. 641

౨౨ అధ్యాయము

వ. అని యిట్లు వామనుండు పలుక [1]సత్యభంగసందేహవిషదిగ్ధశల్య నికృత్తహృదయుం డయ్యును విషణ్ణుండుఁ గాక వైరోచని ప్రసన్న వదనంబుతోడఁ [2]జిన్నిపోక వడుగున కిట్లనియె. 642

ఆ. సూనృతంబుఁ గాని [3]సుడియదు నాజిహ్వ
బొంకఁ జాల నాకు బొంకు లేదు
నీ తృతీయపదము నిజము నా శిరమున
నెలవు సేసిపెట్టు నిర్మలాత్మ! 643

ఆ. నిరయమునకుఁ బ్రాప్త నిగ్రహంబునకును
బదవిహీనతకును బంధనమున
కర్థభంగమునకు నఖిలదుఃఖమునకు
వెఱవ దేవ! బొంక వెఱచినట్లు. 644

వ. అదియునుం గాక. 645

సీ. తల్లిదండ్రులు నన్నదమ్ములు చెలికాండ్రు
గురువులు శిక్షింపఁ గొఱఁతపడునె

---

1. సత్యము దప్పుటవలన గలిగిన సందేహమనెడి విషము పూసిన యెముకచే గాయపఱుపబడిన హృదయముగలవాఁడు. 2. చిన్ని = చక్కని. 3. ప్రసరింపదు.

పిదప మేలగుఁగాక పృథుమదాంధులకును
దానవులకు మాకుఁ దఱి యెఱింగి
[1]విభ్రంశచక్షువు వెలయ నిచ్చుటఁజేసి
గురువులలో [2]*నాదిగురుఁడ వీవ
నీవు బంధించిన నిగ్రహమో లజ్జ
యో నష్టియో బాధయో తలంప

తే. నిన్ను నెదిరించి పోరాడి నిర్జరారు
లాదియోగీంద్రు లందెడు నట్టి టెంకి
నందరే తొల్లి పెక్కండ్రు హర్షమూర్తి
యీశ! నీయెడ దుర్లభ మేమి కలదు. 646

మ. చెలియే మృత్యువు చుట్టమే యముఁడు సంసేవార్థులే కింకరుల్
శిలలం జేసెనె బ్రహ్మ దన్ను? దృఢమే జీవంబునో చెల్ల రే
చలితంబౌట యెఱుంగ రీకపటసంసారంబు నిక్కంబుగాఁ
దలఁచున్ మూఢుఁడు సత్యదానకరుణాధర్మాదినిర్ముక్తుఁడై.

సీ. చుట్టాలు దొంగలు, సుతులు ఋణస్థులు,
కాంతలు సంసారకారణములు,
ధనము లస్థిరములు, దను వతిచంచల,
గార్యార్థు లన్యులు, గడచుఁ గాల,
మాయువు సత్వర, మైశ్వర్య మతిశీఘ్ర,
మని కాదె తమతండ్రి [3]నతకరించి
మాతాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుండు
నీ పాదకమలంబు నియతిఁ జేరె

తే. భద్రుఁ డతనికి మృతిలేని బ్రతుకుఁ గలిగె
నైరులై కాని తొల్లి మా వారుఁ గాన

1. విభ్రంశమైన చూపు. నాశనమునకు హేతువైన చూపు.

2* గూఢగురుఁడవీవు. పైకి శత్రువట్లు కనఁబడుచు లోలోపల నుపకారియగు గురుఁడవు. పారోక్ష్యః-శత్రుచ్ఛలేనవర్తమానః గురుః 3. క్రిందపఱచి (అధఃకరించి) (ఎదిరించియనుట

రర్థిపై వచ్చి నీవు నన్నడుగు టెల్లఁ
బద్మలోచన! నాపుణ్య ఫలముగాదె. 648

వ. అని యిట్లు పలుకుచున్న యవసరంబున. 649

శా. ఆదైత్యేంద్రుఁడు పీనవక్షు నవపద్మాక్షుం బిశంగాంబరా
చ్ఛాదుఁ నిర్మలసాధువాదు ఘనసంసారాదివిచ్ఛేదు సం
శ్రీదుఁ [1]*భక్తిలతాధిరోహితహరిశ్రీపాదు నిష్ఖేదుఁ బ్ర
హ్లాదుఁ బోధకళావినోదుఁ గనియెన్ హర్షంబుతో ముందటన్.

వ. ఇట్లు సమాగతుండైన తమతాతం గనుంగొని విరోచననందనుండు వారుణపాశబద్ధుండుఁ గావునఁ దనకుం దగిన నమస్కారంబు సేయరామింజేసి సంకులాశ్రువిలోలలోచనుండై సిగ్గుపడి (నతశిరస్కుండై) నమ్రీభావంబున మ్రొక్కు సెల్లించె, నంతఁ బ్రహ్లాదుఁడు మఖమండపంబున సునందాదిపరికరసమేతుండై కూర్చున్న వామనదేవునిం గని యానందబాష్పజలంబులుఁ బులకాంకురంబులుఁ నెరయ దండప్రణామం బాచరించి యిట్లని విన్నవించె. 650

సీ. ఇతనికి మున్ను నీవింద్రపదం బిచ్చి
నేఁడు త్రిప్పుటయును నెఱయ మేలు
మోహనాహంకృతి మూలంబు గర్వాంధ
తమసవికారంబు దాని మాన్పి
కరుణ రక్షించుటఁ గాక బంధించుటే
తత్త్వజ్ఞునకు మహేంద్రత్వ మేల
నీపాదకమలంబు నియతిఁ గొల్చినదాని
బోలువే సురరాజ్యభోగపరత

తే. గర్వ మేపారఁ గన్నులు గానరావు
చెవులు వినరావు చిత్తంబు సిక్కువడును
మఱచు నీసేవ లన్నియు మహిమ మాన్పి
మేలు సేసితి [2]నీమేటిమేర సూపి. 651

1. భక్తిలతయందధిరోహింపఁబడిన హరియొక్క మంగళకరములయిన పాదములు గలవాఁడు. * "భక్తిలతాతిరోహితహరి శ్రీపాదు" అని పాఠము. 2. నీగొప్పహద్దు (మహిమయన్న మాట).

వ. అని పలికి జగదీశ్వరుండును నిఖిలలోకసాక్షియు నగు నారాయణ దేవునకు నమస్కరించి ప్రహ్లాదుండు వలుకుచున్న సమయంబున.

మ. తతమత్తద్విపయానయై కుచనిరుంధచ్చోళిసంవ్యానయై
ధృతబాష్పాంబువితాన యై కరయుగాధీనాలికస్థానయై
పతిభిక్షాం మమ దేహి కోమలమతే పద్మాపతే యంచుఁ ద
త్సతి వింధ్యావళి సేరవచ్చెఁ [1]ద్రిజగద్రక్షామనున్ వామనున్. 653

వ. వచ్చి యచ్చేడియ తచ్చరణసమీపంబునం బ్రణతయై నిలువంబడి యిట్లనియె. 654

క. నీకుం గ్రీడార్థము లగు
లోకంబులఁ జూచి పరులు లోకులు కుమతుల్
లోకాధీశుల మందురు
లోకములకు రాజ వీవ లోకస్తుత్యా! 655

క. కా దనఁడు పొమ్ము లే దీ
రా దనఁడు జగత్త్రయైకరాజ్యము నిచ్చెన్
నాదయితుఁ గట్ట నేటికి
శ్రీదయితాచిత్తచోర! శ్రితమందారా! 656

వ. అని యిట్లు వింధ్యావళియుం బ్రహ్లాదుండును విన్నవించు నవసరంబున హిరణ్యగర్భుండు సనుదెంచి యిట్లనియె. 657

సీ. భూతలోకేశ్వర! భూతభావన దేవ
దేవ జగన్నాథ దేవవంద్య
తనసొమ్ము సకలంబుఁ దప్పక నీకిచ్చె
దండయోగ్యుఁడుగాఁడు దానపరుఁడుఁ
గరుణింప నర్హుండు గమలలోచన నీకు
విడిపింపు మీతని వెరపుదీర్చి
తోయపూరము సల్లి దూర్వాంకురంబులఁ
జేరి నీపదము లర్చించునట్టి

1. ముల్లోకములకు రక్షక మంత్రమైనవాఁడు.

తే. భక్తియుక్తుఁడు లోకేశపదము నొందు
నీవు ప్రత్యక్షముగవచ్చి నేఁడు వేఁడ
నెఱిఁగి తన రాజ్యమంతయు నిచ్చినట్టి
బలికిఁ దగునయ్య దృఢపాశబంధనంబు. 658

వ. అని పలికిన బ్రహ్మవచనంబులు విని భగవంతుం డిట్లనియె. 659

సీ. ఎవ్వనిఁ గరుణింప నిచ్ఛయించితి వాని
యఖిలవిత్తంబు నే నపహరింతు
సంసారగురుమదస్తబ్ధుఁడై యెవ్వఁడు
దెగడి లోకము నన్ను ధిక్కరించు
నతఁ డెల్లకాలంబు నఖిలయోనులయందుఁ
బుట్టుచుఁ దుర్గతిఁ బొందుఁ బిదప
విత్తవయోరూపవిద్యాబలైశ్వర్య
కర్మజన్మంబుల గర్వముడిగి

తే. యేకవిధమున విమలుఁడై యెవ్వఁడుండు
వాఁడు నాకూర్చి రక్షింప వలయువాఁడు
స్తంభలోభాభిమానసంసారవిభవ
మత్తుఁడై చెడనొల్లఁడు మత్పరుండు. 660

శా. బద్ధుండై గురుశాపతప్తుఁడయి తా బంధుప్రజత్యక్తుఁడై
సిద్ధైశ్వర్యముఁ గోలుపోయి విభవక్షీణుండునై పేదయై
శుద్ధత్వంబును సత్యముం గరుణయున్ సొంపేమియుం దప్పఁడు
దుర్బుద్ధుండై యజయాఖ్యమాయ గెలిచెం బుణ్యుం డితం డల్పుఁడే.

ఆ. అసురనాథుఁ డనుచు నసఘుని మర్యాద
యేను జూతమనుచు సంతవలుక
నిజము పలికె నితఁడు నిర్మలాచారుండు
మేలుమేలు నాకు మెచ్చు వచ్చు. 662

క. సావర్ణి మనువువేళను
దేవేంద్రుండగు నితండు దేవతలకు ధు

ర్భావిత మగు నా చోటికి
రావించెద నంతమీఁద రక్షింతు దయన్. 663

క. వ్యాధులుఁ దప్పులు నొప్పులు
బాధలుఁ జెడి విశ్వకర్మభావితదనుజా
రాధితసుతలాలయమున
[1]నేధితవిభవమున నుండు నింతఁ డందాఁకన్. 664

వ. అనిపలికి బలింజూచి భగవంతుం డిట్లనియె. 565

సీ. సేమంబు నీ కింద్రసేనమహారాజ
వెఱవకు మేలు నీ వితరణంబు
వేలుపు లందుండ వేడుక పడుదురు
దుఃఖంబు లిడుములు దుర్మరణము
లాతురతలు నొప్పు లం దుండువారికి
నొందవు సుతల మం దుండు నీవు
నీపంపు సేయని నిర్జరారాతుల
నాచక్ర మే తెంచి నఱకుచుండు

ఆ. లోకపాలకులకు లోను గావక్కడ
నన్ను నెంతవార లచట నిన్ను
నెల్లప్రొద్దువచ్చి యేను రక్షించెదఁ
గరుణతోడ నీకుఁ గానవత్తు. 666

క. దానవదైత్యులసంగతిఁ
బూనిన నీ యసురభావమును ద్రోద్రోము
ధ్యానమునఁ దలఁగి పోవును
మానుగ సుతలముననుండుమూ మా యాజ్ఞన్. 657

23 అధ్యాయము.

వ. అని యిట్లు పలుకుచున్న ముమ్మూర్తుల ముదుకవేల్పు తియ్యని
నెయ్యంపుఁ బలుకుఁ జెఱకురసంపుసోనలు వీనుల తెరువులంజొచ్చి

1. వృద్ధిపొందిన వైభవముతో

లోను బయలు నిండి తెప్పలకప్పు దప్పంద్రోచికొని కనుఁగవకొలం
కుల [1]నలుఁగులు వెడలిన చందంబున సంతసంబునం గన్నీరు
మున్నీరై పఱవ నురఃఫలకంబునం బులకంబులు [2]కులకంబులయి
తిలకంబు లొత్తఁ గేలు మొగిడ్చి నెక్కొన్న వేడుకం ద్రొక్కుడు
వడుచుఁ జిక్కని చిత్తంబునఁ జక్కనిమాటల రక్కసుల ఱేఁ
డిట్లనియె. 668

ఉ. ఎన్నఁడు లోకపాలకుల నీకృపఁ జూడని నీవు నేఁడు న
న్నున్నతుఁ జేసి నా బ్రదుకు నోజయు నానతియిచ్చి కాచి తీ
మన్నన లీ దయారసము మాటలు పెద్దఱికంబుఁ జాలవే
పన్నగతల్ప! నిన్నెఱిఁగి పట్టిన నాపదఁ గల్గనేర్చునే? 669

వ. అని పలికి హరికి నమస్కరించి బ్రహ్మకుం బ్రణామంబు సేసి యిం
దుధరునకు వందనం బాచరించి బంధవిముక్తుండై తన వారలతోఁ
జేరికొని బలి సుతలంబునకుం జనియె. అంత హరికృపావశంబునం
గృతార్థుండై కులోద్ధారకుం డయిన మనుమనిం గని సంతోషించి
ప్రహ్లాదుండు భగవంతున కిట్లనియె. 670

సీ. చతురాననుఁడు నీ ప్రసాదంబు గానఁడు
శర్వుఁ డీలక్ష్మల జాడఁ బొందఁ
డన్యుల కెక్కడి దసురులకును మాకు
బ్రహ్మాదిపూజితపదుఁడ వయిన
దుర్లభుండవు నీవు దుర్గపాలుఁడ వైతి
పద్మజాదులు భవత్పాదపద్మ
మకరందసేవనమహిమ నైశ్వర్యంబు
లందిరికాక యే మల్పమతుల
తే. మధికదుర్యోధులము కుత్సితాత్మకులము
నీ కృపాదృష్టిమార్గంబు నెలవు సేర

1. అలుగులు — కలుజులనుఁడి వెడలిన విధముగా (చెఱువునిండినపుడు నీరు వద
లుటకు పెట్టిన తూమునకు అలుగు లేక కలుజు అని పేరు)

నేమి తపమాచరించితి మెన్నఁ గలమె
మమ్ముఁ గాచుట చిత్రంబు మంగళాత్మ! 671

వ. అదియునుం గాక. 672

ఆ. సర్వగతుఁడవయ్యు సమదర్శనుఁడవయ్యు
నొకట విషమవృత్తి నుండ దరయ
నిచ్చ లేనివారికీవు భక్తులు గోరు
తలఁపులిత్తు కల్పతరువుమాడ్కి. 673

వ. అని విన్నవించుచున్న ప్రహ్లాదుం జూచి పరమపురుషుం డిట్లనియె.

తే. వత్స ప్రహ్లాద మేలు నీవారు నీవు
నరిది మనుమనిఁ దోడ్కొని సుతలమునకుఁ
బయనమై పొమ్ము నే గదాపాణి నగుచుఁ
జేరి రక్షింప దురితంబు సెంద దచట. 675

వ. అని యిట్లు నియమించినం బరమేశ్వరునకు సమస్కరించి వలగొని కరకమలపుటఘటితనిటలతటుండై వీడ్కొని బలిం దోడ్కొని సకలాసురయూథంబునుం దాను నొక్క మహాబిలద్వారంబు సొచ్చి ప్రహ్లాదుండు సుతలలోకంబునకుం జనియె. అంత బ్రహ్మవాదు లయిన యాజకులసభామధ్యంబునం గూర్చున్న శుక్రునిం జూచి నారాయణుం డిట్లనియె. 676

ఆ. ఏమిఁ గొఱఁతవడియె నీతని జన్నంబు
విస్తరింపు కడమ విప్రవర్య!
విషమ మయిన కర్మవిసరంబు బ్రాహ్మణ
జనులు సూచినంత సమతఁ బొందు. 677

వ. అనిన శుక్రుం డిట్లనియె. 678

సీ. అఖిలకర్మంబుల కధినాథుఁడవు నీవ
యజ్ఞేశుఁడవు నీవ యజ్ఞపురుష!
ప్రత్యక్షమున నీవు పరితుష్టి నొందినఁ
గడమేలఁ కల్గు నేకర్మములకు

ధన దేశ కాలార్హ తంత్ర మంత్రంబులఁ
గొఱఁతలు నిన్నుఁ జేర్చికొనిన మాను
నయినఁ గావింతు నీయానతి భవదాజ్ఞ
మెలఁగుట జనులకు మేలుగాదె

తే. యింతకంటెను శుభము నా కెచటఁ గలుగు
ననుచు హరిపంపు శిరమున నావహించి
కావ్యుఁ డసురేంద్రు జన్నంబు కడమఁ దీర్చె
మునులు విప్రులు సాహాయ్యమునఁ జరింప. 679

వ. ఇవ్విధంబున వామనుండయి హరి బలి నడిగి మహిం బరిగ్రహించి తనకు నగ్రజుండగు సమరేంద్రునకుం ద్రిదివంబు సదయుండయి యొసఁగె. అత్తఱి పరమభృగుప్రముఖప్రజాపతులును భవుండును కుమారుండును దేవర్షి పితృగణంబులును రాజులును దానును గూడికొని చతురాననుండు కశ్యపునకు నదితికి సంతోషంబుగా లోకంబులకు లోకపాలురకు వామనుండు వల్లభుండని నియమించి యంత ధర్మంబునకు యశంబునకు లక్ష్మికి శుభంబులకు దేవతలకు వేదంబులకు వ్రతంబులకు స్వర్గాపవర్గంబులకు నుపేంద్రుండు ప్రధానుండని సంకల్పించె ఆ సమయంబున. 680

క. కమలజుఁడు లోకపాలురు
నమరేంద్రునిఁ గూడి దేవయానంబున న
య్యమరావతికిని వామను
నమరం గొనిపోయి రంత నటమీఁద నృపా! 681

ఆ. బల్లిదంపుదోఁడు ప్రాపున నింద్రుని
కింద్రపదము సేరు టెట్లు గలిగెఁ
దనకు నాథుఁ డైన తమ్ముఁడుఁ గలిగినఁ
గోర్కు లన్ని కేల కొఱఁత నొందు. 682

క. పాలడుగఁడు మేలడుగం
డేలఁడు భిక్షించి యన్న కిచ్చెఁ ద్రిజగమున్

వేలుపులతల్లి కడపటి
చూలుం బోలంగఁ గలరె [1]సొలయనితమ్ముల్. 683

ఆ. కడుపు [2]బదరగాఁగ గొడుకులఁ గనుకంటె
దల్లి కొకఁడె చాలు బల్లిదుండు
త్రిదశగణముఁ గన్న యదితి గానుపుదీఱఁ
జిన్నిమేటివడుగుఁ గన్నయట్లు. 684

వ. ఇట్లు దేవేంద్రుండు వామనభుజపాలితం బగు త్రిభువనసామ్రాజ్య
విభవంబు మరల నంగీకరించె. అప్పుడు బ్రహ్మయు శర్వుండునుఁ
గుమారుండును భృగుప్రముఖు లయిన మునులునుఁ బితృదేవత
లును దక్షాదిప్రజాపతులును సిద్ధులును వైమానికులును మఱియుం
దక్కినవారలును బరమాద్భుతప్రకారుం డైన విష్ణుని సుమహాకర్మం
బులకు నాశ్చర్యంబు నొందుచుఁ బ్రశంసించుచు నాడుచుం బాడు
చుం దమతమనివాసంబులకుం జనిరి. అనిచెప్పి శుకుం డిట్లనియె.

తే. మనుజనాథ! త్రివిక్రము మహిమ కొలఁది
యెఱుఁగఁ దర్కింప లెక్కింప నెవ్వఁడోపుఁ
గుంభినీరేణుకణములు గుఱుతు వెట్టు
వాఁడు నేరఁడు తక్కిన వారి వశమె. 686

క. అద్భుతవర్తనుఁ డగు హరి
సద్భావిత మైన విమలచరితము వినువాఁ
డుద్భటవిక్రముఁ డై తుది
నుద్భాసితలీలఁ బొందు నుత్తమగతులన్. 687

తే. తగిలి మానుష పైతృక దైవకర్మ
వేళలందుఁ ద్రివిక్రమవిక్రమంబు
లెక్కడెక్కడఁ గీర్తింతు రెవ్వ రేనిఁ
బొందుదురు నిత్యసౌఖ్యంబు భూవరేంద్ర! 688

1. విముఖితనుపొందని తమ్ములు (అనుకూలురైన సోదరులన్నమాట). 2. బదర=
పగులు. లేదా ప్రత్తికాయ యగునట్లు.

మ. జడులై నాకముఁ గోలుపోవుసురలం జంభారినిం బ్రోవఁగా
వడుగై భూమి బదత్రియం బిడుటకై వైరోచనిన్ వేఁడి రెం
డడుగుల్ సాఁచి త్రివిక్రమస్ఫురణ బ్రహ్మాండంబుఁ దానిండుచుం
గడు మోదంబుననుండు వామనున కెక్కాలంబునన్ మ్రొక్కెదన్.

౨౪ అ ధ్యా య ము

మత్స్యావతార కథాప్రారంభము.

వ. అని యిట్లు శుకుండు రాజునకు వామనావతారచరితంబు సెప్పెనని
సూతుండు మునులకుం జెప్పిన విని వార లతని కిట్లనిరి. 690

సీ. విమలాత్మ! వినవాఁకు వేడ్కయయ్యెడి మున్ను
హరిమత్స్యమైన వృత్తాంతమెల్లఁ
గర్మబద్ధునిభంగి ఘనుఁ డీశ్వరుఁడు లోక
నిందితంబై తమోనిలయమైన
మీనరూపము నేల మేలని ధరియించె
నెక్కడ వర్తించె నేమి సేసె
నాద్యమై వెలయు నయ్యవతారమునకు నే
య్యది కారణంబు గార్యాంశ మెట్లు

ఆ. నీవు దగుదు మాకు నిఖిలంబు నెఱిఁగింపఁ
దెలియఁ జెప్పవలయు దేవదేవు
చరిత మఖిలలోకసౌభాగ్యకరణంబు
గాదె విస్తరింపు క్రమముతోడ. 691

వ. అని మునిజనంబులు సూతు నడిగిన నతం డిట్లనియె. మీరలడిగిన
యీ యర్థంబుఁ బరీక్షిన్నరేంద్రుం డడిగిన భగవంతుండగు బాద
రాయణి యిట్లనియె. 692

సీ. విభుఁ డీశ్వరుఁడు వేదవిప్రగోసురసాధు
ధర్మార్థములఁ గావఁ దనువుఁదాల్చి
గాలిచందంబున ఘనరూపములయందుఁ
దనుర్రూపములయందుఁ దగిలియుండు

ఎక్కువఁ దక్కువ లెన్నఁడు నొందక
నిర్గుణత్వంబున నెఱయు ఘనుఁడు
గురుతయుఁ గొఱఁతయు గుణసంగతి వహించు
మనుజేశ! చోద్యమే మత్స్యమగుట

తే. వినుము పోయిన కల్పాంత వేళఁ బొల్లి
ద్రవిళదేశపురాజు సత్యవ్రతుండు
నీరుద్రావుచు హరిఁగూర్చి నిష్ఠతోడఁ
దపముఁ గావించె నొకయేటి తటమునందు. 693

వ. మఱియు నొక్కనాఁ డమ్మేదినీకాంతుండు గృతమాలికయను నేటి
పొంత హరిసమర్పణంబుగా జలతర్పణంబు సేయుచున్న సమయం
బున నారాజు దోసిట నొక్కమీనుపిల్ల దవిలివచ్చిన నులికిపడి
మరలం దరంగిణీజలంబునందు [1]శకులశాబకంబు విడిచె. అట్లు విడి
వడి నీటిలోనుండి జలచరపోతంబు భూతలేశ్వరున కిట్లనియె. 694

మత్తకోకిలము.

పాటువచ్చిన జ్ఞాతిఘాతులు పాపజాతిఝషంబు లీ
యేటఁ గొండొక మీనుపిల్లల నేఱిపట్టి వధింప న
చ్చోట నుండక నీదుదోసిలి జొచ్చివచ్చిన నన్ను న
ట్టేటఁ ద్రోవఁగఁ బాడియే కృప యింత లేక దయానిధీ! 695

ఆ. వలలు దారు నింక వచ్చి జాలరివేఁట
కాఱు నేఱు గలఁచి [2]కారఁ బెట్టి
మిడిసిపోవనీక మెడఁ బట్టుకొనియెడు
రప్పు డెందుఁ జొత్తు ననఘచరిత! 696

క. భక్షించు నొండె ఝషములు
శిక్షింతురు ధూర్తులొండెఁ జెడకుండ ననుం
రక్షింపు దీనవత్సల!
ప్రక్షీణులఁ గాచుకంటె భాగ్యము గలదే. 697

1. బెడిసచేప. 2. నిర్బంధములోఁబెట్టి. (కార = చెఱ)

వ. అనిన విని కరుణాకరుండగు నవ్విభుండు మెల్లన యయ్యంభశ్చర డింభకంబునుఁ గమండలు జలంబునం బెట్టి తన నెలవునకుం గొని పోయె. అదియు నొక్కరాత్రంబునం గుండికనిండి తనకునుండ నిమ్ముసాలక రాజన్యున కిట్లనియె. 698

క. ఉండ నిదిఁ గొంచె మెంతయు
నొండొకటిం జెమ్ము భూవరోత్తమ! యనుడున్
గండకముఁ దెచ్చి విడిచెను
మండలపతి సలిలకలశమధ్యమున నృపా! 699

వ. అదియును ముహూర్తమాత్రంబునకు మూఁడుచేతుల నిడుపై [1]యుదంచంబునిండి పట్టుసాలక వేఱొండుఁ జెమ్మనవుడు నారాచపట్టి కరుణాగుణంబునకు నాటపట్టుఁ గావున గండకంబు నొండొక్క చిఱుతమడుఁగున నునిచె. అదియు నాసరోవరజలంబునకు నగ్గలంబై తనకు సంచరింప నది గొంచెం బని పలికినం బుడమిఱేఁడు మంచివాఁడగుటం జేసి [2]యాకంచరంబు నుదంచితజలాస్పదంబైన హ్రదంబునందు నిడియె. అదియు నాసలిలాశయంబునకును నధికంబై పెరుఁగ నిమ్ము సాలదని చెప్పికొనిన నప్పుణ్యుండు గొప్పడి నడవకిం దప్పనివాఁడైన కతంబున నమ్మహామీనంబును మహార్ణవంబున విడిచె. అదియును మకరాకరంబునం బడి రాజునకిట్లను. "పెను మొసళ్ళు మసరికొని కసిమసంగి మ్రింగెడి నింతకాలంబు నడపి కడపట దిగవిడువకు వెడలఁ దిగువు" మని యెఱింగింప దెలిసి కడపట యన్నిటతిరుగుడుపోఁడకుం బుడమిఱేఁ డిట్లనియె. 700

సీ. ఒకదినంబున శతయోజనమాత్రము
విస్తరించెదు, నీవు వినము చూడ
మిటువంటి ఝషముల నెన్నఁడు నెఱుఁగము
మీనజాతుల కిట్టి మేను గలదె
యేమిటి కెవ్వఁడ వీలీలఁ ద్రిప్పెదు
కరుణ నాపన్నులఁ గావ వేఁడి

1. ఉదంచనము = మూకుడు 2. కంచరము = చేప (నీటఁదిరుగునది)

యంభశ్చరం బైన హరివి నే నెఱిఁగితి
నవ్యయనారాయణాభిధాన
తే. జననసంస్థితిసంహారచతురచిత్త
దీనులకు భక్తులకు మాకు దిక్కు నీవ
నీదులీలావతారంబుఁ నిఖిలభూత
భూతిహేతువు మ్రొక్కెదఁ బురుషవర్య! 701
క. ఇతరులముఁ గాము [1]చిత్సం
గతులము మాపాలి నీవుఁ గలిగితి భక్త
స్థితుఁడ వగు నిన్ను నెప్పుడు
నతి సేసినవాని కేల నాశముఁ గలుగన్. 702
క. శ్రీలలనాకుచవేదికఁ
గేళీపరతంత్రబుద్ధిఁ గ్రీడించు సుఖా
లోలుఁడవు [2]దామసాకృతి
నేలా మత్స్యంబ వైతి వెఱిఁగింపు హరీ!
వ. అని పలుకు సత్యవ్రతమహారాజునకు నయ్యుగంబుకడపటఁ బ్రళ
యవేళ సముద్రంబున నేకాంతజనప్రీతుండయి విహరింప నిచ్ఛిం
చి మీనరూపధరుండైన హరి యిట్లనియె. 704
సీ. ఇటమీఁద నీరాత్రి కేడవదినమునఁ
బద్మగర్భున కొక్క పగలునిండు,
భూర్భువాదికజగంబులు మూఁడు విలయాబ్ధి
లోన మునుంగు, నాలోనఁ బెద్ద
నావ సేరఁగ వచ్చు నాపంపు పెంపున
దానిపై నోషధితతులు బీజ
రాసులు నిడి పయోరాశిలో విహరింపఁ
గలవు సప్తర్షులుఁ గలసి తిరుఁగ
ఆ. మ్రోలఁ గానరాక ముంచు పెంజీఁకటి
మిడుకుచుండు మునులమేని వెలుఁగుఁ

1. తమోగుణమయమైన యాకారమును,

దోలఁకుచుండు జలధిదోధూయమాన మై
నావ దేలుచుండు నరవరేణ్య ! 705

వ. మఱియు నన్నావ మున్నీటికరళ్లకు లోనుఁగాకుండ నిరుఁగెలంకుల వెనుకముందట నేమఱకుండఁ [1]బెన్నెఱులగు నా[2]గఱులన్ జఱియుచుఁ బొడువ వచ్చిన బలుగ్రాహంబుల నొడియుచు సంచరించెద. ఒక్కపెనుఁబాము చేరువ నాయనుమతిం బొడసూపెడు దానంజేసి సుడిగాడ్పులకతంబున నావ వడిం దిరుగఁ బడకుండ, నాకొమ్ముతుదిం పదిలముచేసి నీకునుఁ దపసులకును నలజడిసెందకుండ మున్నీట నిప్పాటం దమ్మిచూలిరేయి వేఁగునంతకు మెలంగెద. అది కారణంబుగా జలచరరూపంబుఁ గయికొంటి. మఱియు నొకప్రయోజనంబుఁగలదు. నామహిమ పరబ్రహ్మంబని తెలియుము. నిన్ను ననుగ్రహించితి నని సత్యవ్రతుండు సూడ హరి తిరోహితుం డయ్యె. అయ్యవసరంబున. 706

ఆ. మత్స్యరూపి యైన మాధవు[3]నుడుగులుఁ
దలఁచికొనుచు రాచతపసియొక్క
దర్భశయ్యఁ దూర్పుఁ దలగడగాఁ బండి
కాచియుండె నాఁటి కాలమునకు. 707

వ. అంతఁ గల్పాంతంబు డాసిన. 708

క. ఉల్లసితమేఘపంక్తులు
[4]జల్లించి మహోగ్రవృష్టి జడిగొని కురియన్
వెల్లివిరిసి జలరాసులు
సెల్లెలికట్టలను దాఁటి సీమల ముంచెన్. 709

వ. తదనంతరంబ. 710

తే. మున్నుపోయిన కల్పాంతమున నరేంద్ర !
బ్రహ్మమును నైమిత్తిక ప్రళయవేళ

1. పెను + నెఱి = మిగుల సంపూర్తికలది (విశాలమయినదన్నమాట) లేదా మిక్కిలి పరాక్రమముగలవి. 2. నా, గఱులన్ = ఱెక్కలచే (గఱి = ఱెక్క) 3. నుడుగులు = మాటలు (నుడువుయొక్క రూపాంతరము). 4. జల్లించి = కాఱి.

నింగిపై నిట్టతోలఁకు మున్నీటిలోనఁ
గూలె భూతాళిజగముల కొలఁదు లెడలి. 711

వ. అంత నమ్మహారాత్రియందు. 712

మ. నెఱి నెల్లప్పుడు నిల్చి ప్రాణిచయమున్ నిర్మించి నిర్మించి వీ
పిఱియన్ నీల్గుచు నావులించుచు నజుం డేసృష్టియున్ మాని మే
నొఱగన్ ఱెప్పలుమూసి కేల్ దలగడై యుండంగ నిద్రించుచున్
గుఱువెట్టం దొడఁగెం గలల్ గనుచు నిర్ఘోషించుచున్ భూవరా!

ఆ. అలసి సొలసి నిదుర నందిన పరమేష్ఠి
ముఖమునందు వెడలె మొదలి శ్రుతులు
నపహరించె నొక హయగ్రీవుఁ డనుదైత్య
భటుఁడు దొంగఁ దొడర బరులవశమె. 714

క. చదువులుఁ దనచేఁబడినం
జదువుచుఁ బెన్ బయల నుండ శంకించి వడిం
[1]జదువులముదుకఁడు [2]కూరుకఁ
జదువుల తస్కరుఁడు సొచ్చె జలనిధికడుపున్. 715

వ. ఇట్లు వేదంబులు దొంగిలి దొంగరక్కసుండు మున్నీట మునింగిన వాని జయింపవలసియు, మ్రానుదీఁగెల విత్తనంబుల ప్రోత్తరలు పెన్నీట నాని చెడకుండ నునుపవలసియు, నెల్లకార్యంబులకుం గావలి యగునా పురుషోత్తముం డప్పను రేయుచొరుదలయందు.

క. [3]కుఱుగఱులు వలుఁదమీసలు
చిఱుదోఁకయుఁ బసిఁడియొడలు సిరిగల పొడలున్
నెఱిమొగము నొక్కకొమ్మును
మిఱుచూపులుఁగలిగి యొక్క మీనం బయ్యెన్. 717

వ. ఇట్లు లక్షయోజనాయతం బయిన పాఠీనంబై విశ్వంభరుండు జలధి సొచ్చి. 718

సీ. ఒకమాటు జలజంతుయూథంబులోఁ గూడు
నొకమాటు దరులకు నుఱికి వచ్చు

1. బ్రహ్మ. 2. నిద్రింపఁగా (బ్రహ్మప్రళయము యుగసహస్రమైనమాట) 3. పెద్ద ఱెక్కలు.

నొకమాటు మింటికి నుదరి యుల్లంఘించు
నొకమాటు లోపల నొదిఁగి యుండు
నొకమాటు వారాశి నొడలు ముంపమిఁ జూచు
నొకమాటు బ్రహ్మాండ మొరయఁ దలఁచు
నొకమాటు ఝషకోటి నొడిసి యాహారించు
నొకమాటు జలముల నుమిసివైచుఁ

తే. గఱులు సారించు మీసాలుఁ గదలుకొలుపుఁ
బొడలు మెఱయించుఁ గన్నులఁ బొలప మార్చు
నొడలు జళిపించుఁ దళతళ లొలయ మీన
వేషి వెన్నిట [1]నిగమగవేషి యగుచు. 719

వ. అంతకు మున్న సత్యవ్రతుండు మహార్ణవంబులు మహీవలయంబు
ముంచు నవసరంబున భక్తపరాధీనుం డగు హరిఁ దలంచుచునుండ
నారాయణప్రేరితయై యొక్కనావ వచ్చినం గనుంగొని. 720

మ. చని సత్యవ్రతమేదినీదయితుఁ డోజం బూని ప్రోదిఁగవి
త్తనముల్ పెక్కులు నావపై నిడి హరి ధ్యానంబుతో దానిపై
మునిసంఘంబులుఁ దాను నెక్కి వెఱతో మున్నీటిపైఁ దేలుచుం
గనియెన్ ముందట [2]భక్తలోకహృదలంకర్మీణమున్ మీనమున్. 721

వ. కని జలచరేంద్రుని కొమ్మున నొక్క పెను [3]బాపత్రాటన నావఁ
గట్టి సంతసించి డెందంబు నివురుకొని తపస్వులుం దాను నారాచ
పెద్ద మీనాకారుం డగు వేల్పు జేని నిట్లని పొగడం దొడంగె. 722

మ. తమలోఁ బుట్టు నవిద్య గప్పికొనుడుం దన్మూలసంసారవి
భ్రములై కొందఱు దేలుచుం గలఁగుచున్ బల్వెంటలన్ దైవయో
గమునం దే పరమేశుఁ గొల్చి ఘనులై కైవల్యసంప్రాప్తులై
ప్రమదం బందుదు రట్టి నీవు కరుణం బాలింపు మమ్మీశ్వరా! 723

ఉ. కన్నులు గల్గువాఁడు మఱి కాననివారికిఁ ద్రోవఁ జూపఁగాఁ
జన్న తెఱంగు మూఢున కసన్మతిఁ దాగురుఁ డౌట సూర్యుఁడే

---

1. వేదములను వెదకువాఁడై 2. భక్తసంఘముల హృదయముల నలంకరించునది
3. పాపత్రాటన = పాము అనెడి త్రాటిచే.

కన్నులు గాఁగ భూతములఁ గాంచుచు నుండు రమేశ! మాకు న
ద్యన్నయమూర్తివై గురువవై యల సద్గతిజాడఁ జూపవే. 724

క. [1]ఇంగలముతోడ సంగతి
బంగారము వన్నె గలుగు భంగిని ద్వత్సే
వాంగీకృతుల యఘుంబులు
భంగంబులఁ బొందు ముక్తి ప్రాపించు హరీ! 725

క. హృదయేశ! నీప్రసన్నత
పదివేలవపాలి లేశభాగముకతనం
దిదశేంద్రత్వము గలదఁట
తుది నిను మెప్పింప నేది దొరకదు శ్రీశా! 726

క. తెలివాఁడు గురుఁడటంచును
గొఱగానిపదంబు సూపఁ గుజనుం డగు నీ
నెఱత్రోవ నడవనేర్చిన
నఱమఱ లేనట్టి పదమునందు దయాబ్ధీ. 727

మ. చెలివై చుట్టమవై మనస్థితుఁడవై చిన్మూర్తివై యాత్మవై
వలనై కోర్కులపంటవై విభుఁడవై వర్తిల్లు నిన్నెల్ల కే
పలువెంటం బడి లోక మక్కట వృథాబద్ధాశమై పోయెడిన్
నిలువన్ నేర్చునె హేమరాశిఁ గనియున్ నిర్భాగ్యుఁ డంభశ్శయా!

ఆ. నీరరాశిలోన నిజకర్మబద్ధమై
యుచితనిద్రఁ బొంది యున్నలోక
మేమహాత్ము చేత నెప్పటి మేల్కాంచు
నట్టి నీవు గురుఁడ వగుట మాకు. 729

క. ఆలింపుము విన్నప మిదె
[2]వేలుపుగమిఱేని నిన్ను వేఁడికొనియెదన్
నాలోని చిక్కు మానిచి
నీలోనికిఁ గొంచుఁ బొమ్ము నిఖిలాధీశా! 730

వ. అని యిట్లు సత్యవ్రతుండు పలికిన సంతసించి మత్స్యరూపంబున
మహాసముద్రంబున విహరించు హరి పురాణపురుషుం డగుటం జేసి

సాంఖ్యయోగక్రియాసహితయగు పురాణసంహిత నుపదేశించె. అమ్మహారాజు మునిసమేతుండై భగవన్నిగదితంబై సనాతనంబగు బ్రహ్మస్వరూపంబు విని కృతార్థుండయ్యె. అతం డిమ్మహాకల్పంబున వివస్వతుం డనంబరఁగిన సూర్యునకు శ్రాద్ధదేవుం డన జన్మించి శ్రీహరికృపావశంబున నేడవమను వయ్యె. అంత నవ్విధంబున వెను రేయి నిండునంతకు సంచరించి జలచరాకారుండగు నారాయణుండు తన్నిశాంతసమయంబున. 731

మ. [1]ఉఱ కంభోనిధి [2]రోసి వేదముల[3]కుయ్యున్ దైన్యముం జూచి వేఁ
గఱు లల్లార్చి ముఖంబుసాఁచి బలుపేఁకం దోఁకసారించి మే
న్మెఱయన్ దాడలుదీటి మీఁద లవరన్ మీనాకృతిన్ విష్ణుఁ [4]డ
క్కఱటిం దాఁకి వధించె ముష్టిదళితగ్రావున్ హయగ్రీవునిన్. 732

వ. అంతం బ్రళయావసానసమయంబున. 733

సీ. ఎప్పుడు వేగునం చెదురు సూచుచునుండు
మునుల డెందంబులం ముదము నొందఁ
దెలివితోఁ బక్క నిద్రించు భారతి లేచి
మోపపయ్యెదఁ జక్క నొత్తికొనఁగ
మలినమై పెనురేయి మ్రక్కిన తేజంబుఁ
దొంటిచందంబునఁ దొంగలింపఁ
బ్రాణుల సంచితభాగధేయంబులుఁ
గన్నుల కొలుకులఁ గానఁబడఁగ

తే. నవయవంబులుఁ గదలించి యావులించి
నిదురఁ దెప్పిలి మేల్కాంచి నీల్గి మలఁగి
యొడలు విఱుచుచుఁ గనుఁగవ లుసుముకొనుచు
ధాత గూర్చుండె సృష్టిసంధాతయగుచు. 734

వ. అయ్యవసరంబున. 735

ఆ. వాసవారిఁ జంపి వానిచేఁ బడియున్న
వేదకోటి చిక్క విచ్చి తెచ్చి

1. ఊఁక. 2. వెదకి. 3. మొఱను (కుయి + యున్). 4. కఱటిని=వంచకుని.

నిదుర మానియున్న నీరజాసనునకు
నిచ్చెఁ గరుణతోడ నీశ్వరుండు. 736

క. జలరుహనాభునికొఱకై
జలతర్పణ మాచరించి సత్యవ్రతుఁడా
జలధి బ్రదికి మనువయ్యెను
జలజాక్షునిఁ గొలువ కెందు సంపదఁ గలదే. 737

ఆ. జనవిభుండు దపసి సత్యవ్రతుండును
మత్స్యరూపి యైన మాధవుండు
సంచరించినట్టి సదమలాఖ్యానంబు
వినినవాఁడు బంధవిరహితుండు. 738

క. హరి జలచరావతారముఁ
బరువడిఁ బ్రతిదినముఁ జదువఁ బరమపదంబుం
బరుఁ డొందు వాని కోర్కులు
ధరణీశ్వర! సిద్ధిఁబొందుఁ దథ్యము సుమ్మీ! 739

మ. ప్రళయాంభోనిధిలోన మేన్మఱచి నిద్రం జెందు వాణీశుమో
ముల వేదంబులుఁ గొన్న దైత్యుని మృతింబొందించి సత్యవ్రతుం
డలరన్ బ్రహ్మము మాటలం దెలిపి సర్వాధారుఁడై మీనమై
జలధిం గ్రుంకుచుఁ దేలుచుం మెలఁగు రాజన్మూర్తికిం మ్రొక్కెదన్.

వ. అని చెప్పి. 741

క. రాజేంద్ర! దైత్యదానవ
రాజమహాగహనదహన! రాజస్తుత్యా!
రాజావతంస! మానిత
రాజధరార్చిత! గుణాఢ్య! రాఘవరామా! 742

మాలిని. దివిజరిపువిదారీ! దేవలోకోపకారీ!
భువనభరనివారీ! పుణ్యరక్షానుసారీ!
ప్రవిమలశుభమూర్తీ! బంధుపోషప్రవర్తీ!
ధవళబహుళకీర్తీ! ధర్మనిత్యానువర్తీ! 743

గద్యము. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రి పుత్త్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబయిన శ్రీమదాంధ్ర భాగవతపురాణం బను మహాప్రబంధంబునందు స్వాయంభువ స్వారోచిషోత్తమ తామసమనువుల చరిత్రంబును, గరిమ కరంబుల యుద్ధంబును గజేంద్రరక్షణంబును రైవతచాక్షుష మనువులవర్తనంబును, సముద్రమథనంబునుఁ, గూర్మావతారంబును, గరళభక్షణంబును, నమృతాదిసంభవంబును, దేవాసురకలహంబును, హరికపటకామినీరూపంబున నసురుల వంచించి దేవతల కమృతంబు వోయుటయు, రాక్షసవధంబును, హరిహరసల్లాపంబును, హరికపటకామినీరూపవిభ్రమణంబును, వైవస్వతసూర్యసావర్ణి దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి భద్రసావర్ణి దేవసావర్ణీంద్రసావర్ణి మనువులవృత్తాంతంబులును, బలియుద్ధయాత్రయును, స్వర్గవర్ణనంబును, దేవపలాయనంబును, వామనావతారంబును, శుక్రబలిసంవాదంబునుఁ,ద్రివిక్రమవిస్ఫురణంబును, రాక్షసులసుతలగమనంబును, సత్యవ్రతోపాఖ్యానంబును, మీనావతారంబును నను కథలుఁ గల యష్టమస్కంధము!

సంపూర్ణము

హరిః ఓం తత్సత్ శ్రీ శ్రీనివాసార్పణమస్తు.



శ్రీరస్తు

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర

# భాగవతము

## నవమస్కంధము



రాజిత ! మునిపూజిత !
[1]వారిధిగర్వాతిరేకవారణబాణా
సూరిత్రాణ ! మహోజ్జ్వల
సారయశస్సాంద్ర ! రామచంద్రనరేంద్రా !

వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యానవైఖరీసమేతుండయిన సూతుం డిట్లనియె. అట్లు ప్రాయోపవిష్టుండయిన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుంగనుంగొని. 2

సీ. మనువుల నడవళ్ళు మర్యాదలును వింటి
మన్వంతరంబుల మాధవుండు
దిరిగిన జాడలు దెలిసె సత్యవ్రతుఁ
డనురాజు ద్రవిళదేశాధిపుండు
పోయిన కల్పాంతమున విష్ణు సేవించి
విజ్ఞానముఁ బొంది [2]వెలుఁగు తేని
కతఁడు వైవస్వతుండై పుట్టి మనువయ్యె
నతనికి నిక్ష్వాకుఁ డాది గాఁగ

1. సముద్రుని గర్వాతిశయమును వారించిన బాణము కలవాఁడా ! 2. సూర్యునకు.

తే. బదురు గొడుకులు గల రంధ్రు పరఁగ వారి
వంశ మేరీతి వర్తించె వారిలోనఁ
జనిన వారిని జనువారిఁ జనెడు వారిఁ
జెప్పవే వ్యాసనందన ! చిత్తగించి. 3

క. చెవులార నేఁడు వినియెద
రవివంశమునందుఁ గలుగు రాజుల కీర్తుల్
వివరింపు వరుసతోడను
భువిఁ బుణ్యులకీర్తి వినినఁ బుణ్యముగాదే. 4

వ. అనినం బరాశరముని మనుమం డిట్లనియె. 5

ఆ. వినుము మనువు కులము వేయి నూఱేండ్లను
బరఁగ విస్తరించి పలుకరాదు
నాకుఁ దోఁచినంత నరనాథ ! వేగంబ
యెఱుకపడఁగఁ బ్రీతి నేర్పరింతు. 6

క. ఎక్కువ దక్కువ [1]పొడవుల
[2]కెక్కటి మొదలయిన పురుషుఁ [4]డింతయుఁ జెడఁ దా
నొక్కఁడుఁ గల్పాంతంబున
నక్కజమై నిల్చి విశ్వమయుఁడై యుండున్. 7

సీ. భూమీశ ! యమ్మహాపురుషుని నాభి మ
ధ్యమున బంగారుఁ [3]గెందమ్మి మొలచె
నాతమ్మిపూవులో నటమీఁదఁ దనయంత
నాలుగు మోముల నలువ పుట్టె
నా బ్రహ్మ మనమున నట మరీచి జనించెఁ
గశ్యపుం డతనికిఁ గలిగె నంత
నా కశ్యపునికి దక్షాత్మజ యదితికిఁ
గొమరుఁడై [4]చీఁకటి గొంగ వొడమె

1. పొడవులకు = రూపులకు. 2. ఎక్కటి = కేవలుఁడు అద్వితీయుఁడు (ఆత్మ)
3. ఈ సృష్టి యంతయు లయింపఁగా. 3. ఎఱ్ఱతామరపువ్వు. 4. సూర్యుఁడు.

తే. జలజబంధుని పెండ్లాము సంజ్ఞ యందు
శ్రాద్ధదేవుండు మనువు సంజాతుఁ డయ్యె
మనువునకు శ్రద్ధ యనియెడి మగువ యందుఁ
బదుగు రొదవిరి కొడుకులు భద్రయశులు. 8

వ. వార లిక్ష్వాకుండును నృగుండును శర్యాతియు దిష్టుండును ధృష్టుండును గరూశకుండును నరిష్యంతుండును బృషధ్రుండును నభగుండును గవియు నన నెగడిరి. అటమున్న మనువు గొడుకులు లేనివాఁడై మిత్రావరుణుల నుద్దేశించి. 9

సీ. మనువు బిడ్డలు వుట్ట మఖమాచరించుచో
నతని భార్యయు హోత నాశ్రయించి
[1]కూఁతురు వుట్ట నాకుం జేయు మని పల్క
వరభక్తితోఁ [2]బయోవ్రతము సలిపె
నాసతి సెప్పిన ట్లధ్వర్యుఁడును హోత
నగుఁగాక [3]వేలువు మనుచుఁ బలికె
హవి నందుకొని కూఁతు రయ్యెడు మని [4]వష
ట్కారంబు సెప్పుచుఁ గడిసివేల్వ
తే. హోత పెడచేఁత నిలయను సుదతి వుట్టె
దానిఁ బొడగని మనువు సంతాప మంది
కొడుకు మేల్గాక యేటికిఁ గూఁతు రకట
చెప్పవే యని పోయె వసిష్ఠు కడకు. 10

వ. చని యిట్లనియె. 11

క. అయ్యా కొడుకుల కొఱకై
యియ్యాగము నీ యనుజ్ఞ నేఁ జేయంగా
నియ్యాఁడు దేల పుట్టెను
మీయంతటి వారి కొండు మేరయుఁ గలదే. 12

---

1. నాకు కూఁతురు పుట్టన్ + చేయుము అని యన్వయము. 2. పయోవ్రతము. 3. హోమము చేయుము. 4. వషట్కారము='వౌషట్' అని పల్కుచు చేయు హవిస్త్యాగము.

వ. అదియునుం గాక మీరు బ్రహ్మవాదులరు మంత్రవాదులరు (వేద వాదులరు) పాపంబు లందకుండం జేయించువా రిదియేమి యన వుడు మాతాత వసిష్ఠుండు [1]హోతృవ్యభిచారం బెఱింగి మనువున కిట్లనియె. 13

తే. అధిప ! సంకల్పవైషమ్య మగుటఁ జేసి
హోత కల్లతనంబున నువిద గలిగె
నైనఁ గలిగింతు నీకుఁ బ్రియాత్మజునిగ
నీవు మెచ్చంగఁ జూడు నా నేర్పు బలిమి. 14

వ. అని పలికి భగవంతుండగు వసిష్ఠుండు గీర్తితత్పరుండు గావున మనువు కూఁతు మగతనంబు కొఱకు నేకచిత్తంబున నాదిపురుషుం డగు హరిం బొగడిన నప్పరమేశ్వరుండు మెచ్చి తపసి కోరినవరం బిచ్చె. అది నిమిత్తంబుగా నిలాకన్యక సుద్యుమ్నుం డను కుమారుం డయి రాజ్యంబు సేయుచు.

సీ. ప్రొద్దువోకొకనాఁడు వోయి వేఁటాడుచు వేడ్కతోడఁ
గొండఱు మంత్రులు గూడి రా [2]సైంధవం బయిన గుఱ్ఱము నెక్కి యడవి కేఁగి
బలువిల్లుఁ గ్రొవ్వాఁడి బాణంబులును దాల్చి పెను మృగంబుల వెంట బిఱుసుతోడ
నుత్తరదిశకు మహోగ్రుఁడై చనిచని మేరువు పొంతఁ గుమారవనముఁ

తే. జేరె నందు మహేశుండు శివయు నెపుడు
రతి సలుపుచుండు రందుఁ జొరంగఁ బోవ
నాఁడు దయ్యెను రాజు రాజానుచరులుఁ
బడఁతు లైరి తదశ్వంబు [3]బడబ యయ్యె. 16

1. హోతయొక్క తప్పునడత. (విధినతిక్రమించుట యన్నమాట). 2. సింధుదేశమునఁ బుట్టినది. 3. ఆడు గుఱ్ఱము.

వ. ఇట్లు మగతనంబు సెడి మగువలై యొండొరుల మొగంబులు సూచి మఱుఁగుచుండి రనిన విని శుకునకు రా జిట్లనియె. 17

ఆ. రాజుఁదోడివారు రమణులై రంటివి
కాంత లగుట కేమి కారణమ్ము ?
ఇట్టిదేశ మెఱుఁగ మెన్నఁడు నా కథల్
వేడ్క దీర నాకు విస్తరింపు. 18

వ. అదియునుంగాక. 19

ఆ. మగువతనము మాని మగవాఁడు గా వచ్చుఁ
గాక పేరుఁ బెంపు గాసి గాఁగ
మగతనంబు మాని మగువ గావచ్చునె
మానవంతుఁ డైన మానవునకు. 20

వ. అని యడిగిన నర్జునపౌత్రునకు వ్యాసపుత్రుం డిట్లనియె. 21

సీ. పురవైరి కొకనాఁడు పొడసూపు వేఁడుకఁ
దద్దయు దిక్కుల తమము లెల్లఁ
దమతమ వెలుఁగులు దగిలి గొందులు సొరఁ
గొందఱు మౌనులు గొలిచిరాఁగఁ
బ్రాణేశుతొడలపై భాసిల్లు నంబిక
వారలఁ జూచి మైవలువ లేమి
సిగ్గు పుట్టిన లేచి చీరఁగట్టినఁ జూచి
దేవియు దేవుండు దీర్ఘలీల

తే. నొంటి దమలోనఁ గ్రీడించు చున్నవారు
మనకు సమయంబుగా దని మరల మునులు
నరుఁడు నారాయణుండు ననారతంబు
మెలఁగు చోటికి నడచిరి మేదినీశ ! 22

వ. అది కారణంబుగా భగవంతుం డగు శివుండు దన ప్రియురాలి వేడుకలకొఱకు నిట్లని వక్కాణించె. 23

క. ఈ నెల వెవ్వఁడు పొచ్చిన
మానిని యగు ననిన తొంటిమాట కతమునన్
[1]మానవుఁడు మగువపోఁడిమి
మానక పేరడవులందు మఱియుం దిరిగెన్. 24

వ. ఇట్లు చెలికత్తియల మొత్తంబులుం దానును నారాచపుఁబోఁడి వాఁడిచూపుల నాఁడుపోఁడిమి నెఱపుచు దైవయోగంబున సోమసుతుండును భగవంతుండునునగు బుధుని యాశ్రమంబు సేరి మెలంగుచున్నయెడ. 25

ఆ. [2]రాజుకొడుకుఁ జూచె రాజీవదళనేత్ర
[3]రాజవదనఁ జూచె రాజుపట్టి
దొంగకాముఁ డంత [4]దొందడిఁ [5]జిగురాకు
వాలు వెఱికి యుఱికి వారిమొత్తె. 26

వ. ఇట్లు [6]పూవుంగైదువులుగల [7]నెఱబిరుదు చిగురుటడిదంబు మొనకు [8]నోహటించి వార లిరువురుం బైపడి వేడుకలకుం జొచ్చిన వారలకుం బురూరవుం డను కుమారుండు పుట్టె. ఇవ్విధంబున. 27

ఆ. మనుసుతుండు ఘనుఁడు మగనాలితనమునఁ
గొడుకుఁ గాంచి వినివి కుందికుంది
చింతఁ బొంది గురు వసిష్ఠుని భావించె
నతని తలఁపుతోన యతఁడు వచ్చె. 28

వ. వచ్చి సుద్యుమ్నుండు మగవాఁ డగుకొఱకు నమ్మునిపుంగవుండు శంకరు నారాధింప నీశ్వరుండును దపసి ప్రయాసంబునకు సంతసిల్లి యిట్లనియె. 29

---

1. ఆడుదాని విలాసము. 2. రాజు = చంద్రునియొక్క, కొడుకుఁ – బుధుని. 3. రాజవదనఁ = చంద్రునివంటి మోము కలదానిని. 4. త్వరతో లేక సంఘర్షముతో. 5. చిగురాకు అనెడి కత్తి. 6. పూవు లాయుధములు గల. 7. నెఱబిరుదు = గట్టి శూరునియొక్క, చిగురు + అడిదము = చిగురాకు బాకుయొక్క, మొనకు = కొనకు. 7. ఓహటించి = ఓడి.

మ. తను మున్నాడినమాటయున్ నిజముగాఁ దన్మౌనికిం బ్రీతిగా
మనుజుం డొక్క నెలవో నెలం బురుషుఁడై మాసాంతరంబైనఁ గా
మినియై యీ గతి వీఁడుపాటమర భూమిం దాన రక్షించుఁ బో
మ్మనినన్ వచ్చె వసిష్ఠుఁ డామనుసుతుం డారీతి రాజ్యస్థుఁడై. 30

ఆ. మగువ యగుచు మరల మగవాఁడు నగుచును
భూతధాత్రి యంత నాతఁ డేలెఁ
బ్రజలు సంతసింప బాహాబలముతోడ
గురుని కరుణఁ జేసి కువలయేశ! 31

వ. అతనికి నుత్కలుండును గయుండును విమలుండును నను కొడుకులు మువ్వురు గలిగి ధర్మపరులై యుత్తరాపథంబునకు రాజు లయిరి. సుద్యుమ్నుండు ముదుసలియై ప్రతిష్ఠానపురంబు విడిచి పురూరవునకు భూమి యిచ్చి వనంబునకుఁ జనియె. ఇవ్విధంబున. 32

౨ అధ్యాయము

సీ. కొడుకు సుద్యుమ్నుండు ఘోరాటవుల కేఁగ
[1]వందుచు మనువు వైవస్వతుండు
దనకుఁ బిడ్డలు గల్గ దప మాచరించెను
హరిఁ గూర్చి నూఱేండ్లు యమునలోన
హరి యంత నిక్ష్వాకుఁ డాదిగాఁ బదుగురు
పుత్త్రుల నిచ్చెను బొసఁగ వారి
యందుఁ బృషధ్రాఖ్యుఁ డనువాఁడు గురునాజ్ఞ
విమలధర్మంబులు వెలయఁబూని
తే. పసుల కదుపులఁ గాచుచు [2]బలు ముగిళ్ళు
వచ్చి నడురేయి జోరున వానగురియ
మందవిడియించి చుట్టు నేమఱకయుండె
నడవి మెకములు సొరకుండ నరసికొనుచు. 33

వ. అంత. 34

1. దుఃఖించుచు 2. పెక్కు మేఘములు

క. ప్రబ్బికొనిన పెంజీఁకటి
నిబ్బరముగ [1]నడిఁకి నడిఁకి నింగికి వడితో
గొబ్బున నెగసి తటాలున
బెబ్బులి [2]మందావుఁ బట్టెఁ [3]బెలుకుఱి యఱవన్. 35

క. ఉల్లములు గలఁగి మొదవుల
[4]వెల్లువ లన్నియును లేచి విచ్చలవిడితోఁ
జెల్లాచెదరై పాఱెను
బెల్లుగ నంబే యటంచు బెబ్బులి [5]గాలిన్. 36

వ. అయ్యవసరంబున. 37

శా. ఆ పెంజీఁకటి మ్రోలగాన [6]కడిదం బంకించి శార్దూల మం
చా[7]పుల్లావు శిరంబుఁ ద్రుంచి తెగదో యంచుం బులిన్ వెండియున్
వాపోవం దెగవ్రేసి భూవరుఁడు ద్రోవన్ ఖడ్గరక్తంబు చేఁ
బైపైఁగ్రోయుచుఁ జేరి చూచెఁ దల [8]ద్రెవ్వంబడ్డ యద్ధేనువున్. 38

వ. చూచి దుఃఖితుండైయున్న పృషధ్రునింగని కులగురుం డగు
వసిష్ఠుండును కోపించి నీవు రాజత్వంబునకుఁ బాసి యీ యపరా
ధంబున శూద్రుండవు గమ్మని శపియించె. అతండును గృతాంజలి
యై తనకులాచార్యుని వలన మరలం గైకోలు వడసి యతని యను
మతంబున. 39

సీ. అఖిలాత్ముఁ డగుచున్న హరియందుఁ బరునందు
భక్తితోఁ జాలఁ దత్పరత మెఱసి
[9]యూర్ధ్వరేతస్కుఁడై యున్న ప్రాణుల కెల్ల
నాప్తుఁడై సర్వేంద్రియములు గెల్చి
సంగంబునకుఁ బాసి శాంతుఁడై [10]యపరిగ్ర
హుండునై కోరిక యుంపి తనకు

---

1. ఒదిఁగి యొదిఁగి (నడుచు క్రియ) 2. మంద + ఆవు = మందలోనున్న ఆవును 3. పెలుకుఱి = బెగ్గలించి (విహ్వలించి) 4. ప్రవాహములు (గుంపులన్న మాట) 5. గాలిన్ = పసిచేత (పులియొక్క వాసన పసిపట్టి యని భావము) 6. అడిదము కత్తి 7. పుల్లావు – కపిలధేనువు. 8. నరకఁబడిన 9. కామవ్యాపారమును జయించినవాఁడు, 10. విషయములవంకఁ బోనివాఁడై.

వచ్చిన యదియ జీవనము గావించుచుఁ
దను దాన నిలుపుచు ధన్యబుద్ధి

తే. జడుని తెఱఁగున నంధుని చందమునను
జెవిటి భంగిని మహి నెల్లఁ జెల్లఁ దిరిగి
యడవులకు నేఁగి కార్చిచ్చు నందుఁ జొచ్చి
చిక్కి నియతుండై బ్రహ్మంబుఁ జెందె నతఁడు. 40

క. కవి యను కడపటి కొమరుఁడు
భవనము రాజ్యంబు విడిచి బంధులతో నేఁ
గి వనమునఁ బరమపురుషునిఁ
బ్రవిమలమతిఁ దలఁచి తలఁచి పరముం బొందెన్. 41

వ. మఱియుఁ గరూశుండను మానవుని వలనం గొందఱు కారూశులు క్షత్త్రియులు గలిగి ధర్మంబుతోడి ప్రియంబున బ్రహ్మణ్యులై యుత్తరాపథంబునకు రక్షకులైరి. ధృష్టునివలన ధార్ష్టంబను వంశంబు గలిగి భూతలంబున [1]బ్రహ్మభూయంబునొంది నెగడె. నృగుని వంశంబున సుమతి పుట్టె నతనికి భూతజ్యోతి పుట్టె నతనికి వసువు జనించె. వసువునకుం బ్రతీకుండు గలిగెఁ బ్రతీకునికి నోఘవంతుండు జనించె. అతని కూఁతు రోఘవతి యను కన్యకను సుదర్శనుండు వివాహంబయ్యె. నరిష్యంతుండను మనుపుత్త్రునికిఁ జిత్రసేనుం డావిభునకు దక్షుం డాపుణ్యునకు మీఢ్వాసుం డా సుజనునికి శర్వుం డమ్మహాత్మునికి నింద్రసేనుం డా రాజునకు వీతిహోత్రుం డాసుమతికి సత్యశ్రవుం డాఘనునికి నురుశ్రవుం డా వీరునకు దేవదత్తుం డాపండితునకు నగ్నివేశుండు సుతులయి జనియించిరి. అయ్యగ్నివేశుండు [2]గానీనుండన నెగడి జాతకర్ణుండను మహర్షియై వెలసె. అతనివలన నాగ్నివేశ్యాయనం బను బ్రహ్మకులంబు గలిగె. ఇవ్విధంబున. 42

1. బ్రహ్మత్వమును (బ్రహ్మజ్ఞానమునన్నమాట) 2. కానీనుఁడు = కన్యకుఁ బుట్టినవాఁడు.

క. తెలుపఁబడె నరిష్యంతుని
కులమెల్లను నీకు దిష్టు కులముం దెలియం
దెలిపెద రాజేంద్రోత్తమ!
తెలియుము సర్వంబు నీకుఁ దేటపడంగన్. 44

వ. దిష్టుని కొడుకు నాభాగుం డనువాఁడు కర్మవశంబున వైశ్యత్వంబు నొందెను. ఆ నాభాగునికి హలధనుండుగలిగె నతనికి వత్సప్రీతియు వత్సప్రీతికిఁ బ్రాంశువు నతనికిఁ బ్రమతియుఁ బ్రమతికి ఖమిత్రుండు ఖమిత్రునికిఁ జాక్షుషుండు నతనికి వివింశతియు వివింశతికి రంభుండు రంభునికి ధార్మికుండైన ఖనినేత్రుండు నతనికిఁ గరంధనుండుఁ గరంధనున కవిక్షిత్తు నాయవిక్షిత్తునకు మరుత్తుండు జనియించిరి. ఆ మరుత్తుండు చక్రవర్తి యయ్యె నతని చరిత్రంబు వినుము. 44

సీ. అంగిరస్సుతుఁడు మహాయోగి సంవర్తుఁ
డతని యాగమునకు యాజకుండు
దిరిగి యుండెడివారు మరుదాఖ్యగణము లో
ప్పారు విశ్వేదేవు లచటి సభ్యు
లధికదక్షిణల బ్రాహ్మణకోటిఁ దనిపెను
సోమపానంబున సురవరుండు
మది నుబ్బి బంగారుమయము గావించెను
యాగవస్తువు లెల్ల నధికనియతి
తే. నా మరుత్తుండు సేసిన యట్టిభంగి
ధీరభావంబుఁ [1]జాగంబుఁ [2]దెంపుఁ గలిగి
మఖము సేసిన వారిని మఱియు నెఱుఁగ
మెల్లలోకములందు నరేంద్రముఖ్య. 45

వ. ఆ మరుత్తునకు దముండును దమునకు రాజవర్ధనుండును రాజవర్ధనునకు సుధృతియు సుధృతికి సౌధృతేయుండును సౌధృతేయునకుఁ గేవలుండును గేవలునకు బంధుమంతుండును నతనికి వేదవంతుం

---

1 త్యాగము. 2 తెగింపు (సాహసము)

డును వేదవంతునికి బంధుండును బంధునకుం దృణబిందుండును సంభవించిరి. అంత. 46

క. అచ్చరకన్య యలంబుస
గ్రచ్చుఱఁ దృణబిందుఁ జూచి కామించి తుదిం
[1]బచ్చవిలుకాని యమ్ముల
[2]ముచ్చిచ్చున వెచ్చిపొందె మోహాతుర యై. 47

వ. ఆ దంపతులకు నిలబిల యను కూఁతురు జన్మించె. ఆ కొమ్మను విశ్రవసుండు వొందిన నైలబిలుం డనం గుబేరుండు పుట్టె. మఱియు నాతృణబిందునకు విశాలుండును శూన్యబంధుండును ధూమ్రకేతుండును నను వారు మువ్వురు గొడుకులు గలిగిరి. అందు విశాలుండు వంశవర్ధనుండై వైశాలియను నగరంబు నిర్మించె. ఆ రాజునకు హేమచంద్రుం డానరేంద్రునకు ధూమ్రాక్షుం డాపుడమిఱేనికి సహదేవుం డాబలిష్ఠునకుఁ గృశాశ్వుం డాతనికి సోమదత్తుండు జనించె. అతండు. 48

ఆ. అమరవిభుఁడు మెచ్చ నశ్వమేధము సేసి
భూరి పుణ్యగతికిఁ బోయె నెఱమి
సోమదత్తుకొడుకు సుమతికి జనమేజ
యుం డనంగఁ గొమరుఁ డుప్పతిల్లె. 49

వ. వీరలు వైశాలురనం బరఁగి తృణబిందుని కీర్తి వహించి రాజ్యంబు సేసిరి. మఱియును. 50

3 అధ్యాయము

సీ. శర్యాతి యనురాజు జనియించె బ్రహ్మ ప
రుండైన మనువుకు రూఢితోడ
నతఁ డంగిరునిసత్త్రమందు రెండవనాఁటి (సారె)
విహితకర్మము లెల్ల వెలయఁ జెప్పె
నతని కూఁతురు సుకన్యక యను వనజాక్షి
దన తండ్రితోఁ దపోవనికి నరిగి

3 మన్మథునియొక్క. 4 అగ్నిచే,

చ్యవనాశ్రమముఁ జేరి సఖులును దానును
ఫలపుష్పములు గోయఁ బాఱి తిరిగి

ఆ. యొక్క పుట్టలోన నొప్పారు జ్యోతుల,
రెంటిఁ గాంచి [1]వాఁడి ముంటఁ బొడిచె
గన్య ముగుద మఱచి [2]ఖద్యోతయుగ మంచు,
దైవవశము కతనఁ [3]దమకి యగుచు. 51

క. జ్యోతుల ముంటం బొడిచిన,
[4]వాతుల నెత్తురులు గురిసె వసుధేశభట
వ్రాతముల కెల్ల నచ్చట
నాతఱి మలమూత్రబంధ మయ్యె నరేంద్రా! 52

వ. వారలం జూచి రాజర్షి యగు శర్యాతి విస్మితుండై మీర లియ్యా
శ్రమంబున నకృత్యంబు సేయ నోపుదురు. అది కారణంబుగా మీ
కీ [5]నిరోధంబు సిద్ధించె నని పలుకు నవసరంబునఁ దండ్రికి సుకన్యక
యిట్లనియె. 53

తే. అయ్య! యీ పుట్టచేరువ నాడి యాడి
యిందులో రెండు జ్యోతుల నేను గాంచి
కంటకంబునఁ బొడువ రక్తంబు గురిసె
నేవిధంబునఁ గురిసెనో యెఱుఁగు మీవు. 54

వ. అనిన విని శర్యాతి భీతుండై కూఁతుం దోడ్కొని వల్మీకంబు కడకుం
జని యందుఁ దపంబు సేయు చున్న చ్యవనమునిం గని తన నేర్పున
నతనివలనఁ బ్రసన్నత వడసి తపసి చిత్తంబు నెఱింగి తన పుత్త్రిక
నిచ్చి యెట్టకేలకున్ బ్రదికినవాఁడై మునీశ్వరుని వీడ్కొని పురం
బునకుం జనియె. అంత. 55

ఆ. పరమకోపుఁ డయిన భార్గవుఁ బతిఁ జేరి
మిగులఁ బనులయెడల మెచ్చఁ దిరిగి

---

1. సూదియైన ముల్లుచేత. 2 మిణుఁగురు పురుగుల జంటయని. 3 తమకి = తొట్రుపాటుగలది. 4 నోటివెంబడి. 5. నిర్బంధము.

యతని పర్ణశాల నాసుకన్యక యను
మగువ గొన్నియేండ్లు మనువు మనియె. 55

వ. అంత నొకనాఁ డయ్యాశ్రమంబునకు [1] వేల్పువెజ్జులైన [2]నాసత్యు
లిద్దఱు వచ్చిన వారలం బూజించి తన ముదిమి సూపి చ్యవనుం
డిట్లనియె. మీకు మున్ను యాగభాగంబుల లేని సోమపానంబు
నేను గల్పించి యిచ్చెద. సోమపానసమయంబునఁ బానపాత్రంబు
మీకు నం దిచ్చెద. నా ముదిమి మాసుపుండని యిట్లనియె. 57

క. [3]నవకం బగు ప్రాయంబున
జవరాండ్రఁ గరంచు మేని చక్కఁదనంబున్
శివతరముగఁ గృపసేయుఁడు
దివిజాధిపవైద్యులార! దీవింతు మిమున్.

వ. అనిన నశ్విదేవతలు సంతోషించి సిద్ధనిర్మితం బయిన యీ మడుఁ
గున మునుఁగు మని పలికి. 69

సీ. ముసలి తాపసుఁబట్టి మొగి నెత్తుకొనిపోయి
ముగురు నామడుఁగున మునిఁగి లేచి
వనితాజనుల నెల్ల వలపించువారలై
సుందరమూర్తులై సుభగు లగుచుఁ
గమలమాలికలతోఁ గనకకుండలముల
తోఁ బుష్పసాయకు తోడఁ దుల్యు
లై సూర్యతేజస్కులై యున్నవారల
మువ్వురఁ బొడగాంచి [4]మగువబాల

తే. యందుఁ బెనిమిటి వీఁ డని యెఱుఁగ లేక
[5]గరితగావున నిజనాథుఁ గానఁ గోరి
సుభగమతులార! నానాథుఁ జూపుఁ డనుచు
నశ్విదేవతల కపు డయ్యబల మొ్రక్కె.

1. దేవవైద్యులు. 2. అశ్వినీదేవతలు. 3. శోషములను. 4. ముగ్ధ. 5. (అవమాయ
పరాలు) పతివ్రత.

వ. వారలా పతివ్రతా¹నిజవర్తనంబునకు మెచ్చి వయోరూపసంపన్నుం డయిన చ్యవనుం జూపి దంపతుల వీడ్కొని విమానారూఢులై వేలుపులప్రోలికిం జనిరి. అంత. 61

సీ. యాగంబు సేయంగ నర్థించి శర్యాతి
చ్యవనమునీంద్రు నాశ్రమము కడకుఁ
గూఁతు నల్లునిఁ దోడుకొనిపోవ వేడుక
వచ్చి పుత్త్రికకుఁ బార్శ్వంబునందు
సూర్యతేజంబున సొంపారు వరుఁ గని
వీఁ డెవ్వఁడో దీని విభుఁడు గాఁడు
చెల్లరే! యని పుత్త్రి సేసిన ప్రియములు
మ్రొక్కులు నొల్లక మోము వాంచి

తే. మాఱు మాటాడ దీవింప మనసు రోసి
చ్యవనుఁ డధికుండు మునిజనసత్తముండు
భువనసన్నుతుఁ డతఁ డెందుఁ బోయె నాతఁ
డెట్లు వంచింపఁ బడియె వీఁ డెవ్వఁ డబల! 62

మ. తగవే ధర్మమె శీలమే ²కులజవై దర్పించి మోదింప నా
జగదారాధ్యునిఁ బుణ్యశీలుఁ దపసిన్ సాధ్వీమనస్సమ్మతున్
మగనిన్ మాని ³భుజంగుఁ బొందఁ దగునే మానంబు వాటింపఁగా
దగదే దుర్గతిఁ ద్రోచితే కఠినవై తండ్రిం బతిం గూఁతురా! 63

ఆ. పద్మనయన మగఁడు ప్రాయంపువాఁడైనఁ
గాపువెట్టి కొంతఁ గావనేర్చుఁ
గడఁగి ముసలి తపసి గావంగ నేర్చునే
యువతి ముదుకఁ గూన్ప నొప్పు నెందు. 64

వ. అని పలికిన నప్పరమపతివ్రతాలలామంబు చిఱునగవు చెక్కుటద్దంబులఁ జిడిముడిపడఁ దండ్రి కిట్లనియె. 65

1. సత్యప్రవర్తనము. 2 ఉత్తమవంశమునఁ బుట్టినదానవై. 3 విటుని (జారుని).

క. నీ యల్లుఁ డితఁడు భార్గవుఁ
డయ్యా జారుండు గాఁడు హర్షముతోడన్
నెయ్యంబు నిల్పు మంచును
దొయ్యలి సర్వంబుఁ దండ్రితో వినిపించెన్. 66

వ. అంత శర్యాతియు నప్రమత్తుండై కూఁతుం గౌఁగిలించుకొని గార
వంబున [1]నయిదువవు గమ్మని దీవించె నంత భార్యాసహితుండై
చ్యవనుండు నని తన మామకు యాగంబు సేయించి యొక్క
పాత్రంబున సోమభాగంబుఁ బట్టి నిజతపోబలంబున నశ్విదేవతల
కర్పించినం జూచి. 67

క. కోపముతోడను వాసవుఁ
డేపున ముని పైవ వజ్ర మెత్తిన మరలం
దాపసుఁడు వజ్రి భుజమున
నా [2]పవి [3]నిలిపెన్ జగంబు లాశ్చర్యపడన్. 68

వ. ఇవ్విధంబున నశ్విదేవత లిద్దఱు వైద్యులై సోమపానంబులేనివా
రయ్యుఁ జ్యవను సామర్థ్యంబునఁ [4]బ్రాప్తభాగులయి చనిరి.
శర్యాతికి నుత్తానబర్హియు నానర్తుండును భూరిషేణుండు నను
మువ్వురు గొడుకులు గలిగి రందు. 69

సీ. ఆనర్తునకు రైవతాహ్వయుం డుదయించె
నతఁడు కుశస్థలి యనుపురంబు
నీరధిలోపల నిర్మించెఁ బెంపుతో
నానర్తముఖవిషయంబు లేలె
గనియెఁ గకుద్మిముఖ్యం బైన నందన
శతము రైవతుఁడు విశాలయశుఁడు
దనకూఁతు రేవతి ధాత ముందటఁ బెట్టి
తగువరు నడిగెడి తలఁపుతోడఁ

---

1 అయిదువ = పుణ్యస్త్రీ. 2 వజ్రాయుధమును. 3 స్తంభింపజేసెను, 4 భాగమును పొందినవారు.

తే. కన్యఁ దోడ్కొని బ్రహ్మలోకమున కేఁగి,
యచట గంధర్వ కిన్నరు లజుని మ్రోల
నాటపాటలు సలుపంగ నవసరంబు,
గాక నిలుచుండె నతఁ డొక్క క్షణము తడవు. 70

వ. అంత నవసరం బయిన నజునికి నమస్కరించి రైవతుండు రేవతిం
జూపి యిట్లనియె. 71

ఆ. చాల ముద్దరాలు జవరాలుఁ [1]గోమరాలు,
నీ శుభాత్మురాలి కెవ్వఁ డొక్కొ
మగఁడు సెప్పు మనిన మది చూచి పకపక,
నవ్వి భూమిపతికి నలువ పలికె. 72

సీ. మనుజేశ! దీనికై మదిలోనఁ దలఁచిన
వారలెల్లను గాలవశతఁ జనిరి
వారల బిడ్డల వారల మనుమల
వారల గోత్రంబు వారి నైన
వినము మేదినిమీఁద వినుము నీవచ్చిన
యీలోన నిరువది యేడుమాఱు
లొండొండ నాలుగు యుగములుఁ జనియె నీ
వటుగాన ధరణికి నరుగు మిపుడు

తే. దేవదేవుండు హరి బలదేవుఁ డనఁగ
భూమిభారంబు మాన్పంగఁ బుట్టినాఁడు
సకలభూతాత్మకుఁడు నిజాంశంబుతోడ
యువతిమణి నమ్ము జనమణి [2]కున్నతాత్మ! 73

వ. అని యానతిచ్చిన బ్రహ్మకు నమస్కరించి భూలోకమునకుఁ జను
దెంచి సోదరస్వజనహీనం బగు తన నగరంబున కారాజు వచ్చి
బలభద్రుంగాంచి రేవతీకన్య నతని కిచ్చి నారాయణాశ్రమం బగు
బదరికావనంబునకు నియమంబునఁ దపంబుసేయం జనియె. 74

---

1 సుందరురాలు. 2. ఉన్నతాత్మ-ఉదారమయిన మనస్సుకలవాఁడా!

౪ అధ్యాయము

క. నభగుఁ డను మనుజపతికిని
శుభమతి నాభాగుఁ డనఁగ సుతుఁ డుదయించెం
బ్రభులై [1]కవి యను తలఁపున
విభజించిరి భ్రాత లతని విత్తము నధిపా! 75

వ. అంత నాభాగుండును బ్రహ్మచారియై తన తోడంబుట్టువులను ధనంబు పాలడిగిన వారలు దండ్రి చెప్పిన క్రమంబున నిచ్చెద మనిన నాభాగుండు తండ్రి యగు నభగు కడకుం జని విభాగంబు సేయు మనిపలికిన నతం డిందు నంగిరసులు మేధగలవారలయ్యును సత్త్రయాగంబు సేయుచు నాఱవదినంబున సర్వకర్మంబులు దోఁపక మూఢులయ్యెదరు. వారలకు నీవు వైశ్వదేవసూక్తంబులు రెండెఱింగించినఁ గవి యనం బ్రసిద్ధికెక్కెదవు. దానం జేసి వారు కృతకృత్యులై స్వర్గంబునకు బోవుచు [2]సత్త్రపరిశేషితం బైన ధనంబు నీకిచ్చెదరని పలికినం దండ్రి వీడ్కొని నాభాగుండు నని యట్లు సేసిన నంగిరసులు సత్త్రపరిశేషితధనంబు లతని కిచ్చి నాకంబునకుం జనిరి. అంత. 75

క. అంగిరసు లిచ్చు పసిఁడికి
మంగళమతిఁ జేరు నృపుని నూనిచి యొక[3]ఁడు
త్తుంగుఁడు [4]గృష్ణాంగుఁడు దగ
ముంగల నిలుచుండి విత్తముం జేకొనియెన్.

వ. వానిం జూచి నాభాగుఁడు దనకు మును లిచ్చుటం జేసి తన ధనం బని పలికిన నమ్మహాపురుషుండు మీతండ్రి సెప్పిన క్రమం బకర్తవ్యం బనిన నాభాగుండు నభగు నడిగిన నతండు యజ్ఞమందిరగతంబై యుచ్ఛిష్టం బగు ధనంబు దొల్లి మహామునులు రుద్రున కిచ్చిరి. అది కారణంబుగా నాదేవుండు సర్వధనంబునకు నర్హుం డనిన విని వచ్చి నాభాగుండు మహాదేవునకు నమస్కరించి దేవా! యీధనంబు నీయధీనంబని మాతండ్రి నాకుం జెప్పె, నే నపరా

1. పండితుఁడు (బ్రహ్మజ్ఞాని యన్నమాట). 2. యాగమున మిగిలినది. (యజ్ఞశిష్టము). ఎత్తుగానున్నవాఁడు. 4. నల్లని శరీరము కలవాఁడు.

ధంబు సేసితి సహింపు మనువుడు భక్తవత్సలుండగు నమ్మహా
పురుషుండు నభగు సత్యవచనంబునకు నాభాగుని నిజంబునకు
మెచ్చి నీవు దప్పక పలికితివి కావున సత్త్రిశేషం బగు ధనంబు
నీకు నిచ్చితి నని పలికి [1]యంతర్దర్శిత్వంబును సనాతనంబగు బ్రహ్మ
జ్ఞానంబును నుపదేశించి తిరోహితుండయ్యె. ఇవ్విధంబున.

క. భువిలో నాభాగునికథ
దవిలి మతిన్ రేపు మాపుఁ దలఁచిన మాత్రం
గవి యగు మంత్రజ్ఞుం డగుఁ
బ్రవిమల గతిఁ బొందు నరుఁడు [2]భద్రాత్మకుఁడై. 79

వ. అంత నాభాగునకు నంబరీషుండు జనియించె. అతని యందు [3]జగద
ప్రతిహతం బైన బ్రాహ్మణశాపంబు నిరర్థకం బయ్యె ననిన విని
యేమికారణంబున దురంతం బైన బ్రహ్మదండంబు వలన నతండు
విముఖం బడియె ననిన నప్పుడమిఱేనికి శుకుం డిట్లనియె. 80

అంబరీషోపాఖ్యానము.

శా. సప్తద్వీప విశాలభూభరము దోస్తంభంబునం బూని సం
ప్రాప్తశ్రీయుతుఁడై మహావిభవసంపచ్చాతురిం గల్గి [4]దు
ర్వ్యాప్తిం జెందక వైష్ణవార్చనల మేరం గాలముం బుచ్చుచున్
సుప్తిం బొందక యొప్పె సద్గుణగరిష్ఠుం డంబరీషుం డిలన్. 81

సీ. చిత్తంబు మధురిపు శ్రీపాదములయంద,
పలుకులు హరిగుణపఠనమంద
కరములు [5]విష్ణుమందిరమార్జనములంద,
శ్రవములు మాధవశ్రవణమంద
చూపులు గోవిందరూపవీక్షణమంద,
శిరము కేశవనమస్కృతులయంద
పదము లీశ్వరగేహపరిసర్పణములంద
కామంబు చక్రికైంకర్యమంద

1. లోపలిచూపును (ఆత్మదర్శనమన్నమాట.) 2. మంగళస్వరూపుఁడై. 3. లోకమునం దడ్డులేనిది. 4. చెడ్డతనముయొక్క వ్యాప్తి. 5. విష్ణ్వాలయములను తుడిచి కడుగుటయందు.

తే. సంగ మచ్యుతజనతనుసంగమంద,
ఘ్రాణ మసురారిభక్తాంఘ్రికమలమంద
రసనఁ దులసీదళములంద రతులుపుణ్య
సంగతులయంద యా రాజచంద్రమునకు. 82

వ. మఱియు నమ్మహీవిభుండు. 83

సీ. ఘన వైభవంబునఁ గల్మషహరుఁడై
యజ్ఞేశు నీశు నజ్ఞాంగుఁ గూర్చి
మొనసి వసిష్ఠాదిమునివల్లభులతోడఁ
దగిలి సరస్వతీ తటమునందు
[1]మేధతో బహువాజిమేధంబు లొనరించె
గణుతింపరాని దక్షిణలు వెట్టి
[2]సమలోష్టహేముఁడై సర్వకర్మంబులు
హరిపరంబులు గాఁగ నవనియేలె

ఆ. విష్ణుభక్తులందు విష్ణువునందుఁ [3]గ
లంక యెడల మనసు లంకె వెట్టి
విహితరాజ్యవృత్తి విడువనివాఁడునై
యతఁడు రాచతపసి యనఁగ నొప్పె. 84

వ. మఱియు నమ్మహాభాగవతుండు. 85

క. హరియని సంభావించును
హరియని దర్శించు నంటు నాఘ్రాణించున్
హరియని రుచిగొనఁ దలఁచును
హరి హరి ఘను నంబరీషు నలవియె పొగడన్. 86

వ. ఇట్లు పుణ్యచిత్తుండు నీశ్వరాయత్తుండునై యల్లనల్లన రాజ్యంబు సేయుచున్న సమయంబున. 87

1. చురుకుతనము గల బుద్ధి. (జ్ఞాపకశక్తి కలది కాని). 2. మన్ను బంగారమును సమానముగ భావించువాఁడై. సమదృష్టికలవాఁడనుట (విషయవాంఛలు లేనివాఁడని భావము). 3. క్షోభ లేక కాలుష్యము. (మకిలి)

ఆ. ఆతని ¹కీహ మానె హారులందుఁ గరులందు
ధనములందుఁ గేళివనములందుఁ
బుత్త్రులందు బంధుమిత్త్రులయందును
బురమునందు నంతిపురమునందుఁ 88

వ. అంతఁ గొంతకాలంబున కమ్మేదినీకాంతుండు సంసారంబువలని
²తగులంబు విడిచి వినిర్మలుండై యేకాంతంబున భక్తిపరవశుం
డయి యుండ నారాచతపసికి భక్తలోకవత్సలుం డగు పురుషోత్త
ముండు ప్రతిభటశిక్షణంబును నిజజనరక్షణంబును ³నిఖిలజగద
వక్రంబును నగు చక్రంబు నిచ్చి చనియె. అంత. 89

క. తనతోడి నీడ కైవడి
ననురూపగుణాఢ్య యైన ⁴యాత్మమహిషితో
జనవిభుఁడు ద్వాదశీవ్రత
మొనరన్ హరిఁ గూర్చి చేసె నొకయేఁ డధిపా! 90

వ. ఇట్లు వ్రతంబు సేసి యావ్రతాంతంబునం గార్తికమాసంబున
మూఁడు రాత్రు లుపవసించి కాళిందీజలంబుల స్నాతుం డయి
మధువనంబున మహాభిషేకవిధానంబున విహితపరికరసంపన్నుం
డయి హరి నభిషేకంబు సేసి మనోహరంబు లయిన గంధాక్షతం
బులు సమర్పించి యభినవామోదంబులైన పుష్పంబులం బూజించి
తదనంతరంబ. 91

శా. పాలేఱై ప్రవహింప నంగరుచులుం బ్రాయంబులున్ రూపము
ల్మేలై ⁵ధూర్తలుగాక ⁶వెండిగొరిజల్ హేమోరుశృంగంబులుం
గ్రాలం గ్రేపుల యక్కునాఁకుచును ⁷రంగచ్చేలలై యున్న ⁸మం
దాలన్ ⁹న్యర్బుదషట్క మిచ్చె విభుఁ డుద్యద్వేదికశ్రేణికిన్. 92

---

1. కోరిక. 2. మోహము (అంటు). 3. సర్వలోకములందును కుంటువడనిది
4. పట్టపుదేవితో 5. పొడుపు తన్నులేనివి 6. వెండికోసులు తొడిగిన గిట్టలు 7.
చక్కని వస్త్రములు కప్పినవి 8. మంద × ఆలన్ = మందలోని ఆవులను 9. ఆరున్యర్బు
దములు. న్యర్బుదము = నూరుకోట్లు (అర్బుదము = పదికోట్లు)

క. పెక్కండ్రు విప్రవరులకు
గ్రక్కున నతిభక్తితోడఁ గఱుపులు నిండం
జొక్కపుటన్నం బిడి విభుఁ
డొక్కెడఁ [1]పారణము సేయ నుద్యోగింపన్. 93

వ. అయ్యవసరంబున. 94

క. భాసుర నిగమపదోప
న్యాసుఁడు సుతపోవిలాసుఁ డనుపమయోగా
భ్యాసుఁడు [2]రవిభాసుఁడు దు
ర్వాసుఁ డతిథి యయ్యెఁ దన్నివాసంబునకున్. 95

వ. అట్లతిథియై వచ్చిన యమ్మునివల్లభునకుఁ బ్రత్యుత్థానంబు సేసి కూర్చుండ గద్దియ యిడి పాదంబులు గడిగి పూజించి సేమం బరసి తన యింట నన్నంబు గుడువు మని నమస్కరించిన యమ్మహాత్ముండు సంతసించి భోజనంబునకు నంగీకరించి నిర్మలంబు లగు కాళిందీ జలంబులం బరమధ్యానంబు సేయుచు మునింగి లేచి రాక తడవు సేసిన [3]ముహూర్తార్ధావశిష్ట యగు ద్వాదశియందుఁ బారణ సేయవలయుటఁ జింతించి బ్రాహ్మణాతిక్రమదోషంబునకు శంకించి విద్వజ్జనంబుల రావించి వారల నుద్దేశించి. 96

క. ముని నీరు సొచ్చి వెడలఁడు
చనియెడు ద్వాదశియు నింత సనియె న్నీలో
నన పారణయున్ వలయును
వినిపింపుం డర్హధర్మవిధ మెట్టిదియో. 97

వ. అని పలికిన నారాజునకు బ్రాహ్మణజను లిట్లనిరి. 98

ఆ. అతిథి వోయి రామి నధిప ! యీద్వాదశి
పారణంబు మానఁ బాడి గాదు
గుడువకుంట గాదు గుడుచుటయును గాదు
సలిలభక్షణంబు సమ్మతంబు. 99

1. భోజనము ఉపవాసానంతరము చేయుభోజనము. 2. సూర్యుని వలె వెలుంగువాఁడు 3. రెండుగడియలు మాత్రమే మిగిలియున్నది

వ. అని ధర్మసందేహంబు వాపిన నారాజర్షి శ్రేష్ఠుండును మనంబున హరిం దలంచి నీరు పారణంబుసేసి జలంబుల మునింగినతపసి రాక కెదురుచూచుచున్న సమయంబున. 100

సీ. యమునలోఁ [1]గృతకృత్యుఁడై వచ్చి రాజుచే
సేవితుండై రాజుచేష్టితంబు
బుద్ధిలో నూహించి బొమముడి మొగముతో
నదరెడి మేనితో నాగ్రహించి
రెట్టించి యాఁకలి గొట్టు మిట్టాడంగ
నీసంపదున్మత్తు నీనృశంసు
నీదురహంకారు నిందఱుఁ గంటిరే
విష్ణుభక్తుఁడు గాఁడు వీఁడు నన్నుఁ

తే. గుడువ రమ్మని [2]మునుమట్టఁ గుడిచినాఁడు
ధర్మభంగంబు సేసి దుష్కర్ముఁ డయ్యె
నయిన నిప్పుడు సూపెద నన్నిదిశల
నేను గోపింప మాన్చువాఁ డెవ్వఁ డనుచు. 101

చ. పెటపెటఁ బండ్లు గీఁటుచును భీకరుఁడై కనుఁగ్రేవ నిప్పుకల్
పొటపొటరాల, గండములుపొంగ, మునీంద్రుఁడుహుంకరించుచున్
జట మొదలంటఁగాఁ బెఱికి చక్కన దానన [3]కృత్య [4]నాయుధో
త్కట వరశూలహస్తయుతఁ గా నొసరించి [5]కవించె రాజుపైన్.

వ. అంత. 103

క. కాలానలసన్నిభయై
శూలాయుధహస్త యగుచు సుఱసుఱ నుఱుకన్
నేలఁ బదంబులఁ ద్రొక్కుచు
వాలి మహాకృత్య మనుజవల్లభుఁ జేరెన్. 104

ఆ. ఆ ప్రకార మెఱిఁగి హరి విశ్వరూపుండు
వెఱతపసి సేయు [6]వేడబంబుఁ

1. సంధ్యాది కృత్యములు నెరవేర్చికొన్నవాఁడై 2. పూర్తిగా 3. 'కృత్య' యనియెడిశక్తిని 4. ఆయుధములచే విజృంభించినదానిని 5. పైకొల్పెను లేదా (ప్రయోగించెను) 6. వంచనము.

జక్కఁబెట్టు మఱచుఁ జక్రింబుఁ బంచిన
వచ్చెనదియుఁ బ్రిళయవహ్నిపగిది. 105

వ. వచ్చి ముని పంచిన కృత్యను దహించి తనివి సనక మునివెంట బడిన మునియును మేరుగుహసొచ్చిన నదియు నురగంబు వెఱకొనుదవానలంబు చందంబునఁ దోన చొచ్చి మఱియును.

మ. భువిఁ దూఱన్ భువిఁ దూఱు, నబ్ధిఁ జొర నబ్ధిన్ జొచ్చు, నుద్యోగియై దివిఁ బ్రాఁకన్ దివిఁ బ్రాఁకు, దిక్కులకుఁ బో దిగ్వీథులంబోవుఁ, జి క్కి వెసం గ్రుంగినఁ గ్రుంగు, నిల్వనిలుచుం, గ్రీడింపఁ గ్రీడించు నో క్కవశిన్ దాపసు వెంట నంటి హరిచక్రం [1]బన్యదుర్వక్రమై.

శా. ఏలోకంబునకైన వెంటఁబడితో నేతెంచు చక్రానల జ్వాలల్ మానుపువారు లేమిఁ జని [2]దేవజ్యేష్ఠు లోకేశు వాఁ డాలోకించి విధాత [3]విశ్వజననవ్యాపారపారీణ రే ఖాలీలేక్షణ! కావవే కరుణఁ జక్రింబున్ నివారింపవే. 108

వ. అనిన బ్రహ్మ యిట్లనియె. 109

మ. కర మర్థిన్ [4]ద్విపదార్థసంజ్ఞ గల యీ కాలంబుఁ గాలాత్ముఁడై సారిదిన్ నిండఁగఁ జేసి లోకములు నా చోటున్ విభుం డెవ్వఁడే [5] పరిపూర్తిన్ గనుఁగ్రీవఁగెంపు గదురన్ భస్మంబుగాఁ జేయు నా హరి చక్రానలకీల కన్యుఁ డొకరుం డడ్డంబు గా నేర్చునే. 110

ఆ. ఏను భవుఁడు దక్షుఁ డింద్రాదులును బ్రజా
పతులు భృగుఁడు భూతపతులు శిరము
లందుఁ దాల్తు మతని యాజ్ఞ జగద్ధితం
బంచు భూరికార్యమతుల మగుచు. 111

వ. కావున [5]సుదర్శనానలనివారణంబునకు నోపనని వివరించి పలికిన, సంచలించి దుర్వాసుండు కైలాసంబునకుం జనుదెంచి శర్వు నాలోకించి చక్రిచక్రానలసారంబు తెఱంగెఱిఁగించిన నమ్మహా దేవుం డిట్లనియె. 112

1. ఇతరులకు మఱలింపరానిది 2. దేవతలకెల్ల పెద్ద. బ్రహ్మ 3. సృష్టి సేయు పనియందు నేర్పు తీర్పు గల విలాసదృష్టికలవాఁడా! 4. ద్విపరార్థమను పేరుగల కాలము 5. చక్రాగ్ని నార్పుటకు.

సీ. వినవయ్య! తండ్రి! యీ విశ్వేశ్వరునియందుఁ
జతురాస్యజీవకోశములు పెక్కు
వేల సంఖ్యలు గూడి వేళతో నిబ్బంగి
నగుచుండుఁ జనుచుండు నదియుఁగాక
యెవ్వానిచే భ్రాంతి నేమందుచున్నార
మేను దేవలుఁ డసురేంద్రసుతుఁడు
నారదుఁ డజుఁడు సనత్కుమారుఁడు ధర్ముఁ
డాకపిలుఁడు మరీచ్యాదు లన్య
ఆ. పారవిదులు సిద్ధపతులు నెవ్వనిమాయ
నెఱుఁగలేము దాన నింత వడుదు
మట్టి నిఖిలనాథు నాయుధశ్రేష్ఠంబుఁ
దొలఁగఁజేయ మాకు దుర్లభంబు. 113

వ. మునీంద్రా! నీవు నమ్మహాత్ముని శరణంబు వేఁడుము. అతండు
మేలుసేయం గలవాఁ డనిపలికిన నీశ్వరునివలన నిరాశుండై దుర్వా
సుండు వైకుంఠనగరంబునకుం జని. 114

శా. ఆవైకుంఠములోని భర్మమణిసౌధాగ్రంబుపై లచ్చితోఁ
గ్రీవన్ మెల్లన నర్మభాషణములం గ్రీడించు పుణ్యున్ హరిన్
దేవాధీశ్వరుఁ గాంచి యోవరద! యో దేవేశ! యోభక్తర
క్షావిద్యాపరతంత్ర! మానుపఁ గదే చక్రానలజ్వాలలన్. 115

ఉ. నీ మహిమార్ణవంబు తుది నిక్కముగా నెఱుఁగంగలేక నీ
ప్రేమకు వచ్చు దాసులకుఁ [1]గ్రించుతనంబున నెగ్గు సేసితిన్
నా [2]మఱపున్ సహింపు మట [4]నారకుఁడైన మనంబులో భవ
న్నామము చింత సేసిన ననంతసుఖస్థితి నొందకుండునే. 116

వ. అని పలికి పాదకమలంబులకు మ్రొక్కి లేవక యున్నదుర్వాసునిం
గని హరి యిట్లనియె. 117

చ. చలమున బుద్ధిమంతులగు సాధులు నాహృదయంబు లీల దొం
గిలికొని పోవుచుందు రకిల్బిషభక్తిలతాచయంబులన్

1. నీచత్వముచే. 2. అజ్ఞానమును. 3. నరకమున నుండువాఁడు. (పాపి).

నిలువఁగఁ బట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభికైవడిన్
వలలకుఁ జిక్కి భక్తజనవత్సలతం జనకుండఁ దాపసా! 118

ఆ. నాకు మేలుగోర నా భక్తులక కాని
భక్తజనుల కేన పరమగతియు
భక్తుఁ డెందు జనినఁ బఱతెంతు వెనువెంట
గోవు వెంటఁ దగులు [1]క్రేఁడభంగి. 119

వ. అదియునుంగాక. 120

ఆ. తనువు మనువు విడిచి తనయులఁ జుట్టాల
నాలి విడిచి సంపదాలి విడిచి
నన్నకాని యన్యమెన్నఁడు నెఱుఁగని
వారి విడువ నెట్టివారి నైన. 121

క. పంచేంద్రియముల [2]తెరువుల
[3]వంచించి మనంబునందు వరమతులు ప్రతి
ష్ఠించి వహింతురు నన్నును
మంచిమగుం బుణ్యసతులు మరగిన భంగిన్. 122

క. సాధుల హృదయము నాయది
సాధుల హృదయంబు నేను జగముల నెల్లన్
సాధుల నేన యెఱుంగుదు
సాధు లెఱుంగుదురు నాదు చరితము విప్రా! 123

ఆ. ధరణీసురులకుఁ దపము విద్యయు రెండు
ముక్తి సేయుచుండు ముదము తోడ
దుర్వినీతు లగుచు దుర్జను లగువారి
కివియుఁ గీడు సేయ కేల యుండు. 124

క. నా తేజము సాధులలో
నాతతమై యుండువారి నలఁచు జనులకున్
[4]హేతిక్రియ భీతి నిచ్చుం
జేతోమోదంబుఁ జెఱచు సిద్ధము సుమ్మా. 125

1. దూడ (క్రేఁడమాడి) 2. దారులను. 3. అరికట్టియన్న మాట. "విషయముల వెంట నింద్రియములను దగుల్గొననీయక" అన్నమాట. 4. జ్వాల లేక కత్తి.

క. అదె పో బ్రాహ్మణ! నీకును
సదయుఁడు నాభాగసుతుఁడు జనవినుతగుణా
స్పదుఁ డిచ్చు నభయ మాతని
మది సంతసపఱచి వేఁడు మాశరణంబున్. 126

౫ అధ్యాయము

మ. అని శ్రీవల్లభుఁ డానతిచ్చిన మహోద్యచ్చక్రకీలావళీ
జనితాయాసుఁడు నిర్వికాసుఁ డుదితశ్వాసుండు దుర్వాసుఁ డ
ల్లన యేతెంచి సుభక్తిఁ గాంచెఁ గరుణాలావణ్య వేషున్ విదో
షనయోదారమనీషు మంజుమితభాషు న్నంబరీషున్ వెసన్. 127

వ. కని దుఃఖితుండయి యమ్మహీవల్లభు పాదంబులు వట్టి విడువ
కున్న నా నరేంద్రచంద్రుండు చరణస్పర్శనంబునకు నోడుచుఁ గరు
ణారసభరితహృదయుండయి హరిచక్రంబు నిట్లని స్తుతియించె. 128

సీ. నీవ పావకుఁడవు నీవ సూర్యుండవు
నీవ చంద్రుండవు నీవ జలము
నీవ నేలయు నింగి నీవ సమీరంబు
నీవ భూతేంద్రియనికర మీవ
నీవ బ్రహ్మంబును నీవ సత్యంబును
నీవ యజ్ఞంబును నీవ ఫలము
నీవ లోకేశులు నీవ సర్వాత్మయు
నీవ కాలంబును నీవ జగము

తే. నీవ బహుయజ్ఞభోజివి నీవ నిత్య
మూలతేజంబు నీకు నే మ్రొక్కువాఁడ
నీరజాక్షుండు చాల మన్నించునట్టి
శస్త్రముఖ్యమ! కావవే చాలు మునిని. 129

మ. హరిచే నీవు విసృష్టమై చనఁగ మున్నాలించి నీ ధారలన్
ధరణిన్ వ్రాలుట నిక్కమంచు మునుపే దైత్యేశ్వరవ్రాతముల్
శిరముల్ పాదములున్ భుజాయుగళముల్ ఛేదిల్లి యంగంబు ల
ద్దిరగం బ్రాణసమీరముల్ వదలు నీ యుద్ధంబులం జక్రమా!

1. వికాసము తప్పినవాఁడు. 2. నీతిచే గొప్పదియైన బుద్ధికలవాఁడు.

ఆ. కలఁగి నిద్ర వోవఁ గలలోన వచ్చిన
నిన్నుఁ జూచి [1]దీర్ఘనిద్రవోదు
రసురవరులు శయ్యలం దున్నసతులు ప్ర
భాతమందు లేచి పలవరింప. 131

ఉ. చీఁకటిఁ బాపుచున్ వెలుఁగుసేయుచు సజ్జనకోటినెల్ల స
శ్రీకను జేయు నీరుచులు సెల్వఁగ ధర్మసమేతలై; నినున్
[2]వాకున నిట్టిదట్టి దని వర్ణనసేయ విధాత నేరఁ డ
స్తోకము నీదురూపు గలదుం దుదిలేదు పరాత్పరాద్యమై. 132

ఆ. కమలలోచనుండు ఖలుల శిక్షింపంగఁ
బాలు సేయ నీవు పాలువడితి
వైన నింకఁ జాలు నాపన్నుఁడై యున్న
తపసిఁ గావు మీవు ధర్మవృత్తి. 133

వ. అని వినుతించి కేలుఁదమ్మిదోయి నొసలం బొసంగించి యిట్లనియె.

ఆ. ఏ నమస్కరింతు [3]నింద్రశాత్రవధూమ
కేతువునకు [4]ధర్మసేతువునకు
విమలరూపమునకు విశ్వదీపమునకుఁ
జక్రమునకు [5]గుప్తశక్రమునకు. 135

వ. అని మఱియు నిట్లనియె. 136

ఆ. విహితధర్మమందు విహరింతునేనియు
నిష్టమైన ద్రవ్య మిత్తునేని
ధరణిసురుఁడు మాకు దైవతంబగునేని
విప్రునకు శుభంబు వెలయుఁగాక. 137

క. అఖిలగుణాశ్రయుఁడగు హరి
సుఖియై నాకొలువువలనఁ జొక్కెడినేనిన్

---

1. చనిపోదురు. 2. మాటచేత. 3. ఇంద్రశత్రులయిన రాక్షసులపాలిటికి ధూమకేతువు. అనగా వారిచావునకు సూచకము అన్నమాట. 4. ధర్మరూపమయిన సేతువు. వంతెన. సంసారమును తరింపఁజేయు సాధనమన్నమాట. 5. ఇంద్రుని రక్షించినది. 6. ఆరాధన. సేవ.

నిఖిలాత్మమయుం డగుటను
సుఖ మందుం గాక భూమిసురుఁ డివ్వేళన్. 138

వ. అని యివ్విధంబునం బొగడు పుడమిఱేనివలన మన్నించి తపస్విని
దాహంబు నొందింపక [1]రక్కసులగొంగ చక్రంబు తిరిగి చనియె.
అంత దుర్వాసుండు శాంతింబొంది మెల్లని మేలిమాటల నా రాజును
దీవించి యిట్లనియె. 139

మ. నరనాథోత్తమ! మేలుసేసితికదా నాతప్పు మన్నించి శ్రీ
హరిపాదాబ్జము లింత ముట్టఁగొలుతే యాశ్చర్యమా నైనచో
[2]నరుదంద్రే నినుబోఁటి సాధునకుఁ బాపై యిచ్చుటల్ గాచుటల్
సొరిదిన్ నైజగుణంబులై సరిస వచ్చుంగాదె మిత్రాకృతిన్. 140

వ. అదియునుం గాక. 141

మ. ఒకమా రెవ్వనిపేరు కర్ణములలో నొయ్యారమై సోఁకినన్
సకలాఘంబులు [4]పల్లటిల్లి తొలఁగున్ సంభ్రాంతితో, నట్టి స
త్సుకరున్ మంగళతీర్థపాదు హరి విష్ణున్ దేవదేవేశునిన్
అకలంకస్థితిఁ గొల్చు భక్తులకు లేదడ్డంబు రాజాగ్రణీ! 142

మత్తకోకిలము.
తప్పులోఁ గొని చక్రపావకదాహముం బెడఁబాపి తో
నొప్పు నొప్పు భవద్దయారస మో నరేశ్వర! ప్రాణముల్
సెప్ప మున్నను వోయి క్రమ్మఱఁ జేరె ధన్యుఁడ నైతి నీ
కెప్పుడున్ శుభ మేను గోరెద నింకఁ బోయెద భూవరా!

క. అనిన విని రాజముఖ్యుఁడు
మునివల్లభు పాదములకు మ్రొక్కి కడున్ మ
న్నన సేసి యిష్టభోజన
మనుపుగఁ బెట్టించెఁ దృప్తుఁ డయ్యె నతండున్. 144

వ. మఱియు నమ్మునీంద్రుం డిట్లనియె. 145

శా. కంటిన్ నేటికి నిన్ను నీవచనముల్ కర్ణద్వయిం బ్రీతిగా
వింటి న్నన్నముఁ గొంటి నీగృహమునన్ వేడ్కన్ ఫలంబందెనే

1. రాక్షససంహారకుఁడు. 2. అరుదు అంద్రే + అపురూపము, అందురా?
3. విలాసముగా నైనను 4. చలించి.

[1]మంటిం బోయెద నీచరిత్ర మమరుల్ మర్త్యుల్ సుఖాసీనులై
మింటన్ మేదిని సన్నుతింపఁ గలరీ మీఁదన్ నరేంద్రాగ్రణీ!

వ. అని చెప్పి దుర్వాసుం డంబరీషుని దీవించి కీర్తించి మింటి తెరువున బ్రహ్మలోకంబునకుం జనియె. మునీశ్వరుండు వచ్చి మగుడం జను వేళకు నొక్కవత్సరంబు నిండి వ్రతంబు పరిపూర్ణంబైన. 147

ఆ. అవనిసురుఁడు గుడువ నతిపవిత్రంబైన
వంటకంబు భూమివరుఁడు గుడిచె
దపసి [2]నెగులు మాన్పఁ దా నెంతవాఁడను
హరికృపామహత్త్వ మనుచుఁ దలఁచి. 148

వ. మఱియును. 149

క. హరిఁ గొల్చుచుండువారికిఁ
పరమేష్ఠిపదంబు మొదలు పదభోగంబుల్
నరక సమము లను తలఁపున
ధరణీరాజ్యంబుతోడి [3]తగులము మానెన్. 150

వ. ఇట్లు విరక్తుండై. 151

ఆ. తనకు సదృశులైన తనయుల రావించి
ధరణిభరము వారిఁ దాల్పఁ బంచి
కాననంబు సొచ్చెఁ గామాదివిజయుఁడై
నరవిభుండు హరి సనాథుఁ డగుచు 152

క. ఈ యంబరీషు చరితముఁ
దీయంబున విన్నఁ జదువ ధీసంపన్నుం
డై యుండును భోగపరుం
డై యుండును నరుఁడు పుణ్యుఁ డై యుండు నృపా! 153

౬ అధ్యాయము.

వ. విను మయ్యంబరీషునకు విరూపుండును గేతుమంతుండును శంభుం డును నను వారు మువ్వురు గొడుకులందుఁ గేతుమంతుండును శంభుడును హరింగూర్చి తపంబుసేయువారై వనంబునకుం జనిరి;

1. బ్రతికి ౨౦. 2. ఆపద. 3. అంటు (మోహము) సక్తి

విరూపునికిఁ బృషదశ్వుండును బృదషశ్వునకు రథీతరుండును గలిగిరి. అమ్మహాత్మునికి సంతతి లేకున్న నంగిరసుఁ డను మునీంద్రుం డతని భార్యయందు బ్రహ్మతేజోనిధు లయిన కొడుకులం గలిగించె. వారలు రథీతరగోత్రులు నాంగీరసులను బ్రాహ్మణులు నై యితరులందు ముఖ్యులయి ప్రవర్తిల్లిరి. అని చెప్పి శుకుం డిట్లనియె.

### ఇక్ష్వాకువంశానుక్రమము.

క. ఒకనాఁడు మనువు దుమ్మిన
వికలుఁడు గా కతని [1]ఘ్రాణవివరము వెంటం
బ్రకటయశుం డిక్ష్వాకుం
డకలంకుఁడు వుట్టె రవికులాధీశుండై. 155

సీ. ఇక్ష్వాకునకుఁ బుత్త్రు లెలమిఁ బుట్టిరి నూర్వు
రమర వికుక్షియు నిమియు దండ
కుండు; నాతని పెద్దకొడుకులు ముప్వ రా
ర్యావర్తమందు హిమాచలంబు
వింధ్యాద్రిమధ్య మూర్వీమండలము గొంత
యేలిరి యిరువది యేవు రొక్క-
పొందున నాతూర్పు భూమి పాలించిరి;
యందఱు పడమటి కధిపులైరి,

తే. యున్న నలువది యేడ్వురు కుత్తరోర్వి
దక్షిణోర్వియుఁ గాచిరి తండ్రియంత
[2]నష్టకాశ్రాద్ధ మొనరింతు ననుచు నగ్ర
సుతు వికుక్షి నిరీక్షించి శుద్ధమైన
మాంసఖండంబు దెమ్మనె మహితయశుఁడు. 126

---

1. ముక్కురంధ్రము 2. వైశ్వదేవసంబంధమైన సప్తపాకయజ్ఞములలో నొకటి మాఘబహుళ షష్ఠి; సప్తమి, అష్టమి అనుమూఁడు తిథులయందును పితృదేవతలంగూర్చి చేయునది.

మ. అగుఁగా కంచు వికుక్షి వేఁట సని ఘోరారణ్యభూమిం దగన్
మృగసంఘంబులఁ జంపి బిట్టలసి తామే నొల్లఁబో నాకటన్
సగమై యొక్క [1]శశంబుఁ బట్టి తిని శేషం బయిన మాంసంబు శీ
ఘ్రగతిం దండ్రికిఁ దెచ్చి యిచ్చె సకలంకస్ఫూర్తి వర్ధిల్లగాన్.

తరలము.

కులగురుండు వసిష్ఠుఁ డంత వికుక్షి కుందెలు దింట లో
పల నెఱింగి యసర్వ మెంగిలి పైతృకం బొనరింపఁ గా
వలదు వీఁడు దురాత్మకుం డన వాని తండ్రియు వానిఁ జెం
తలను జేరఁగనీక దేశము దాఁటి పోనడిచెన్ వడిన్. 158

ఆ. కొడుకు వెడలఁ గొట్టి గుణవంతుఁ డిక్ష్వాకుఁ
డా వసిష్ఠుఁ డేమి యానతిచ్చె
నదియుఁ జేసి యోగి యై వనంబునఁ గళే
బరము విడిచి ముక్తిపదము నొందె. 159

చ. జనకుఁడు ముక్తికేఁగ నయశాలి వికుక్షి శశాదుఁ డంచు భూ
జనులు నుతింప నీధరణి చక్ర మశేషము నేలి యాగముల్
గొనకొన చేసెఁ బ్రీతిహరిఁ గూర్చి, పురంజయుఁ బుత్త్రుఁగాంచెఁ బే
రొక్కొనె నమరేంద్రవాహుఁడుఁ గకుత్స్థుఁడునంచునువానిలోకముల్.

సీ. కృతయుగాంతంబున [2]దితిసుతామరులకు
రణ మయ్యె నందు నా రాక్షసులకు
నమరవల్లభుఁ డోడి హరితోడఁ జెప్పిన
జలజనేత్రుఁడు పురంజయునియందు
వచ్చి నే నుండెద వాసవ! వృషభంబ
వై మోవు మని వల్క నమరవిభుఁడు
గోరాజమూర్తిఁ [3]గకుత్ప్రదేశంబున
నా పురంజయు మోచె నంత నతఁడు

1. కుందేలు 2. దైత్యులకు దేవతలకును 3. మూపురము మీఁద

తే. విష్ణుతేజంబు దనయందు విస్తరిల్ల
దివ్యచాపంబు చేఁబట్టి దీర్ఘనిశిత
బాణములఁ బూని వేల్పులు ప్రస్తుతింప
నంతఁ గాలాగ్ని చాడ్పున ననికి నడచె.

చ. నడచి శరావళిన్ దనుజనాథుల మేనులు సించి కంఠముల్
దొడ్డిఁదొడ్డిఁ ద్రుంచి కాలపురిత్రోవకుఁ గొందఱఁ బుచ్చి కొందఱన్
వడి నురగాలయంబున నివాసము సేయఁగ దోలి యంత నూ
ఱడక నిశాచరేంద్రుల పురంబులు గూల్చెఁ బురంజయాఖ్యతన్.

వ. ఇవ్విధంబున శశాదపుత్త్రుండు రాక్షసులపురంబులు జయించినకతనం బురంజయుండును వృషభరూపుండైన యింద్రుండు వాహనం బగుటం జేసి యింద్రవాహనుండును నతనిమూఁపురం బెక్కి రణంబు సేసిన కారణంబునఁ గకుత్స్థుండును నన నీమూఁడు నామంబులం బ్రసిద్ధి కెక్కె దైత్యుల ధనంబుల నింద్రున కిచ్చె నప్పురంజయుని పుత్త్రుం డనేనసుం డతనిపుత్త్రుండు పృథుండు పృథుకొడుకు విశ్వగంధుండు విశ్వగంధునకు నందనుండు చంద్రుండు చంద్రుసుతుండు యవనాశ్వుండు యవనాశ్వతనూభవుండు శవస్తుం డతండు శావస్త నామనగరంబు నిర్మించె. శవస్తతనయుండు బృహదశ్వుండు బృహదశ్వతనూజుండు గువలయాశ్వుండు. ఆనరేంద్రచంద్రుండు. 163

క. లావు మెఱసి యిరువదియొక
వేవురు నందనులుఁ దాను వీరుఁ డతఁడు భూ
దేవుఁ డుదంకుఁడు [2]వనుప [3]దు
రావహుఁడై చంపె ధుంధు నమరాబంధున్. 164

వ. అది కారణంబుగా ధుంధుమారుం డన నెగడె. నయ్యసురముఖానలంబునఁ గువలయాశ్వకుమారు లందఱు భస్మంబై రందు దృఢాశ్వుండును గపిలాశ్వుండును భద్రాశ్వుండును ననువారలు ముగ్గురు సిక్కి రందు దృఢాశ్వునకు హర్యశ్వుండును హర్యశ్వునకు నికుం

భుండును నికుంభునకు బర్హిణాశ్వుండును బర్హిణాశ్వునకుఁ గృశా
శ్వుండును గృశాశ్వునకు సేనజిత్తును సేనజిత్తునకు యువనాశ్వుండును
జనించిరి. అయ్యువనాశ్వుండు గొడుకులు లేక నూర్వురుభార్యలుం
దానును నిర్వేదపడియుండ నారాజునకు మునులు గృపచేసి
యింద్రునిఁగూర్చి సంతతికొఱకు నైంద్రయాగంబు సేయించిరి. అందు

సీ. భూమీశుభార్యకుఁ బుత్త్రలాభమునకై
 పోయుతలంపున భూమిసురులు
జలములు మంత్రించి జలకలశము దాఁచి
 నియమంబుతోఁ గూడి నిద్రవోవ
ధరణీశ్వరుఁడు పేరు దప్పితో నారాత్రి
 ధృతి లేక యజ్ఞమందిరముఁ జొచ్చి
యానీరు ద్రావిన నంత మేల్కని వార
 లెవ్వఁడు ద్రావె నీ రెందుఁ బోయె

ఆ. ననుచు రాజు ద్రావు టంతయు భావించి
యెఱిఁగి చోద్యమంది యీశ్వరాజ్ఞ
యెవ్వఁ డోపుఁ గడవ నీశ్వరునకు నమ
స్కార మనుచు నేది కార్యమనుచు.

వ. వారలు దుఃఖించుచుండ నంతఁ గొంతదడవునకు యువనాశ్వుని
కడుపు వ్రక్కలించుకొని చక్రవర్తిచిహ్నంబులుగల కుమారుండు
జన్మించి తల్లిలేనికతంబునఁ గుడుపునకు లేక యేడ్చుచుండ నింద్రుండు
వచ్చి శిశువునకు నాఁకలి దీఱుకొఱకు వాని నోటం దనవ్రేలిడినం
ద్రావినకతంబున వానిపేరు మాంధాతయని నిర్దేశించి చనియె
నివ్విధంబున.

ఆ. కడుపు వగుల ముద్దుకొడుకు జన్మించినఁ
ధీఱఁ డయ్యెఁ దండ్రి దేవ విప్ర

కరుణ యట్లుకాదె కడిఁది దైవము లావు
గలుగువాఁడు బ్రదుకుఁగాక చెడునె. 168

వ. ఇట్లు బ్రదికియున్న యువనాశ్వుండు గొంతకాలంబునకుఁ దపంబు
సేసి సిద్ధిం బొందె నంత. 169

సీ. పడమటఁ బొడమెడు బాలచంద్రుని మాడ్కిఁ
బూఁట పూఁటకు వృద్ధిఁ బొంది బాలుఁ
డల్లన పరిపూర్ణయౌవనారూఢుఁడై
రావణాదిరిపుల రాజవరుల
దండించి తనుఁ ద్రసదస్యుఁ డంచు సురేంద్రుఁ
డంకింప శూరుఁడై యఖిల దేవ
మయు నతీంద్రియు విష్ణు మాధవు ధర్మాత్ము
నజుని యజ్ఞాధీశు నాత్మఁగూర్చి

తే. చేసెఁ గ్రతువులు భూరిదక్షిణల నిచ్చి
ద్రవ్యయజమాన విధిమంత్ర ధర్మయజ్ఞ
కాలఋత్విక్ప్రదేశముఖ్యంబు లెల్ల
విష్ణురూపంబు లనుచు భావించి యతఁడు. 170

క. బలిమి నడంచుచు నరులం
జలి [1]వెలుఁగుల వేఁడి వెలుఁగుఁ జనుచో నెల్లన్
జలరుహనయనుని కరుణను
జెలువుగ మాంధాత యేలె సిరి నిండారన్. 171

వ. అంతనా రాజునకు శతబిందునికూఁతురగు బిందుమతియందుఁ బురు
కుత్సుండు నంబరీషుండును ముచుకుందుండును నను వారు ముగ్గురు
గొడుకులు నేఁబండ్రుగూఁతులును జనియించి పెరుఁగుచున్నయెడ.

సీ. యమునాజలములోన నధికుఁడు సౌభరి 172
తపము సేయుచు జలస్థలమునందుఁ

1. చంద్రుఁడు. 2. సూర్యుఁడు.

బిల్లలుఁ దన ప్రాణవల్లభయును గూడి
మెలఁగ నానందించు మీనరాజుఁ
గనుఁగొని సంసారకాంక్షియై మాంధాత
నొక కన్య నడుగ నృపోత్తముండు
దరుణి నిచ్చెద స్వయంవరమునఁ జేకొను
మనవుడు ననుఁ జూచి యౌవనాంగి

ఆ. యేల ముసలిఁ గోరు నిట్టట్లు వడఁకెడి
వాఁడు జాల నరసినాఁడు నొడల
జిగియు బిగియు లేని శిథిలుండఁ గరఁగింప
బాలఁ దిగిచికొను నుపాయ మెట్లు. 173

వ. అదియునుం గాక. 174

ఆ. కాల పున్నెఁబోతె ప్రాయపువానిని
[1]జెరున్నవాని ధనముఁ జెప్పువాని
మఱిగనేనిఁ గొంత మసనుఁగా[2]కెవ్వరిఁ ద
న్నెఱిఁగి ముసలితపసి నేల మసఁగు. 175

వ. అని విచారించి సౌభరి దన తపోబలంబునం జేసి ముసలితనంబు
విడిచి యొప్పు ప్రాయంపుఁ గోమటం దయి యలంకరించికొని మందట
నిలుసంబడిన మాంధాతయుఁ గన్నియల నగరుగాచికొని యున్న
వారికి సెలవు నేసిన వా రమ్మునీంద్రుని నారాజపుత్రికలున్న
మొకసం గొనిపోయి చూపిన. 176

ఉ. కోమలులార! వీఁడు నలకూబరుఁడో మరుఁడో జయంతుఁడో
యేమిటి వచ్చె వీనిఁ దగ నేల వరింతుము నేమయేమయం
చామునినాథుఁ జూచి చలితాత్మిక లై సొరిదిన్ వరించి రా
భామిను లందఱుం గుసుమబాణుఁడు[2]గి యని ఘంట వేయఁగన్.

వ. ఇట్లు రాజకన్యకల నందఱిం జేకొని సౌభరి నిజతపఃప్రభావంబున
ననేకలీలావినోదంబులఁ గల్పించి. 178

---

1. చక్కని వానిని. 2. గి యూరి గం ప్రమోగింపగా (మోహము కలిగింపగా అనుట)

సీ. గృహరాజములయందుఁ [1]గృతకాచలములందుఁ
గలువలు విలసిల్లు కొలఁకులందుఁ
గలకంఠశుభమధుకరనినాదములచే
వర్ణనీయములైన వనములందు
మణివేదికలయందు మహనీయపర్యంక
పీఠలీలాశైలబిలములందు
శృంగారవతులగు చెలువలు పలువురు
తనపంపుసేయ సుస్థలములందు

తే. వస్త్రమాల్యానులేపసువర్ణహార
భూరిసంపద నిష్టాన్నభోజి యగుచుఁ
బూఁట పూఁటకు నొకవింత పొలుపుఁ దాల్చి
రాజకన్యల నందఱ రతులఁ దేల్చె. 179

క. పెక్కండ్రు రాజముఖులకు
నొక్కఁడు మగఁడయ్యుఁ దనియకుండె మునీంద్రుం
డెక్కుడు ఘృతధారలచే
[2]నక్కజమై తృప్తిలేని యనలుని భంగిన్. 180

వ. ఇవ్విధంబున. 181

క. ఆరామంబున మునివరుఁ
డారామలతోడ బహువిహారమయుండై
గారాములఁ దన కిట్టటు
పోరాములు సేసికొన్న ప్రొద్దుల్ పుచ్చెన్. 182

వ. అంత నొక్కనాఁడు మాంధాతృమేదినీవల్లభుండు మునీశ్వరుం డెందుఁ బోయెఁ గూఁతు లెక్కడ నలజడిపడుచున్నవారలో యని తలంచి వెదకవచ్చి యొక్కమహాగహనంబున మణిమయసౌధంబులం జక్రవర్తియుం బోలెఁ గ్రీడించుచున్న తాపసరాజుం గని సంతసించి వెఱఁగుపడి మన్ననలం బొంది మెల్లన కూఁతులం బొడగని సత్కరించి యిట్లనియె. 183

1. ఆడుకొనుటకు, విహరించుటకు నుద్యానములందు గల్పితమైన చిన్నకొండలు.
2. అక్కజమై.

క. నాతోడులార ! మీపతి
మీతోడే పనులమొదల మేలే యనుచున్
నాతోడిద నాతోడిదె
తాతా మేలనుచు ననిరి తరుణులు వరుసన్. 184

వ. అంతఁ గొంతకాలమునకు [1]బహుభార్యాచర్యుండగు సౌభరి యేకాంతంబునఁ దన్నుఁదాన చింతించుకొని [2]మీనమిథునసంగదోషంబునం గాఁపురంబు దనకు నగపడుట యెఱింగి పశ్చాత్తాపంబున నిట్లనియె.

మ. ఉపవాసంబుల [3]డయ్యుటల్ విషయసంయోగంబు వర్జించుటల్
తపముం బూని చరించుటల్ హరిపదధ్యానంబునన్ నిల్చుటల్
యుపలాపంబున నేల పొందితి, హతంబయ్యెం దపం బెల్ల, నీ
కపటస్త్రీపరిరంభముల్ మునులకుం గైవల్యసంసిద్ధులే. 186

చ. మునినఁట తత్త్వవేది నఁట మోక్షముకాని సుఖంబు లెవ్వియుం
జన వఁట కాంత లొప్పరఁట సౌధచయం బఁట వాసదేశముం
దనయులు నైదువే లఁట [4]నిదానము మీనకుటుంబి సౌఖ్యముం
గనుటఁట చెల్లరే నగవు గాక మహాత్ములు సూచి మెత్తురే. 187

ఆ. తపము సేయువాఁడు తత్త్వజ్ఞుఁ డగువాఁడు
నెలమి మోక్ష మిచ్ఛయించువాఁడు
నేకతంబు విడిచి యేర్పడ నేరఁడు
కాఁపురంబు సేయుఁ గఱటి తపసి. 188

వ. అని దుఃఖించి తన్నుం దాననిందించుకొని, తనవేడబంబు వివేకించుచు నిహపరసాధకుండై కాపురంబు విడిచి సతులుం దానును వానప్రస్థధర్మంబున నడవికిం జని ఘోరతపంబు సేసి శరీరంబుఁ గుదియించి యగ్నిసహితుండై పరబ్రహ్మంబు సొచ్చె. అంత. 189

క. మునిపతి వనమున కరిగిన
వనితలుఁ దోనరిగి ప్రాణవల్లభుగతికిం
జనిరి వెనుతవిలి విడువక
యనలము సన [5]శిఖలు నిలువ కరిగినభంగిన్. 190

1. పెక్కుమంది భార్యలతో వర్తించువాఁడు. 2. చేప మిథునముతోడి పొత్తువల్ల దోషముచే. 3. శ్రమపడుట. 4. మొదలికారణము. 5. జ్వాలలు.

8 అధ్యాయము

వ. అంత మాంధాత పెద్దకొడుకగు నంబరీషునిం దత్పితామహుండగు యువనాశ్వుండు దనకుఁ బుత్త్రుండు గావలయు నని కోరిపుచ్చుకొనియె. అయ్యంబరీషునకు యౌవనాశ్వుం డతనికి హారీతుండు జనియించిరి. అది కారణంబుగా నంబరీషయౌవనాశ్వహారీతులు మాంధాతృగోత్రంబునకుఁ బ్రవరులైరి. మాంధాత రెండవకొడుకు పురుకుత్సుం డతని నురగలోకంబునకుఁ గొనిపోయి నాగకుమారులు దమచెల్లెలి నర్మదయను కన్యకను వివాహంబు చేసిరి. పురుకుత్సుండు నక్కడ ననేకగంధర్వనాథుల వధించి తననాగలోకసంచరణంబు దలంచువారికి నురగభయము లేకుండ వరంబు వడసి తిరిగివచ్చె. ఆపురుకుత్సునకుఁ ద్రసదస్యుండు ద్రసదస్యునకు ననరణ్యుండు నాయనరణ్యునకు హర్యశ్వుండు హర్యశ్వునకు నరుణుండు నరుణునకుఁ ద్రిబంధనుండుఁ ద్రిబంధనునకు సత్యవ్రతుండును జన్మించిరి. ఆసత్యవ్రతుండ త్రిశంకుం డనం బరఁగెను. అతండు. 191

సీ. గురుశాపవశమునఁ గూలి చండాలుఁడై
యనఘాత్ముఁ గౌశికు నాశ్రయించి
యతని [1]లావున దివిజాలయంబున కేఁగ
మన్నింప కమరులు మరల ద్రోయఁ
దల క్రిందుగాఁ బడి దైన్యంబుతో రాఁగఁ
గౌశికుఁ డెప్పటి ఘనత మెఱసి
నిలిపె నాకసమున నేఁడు నున్నాఁడు త్రి
శంకుఁ డాతఁడు హరిశ్చంద్రుఁ గనియె
తే. నా హరిశ్చంద్రుఁ గౌశికుఁ డర్థిఁ జేరి
యాగదక్షిణామిషమున నఖిలధనముఁ
గొల్లగొని మీఁదఁ గులసతినిఁ గొలువఁ బెట్టి
బొంక [2]కలజడిఁ బొందె నా భూవరుండు. 192

వ. ఇట్లు విశ్వామిత్రుండు హరిశ్చంద్రు నెగులుపఱచుట విని వశిష్ఠుండు విశ్వామిత్రునిఁ గృధ్రమ్మవు గమ్మని శపించె. విశ్వామిత్రుండును

1. బలముచేత 2. దారిద్ర్యము.

వశిష్ఠుని బకంబవు గమ్మని శపించె. పక్షిరూపులయ్యును వైరంబు మానక యయ్యిరువురును యుద్ధంబు సేసిరి. అంత హరిశ్చంద్రుండు పుత్త్రులు లేక నారదు నుపదేశంబున వరుణోపాసనంబు నతిభక్తితోఁ జేయ నా వరుణుండు ప్రత్యక్షం బైన నతనికి మ్రొక్కి యిట్లనియె.

ఆ. వరుణదేవ! నాకు వరవీరగుణయుతుల
కొడుకు పుట్టెనేని కొడుకుఁ బట్టి
పశువుఁ జేసి నీవు పరితుష్టుఁడవఁగ వేల్తుఁ
గొడుకు నీఁగదయ్య కొఱఁత లేక. 194

వ. అని పలికినం, గుమారుండు గలిగెడు మని వరం బిచ్చి వరుణుండు చనియె. అంత హరిశ్చంద్రునకు వరుణప్రసాదంబున రోహితుం డను కుమారుండు జన్మించె. వరుణుండును హరిశ్చంద్రకుమారు నుద్దేశించి.

సీ. పురిటిలోపల వచ్చి పుత్త్రు వేల్వు మన్నఁ
బురుడు పోయినఁగాని పోనఁగ దనియెఁ
[1]బలురాకమును వచ్చి బాలు వేల్వు మన్నఁ
బండ్లు లేకుంట నభావ్యుఁ డనియెఁ
బండ్లు రాఁజూచి డింభకుని వేల్వు మన్నఁ
బడిపండ్లురామి నభావ్యుఁ డనియెఁ
బడిపండ్లు వొడమినఁ గొడుకు వేల్వుమన్నఁ
జోరుల గొడవక పోల దనియెఁ

ఆ. దొడరి యిట్లు గొడుకు తోడి మోహంబునఁ
బ్రొద్దు గడుపుచుండెఁ భూవరుండు
దండ్రి తలఁపు కో[illegible]నలోనఁ జింతించి
యింట నుండ కడవి [illegible]గెఁ గొడుకు. 196

వ. ఇట్లు వనంబునకుఁ జని శరశరాసనధరుండయి రోహితుండు దిరుగుచుండి వరుణగ్రస్తుండై హరిశ్చంద్రుండు మహోదరవ్యాధిచేఁ బీడితుండుగా నుండుట విని పురంబునకుం దిరిగి రా గమకింప నింద్రుండు ముసలి తపసియై వచ్చి యిట్లనియె. 197

1. దంతములు రాకమున్న,

ఆ. పుణ్యభూము లరుగు పుణ్యతీర్థంబులఁ
గ్రుంకు పుణ్యజనులఁ గోరి చూడు
పుణ్యకథలు వినుము భూపాలపుత్రక!
మేలు గలుగునట్టి మేర గలదు. 198

వ. అని యిట్లు మగిడించినం దిరిగి చని రోహితుం డొక్కయేఁడవ్వనంబునం దిరిగి క్రమ్మఱఁ జనుదేర, నింద్రుండు వచ్చి తొంటియట్ల నివారించె. ఇవ్విధంబున. 199

సీ. ఐదేండ్లు మరలించె నమరేంద్రుఁ డాబాలు
నాఱవయేఁటఁ దా నడవినుండి
యింటికి వచ్చుచు నెలమి నజీగర్తు
మధ్యమపుత్త్రు సన్మాన్యచరితు
ఘను శునశ్శేఫునిఁ గొని యాగపశువుగ
నాహరిశ్చంద్రున కాతఁ డిచ్చెఁ
బురుషమేధము సేసి భూపాలవర్యుఁడు
వరుణాదినిఖిలదేవతలఁ దనిపె

తే. హోత కౌశికుఁ డధ్వర్యుఁ డొనర భృగువు
బ్రహ్మ జమదగ్ని సామంబు పాడువాఁడు
ముని వశిష్ఠుఁ; డామఖమున ముదముఁ బొంది
కనకరథ మిచ్చె నింద్రుఁ డా మనుజపతికి.

వ. శునశ్శేఫుని ప్రభావంబు వెనుక వివరించెద. అంత భార్యాసహితుండైన హరిశ్చంద్రు వలనం బ్రీతుండై విశ్వామిత్రుండు నిరస్తదోషుండైన యతనికి ముఖ్యజ్ఞానంబు గృపసేసిన మనం బన్నమయంబు గావున మనంబున నన్నరూపియైన పృథివి నెఱింగి పృథివిని జలంబు వలన నడంచి జలంబుఁ దేజంబువలన నింకించి తేజంబు వాయువు వలనం జేరిచి వాయువు నాకాశంబునం గలిపి యాకసంబుఁ దామ సాహంకారంబునందు లయంబు సేసి యహంకారత్రయంబు మహాత్తత్త్వంబునందు డిందించి పరతత్త్వంబునకు లోకంబులు సృజించెద నను తలంపైన మహత్తత్త్వంబునందు విషయాకారంబు నివర్తించి

విషయవివర్జితంబైన మహత్తత్త్వంబును బరతత్త్వంబుగా నెఱుంగుచు నయ్యెఱుకవలన సంసారహేతువైన ప్రకృతిని భస్మంబు సేసి [1]యయ్యెఱుకను [2]నిర్వాణసుఖపారవశ్యంబునం బరిహరించి సకల బంధవిముక్తుండై హరిశ్చంద్రుం డవాఙ్మానసగోచరంబయిన నిజ రూపంబుతో వెలుంగుచుండె.

౮ అధ్యాయము

వ. అతని కుమారునకు లోహితునకు హరితుండు పుట్టె హరితునకుఁ జంపనామధేయుండు జనియించె. అతండు దనపేరఁ జంపానగరంబు నిర్మించె. ఆ చంపునికి సుదేవుండు సుదేవునికి విజయుండు విజయునకు రురుకుండు రురుకునకు వృకుండు వృకునకు బాహుకుండు జనియించిరి. అందు బాహుకుండు.

సగరచక్రవర్తి కథాప్రారంభము.

సీ. దండించి పగవారు దనభూమిఁ జేకొన్న
నంగనలును దాను నడవి కేఁగి
యడవిలో ముసలియై యాతఁడు సచ్చిన
నాతనిభార్య దా ననుగమింపఁ
గదియుచో నాస్త్రీకి గర్భంబు గలుగుట
యౌర్వమునీశ్వరుఁ డాత్మ నెఱిఁగి
వారించె నంత నవ్వనజాక్షి సవతులు
సూలు నిండారినఁ జూడఁ జాల
తే. కర్థి నన్నంబు గుడుచుచో నందుఁ గలిపి
విషము వెట్టిరి పెట్టిన విరిసి పడక
[3]గరముతోఁ గూడ సగరుండు ఘనుఁడు పుట్టి
వరయశస్స్ఫూర్తితోఁ జక్రవర్తి యయ్యె. 202

శా. [4]చండస్ఫూర్తి నతండు తండ్రిపగకై సంగ్రామరంగంబులన్
జెండెన్ హైహయబర్బరాదుల వధించెం దాళజంఘాదులన్
ముండీభూతులుగా నిరంబరులుగా మూర్తుల్ సభీభత్సులై
యుండం జేసె నిజారులన్ సగరనామోర్వీవిభుం డల్పుఁడే. 203

1 జ్ఞానమును 2 మోక్షరూపమైన ఆనందమువలని మైమఱపు చే 3. విషము 4. తీవ్రతచే.

క. [1]ఖగరాజరుచులు గల యిల
పగరాజుల నడఁచి యేలె బాహాశక్తిన్
[2]నగరాజధీరు శూరున్
సగరున్ [3]హతవిమతనగరుఁ జను వినుతింపన్. 204

సీ. ఔర్వుండు సెప్పంగ నమర వేదాత్మను
హరి నీశు సమ్మతు ననంతుఁ గూర్చి
వాజమేధంబులు వసుధేశ్వరుఁడు సేసె;
నందొక్క మఖమున నశ్వము విడువ
[4]నగభేది గొనిపోయి నాగలోకంబునఁ
గపిలుని చేరువఁ గట్టి పోలఁగెఁ;
నంత గుఱ్ఱముఁ గాన కా రాజు తనపుత్త్ర
నివహంబు దిశలకు నెమకఁ బంప

తే. వారు నీ యేఁడు దీవుల వరుస వెదకి
మఖతురగంబు లేకున్న మగిడి రాక
పార్థివంబున దోర్దండబలము మెఱసి
గ్రొచ్చి కోరాడి త్రవ్విరి కుతల మెల్ల. 205

వ. ఇట్లు సుమతి కొడుకులు నేలం ద్రవ్వి పాతాళంబునం దూర్పు ముట్టియున్న యుత్తరభాగంబునఁ గపిలమహాముని చెంత నున్న తురంగంబుఁ గని. 206

చ. ఎఱిఁగితి మద్దిరయ్య! తప మేటికి గుట్టుపడంగ నిక్కె; నీ
[6]ఖలుని బట్టి చంపుఁ డతిసాధుమునీంద్రుఁడుఁబోలె నేత్రముల్
దెఱవక [6]బాకినోరు మెదలింపక [7]బెసుకె ప్రట్టునంచు న
య్యఱువది వేవురున్ నిజకరాయుధముల్ జళిపించి డాయుచోన్.

చ. కపిలుఁడు నేత్రముల్ దెఱవఁ గాఁ దమమేనుల మంటపుట్టి తా
రపగతధైర్యులై పడి *యఘూర్ణికలంబున మూఢచిత్తులై

1. ఖగ = సూర్యునియొక్క, రాజ = చంద్రునియొక్క ..., రుచులు = కాంతులు, కల, ఇలన్ = భూమిని 'సూర్యచంద్రులు ప్రకాశించునంతవఱకు గల భూమిని' అని యర్థము. 2. హిమవంతునితో సమానమైన ధైర్యము కలవానిని. 3. నాశనముచేయఁబడిన శత్రువుల నగరములు కలవాఁడు. 4. ఇంద్రుఁడు. 5. పాపి (దుష్టుఁడు) 6. విశాలమైన నోరు. 7. పంతము. * యమాంతకరోషంబున — అని పాఠము.

నృపసుతు లందఱున్ ధరణి నీ ఱయి రా క్షణమంద సాధులం
దపసులఁ గాసిఁ బెట్టెడి మదస్ఫురితాత్మలు నిల్వ నేర్తురే.

సీ. కొందఱు కపిలుని కోపానలంబున
మ్రందిరి సగరకుమారు లనుచు
నందు రాముని శాంతుఁ డానందమయమూర్తి
తొడరి కోపించునే? [1]దుమ్ము నేలఁ
గాక జన్మించునే గగనస్థలంబున ?
నే సాంఖ్యమతమున నిద్ధమతులు
భవసముద్రము మృత్యుపదమును లంఘింతు
రాబుద్ధిఁజేయు పరాత్మభూతుఁ

తే. డఖిలబోధకుఁ డతనికి నరసిచూడ
సఖు లమిత్రులు నెవ్వరు? సగరసుతులు
దాము దయచేయు నేరమిఁ దనువులందు
ననలకీలలు పుట్టి నీ ఱైరి గాక. 209

వ. మఱియు సగరుండు కేశినియందుఁ గన్నపుత్త్రుం డసమంజసుం డను వాఁడు సమంజసగుణంబులు లేక పూర్వజన్మంబున యోగీశ్వరుండై యుండి సంగదోషంబువలన యోగభ్రష్టుండయి సగరునకు జన్మించి [2]జాతిస్మరజ్ఞానంబు గలిగి లోకంబువారలకుఁ దమవారలకు నప్రియంబగు వర్తనంబునం దిరుగుచు నొక్కనాఁడు. 210

చ. వరుస నయోధ్యలోనఁ గలవారల నాడెడు సిన్నవాండ్ర నా
సరయువులోనఁ ద్రైచి జనసంఘముఁ దండ్రియుఁ దిట్టుచుండ వాఁ
డురుమతిఁ గొన్ని ప్రొద్దులకు యోగబలంబునఁ జేసిబాలురం
దిరిగి పురంబులోపలికిఁ దెచ్చిన నివ్వెఱఁగంది రందఱున్. 211

వ. అయ్యసమంజసునికొడు కంశుమంతుం డనువాఁడు వినీతుండయి తనయొద్దఁ బనులు సేయుచుండ నంత సగరుం డమ్మనుమని నంశుమంతు నశ్వంబు వెదకి తెమ్మని పంచిన నతండు దనతండ్రుల చొప్పునం జని వారలు ద్రవ్విన మహాఖాతంబు సొచ్చి యందు భస్మరాసులపొంత నున్న హయంబుఁగని యాసమీపంబునం

1. ధూళి. 2. క్రిందటి జన్మంబునందలి జాతియొక్క జ్ఞాపకము.

దున్న కపిలాఖ్యుండయిన విష్ణుదేవునికి దండప్రణామంబు సేసి
యిట్లని స్తుతియించె. 212

సీ. మతి సిక్కఁ బట్టి సమాధిగౌరవమున
వాసిగాఁ దనకు నవ్వల వెలుఁగు
నినుఁ గానఁ డొకనాఁడు నిన్నెఱుంగునె బ్రహ్మ
యజుని మనంబున నవయవముల
బుద్ధి జన్మించిన భూరిజంతువులందు
హీనులమైన మా కెఱుఁగ వశమె
తమలోన నీవుండఁ దామెఱుంగరు నిన్న
గుణములఁ జూతురు గుణము లైనఁ
తే. గాన రొక వేళఁ జీఁకటిఁ గంటు రాత్మ
లందుఁ దెలియరు వెలుపల నమరు బొందు
లరయుదురు దేహధారు లత్యంధు లగుచుఁ
గడఁది నీమాయ నెన్నఁడుఁ గడవ లేక. 213

వ. అని వినుతి సేయుచు హయంబు విడువు మని చెప్పక తనతండ్రులు
నీఱగుటం దడవక మ్రొక్కి నిలుచున్న యంశుమంతునికిఁ గరుణా
విపులుం డగు కపిలుం డిట్లనియె, 214

క. గుఱ్ఱముఁ గొనిపో బుద్ధుల
కుఱ్ఱఁడ! మీ తాత యొద్దకున్ నీతండ్రుల్
వెఱ్ఱులు నీఱై రదె యీ
మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభమగున్. 215

వ. అని పలికిన నమస్కరించి తురంగంబుఁ గొని వచ్చి యాసగరుని
కిచ్చిన, సగరుండా పశువువలన జన్నంబు కడమ నిండించి యంశు
మంతునకు రాజ్యం బిచ్చి [1]ముక్తబంధనుండై యౌర్వుండు సెప్పిన
మార్గంబున నుత్తమగతికిం జనియెను. అంత. 216

౯ అధ్యాయము.

క. జనకులు ప్రుగ్గినచోటికి
[2]ననిమిష నదిఁ దెత్తుననుచు నటపస్థలికిం

1. బంధనమునుండి ముక్తుఁడై. 2. దేవనది (గంగ)

జని తపము సేయఁ జాలక
మనమున [1]వగ లొలయ నంశుమంతుఁడు [2]దీఱెన్. 217

క. ఆతని కొడుకు దిలీపుఁడు
భూతలమున గంగ దెచ్చి [3]పొందించుటకై
ప్రీతిం దపంబు సేయుచు
భాతిగఁ దేలేక [4]కాలపరవశుఁ డయ్యెన్. 218

క. అతనిసుతుండు భగీరథుఁ
డతితప మొనరించి కనియె [5]నమృతాపాంగన్
సుతరంగన్ [6]ముఖవనరుహ
రతభృంగన్ శివజటాగ్రరంగన్ గంగన్. 219

వ. కని నమస్కరించిన గంగ కృపచేసి వరంబు వేఁడు మనిన నారాచ
పట్టి యిట్లనియె. 220

క. మావారి భస్మరాసుల
నీ వారిఁ గలిపికొనుము నెఱి మావారల్
నీ వారిఁ గలయ నాకము
మావారికిఁ గలుగు నిది ప్రమాణము తల్లీ. 221

ఇంద్ర. చెల్లన్ మదిన్ నిన్ను భజింతు గంగన్
[8]ఫుల్లాంతరంగన్ బహుపుణ్యసంగం
[9]గల్లోలలక్ష్మీజితకాశమల్లిం
దల్లిన్ [10]సుధీకల్పలతామతల్లిన్. 222

వ. అని వినుతి సేయుచున్న రాజకుమారునకు లోకపావని యిట్లనియె.

మ. వినువీథిం బఱతెంచి నేలఁబడు నా వేగంబునున్ నిల్పనో
పినవాఁ డెవ్వఁడు? మేదినీతలము నే భేదించి పాతాళముం

1. విచారములు. 2. గతించెను 3. కూర్చుటకు 4. కాలమునకు లొంగెను. (గతించెను) 5. అమృత కటాక్షములు కలది 6. ముఖ మనెడి పద్మములందు ఆసక్తి కల తుమ్మెదలు కలది. 7. శివజటాజూటము రంగస్థలముగా గలది. లేక యందు విలసించు చున్నది. 8. వికసించిన హృదయము కలది. 9. కెరటములు శోభచే జయింపఁబడిన రెల్లు పువ్వులు, మల్లెలు కలది. 10. ఉత్తములపాలి కల్పలతాశ్రేష్ఠ మయిన దానిని (గంగను)

జనుచున్ వచ్చితినేని నాజలములన్ సంస్నాతులై మానవుల్
ననుఁ బొందించు నఘవ్రజం బెచట నేనాశంబుఁ బొందించెదన్.

వ. అది కారణంబుగా విచారించెద నని పలుకుచున్న లోకమాతకు
రాజన్యవర్యుండగు భగీరథుం డిట్లనియె.

మ. పరతత్త్వజ్ఞులు శాంతచిత్తులు తపఃపారీణు లార్యుల్ ఘనుల్
బురుషశ్రేష్ఠులు వచ్చి తల్లి[1]భవదంభోగాహముల్ సేయఁగా
[2]నరసంఘాఘము నిన్నుఁ బొందునె జగన్నాథుండు నానాఘసం
హరుఁ డావిష్ణుఁడు వారిచిత్తములఁ దానై యుంట మందాకినీ!

మ. తనలో నిన్ని జగంబులుం గలుగుటం దానిన్నిటం గల్గుటన్
జననీ! [3]తంతువులందుఁ [4]జీర గల యాచందంబునన్, విశ్వభా
వనుఁడై యొప్పు శివుండు గాక మఱి నీ వారిన్ నివారింప నే
ర్చినవా రెవ్వరు? నిన్ ధరించుకొఱకై శ్రీకంఠునిం గొల్చెదన్.

వ. అని యొడంబఱిచి వీడ్కొని చని, భగీరథుండు మహేశ్వరు నుద్దే
శించి గ్రద్దనఁ దపంబు సేసిన, 228

ఆ. భక్తవత్సలుండు ఫాలాక్షుఁ డాభగీ
రథుని మెచ్చి నిజశిరంబునందు
శౌరిపాదపూతసలిలయై దివినుండి
ధరకు వచ్చు గంగఁ దాల్చె నపుడు. 229

శ్రీ పరమేశ్వరజటానిర్గత గంగాప్రవాహ మహిమానువర్ణనము

వ. ఇట్లమ్మహానదీప్రవాహంబు పురారాతిజటాజూటరంధ్రంబులవలన
వెలువడి నిరర్గళాయమానం బై నేలకుఁ జల్లించి నెఱసి నిండి పెల్లు
వెల్లిగొని పెచ్చుపెరిఁగి విచ్చలవిడిం గ్రేపువెంబడి నుఱుక గ్రేళ్ళు
ఱుకు బ్రాయంపుఁ గామధేనువు చందంబున, ముందఱికి నిగుడుచు
ముద్దుఁ జందురుతోడి నెయ్యంబునఁ గ్రయ్యనడరి చొప్పు దప్పక
సాఁగి చనుదెంచు సుధార్ణవంబుకైవడిఁ బెంపుఁ గలిగి మహేశ్వరు
వదనగహ్వరంబువలన నోంకారంబు పిఱుంద వెలువడు శబ్ద

1. నీ నీట మునుకలను. 2. నరసమూహాఘుల పాపములు. 3. దారములందు,
4. వస్త్రము.

బ్రహ్మాంబుభంగి నదభ్రవిభ్రమంబై యమ్మహీపాలతిలకంబు తెరువు వెంటనంటి వచ్చు వెలియేనుఁగు తొండంబుల ననుకరించి పఱచు వఱద మొగంబులును వఱప మొగంబులపిఱుంద నందంద క్రందుకొని పొడచూపి తొలంగు [3]బాలశారదాకుచకుంభంబుల పగిది కగ్గలంబైన బుగ్గలును, బుగ్గలసంగడంబునం బారిజాతకుసుమస్తబకంబుల చెలువంబులం దెగడు వెలినురువులును, వెలినురువుల చెంగట నర్తోన్మీలితకర్పూరతరుకిసలయంబులఁ జక్కందనము గెలిగొను సుళ్ళును, సుళ్ళకెలంకుల ధవళజలధరరేఖాకారంబుల బాగు మెచ్చని నిడుదయేఱులును, నేఱులంగలసి వాయువశంబున నొండొంటిం దాఁకి బిట్టుముట్టించి మీఁదికెగయు దురితభంగంబులైన భంగంబులును, భంగంబులకొనల భిన్నభిన్నంబులై కుప్పించి యుప్పరంబెగయు ముత్తియంపు సరులవడువున మల్లికాదామంబుల తెఱంగునఁ గర్పూరఖండకదంబంబుల చెలువంబు నిందుశకలంబుల తేజంబునఁ దారకానికరంబులపోలువున మెఱయుచు ముక్తికన్యావశీకరంబులైన శీకరంబులునుం గలిగి మధ్యమలోకశ్రీకరంబై శ్రీకరంబు తెఱంగున విష్ణుపదంబుముట్టి, విష్ణుపదంబుభాతి నుల్లసిత ంసరుచిరంబై రుచిరపక్షంబురీతి నతిశోభితకువలయంబై కువలయంబుచెన్నున బహుజీవనంబై జీవనంబులాగున సుమనోవికాసప్రధానంబై ప్రధానపర్వంబుపోలువున ననేకచక్రబకభీమమహాభంగసుభద్రార్జునచరిత్రాభిరామంబై రామచిత్తంబుమెలఁపునం దనవారిలోఁ జొచ్చిన దోషాచరుల కభయప్రదాన[illegible]ంబై ప్రదానచణవర్తనంబుభాతి సముపాసితమృత్యుంజయంబై మృత్యుంజయురూపంబుపోలిక విభూతిసుకుమారంబై కుమారచరిత్రంబు తేవను క్రౌంచప్రముఖవిజయంబై విజయరథంబుభాతి హరిహయామంథరంబై మంథరవిచారంబు గ్రద్దన మహారామగిరివనప్రవేశకామంబై కామకేతనంబుపెల్లున నుద్దీపితమకరంబై మకరకేతనుబాణంబు కైవడి విలీనపరవాహినీకలితశంబరంబై శంబరారాతిచిగురుగొంతంబుసూటి నధ్వగవేదనాశమనంబై, శమనదండంబుజాడ నిమ్నోన్నతసమవృత్తంబై వృత్తశాస్త్రంబువిధంబున షడిగలిగి స్వదాగురు

లఘువాక్యచ్ఛటాపరిగణితంబై గణితశాస్త్రంబుకోలఁదిని ఘనఘన
మూలవర్గసంకలితభిన్నమిశ్రప్రకీర్ణఖాతభీష్మంబై భీష్మపర్వంబు వెం
పున ననేకభగవద్గీతంబై గీతశాస్త్రంబు నిలుకడను మహాసుషిరతను
ఘననానాశబ్దంబై శబ్దశాస్త్రంబుమర్యాద నచ్చుపడి హల్లుగలిగి
మహాభాష్యరూపావతారవృత్తివృద్ధిగుణసమర్థంబై యర్థశాస్త్రంబు
మహిమను బహుప్రయోజనప్రమాణదృష్టాంతంబై దృష్టాంతంబు
తెఱంగున సర్వసామాన్యగుణవిశేషంబై శేషవ్యాపారంబుకరణిని
సుస్థిరోద్ధరణతత్పరంబై పరబ్రహ్మంబుగరిమ నతిక్రాంతానేకనిగ
మంబై నిగమంబునడవడిని బ్రహ్మవర్ణపదక్రమసంగ్రహంబై గ్రహ
శాస్త్రంబుపరిపాటిని గర్కటమీనమిథునమకరసుందరంబై సుందరీ
ముఖంబుపోఁడిమిని నిర్మలచంద్రకాంతంబై కాంతాధరంబురుచిని
శోణచ్ఛాయావిలాసంబై విలాసవతికొప్పునొప్పునఁ గృష్ణనాగాధి
కంబై యధికమతిశాస్త్రసంవాదంబుసొంపున నపారసరస్వతీవిజయ
విభ్రమంబై విభ్రమవతిచనుదోయిపగిది నిరంతరపయోవ్యాప్త్యాఖిల
లోకజీవనప్రదతుంగభద్రాతిరేఖాసలలితంబై లలితవతినగవుమించున
నపహసితచంద్రభాగధేయంబై భాగధేయవంతునివివాహంబులీల
మహామేఖలకన్యకావిస్తారంబై తారకెంగేలియొడికంబున నాక్రాంత
సూర్యతనయంబై సూర్యతనయుశరవర్షంబుపోలిక భీమరథ్యాటోప
వారణంబై వారణంబుపరుసునం బుష్కరోన్నతసంరంభంబై
రంభనెమ్మోముడాలున సురసాతిశయదశంబై దశరథతనయుబాము
ముడిచాడ్పున సింధుగర్వప్రభంజనంబై ప్రభంజనతనయుగదపెట్టు
మాడ్కిని సమీపగతదుశ్శాసనదుర్మదనివారకంబై వారకన్యక
ముంజేతిని ముహుర్ముహురుచ్చలితకంకణాలంకృతంబై కృతయుగం
బునోజ నపంకంబై పంకజాసనుముఖంబునొఱపునఁ బ్రభూతముఖ్య
వర్ణంబై వర్ణగుణితంబు తెఱకువను బహుదీర్ఘబిందువిసర్గంబై సర్గ
బంధకావ్యంబు విన్ననువున గంభీరభావమధురంబై మధురాపురం
బుసొబగున మహానందనందనంబై నందనవనంబుపొందున విహార
మాణకౌశికంబై కౌశికహయంబురీతి సుదశధ్రువంబై ధ్రువుతలంపు
క్రియం గ్రియాబరిశీలితవిశ్వంభరంబై విశ్వంభరునిశంఖంబురూపున

దక్షిణావర్తోత్తరంబై యుత్తరావివాహంబుచందంబునఁ బ్రమదిత నరంబై నరసింహునఖరంబులభాతి నాశ్రితప్రహ్లాదగురువిభవప్రదానంబై దానకాండంబు సిరిం గామధేనుకల్పలతాద్యభివనంబై నవసూతికాకుచంబుపేర్మిని నిరంతరపయోవర్ధనంబై ధనదునిలయంబు తూనికను సంభృతమకరపద్మమహాపద్మకచ్ఛపంబై కచ్ఛపకర్పరంబుఁబలిమిని బలితశైలసముద్ధరణంబై ధరణీధరంబుసాటి నుత్తుంగతటముఖ్యంబై ముఖ్యవరాహంబుగరిమ నున్నతక్షమంబై క్షమాసురహస్తంబుగరగరికను సత్పవిత్రమనోరామంబై రామచంద్రుని బాణంబుకడిది నభ్యాగతఖరదూషణమదాపహరణముఖరంబై ముఖరరామకుఠారంబురీతి భూభృన్మూలనచ్ఛేదనప్రబలంబై బలరామహలంబుభాతిని బ్రతికూలసన్నికర్షణప్రబుద్ధంబై బుద్ధదేవుని మేనిరొయిలుపున నభిమతశిరక్షోదారమనోహారంబై హారతాడవంబు మేర నుల్లసితానిమిషంబై యనిమిషావతారంబుకీర్తిని శ్రుతిమంగళప్రదంబై ప్రదాతయోగిసూటి సర్ధపరంపరావామనంబై వామనచరణరేఖను బలివంశవ్యపనయంబై నయశాస్త్రంబుమార్గంబున సామభేద మాయోపాయచతురంబై చతురాననాండంబుభావంబున నపరిమితభువనజంతుజాలసేవ్యమానంబై మానినియన లోఁతు సూపక గరితయన నడిచప్పుడు సేయక ముగుదయన బయలుపడక ప్రమదయన గ్రయ్యం బాఱుచుఁ బతివ్రతయన నిట్టట్టుఁ జనక తల్లియన నెవ్వియైన లోఁగొనుచు దైవంబన భక్తమనోరథంబు లిచ్చుచు నంతకంతకు గుఱి గడచి యవాఙ్మనసగోచరంబై ప్రవహించి. 230

మ. జగతీనాథు రథంబుపజ్జ బహుదేశంబుల్ వడిఁ దాఁటి త
త్సగరత్మోపకుమారభస్మముల మీఁదన్ ముంచి పాఱన్ మరు
న్నగరావాసము వారు వొందిరి నవీన శ్రీలతోఁ; గంగ నీ
రు గతింగాక మహాదురంతసుజనద్రోహానలం బాఱునే? 231

మ. హరు మెప్పించి మహాతపోనియతుఁడై యాకాశగంగానదిన్
ధరకుం దెచ్చి నితాంతకీర్తి లతికా స్తంభంబుగా నవ్యసు

స్థిరలీలం బితృకృత్య మంతయు నొనర్చెన్ వారితానేకదు
స్తరవంశవ్యథుఁ డాభగీరథుఁడు నిత్యశ్రీకరుం డల్పెఁడే. 232

క. హరిఁ దమ మనములలో నిడి
హరిపాదాంభోజజనిత మైన నదిన్ సు
స్థిరులై క్రుంకి మునీంద్రులు
హరిఁ గలిసిరి త్రిగుణరహితులై యవ్వేళన్. 233

వ. అంత నాభగీరథునకు శ్రుతుండును శ్రుతునకు నాభావరుండును నాభావరునకు సింధుద్వీపుండును సింధుద్వీపునికి నయుతాయువును నయుతాయువునకు ఋతుపర్ణుండును జనియించెను. అతండు. 234

ఆ. నయవిశాలబుద్ధి నలచక్రవర్తితో
1సంగడీనితనము సాలఁ జేసి
2యక్షహృదయ మతని కవ్యస్తముగ నిచ్చి
3యశ్వవిద్య నేర్చె నతనివలన. 235

వ. ఆ ఋతుపర్ణునకు సర్వకాముండును సర్వకామునకు మదయంతీవల్లభుండైన సుదాసుండును బుట్టె. ఆరాజశేఖరుని మిత్రసహుండును గల్మాషపాదుండు నని చెప్పుదురు. ఆ భూవరుండు వశిష్ఠుని శాపంబున రాక్షసుం డయి తనకర్మంబున ననపత్యుండయ్యెను. అనిన విని పరీక్షిన్నరేంద్రుం డేమి కారణంబున సుదాసునకు గురుశాపంబు ప్రాప్తంబయ్యె నని యడిగిన శుకుం డిట్లనియె. 236

సీ. ఆ సుదాసుఁడు వేటకై వనంబున కేఁగి
గర్వించి యొక్క రక్కసునిఁ జంపి
వానితోఁ బుట్టిన వానిఁ బోవిడిచిన
వాఁడును దనతోడి వాని చావు

1. స్నేహము 2. పాచికలనడకలో రహస్యము తెలియునిద్య 3. అశ్వహృదయ మనువిద్య. గుఱ్ఱముల మనోభావమెఱిఁగి నడుపుట.

వానికి కపటియై భూపాలుగృహమున
[1]నడబాలతనమున నర్థిఁ గొలిచి
యుండ వశిష్ఠున కుర్వీశుఁ డొక్కనాఁ
డన్నంబు సేయంగ నతనిఁ బనుప
తే. వాఁడు మానవమాంసంబు వండి తెచ్చి
మునికి వడ్డింపఁ గోపించి ముని నరేంద్రుఁ
బిలిచి మనుజామిషంబును బెట్టి తనుచు
నలుకతో రాక్షసుఁడవు గమ్మని శపించె. 237

వ. ఇట్లు శపియించి పదంపడి రాక్షసుండు వండి తెచ్చుటయు సుదాసుం డెరుంగమియుఁ దన మనంబున నెఱింగి వశిష్ఠుఁడు పండ్రెండేండ్లు రక్కసుండవయి యుండుమని నియమించెను. అయ్యవసరంబున.

మ. గురువుం గ్రమ్మఱ శపింతు నంచు జలముల్ గోపంబుతో దోయిటన్
నరనాథుండు ధరింపఁ దత్సతి పతిన్వారింప, మిన్నుం దిశల్
ధరయుం జీవమయంబకా నిఖిలముం దాఁ జూచి చల్లెన్ ధరా
వరుఁ డాత్మీయపదంబులం గరపుటీ[2]వాఃపూరముం బొక్కుచున్.

వ. ఇట్లు మిత్రసహుండు గావునఁ [3]గళత్రానుకూలుండై శపియింప నొల్లక సుదాసుండు రాక్షసభావంబునొంది కల్మాషవర్ణంబులయిన పాదంబులతో నడవులం దిరుగుచు. 240

క. ఆఁకట మ్రాఁకుల మాఁడుచు
పోఁక నడవి నున్న [4]విప్రమిథునముం
దాకి తపోలున విప్రునిఁ
[5]గూఁకటి చేఁ బట్టి మ్రింగఁ గొనిపోవుతఱిన్. 241

వ. అంత నాబ్రాహ్మణునిభార్య మొఱదిగొనుచుం బెగ్గడిల్లి డగ్గుత్తికతోఁ బతిభిక్షం బడిగి వచ్చి యేడ్చుచు రాచరక్కసున కిట్లనియె. 242

క. మానుష దేహము గలుగుట
భూనాయక ! దుర్లభంబు పుట్టిన మీఁదన్

---

1. అడబాలతనము = వాచకత్వము. వంటచేయుపని. 2. నీటిధారను. 3. భార్య కనుకూలముగా నడచువాఁడై. 4. బ్రాహ్మణదంపతులను, 5. జుట్టు.

దానముఁ బరోపకారము
భూనుతకీర్తియును వలదె పురుషున కెందున్. 243

మ. రవివంశాగ్రణివై సమస్తధరణీరాజ్యానుసంధాతవై
భువనస్తుత్యుఁడవై పరార్థరతివై పుణ్యానుకూలుండవై
వివరం బేమియులేక నాపెనిమిటిన్ విప్రుం దపశ్శీలు స
త్ప్రవరున్ బ్రహ్మవిదున్ జగన్నుతగుణున్ భక్షింపగాఁ బాడియే?

శా. తండ్రీ! మీకు దినేశవంశజులకున్ దైవంబగున్ బ్రాహ్మణుం
డం డ్రామాటలు లేవె భూమిసురగోహత్యాభిలాషంబు గై
కొం డ్రే మీయటువంటి సాధువులు [1]రక్షోభావమిట్లేల యే
తండ్రిం దాతలఁ బూర్వులం దలఁపవే ధర్మంబునం బోఁగదే! 245

శా. అన్నా! చెల్లెల నయ్యెదన్ విడువు నీ కన్నంబు వెట్టింతు నా
హృన్నాథుఁ ద్విజు [2]గంగికట్టి నకటా హింసింప నేలయ్య? నీ
వెన్నం డింతులతోడఁ బుట్టవె నిజం బిట్టైన ముం దిట్ల నా
పన్నన్ నన్ను శిరంబుద్రుంచి మఱి మత్ప్రాణేశు భక్షింపవే. 246

క. అని కరుణ పుట్ట నాడుచు
వనితామణి పలవరింప వసుధాదేవుం
దినియె నతఁడు, పులి పశువుం
దిను క్రియ, శాపంబు కతన ధీరహితుండై. 247

వ. అంత నాబ్రాహ్మణి గోపించి కామార్తనయిన నాదు పెనిమిటిని భక్షించితివి గావున నీవు నెలతలం బొందఁజేరినవేళ మరణంబుఁ బొందుమని కల్మషపాదుని శపించి పతిశల్యంబులతో నగ్నిప్రవేశంబుసేసి సుగతికిం జనియెను. అంతఁ బండ్రెండేండ్లు సనిన నారాజు మునిశాపనిర్ముక్తుండై. 248

ఆ. రతులకొఱకు నాలి రావింప నదియును
బెదరి విప్రసతి శపించు టెఱిఁగి
మగని నడ్డపెట్టి మైథునకర్మంబు
మాన్పె సతులగోష్ఠి మానె నతఁడు. 249

1. రాక్షసత్వము. 2. గంగిగోవువంటివానిని

క. అది కారణముగఁ బుత్రా
భ్యుదయము లేదా సుదాసభూపాలునకుం
దదనుమతి నవ్వశిష్ఠుఁడు
మదయంతికిఁ గడుపు సేసె [1]మదనక్రీడన్. 250

వ. ఇట్లు సుదాసుని భార్యయగు మదయంతి వశిష్ఠువలన గర్భిణియై యేడేండ్లు గర్భంబు ధరించి నీళ్ళాపఁ సంకటపడుచున్న వశిష్ఠుండు వాఁడియగు [2]నశ్మంబున నాగర్భంబునుఁ జీరిన నశ్మకుండను కుమారుండు పుట్టెను. అతనికి మూలకుండు పుట్టెను. అతండు. 251

క. వీరుఁ డగు పరశురాముఁడు
ఘోర కుఠారమున నృపులఁ గూలుచు వేళన్
నారీజనములు దాఁచిన
నారీకవచుం డనంగ నలి నుతి కెక్కెన్. 252

వ. ఆనారీకవచుండు నిర్మూలంబయిన రవివంశంబునకు మూలంబగుటం జేసి మూలకుం డనం బరఁగెను. ఆమూలకునకు విశ్వసంహుండు పుట్టె. విశ్వసంహునకు ఖట్వాంగుండు పుట్టి చక్రవర్తి యయ్యెను. అతండు. 253

సీ. అమరులు వేఁడిన నసురనాథులఁ జంపి
త్రిదశులదోఁ దన బ్రదుకు కాల
మెంతని యడిగిన నిదె నిండు చున్నది
తడవు లే దేమైన నడుగు మనిన
వరములు గోరక వరవిమానం బెక్కి
తనపురి కేతెంచి తత్త్వబుద్ధిఁ
బరమేశ్వరునియందు భావంబుఁ గీలించి
కులదైవతద్విజకులముఁకం జెు

తే. నంగనాప్రాణరాజ్యపుత్త్రాదు లెల్లఁ
గావు ప్రియములు ధర్మంబు గడచి నాదు

1. మన్మథ క్రీడయందు (రతియందు అనుట) 2. అశ్మంబునన్ = రాతిచే.

దానముఁ బరోపకారము
భూనుతకీర్తియును వలదె పురుషున కెందున్. 243

మ. రవివంశాగ్రణివై సమస్తధరణీరాజ్యానుసంధాతవై
భువనస్తుత్యుఁడవై పరార్థరతివై పుణ్యానుకూలుండవై
వివరం బేమియులేక నాపెనిమిటిన్ విప్రుం దపశ్శీలు స
త్ప్రవరున్ బ్రహ్మవిదున్ జగన్నుతగుణున్ భక్షింపఁగాఁ బాడియే?

శా. తండ్రీ! మీకు దినేశవంశజులకున్ దైవంబగున్ బ్రాహ్మణుం
డం డ్రామాటలు లేవె భూమిసురగోహత్యాభిలాషంబు గై
కొండ్రే మీయటువంటి సాధువులు [1]రక్షోభావమిట్లేల యే
తండ్రిం దాతలఁ బూర్వులం దలఁపవే ధర్మంబునం బోఁగదే! 245

శా. అన్నా! చెల్లెల నయ్యెదన్ విడువు నీ కన్నంబు వెట్టింతు నా
హృన్నాథుం ద్విజు [2]గంగికట్టి నకటా హింసింప నేలయ్య? నీ
వెన్నం డింతులతోడఁ బుట్టవె నిజం బిట్టైన మున్నాముట్ట నా
పన్నం నన్ను శిరంబు ద్రుంచి మఱి మత్ప్రాణేశు భక్షింపవే. 246

క. అని కరుణ వుట్ట నాడుచు
వనితామణి పలవరింప వసుధాదేవుం
దినియె నతఁడు, పులి పశువుం
దిను క్రియ, శాపంబు కతన ధీరహితుండై. 247

వ. అంత నాబ్రాహ్మణి గోపించి కామార్తనయిన నాదు పెనిమిటిని భక్షించితివి గావున నీవు నెలతలం బొందఁజేరినవేళ మరణంబుఁ బొందుమని కల్మాషపాదుని శపించి పతిశల్యంబులతో నగ్నిప్రవేశంబుసేసి సుగతికిం జనియెను. అంతఁ బండ్రెండేండ్లు సనిన నారాజు మునిశాపనిర్ముక్తుండై. 248

ఆ. రతులకొఱకు నాలి రావింప నదియును
బెదరి విప్రసతి శపించు టెఱిఁగి
మగని నడ్డపెట్టి మైథునకర్మంబు
మాన్పె సతులగోష్ఠి మానె నతఁడు. 249

---

1. రాక్షసత్వము. 2. గంగిగోవువంటివానిని

క. అది కారణముగఁ బుత్రా
భ్యుదయము లేదా సుదాసభూపాలునకుం
దదనుమతి నవ్వశిష్ఠుఁడు
మదయంతికిఁ గడుపు సేసె [1]మదనక్రీడన్. 250

వ. ఇట్లు సుదాసుని భార్యయైన మదయంతి వశిష్ఠువలన గర్భిణియై యేడేండ్లు గర్భంబు ధరించి నీళ్ళాడ సంకటపడుచున్న వశిష్ఠుండు వాఁడియగు [2]నశ్మంబున నాగర్భంబునుఁ జీరిన నశ్మకుండను కుమారుండు పుట్టెను. అతనికి మూలకుండు పుట్టెను. అతండు. 251

క. వీరుఁ డగు పరశురాముఁడు
ఘోర కుఠారమున నృపులఁ గూలుచు వేళన్
నారీజనములు దాఁచిన
నారీకవచుం డనంగ నలి నుతి కెక్కెన్. 252

వ. ఆనారీకవచుండు నిర్మూలంబయిన రవివంశంబునకు మూలంబగుటం జేసి మూలకుం డనంబరఁగెను. ఆమూలకునకు విశ్వసంహుండు పుట్టె. విశ్వసంహునకు ఖట్వాంగుండు పుట్టి చక్రవర్తి యయ్యెను. అతండు. 253

సీ. అమరులు వేఁడిన నసురనాథులఁ జంపి
త్రిదశులదోఁ దన బ్రదుకు కాల
మెంతని యడిగిన నిదె నిండు చున్నది
తడవు లే దేమైన నడుగు మనిన
వరములు గోరక వరవిమానం బెక్కి
తనపురి కేతెంచి తత్త్వబుద్ధిఁ
బరమేశ్వరునియంద భావంబుఁ గీలించి
కులదైవతద్విజకులముకంటె

తే. సంగనాప్రాణరాజ్యపుత్త్రాదు లెల్లఁ
గావు ప్రియములు ధర్మంబు గడచి నాదు

---

1. మన్మథ క్రీడయందు (రతియందు అనుట) 2. అశ్మంబునన్ = రాతిచే,

మఱి ప్రవర్తింపదెన్నఁడు మఱినెఱుంగ
నన్య మా యీశ్వరునిఁ దక్క ననుచు మఱియు. 254

మ. ఇలమీఁదన్ బ్రదుకేల వేల్పుల వరం బేలా ధనం బేల [1]చం
చలగంధర్వపురీవిడంబనము లైశ్వర్యంబు లేలా జగం
బులఁ బుట్టించు తలంపునం బ్రకృతితోఁ బొత్తై తుదిం బాసి ని
ర్మలమై వాఙ్మనసామితం బగు పరబ్రహ్మంబు నేఁ జొచ్చెదన్.

వ. అని నిశ్చయించి. 256

మ. కలసెన్ సంగము లెల్లఁ బాసి నియతిన్ ఖట్వాంగుఁ డశ్రాంతమై
కల దయ్యున్ మఱిమీఁద లేదనెడిదై కల్యాణమై యాత్మలోఁ
దలఁపం బల్కఁగరానిదై పరమమై తత్త్వజ్ఞు లూహించి హృ
జ్జలజాతంబుల వాసుదేవుఁడని సంస్థాపించు నా బ్రహ్మమున్.

## ౧౦ అధ్యాయము

వ. అట్టి ఖట్వాంగునకు దీర్ఘబాహుండు దీర్ఘబాహునకు రఘువు రఘువునకుఁ బృథుశ్రవుండుఁ బృథుశ్రవునకు నజుండు నజునకు దశరథుండును బుట్టిరి. ఆ దశరథునకు సురప్రార్థితుండై పరబ్రహ్మమయుండైన హరి నాల్గువిధంబులై శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్న నామంబుల నిజాంశసంభూతుండై జన్మించె. తచ్చరిత్రంబు వాల్మీకి ప్రముఖులైన మునులచేత వర్ణితంబై నది యైనను జెప్పెద సావధానమనస్కుండవై యాకర్ణింపుము. 258

### శ్రీరామచరిత్రము.

మ. [2]అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుండైనట్లు నారాయణాం
శమునం బుట్టె మదాంధరావణశిరస్సంఘాతసంఛేదన
క్రమణోద్దాముఁడు రాముఁ డాగరితకుం గౌసల్యకున్ సన్నుతా
సమనైర్మల్యకతుల్య[3]కంచితజనుస్సంసారసాఫల్యకున్. 259

మ. సవరక్షార్థము దండ్రి వంపఁ జని విశ్వామిత్రుఁడుం దోడరా
నవలీలం దునుమాడె రాముఁ డుదయుండై బాలుఁడై [4]కుంతల

---

1. చంచలములైనగంధర్వ నగరమును బోలినవై 2. తూర్పు దిశకు (ఇంద్రుని దిక్కు) 3. ఒప్పిడి జన్మముయొక్క కుటుంబముయొక్క సాఫల్యము కలది. 4. జుట్టుయొక్క కాంతిచే జయింపఁబడిన బంగారము కలది.బంగారురంగు జుట్టుకలది యన్నమాట

చ్ఛవిసంపజ్జితహాటకం [1]గపటభాషావిస్ఫురన్నాటకన్
[2]జవభిన్నార్కరథఘోటకం [3]గరవిరాజత్ఖేటకం దాటకన్. 260

క. గారామునఁ గౌశిక మఖ
మా రాముఁడు గాచి దైత్యు నధికు సుబాహున్
ఘోరాజిఁ ద్రుంచి తోలెను
మారీచున్ నీచుఁ [4]గపటమంజులరోచున్. 261

మ. ఒక [5]మున్నూఱు గదల్చి తెచ్చిన [6]లలాటోగ్రాక్షచాపంబు బా
లకరీంద్రంబు సులీలమైఁ జెఱకుఁగోలం ద్రుంచు చందంబునన్
సకలోర్వీశులు సూడఁగా విఱిచె దోశ్శక్తిన్ [7]విదేహక్షమా
పక గేహంబున సీతకై [8]గుణమణి ప్రస్ఫీతకై లీలతోన్. 262

క. భూతలనాథుఁడు రాముఁడు
ప్రీతుండై పెండ్లియాడెఁ బృథుగుణమణిసం
ఘాతన్ భాగ్యోపేతన్
సీతన్ [9]ముఖకాంతివిజితసితఖద్యోతన్. 263

క. రాముఁడు నిజబాహుబల
స్థేమంబున భంగపఱిచె దీర్ఘకుఠారో
ద్దామున్ [10]విదళీకృతనృప
ధామున్ రణరంగభీము భార్గవరామున్. 264

క. దశరథుఁడు మున్ను గైకకు
వశుఁడై తా నిచ్చినట్టి వరముకతన వా
గ్దశ సెడక యడవి కనిచెను
దశముఖముఖకమలతుహినధామున్ రామున్. 265

---

1. కపటపు మాటలచేఁ దెలియవచ్చు నాటకము(నటనము) కలది. 2. వేగముచే భేదింపఁబడిన సూర్యరథముయొక్క గుఱ్ఱములుకలది. సూర్యాశ్వముల కంటెను వడిగా బరువుఁ లెత్తునది యన్నమాట. 3. చేతిలో నలరారు డాలుకలది. 4. కపటమైనచక్కని కాంతిగల వాఁడు (లేడివేషము వేసికొన్నవాఁడనుట) 8. మూఁడువందల మంది 6. ఫాలాక్షునియొక్క (శివునియొక్క) 7. విదేహరాజగు జనకునియింట 8. ఉత్తమ గుణములచే నిండినది. 9. ముఖకాంతిచే జయింపబడిన చంద్రుఁడు గలది. (సిత = తెల్లని ఖద్యోత = కాంతి కలవాఁడు. చంద్రుఁడు) 10. విదళింపఁబడిన రాజుల తేజస్సులు కల వాఁడు. రాజుల ప్రతాపమును నశింపఁజేసినవాఁడనుట.

క. జనకుఁడు వనిచిన మే లని
జనకజయును లక్ష్మణుండు సంసేవింపన్
జనపతి రాముఁడు విడిచెను
జనపాలారాధ్య ద్విపదసాధ్య నయోర్థ్యక్. 266

క. భరతున్ నిజపదసేవా
నిరతున్ రాజ్యమున నునిచి నృపమణి యొక్కన్
సురుచిరరుచిపరిభావిత
గురుగోత్రాచలముఁ జిత్రకూటాచలమున్. 267

ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁ డట వోయి ముదంబునఁ గాంచెఁ దండకా
రణ్యముఁ దాపసోత్తమశరణ్యము నుద్ధతబర్హిబర్హలా
వణ్యము గౌతమీవిమలవాఃకణపర్యటనప్రభూతసా
ద్గుణ్యము నుల్లసత్తరునికుంజవరేణ్యము నగ్రగణ్యమున్. 268

సీ. ఆ వనంబున రాముఁ డనుజసమేతుఁడై
సతితోడ నొక పర్ణశాల నుండ
రావణు చెల్లెలు రతిఁ గోరి వచ్చిన
మొగి లక్ష్మణుఁడు దాని ముక్కు గోయ
నది విని ఖరదూషణాదులు పదునాల్గు
వేలు వచ్చిన రామవిభుఁడు గలన
బాణానలంబున భస్మంబు గావింప
జనకనందనమేని చక్కఁదనము

తే. విని దశగ్రీవుఁ డంగజ వివశుఁ డగుచు
నర్థిఁ బంచినఁ [2]బసిఁడిఱ్ఱి యై నటించు
నీచు మారీచు రాముఁడు నెఱి వధించె
నంతలో సీతఁ గొనిపోయె నసురవిభుఁడు. 269

ఉ. ఆ యసురేశ్వరుండు వడి నంబరవీథి నిలాత్మజా న
న్యాయము సేసి నిష్ఠురుఁడై కొనిపోవఁగ నడ్డమైన ఘో

1. సద్గుణ సంపత్తుగలది. 2. బంగారులేడి. (పసిడి × ఇఱ్ఱి)

రాయత హేతిఁ ద్రుంచె ననహాయత [1]రామనరేంద్రకార్యద
త్తాయువుఁ బక్షవేగపరిహాసితవాయువు నజ్జటాయువున్. 270

వ. అంత నారామచంద్రుండు లక్ష్మణసహితుండై సీత వెదక నరు
దెంచి నిజకార్యనిహతుండైన జటాయువునకుఁ బరలోకక్రియలు
కావించి ఋశ్యమూకంబునకుం జని. 271

క. నిగ్రహము నీకు వల దిఁక
నగ్రజు వాలిన్ వధింతు నని నియమముతో
నగ్రేసరుఁగా నేలెను
సుగ్రీవుం [2]జరణఘాతచూర్ణగ్రావున్. 272

క. లీలన్ రామవిభుం డొక
కోలం గూలంగ నేసె గురునయశాలిన్
[3]శీలిన్ సేవితశూలిన్
[4]మాలిన్ వాలిన్ [5]దశాస్యమానోన్మూలిన్. 273

క. ఇలమీఁద సీత వెదకఁగ
నలఘుఁడు రాఘవుఁడు వనిచె హనుమంతు [6]నతి
చ్ఛలవంతున్ మతిమంతున్
బలవంతున్ శౌర్యవంతు బ్రాభవవంతున్. 274

క. అలవాటుకలిమి మారుతి
లలితామితలాఘవమున లంఘించెను[7]శై
వలినీగణసంబంధిన్
[8]జలపూరితధరణిగగనసంధిం [9]గంధిన్. 275

1. రామకార్యమునకై యొసంగఁబడిన యాయుర్దాయము కలది. రామకార్యము నకై ప్రాణము లర్పించినది అన్నమాట. 2. పాదముల రాపిడిచే రాతిబండలను బొడి చేయువాఁడు. 3. శీలము కలవాఁడు. 4. 'మాల' ఇందుఁడొసంగినమాల, కంఠమున ధరించినవాఁడు. 5. రావణుని గర్వమును హరించినవాఁడు. 6. 'మహామాయావి' (మాయావులయెడ మాయనుపయోగింపఁగలవాఁడన్నమాట.) 7. నదుల సమూహము నకు బంధువు. 8. నీటిచే భూమికి, ఆకాశమునకుగల సంధిని నింపినది. 7. సము ద్రమును (కంధి)

వ. ఇట్లు సముద్రంబు దాఁటి సీతం గని హనుమంతుండు దిరిగి చను
దెంచుచు నక్షకుమారాదుల వధియించి, 276

క. సముద్రగత ననిలసుతుం
డమరాహితదత్త వాలహస్తాగ్నుల భ
స్మము సేసె నిరాతంకన్
సమదాసురసుభటవిగతశంకన్ లంకన్. 277

వ. ఇట్లు లంకాదహనంబు సేసివచ్చి వాయుజుండు సీతాకథనంబు సెప్పిన
వినిరామచంద్రుండు వనచరనాథయూథంబులుం దానునుజని చని.

శా. ఆ రాజేంద్రుఁడు గాంచె భూరివిధరత్నాగారమున్ మీనకుం
భీరగ్రాహకఠోరమున్ విపులగంభీరంబు సభ్రభ్రమ
ద్ఘోరాన్యోన్యవిభిన్నభంగభవనిర్ఘోషచ్ఛటాంభఃకణ
[1]ప్రారుద్ధాంబరపారమున్ లవణపారావారముం జేరువన్. 279

వ. కని తనకుఁ ద్రోవ యిమ్మని వేఁడిన నదియు మార్గంబుసూపక
[2]మిన్నందిన నారాచపట్టి రెట్టించిన కోపంబున. 280

క. మెల్లని నగవున నయనము
లల్లార్చి శరంబు విల్లునందిన మాత్రన్
గుల్లలు నాఁచులుఁ జిప్పలుఁ
బెల్లలునై జలధి పెద్దబీడై యుండెన్. 281

వ. ఇట్లు విపన్నుండగు సముద్రుండు నదులతోఁగూడి మూర్తిమంతుం
డయి చనుదెంచి రామచంద్రునిచరణంబులు శరణంబు జొచ్చి
యిట్లని స్తుతియించె. 282

శా. ఓ కాకుత్స్థకులేశ! యో గుణనిధీ! యో దీనమందార! నే
నీ కోపంబున కెంతవాఁడ [3]జడధిన్ నీవేమి భూరాజవే
లోకాధీశుఁడ వాదినాయకుఁడ వీలోకంబు లెల్లప్పుడున్
నీకుక్షిం బ్రభవించు నుండు నడఁగున్ నిక్కంబు సర్వాత్మకా!

---

1. ప్రారుద్ధ = లెస్సగా నరికట్టఁబడిన, అంబర = ఆకాశముయొక్క పార
మున్ = అవధిగలది. 2. ఆకసమంటగా ఎగసిపడఁగా. (గర్వింపగానన్నమాట)
3. జడధిన్ = జలధిని. శ్లేష-జడమైన, ధి = బుద్ధిగలవాఁడను. మందబుద్ధి నన్నమాట.

క. [1]ధాతలు రజమున, దేవ
వ్రాతము సత్త్వమున, భూతరాశి దమమునన్
[2]జాతులఁగా నొనరింతు గు
ణాతీతుఁడ వీవు గుణగణాలంకారా! 284

క. కట్టుము సేతువ లంకం
జుట్టుము నీబాణవహ్ని సురవైరితలల్
గొట్టుము నేలం బడఁ జే
పట్టుము నీయబల నధికభాగ్యప్రబలన్. 285

ఆ. హరికి మామ నగుదు నటమీఁద శ్రీదేవి
తండ్రి, నూర కేల [3]తాఁగడింప
[4]గట్టఁ గట్టి దాఁటు కమలాప్తకులనాథ
నీ యశోలతలకు నెలవు గాఁగ. 286

వ. అని విన్నవించిన రామచంద్రుండు సముద్రునిం బూర్వప్రకారంబున నుండు పొమ్మని వీడుకొల్పెను. అంత. 287

క. ఘనశైలంబులుఁ దరువులు
ఘనజవమునఁ బెఱికి తెచ్చి కపికులనాథుల్
ఘనజలరాశిం గట్టిరి
[5]ఘనవాహప్రముఖదివిజగణము నుతింపన్. 288

వ. ఇట్లు సముద్రంబు దాఁటి రామచంద్రుండు రావణుతమ్ముండైన విభీషణుండు శరణంబు వేఁడిన నభయం బిచ్చి కూడుకొని లంకకుం జని విడిసి వేడె పెట్టించి [6]లగ్గలు పట్టించిన. 289

సీ. ప్రాకారములు ద్రవ్వి పరిఖలు పూడిచి
కోటకొమ్మలు నేలఁ గూలఁ ద్రోచి
వప్రంబు లగలించి వాకిళ్లు వెకలించి
తలుపులు విఱిచి యంత్రములు సెఱిచి

---

1. బ్రహ్మలను 2. పుట్టినవారిగా 3. పీడించుట (తాఁకు + గడించు) 4. సేతువును 5. ఘనవాహ = ఇంద్రుఁడు (ఘనము = మేఘము) ప్రముఖ = మొదలుగాఁగల, దివిజ గణము = దేవతలు. 6. ప్రాకారములను దాఁటు నొకానొక పద్ధతి.

ఘనవిటంకంబులు ఖండించి పడవైచి
గోపురంబులు నేలఁ గూలఁదన్ని
మకరతోరణములు మహిఁ గూల్చి కేతనం
బులు సించి సోపానములు గదల్చి

ఆ. గృహము లెల్లవ్రచ్చి గృహరాజముల ద్రొచ్చి
భర్మకుంభచయము పాఱవైచి
కరులు కొలను సొచ్చి కలఁచిన కైవడిఁ
గవులు లంకఁ జొచ్చి కలఁచి రపుడు. 290

వ. అంతన య్యసురేంద్రుండు పంచినఁ గుంభనికుంభధూమ్రాక్ష విరూపాక్షసురాంతకనరాంతకదుర్ముఖప్రహస్తమహాకాయప్రముఖులగు దనుజవీరులు శరశరాసనతోమరగదాఖడ్గశూలభిందిపాలపరశు పట్టిసప్రాసముసలాదిసాధనంబులు ధరియించి మాతంగతురంగస్యందనసందోహంబుతో బవరంబుసేయ సుగ్రీవపవనతనయపనసగజగవయగంధమాదననీలాంగదకుముదజాంబవదాదు లారక్కసుల నొక్కటి కయ్యంబులందుఁ దరులగిరులఁ గదాఘాతంబుల నుక్కడించి త్రుంచిరంత. 291

క. ఆయెడ లక్ష్మణుఁ డుజ్జ్వల
సాయకములఁ ద్రుంచె శైల సమకాయు సురా
జేయు నగర్గళమాయో
పాయున్ నయగుణవిధేయు నయ్యతికాయున్. 29

ఆ. రామచంద్రవిభుఁడు రణమున ఖండించె
మేటికడిమి నీల మేఘవర్ణు
బాహుశక్తిపూర్ణుఁ బటుసింహనాదసం
కుచితదిగిభకర్ణుఁ గుంభకర్ణు. 2

క. అలవున లక్ష్మణుఁ డాజి
స్థలిఁ గూల్చెన్ మేఘనాదుఁ జటులాహ్లాదున్

[1]బలభేదిజయవినోదుఁ

[2]బలజనితసుపర్వసుభటభావవిషాదున్. 294

వ. అంత. 295

క. తనవారందఱు ద్రుంగిన
ననిమిషపతివైరి పుష్పకారూఢుండై
యనికి నడచి రామునితో
ఘనరౌద్రముతోడ [3]సంపరాయము సేసెన్. 296

వ. అయ్యవసరంబున. 297

క. సురపతిపంపున మాతలి
గురుతర మగు దివ్యరథముఁ గొని వచ్చిన నా
ధరణీవల్లభుఁ డెక్కెను
[4]ఖరకరుఁ డుదయాద్రి నెక్కు కైవడి దోఁపన్. 298

వ. ఇట్లు దివ్యరథారూఢుండయి రామచంద్రుండు రావణున కిట్లనియె.

మ. చపలత్వంబున డాఁగి హేమమృగమున్ సంప్రీతిఁ బుత్తెంచుటో
కపటబ్రాహ్మణమూర్తివై యబల నా కాంతారమధ్యంబునం
[5]దపలాపించుటయో మదీయశితదివ్యామోఘబాణాగ్నిసం
తపనం బేగతి నోర్చువాఁడవు దురంతం బెంతయున్ రావణా! 300

క. నీ చేసిన పాపములకు
నీచాత్మక యముఁడు వలదు నేఁ డిట నా నా
రాచముల ద్రుంచి వైచెద
ఖేచరభూచరులు గూడి క్రీడం జూడన్. 301

వ. అని పలికి. 202

మ. బలువింటన్ [6]గుణటంకృతంబు నిగుడన్ బ్రహ్మాండభీమంబుగా
బ్రళయోగ్రానలసన్నిభం బగు మహాబాణంబు సంధించి రా
జలలాముం డగు రాముఁ డేసె [7]ఖరభాషాశ్రావణున్ దేవతా
బలవిద్రావణు [8]వైరిదారజనగర్భస్రావణున్ రావణున్. 303

1. ఇంద్రుని గెలుచుటయను వినోదము గలవాఁడు. 2. బలముచే దేవభటుల మనసులకు విషాదము పుట్టించినవాఁడు. (ఇంద్రజిత్తు) 3. బాణయుద్ధము. 4. సూర్యుఁడు. 3. మాఱుగుపడి (కప్పిపుచ్చి) 4. ధనుష్టంకారములు. 5. కఠినమయిన మాటలను వినిపించువాఁడు 6. శత్రుభార్యల గర్భస్రావము సూర్చువాఁడు,

క. దశరథసూనుం డేసిన
విశిఖము హృదయంబుఁ దూఱ వివశుండగుచున్
దశకంధరుండు గూలెను
దశవదనంబులను రక్తధారలు దొరఁగన్. 304

వ. అంత నారాయణుండు దెగుట విని. 305

సీ. కొప్పులు బిగి వీడి కుసుమమాలికలతో
నంసభాగంబుల నావరింప
నేసమత్యంబులు సెదరఁ గర్ణికలూడఁ
గంఠహారంబులు గ్రిందుకొనఁగ
వదనపంకజములు వాడి వాతెఱ లెండఁ
గన్నీళ్ళ వఱద లంగములు దడుప
సన్నపు నడుములు జవ్వాడఁ బాలిండ్ల
బరువులు నటుములఁ బ్రిబ్బికొనఁగ

ఆ. నెత్తిమోఁదికొనుచు నెఱిఁ బయ్యెదలు జాఱ
నట్టు నిట్టుఁ దప్పటడుగు లిడుచు
నసురసతులు వచ్చి రట భూతభేతాళ
సదనమునకు ఘోరకదనమునకు. 306

వ. ఇట్లువచ్చి తమ తమ నాథులం గని శోకించిరి. అందు మందోదరి
రావణుం జూచి యిట్లని విలపించె. 307

ఉ. హా దనుజేంద్ర! హా సురగణాంతక! హా హృదయేశ! నిర్జరేం
ద్రాదుల గెల్చి నీవు కుసుమాస్త్రునికోలల కోర్వలేక సో
న్మాదముగన్ రఘుప్రవరుమానిని నేటికిఁ దెచ్చి తప్పుడేఁ
గాదని చెప్పినన్ వినక కాలవశంబునఁ బొంది తక్కటా! 308

ఆ. ఎండఁ గాయ వెఱచు నినుఁడు, వెన్నెలఁగాయ
వెఱచు విధుఁడు, గాలి వీవ వెఱచు
లంకలోన, నిట్టి లంకాపురికి మాకు
నధిప విధవభావ మడరె నేఁడు. 309

క. దురితముఁ దలఁపరు గానరు
జరుగుదు రెట్టకైన నిమిషసౌఖ్యంబులకై
పరవనితాసక్తులకును
బరధనరక్తులకు నిహముఁ బరముంగలదే. 310

వ. అని విలపింప నంత విభీషణుండు రామచంద్రుని పంపువడసి రావణునకు దహనాదిక్రియలు గావించె. అంత రాఘవేంద్రుండు నశోకవనంబున కేఁగి శింశుపాతరుసమీపంబునందు. 311

శా. దైతేయప్రమదాపరీత నతిభీతన్ [1]గ్రంథిబంధాలక
వ్రాతన్ [2]నిశ్వసనానిలాశ్రుకణజీవంజీవదారామభూ
జాతన్ [3]శుష్కకపోలకీలితకరాబ్జాతం [4]బ్రభూతం గృశీ
భూతం బ్రాణసమేత సీతఁ గనియెన్ భూమీశుఁ డా ముందటన్.

వ. కని రామచంద్రుండును దాపంబునొందిభార్యవలన దోషంబులేకుంట వహ్నిముఖంబునం బ్రకటంబు సేసి దేవతలపంపున దేవిం జేకొని.

ఉ. శోషితదానవుండు నృపసోముఁడు రాముఁడు [5]రాక్షసేంద్రతా
శేషవిభూతిఁ గల్పసమజీవివి గమ్మని నిల్పె నర్థి సం
తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వదరోషణున్ మితా
భాషణు నార్యపోషణుఁ గృపాగుణభూషణు నవ్విభీషణున్. 313

వ. ఇట్లు విభీషణసంస్థాపనుండై రామచంద్రుండు సీతాలక్ష్మణసమేతుండై సుగ్రీవహనుమదాదులం గూడికొని పుష్పకారూఢుండై వేల్పులు గురియు పువ్వులసోనలం దడియుచుఁ దొల్లి వచ్చిన తెరువుజాడలు సీతకు నెఱిఁగించుచు మరలి నందిగ్రామంబునకు వచ్చెను. అయ్యవసరంబున.

ఆ. రామచంద్రవిభుని రాక వీనుల విని
భరతుఁ డుత్సహించి పాదుకలను

---

1. ముడులు ముడులుగా పెనగొనిన ముంగురులు కలది. 2. నిట్టూర్పు గాడ్పులచేతను, కన్నీటి బొట్టులచేతను, బ్రతుకుచున్న, ఉద్యానవృక్షములు కలది. 3. పలుచబాఱిన చెక్కిలియందుఁ జేర్చఁబడిన హస్తపద్మముకలది. 4. ప్రఖ్యాతిగన్నది. 5. రాక్షస రాజత్వముయొక్క సమస్తమైన యైశ్వర్యమునందు. (రాక్షస రాజ్యైశ్వర్యమునం దన్నమాట)

మోచికొనుచు వచ్చి ముదముతోఁ బురజను
లెల్ల గొలువ నన్న కెదురువచ్చె. 316

వ. వచ్చి పాదుకల ముందట నిడికొని యెడనెడ సాష్టాంగదండప్రణా
మంబులు సేయుచు మెల్ల మెల్లన డాసి రామచంద్రుని పాదంబులు
దన నొసలం గదియించి తచ్చరణరేణువులు దుడిచి శిరంబునం
జల్లికొని తనివి సనక మఱియు నప్పదకమలంబు [1]లక్కున మోపి
కొనుచు సంతసంపుఁ గన్నీటం గడిగి సేమంబు లడయుచుండెను.
అంత సీతాలక్ష్మణసహితుండై విభుండును దన కెదురువచ్చిన
బ్రాహ్మణజనంబులకు నమస్కరించి తక్కినవారలచేత మన్ననలు
వొందివారల మన్నించెను. అయ్యవసరంబున. 317

చ. నృపవర! పెక్కునాళ్ళఁగొలె నిన్ గన కుంఠిన యట్టినేఁడు మా
తపములు పండె, నిండఱము ధన్యుల మైతి మటంచుఁ బట్టముల్
చపలతఁ ద్రిప్పి పువ్వుల వసంతము లాడుచుఁ బాడుచున్ గత
త్రపులయి యాడుచుం బ్రజలు దద్దయుఁ బండువు సేసి రెల్లెడన్.

సీ. కవగూడి యిరుదెసఁ గపిరాజు రాక్షస
రాజు నొక్కటఁ జామరములు వీవ
హనుమంతుఁ డతి ధవళాతపత్త్రముఁ బట్టఁ
బాదుకల్ భరతుండు భక్తిఁ దేర
శత్రుఘ్నుఁ డమ్ములుఁ జాపంబుఁ గొని రాఁగ
సౌమిత్రి భృత్యుఁడై చనువు సూప
జలపాత్ర చేఁబట్టి జనకజగూడి రాఁ
గాంచనఖడ్గ మంగదుఁడు మోవఁ

ఆ. [2]బసిఁడి కేడె మర్థి భల్లూకపతి మోచి
కొలువఁ బుష్పకంబు వెలయ నెక్కి
గ్రహములెల్లఁ గొలువఁ గడు నొప్పు సంపూర్ణ
చంద్రుపగిది రామచంద్రుఁ డొప్పె. 319

1. రొమ్మునన్ (అక్కు.) 2. బంగారు కత్తి.

వ. ఇట్లు పుష్పకారూఢుండై కపిబలంబులు సేరి కొలువ శ్రీరాముం డయోధ్యకుం జనియె నంతకు మున్న యప్పురంబునందు. 320

సీ. వీథులు సక్కఁగావించి తోయంబులు
సల్లి [1]రంభాస్తంభచయము నిలిపి
పట్టుఁజీరెలు సుట్టి బహుతోరణంబులుఁ
గలువడంబులు మేలు కట్లుఁ గట్టి
వేదిక లలికించి వివిధరత్నంబుల
మ్రుగ్గులు పలుచందములుగఁ బెట్టి
కలయ గోడల రామకథ లెల్ల వ్రాయించి
ప్రాసాదముల దేవభవనములను

తే. గోపురంబుల బంగారు కుండ లెత్తి
యెల్ల వాకిండ్ల గానిక లేర్పరించి
జనులు గైసేసి తూర్యఘోషములతోడ
నెదురునడతెంచి రా రాఘువేంద్రుకడకు. 321

క. సమదగజదానధారల
దుమదుమలైయున్న పెద్ద త్రోవలతోడన్
రమణీయమయ్యె నప్పురి
రమణుఁడు వచ్చినఁ గరంగు రమణియ పోలెన్. 322

ఆ. రామచంద్రవిభుని రాకఁ దూర్యములతో
రథగజాశ్వసుభటరాజితోడ
నమరెఁ బురము చంద్రుఁ డరుదేర ఘూర్ణిల్లు
జంతుభంగమిలితజలధిభంగి. 323

వ. ఇట్లొప్పుచున్న యప్పురంబు ప్రవేశించి రాజమార్గంబున రామచంద్రుం డరుగుచున్న సమయంబున. 324

మ. ఇతఁడే రామనరేంద్రుఁ డీయబలకా యింద్రారి ఖండించె, న
ల్లతఁడే లక్ష్మణుఁ, డాతఁడే [2]కపివరుం, డా పొంతవాఁడే మరు

1. అరఁటి స్తంభములు. 1. సుగ్రీవుఁడు.

తున్నతుఁ, డాచెంగట నా విభీషణుఁ డటంచుం జేతులం జూపుచుం
సతులెల్లం బరికించి చూచిరి పురీసౌధాగ్రభాగంబులన్. 325

వ. ఇట్లు సమస్తజనంబులు చూచుచుండ రామచంద్రుండు రాజ
మార్గంబునం జని చని. 326

సీ. పటికంపు గోడలు బవడంపు వాకిండ్లు
నీలంపు టరుఁగులు నెఱయఁ గలిగి
కమనీయ వైడూర్యక స్తంభచయముల
మకరతోరణముల మహిత మగుచుఁ
[1]బడగల పూఁణిక్యబద్ధ చేలంబులఁ
జిగురుఁ దోరణములఁ జెలువు మీఱి
పుష్పదామకముల భూరివాసనలను
బహుతరధూపదీపముల మెఱసి

తే. మాఱువేల్పులభంగిని మలయుచున్న
సతులుఁ బురుషులు నెప్పుడు సందడింప
గుఱుతు లిడరానిధనముల కుప్పలున్న
రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు. 327

వ. ఇట్లు వచ్చి. 228

ఉ. తల్లుల కెల్ల మ్రొక్కి తమ తల్లికి వందన మాచరించి య
ల్లల్ల బుధాళికిన్ వినతుఁడై చెలికాండ్రను దమ్ములం బ్రసం
ఫుల్లతఁ గౌఁగిలించుకొని భూవరుఁ డోలిఁ గృపారసంబు రం
జిల్లఁగఁ జాల మన్ననలు సేసె నమాత్యులఁ బూర్వభృత్యులన్.

వ. తత్సమయంబునఁ దల్లులు. 330

చ. కొడుకులుఁ బెద్దకోడలును గొబ్బున మ్రొక్కిన, నెత్తిచేతులం
బుడుకుచు మోములుం దలలు బోరన ముద్దులుగొంచు నవ్వుచుం
దొడలకు వారి శాఁ దిగిచి తోఁగఁగఁ జేసిరి నేత్రధారలన్
వెడలిన ప్రాణముల్ దగఁ బ్రవిష్టములయ్యెనటంచు నుబ్బుచున్.

వ. అంత వశిష్ఠుం డరుగుదెంచి శ్రీరామచంద్రుని జటాబంధంబువిడి

1. జెండాలు.

పించి కులవృద్ధులుం దానును సమంత్రకంబుగ దేవేంద్రుని మంగళ స్నానంబు సేయించు బృహస్పతి చందంబున సముద్రనదీజలంబుల నభిషేకంబు సేయించె. రఘువరుండును సీతాసమేతుండై జలకంబు లాడి మంచిపుట్టంబులు గట్టికొని కమ్మని పువ్వులు దుఱిమి సుగంధంబు లలందికొని తొడవులు దొడిగికొని తనకు భరతుఁడు సమర్పించిన రాజసింహాసనంబునం గూర్చుండి యతని మన్నించి కౌసల్యకుఁ బ్రియంబు సేయుచు జగత్పూజ్యంబుగ రాజ్యంబు సేయుచుండెను. అప్పుడు. 332

సీ. కలఁగు టెల్లను మానెఁ జలధు లేడింటికి,
జలనంబు మానె భూచక్రమునకు,
జాగరూకత మానె జలజలోచనునకు,
దీనభావము మానె దిక్పతులకు
మాసి యుండుట మానె మార్తాండవిధులకుఁ,
గావిరి మానె దిగ్గగనములకు
నుడికిపోవుట మానె నుర్వీరుహంబుల,
కడఁగుట మానెఁ [1]త్రేతాగ్నులకును

ఆ. గసిదిఁ ద్రేఁగుమానెఁ [2]గరిగిరికిటినాగ
కమఠములకుఁ బ్రజల కలఁక మానె
రామచంద్రవిభుఁడు రాజేంద్రరత్నంబు
ధరణిభరణరేఖఁ దాల్చునపుడు. 333

వ. మఱియును. 334

సీ. పౌలఁతులవాలుచూపులయంద చాంచల్య
మబలల నడుములయంద [3]లేమి
కాంతాలకములంద కౌటిల్యసంచార
మతివల నడుపులయంద జడిమ

---

[1] గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆవహనీయము. అనుమూఁడగ్నులు. [2] కరి=దిగ్గజములకు, గిరి=కులపర్వతములకు, కిటి=వరాహమూర్తికి, నాగ=శేషునకు, కమఠములకు=కూర్మమూర్తికి, భూమిని మోయుచున్న వీనికి బరువుతగ్గియుండెనని యర్థము. భూకంపములు లేకుండెనని భావము. [3] లేకపోవుట. దారిద్ర్యము.

ముగుదలపరిరంభములయంద పీడన
మంగనాకుచములయంద పోరు
పడఁతుల రతులంద బంధసద్భావంబు
సతులఁ బాయుటలంద సంజ్వరంబు
తే. ప్రియులు ప్రియరాండ్రమనముల బెరసి తార్పు
లందచౌర్యంబు వల్లభు లాత్మసతుల
నాఁగి క్రొమ్ముళ్ళు వట్టులం దక్రమంబు
రామచంద్రుఁడు పాలించు రాజ్యమందు. 225

క. తండ్రిక్రియ రామచంద్రుఁడు
తండ్రుల మఱపించి ప్రజలఁ దా రక్షింపం
దండ్రుల నందఱు మఱచిరి
తండ్రిగదా రామచంద్రధరణీపుఁ డనుచున్. 336

వ. మఱియు నా రామచంద్రుండు రాజర్షి చరితుండును నిజధర్మనిరతుం
డును నేకపత్నీవ్రతుండును సర్వలోకసమ్మతుండును నగుచు ధర్మ
విరోధంబు గాకుండఁ గోరిక లనుభవించుచుఁ ద్రేతాయుగంబైన
గృతయుగధర్మంబుఁ గావించుచు బాలమరణంబు మొదలగు నరి
ష్టంబులు ప్రజలకుఁ గలుగకుండ రాజ్యంబు సేయుచుండె నయ్యెడ.

ఆ. సిగ్గువడుట గల్గి సింగారమును గల్గి
భక్తి గల్గి చాల భయముఁ గలిగి
నయముఁ బ్రియముఁ గల్గి నరనాథు చిత్తంబు
సీత దనకు వశము సేసికొనియె. 338

౧౧ అధ్యాయము

వ. అనిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 339

ఆ. భ్రాతృజనులయందు బంధువులందును
ప్రజలయందు రాజభావ మొంది
యెట్లు మెలఁగె రాఘవేశ్వరుం డీశ్వరుఁ
గూర్చి క్రతువు లెట్లు గోరి చేసె. 340

వ. అనిన శుకుం డిట్లనియె. 341

సీ. భగవంతుఁ డగు రామభద్రుండు ప్రీతితో
దేవోత్తముని సర్వదేవమయునిఁ
దనుఁ దాన కూర్చి యధ్వరములు సేసెను
హోతకుఁ దూరుపు నుత్తరంబు
సామగాయకునికి [1]శమనదిగ్భాగంబు
బ్రహ్మకుఁ గ్రమమునఁ బడమ రెల్ల
నధ్వర్యునకు శేష మాచార్యునకు నిచ్చి
సొమ్ములఁ బంచి భూసురుల కొసఁగి

తే. తనకు రెండు పుట్టంబులు దనకు నయిన
మెలఁత [2]మంగళసూత్రంబు మినుకుఁ దక్క
వినతుఁడై యుండె నా రామువితరణంబు
పాండవోత్తమ! యేమని పలుకవచ్చు. 342

వ. అంత నా రామచంద్రుని దానశీలత్వంబునకు మెచ్చి విప్రవరులు
దమ తమ భూములు మరల నిచ్చి యిట్లనిరి. 343

ఆ. ధరణి వలదు మాకుఁ దపసుల కేల నీ
వఖిలలోకగురుఁడ వైన హరివి
మా మనంబులందు మలయు [3]చీఁకటిఁ బాపు
భవదుదారరుచులఁ బార్థివేంద్ర! 344

వ. అని పలికి బ్రహ్మణ్యదేవుండైన రామచంద్రుని వినయోక్తులం
బూజించి మునులు సనిరి. ఇట్లు పెద్దకాలంబు రాజ్యంబుసేసి రాఘ
వేంద్రుం డొక్కదినంబున. 345

సీ. వసుధపైఁ బుట్టెడు వార్త లాకర్ణించు
కొఱకునై రాముండు గూఢవృత్తి
నడురేయి దిరుగుచో నాగరజనులలో
నొక్కఁడు దనసతి నొప్పకున్న

1. దక్షిణదిశ, 2. మంగళసూత్రంబు మినుకు = తాళిబొట్టు. 1. అజ్ఞానమును.

నొరునింటఁ గాఁపురంబున్న చంచలురాలిఁ
బాయంగ లేక చేపట్టనేమి
తా వెఱ్ఱియగు రామధరణీశ్వరుండనే
జేల పొమ్మను మాట బిట్టు వలుక

ఆ. నాలకించి మఱియు నామాట చారుల
వలన జగములోనఁ గలుగఁ దెలిసి
సీత నిద్రవోనఁ జెప్పక వాల్మీకి
పర్ణశాలఁ బెట్టఁ బనిచె రాత్రి. 346

వ. అంత సీతయు గర్భిణి గావునఁ గుశలవులనియెడి కొడుకులం గనియె. వారికి వాల్మీకి జాతకర్మంబు లొనరించె. లక్ష్మణునకు నంగదుండును జంద్రకేతుండును భరతునకుఁ దక్షుండును బుష్కలుండును శత్రుఘ్నునకు సుబాహుండును శ్రుతసేనుండును సంభవించిరి. అయ్యెడ.

క. బంధురబలుఁ డగు భరతుఁడు 347
గంధర్వచయంబుఁ ద్రుంచి కనకాదుల స
ద్బంధుఁడగు నన్న కిచ్చెను
బంధువులును మాతృజనులుఁ బ్రజలున్ మెచ్చన్. 348

ఆ. మధువనంబులోన మధునందనుండగు
లవణుఁ జంపి భుజబలంబు మెఱసి
మధుపురంబు సేసె మధుభాషి శత్రుఘ్నుఁ
డన్న రామచంద్రుఁ డౌననంగ. 349

వ. అంతఁ గొంతకాలంబునకు రామచంద్రుని కొమారులయిన కుశలవులిద్దఱును వాల్మీకివలన వేదాదివిద్యలయందు నేర్పరులై పెక్కుసభల [1]సతానంబుగా రామకథా శ్లోకంబులు పాడుచు నొక్కనాఁడు రాఘవేంద్రుని యజ్ఞశాలకుం జని, 350

మత్తకోకిలము.

వట్టి మ్రాఁకులు పల్లవింప నవారియై మధుధార దా
నుట్టఁ బాడిన వారిపాటకు నుర్వరాధిపుఁడున్ బ్రజల్

1. తానముతోఁ గూడ. తానమనఁగా సంగీతమున స్వరముల ప్రస్తారవిశేషము.

బిట్టు సంతస మంది రయ్యెడఁ బ్రీతిఁ గన్నులబాష్పముల్
దొట్ట నొడల లూఁచి వారల తోడి మక్కువ వుట్టఁగాన్.

వ. అంత నారామచంద్రుండు కుమారుల కిట్లనియె. 352

ఆ. [1]చిన్నయన్నలార శీతాంశుముఖులార
నళినదళవిశాలనయనులార
మధురభాషులార మహిమీఁద నెవ్వరు
దల్లి దండ్రి మీకు ధన్యులార. 353

వ. అనిన, వారు "లేము వాల్మీకి పౌత్త్రులము రాఘవేశ్వరుని యాగంబు సూడవచ్చితి" మనవుడు మెల్లన నగి యెల్లిప్రొద్దున మీతండ్రి నెఱింగెద రుండుండని యొక్క నివాసంబునకు సత్కరించి పనిచె. మఱునాఁడు సీతం దోడ్కొని కుశలవుల ముందట నిడుకొని వాల్మీకి వచ్చి రఘుపుంగవునిం గని యనేకప్రకారంబుల వినుతించి యిట్లనియె. 354

ఆ. సీత [2]*సుద్దరాలు చిత్తవాక్కర్మంబు
లందుసత్యమూర్తి యమలచరిత
పుణ్యసాధ్వి విడువఁబోలదు చేకొను
రవికులాబ్ధిచంద్ర! రామచంద్ర! 355

వ. అని వాల్మీకి వలుక రామచంద్రుండు పుత్త్రార్థియై విచారింపఁ గుశలవులను వాల్మీకికి నొప్పగించి రామచంద్రచరణధ్యానంబు సేయుచు నిరాశయై సీత భూవివరంబు సొచ్చెను. అయ్యెడ. 356

మ. ముదితా! యేటికిఁ గ్రుంకి తీవు మనలో మోహంబు చింతింపవే
వదనాంభోజము సూపవే మృదువు నీ వాక్యంబు విన్పింపవే
తుది సేయం దగదంచు నీశ్వరుఁడు నై దుఃఖించె భూపాలుఁ డా
పదగాదే ప్రియురాలిఁ బాసిన తఱిన్ భావింప నెవ్వారికిన్.

వ. అని వగచి రామచంద్రుండు బ్రహ్మచర్యంబు ధరియించి పదుమూఁడువేల యేం డ్లెడ తెగకుండ నగ్నిహోత్రంబులు సెల్లించి తా నీశ్వరుండు గావునఁ దన మొదలి నెలవునకుం జనియెను. ఇవ్విధంబున.

1. చక్కని పిల్లలారా! 2. శుద్ధురాలు. * ముద్దరాలు. పా.

ఆ. ఆదిదేవుఁ డైన యా రామచంద్రుని
కబ్ధి గట్టు టెంత యసురకోటి
జంపు టెంత కపుల సాహాయ్య మది యెంత
సురలకొఱకుఁ గ్రీడ సూపెఁ గాక.

చ. వశుఁడుగ మ్రొక్కెదన్ లవణవార్ధివిజృంభణతోనివర్తికిన్
దశదిగధీశమౌళిమణిదర్పణమండితదివ్యకీర్తికిన్
దశశతభానుమూర్తికి సుధారుచిభాషికి సాధుపోషికిన్
దశరథరాజుపట్టికిని దైత్యపతిం బొరిగొన్న జెట్టికిన్. 360

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు [1]మహాశుగంబులున్
విల్లును దాల్చువాఁడు గడువిప్పగువక్షమువాఁడు మేలుపైఁ
జల్లెడువాఁడు నిక్కినభుజంబులవాఁడు యశంబు దిక్కులం
జల్లెడువాఁడు నైన రఘుసత్తముఁ డిచ్చుత మా కభీష్టముల్. 361

ఆ. రామచంద్రుఁ గూడి రాకలఁ బోకలఁ
గదిసి తిరుగువారుఁ గన్నవారు
నంటికొన్నవారు నా కోసల ప్రజ
లరిగి రాదియోగు లరుగు గతికి. 362

క. [2]మంతనములు సద్గతులకుఁ
[3]బొంతనములు ఘనము లైన పుణ్యముల [4]కిదా
నీంతనపూర్వమహాఘని
కృంతనములు రామనామకృతిచింతనముల్. 363

౧౨ అధ్యాయము

వ. ఆ రామచంద్రునకుఁ గుశుండును గుశునకు నతిథియు నతిథికి నిషధుండును నిషధునకు నభుండును నభునికిఁ బుండరీకుండును బుండరీకునకు క్షేమధన్వుండును క్షేమధన్వునకు దేవానీకుండును దేవానీకు

1. గొప్పబాణములు. 2. ఆలోచనలు. లేక ఉత్తమగతికి గొనిపోవు నేకాంతమార్గములు. 3. మైత్రిగూర్చునవి. (పొందించునవి) గ్రహమైత్రికి పొంతనమని పేరు. 4. ఇప్పటివి పూర్వపువి అయిన మహాపాపములను ఛేదించునవి,

నకు నహీనుండును నహీనునకుఁ బారియాత్రుండును బారియాత్రునకు బలుండును బలునకుఁ జలుండును జలునకు నర్కసంభవుం డగు వజ్రనాభుండును వజ్రనాభునకు శంఖణుండును శంఖణునకు విధృతియు విధృతికి హిరణ్యనాభుండును జనియించిరి. అతండు జైమిని శిష్యుండైన యాజ్ఞవల్క్యమునివలన నధ్యాత్మయోగంబు నేర్చి హృదయకలుషంబులం బాసి యోగచర్యుండయ్యె. ఆహిరణ్యనాభునకుఁ బుష్యుండును బుష్యునకు ధ్రువసంధియు ధ్రువసంధికి సుదర్శనుండును సుదర్శనునకు నగ్నివర్ణుండును నగ్నివర్ణునకు శీఘ్రుండును శీఘ్రునకు మరువను రాజశ్రేష్ఠుండును బుట్టిరి. ఆ రాజయోగి సిద్ధుండయి కలాపగ్రామంబున నున్నవాఁడు. కలియుగాంతంబున నష్టంబయ్యెడుసూర్యవంశంబుఁ గ్రమ్మఱఁ బుట్టింపంగలవాఁడు. మరువునకుఁ బ్రసుశ్రుకుండును నా ప్రసుశ్రుకునకు సంధియు నతనికి నమర్షణుండును నాయమర్షణునికి మహస్వంతుండును నా మహస్వంతునకు విశ్వసాహ్వుండును నా విశ్వసాహ్వునకు బృహద్బలుండును జనియించిరి. అబృహద్బలుఁడు భారతయుద్ధంబున విఖ్యాతుండ్రై యగు నభిమన్యునిచేత హతుండయ్యె వినుము.

భవిష్యద్రాజేతిహాసము.

తే. పరఁగ నిక్ష్వాకుఁడును బృహద్బలుఁడు మొదలుఁ
దుదయుఁ గాఁగల రాజులఁ దోడుతోడ
నెఱుఁగఁ జెప్పితి నీవారి నింకమీఁదఁ
బుట్టఁ గలవారిఁ జెప్పెద భూవరేంద్ర! 265

వ. ఆ బృహద్బలునకు బృహద్రణుండును బృహద్రణునకు నురుక్షతుండును నాతనికి వత్సప్రీతుండును వత్సప్రీతునకుఁ బ్రతివ్యోముండును బ్రతివ్యోమునకు భానుండును భానునకు సహదేవుండును సహదేవునకుఁ బృహదశ్వుండును బృహదశ్వునకు భానుమంతుండును భానుమంతునకుఁ బ్రతీకాశ్వుండును బ్రతీకాశ్వునకు సుప్రతీకుండును సుప్రతీకునకు మేరుదేవుండును మేరుదేవునకు సుతక్షత్త్రుండును సుతక్షత్త్రునకు ఋక్షకుండును ఋక్షకునకు నంతరిక్షుండును

నంతరిక్షునకు సుతపుండును సుతపునకు నమిత్రజిత్తును నతనికి బృహ
ద్భ్రాజియు నతనికి బర్హియు బర్హికి ధనంజయుండును ధనంజయునకు
రణంజయుండును నతనికి సృంజయుండును సృంజయునకు శాక్యుం
డును శాక్యునకు శుద్ధాదుండును శుద్ధాదునకు లాంగలుండును
లాంగలునకుఁ బ్రసేనజిత్తును నతనికి క్షుద్రకుండును క్షుద్రకునకు
ఋణకుండును ఋణకునకు సురథుండును సురథునకు సుమిత్రుం
డును బుట్టుదురు. సుమిత్రుని యనంతర కాలంబున సూర్యవంశంబు
నశింపఁగలదు. వీరలు బృహద్బలునినుండి క్రమంబునం బుట్టంగల
వార లని చెప్పి శుకుండిట్లనియె. 366

౧౩ అధ్యాయము

సీ. ధన్యుఁడాయిక్ష్వాకు తనయుఁ డౌ నిమి యాగ
మాచరింపఁగ గోరి యావశిష్ఠు
[1]నార్త్విజ్యమునకుఁ దా నర్థింపఁ గని యాతఁ
డింద్రునిమఖము సేయింప నియ్య
కొనినాఁడ మఱి వత్తుఁ గొదవ లేదన వచ్చి
సంసార మెంతయుఁ జంచలంబు
కాలయాపన మేల క్రతువు సేసెద నని
యన్యఋత్విక్కుల నతఁడు గూర్చి

తే. సేయ నింద్రుని యాగంబు సెల్లఁజేసి
గురుఁడు సనుదెంచి శిష్యుపైఁ గోపమెత్తి
యోరి నావచ్చునందాఁక నుండవనుచు
నతని దేహంబు వడుఁగాత మనిశపించె. 367

వ. ఇట్లు వశిష్ఠుండు శపించిన నిమియును వశిష్ఠుని దేహంబు వడుఁగాక
యని మరల శపియింప నవ్వశిష్ఠుండు మిత్రావరుణులవలనఁ గడపట
నూర్వశికి జన్మించె. గురుశాపంబున బ్రహ్మజ్ఞానియైన నిమి విగత
దేహుండైన నతని దేహంబు మునీశ్వరులు గంధవస్తువులం బొదివి
దాఁచి దొరకొన్న సత్త్రయాగంబు సెల్లించిరి. కడపట దేవగణం

1 ఋత్విక్కుయొక్క పని.

బులు మెచ్చి వచ్చినవారలకు నిమిదేహంబు సూపి బ్రదుకంజేయుం
డనవుడు వారలు నిమిప్రాణంబు వచ్చుంగాక యని పలికిన నిమి
తనదేహంబు సొర నొల్లక యిట్లనియె. 368

మ. అతిమోహాకులితంబు సాంద్రమమతాహంకారమూలంబు సం
తతనానాసుఖదుఃఖపీడిత మనిత్యం బిట్టి దేహంబు సం
కృతి నా కేటికి [1]మీనజీవనము భంగిన్ భీతిబాహుళ్య మం
చితరుల్ పెద్దలు దీనిఁ జేకొనరు సర్వేశున్ హరిం గొల్చుచున్.

వ. అని పలికిన నిమిమాటలు క్రిమ్మఱింపనేరక శరీరులు గన్నులు దెఱచి
నప్పుడును మూసినప్పుడును నిమి గాన వచ్చుంగాక యని పల్కి
దేవతలు చనిరి. అంత. 370

ఆ. పెద్దలైన మునులు పృథివీస్థలికి రాజు
లేమిఁ జూచి నిమికళేబరంబు
దరువ నొకఁడు పుట్టెఁ దనయుండు వానిని
జనకుఁ డనుచుఁ బలికె జగములెల్ల. 371

వ. మఱియు నతండు విదేహజుండు గావున వైదేహుండనియు మథన
జాతుఁడు గావున మిథిలుండనియు ననంబరఁగెను. అమ్మిథిలునిచేత
నిర్మితంబయినది మిథిలానగరంబునాఁబరఁగె. ఆ జనకునకు నుదావ
సుండును నుదావసునకు నందివర్ధనుండును నందివర్ధనునకు సుకేతుం
డును సుకేతునకు దేవరాతుండును దేవరాతునకు బృహద్రథుండును
బుట్టిరి. అతనికి మహావీర్యుండును నతనికి సుధృతియు నతనికి ధృష్ట
కేతుండును నతనికి హర్యశ్వుండును నతనికి మరువును నతనికిఁ
బ్రతీంధకుండును నతనికిఁ గృతరథుండును నతనికి దేవమీఢుఁడును
నతనికి విధృతుండును నతనికి మహాధృతియు నతనికిఁ గీర్తిరాతుం
డును నతనికి మహారోముండును నతనికి స్వర్ణరోముండును నతనికి
హ్రస్వరోముండును నతనికి సీరధ్వజుండును బుట్టిరి. 372

ఆ. అతఁడు మఖముసేయ నవని దున్నింపంగ
లాగలంబుకొనను లక్షణాంగి

---

1. చెరు బ్రదుకు,

యట్టిపుణ్యమతుల నైళాదిరాజుల
నింకవినుము మానవేంద్రచంద్ర! 375

సీ. ఒక వేయితలలతో నుండుజగన్నాథు
బొడ్డుదమ్మిని బ్రహ్మ పుట్టె మొదల
నతనికి గుణముల నతనిఁ బోలినదక్షుఁ
డగు నత్రి సంజాతుఁ డయ్యె నత్రి
కడగంటిచూపునఁ గలువలసంగడీఁ
డుదయించి విప్రుల కోషధులకు
నమరఁ దారాతతి కజునిపంపున నాథుఁ
డై యుండి రాజసూయంబు చేసి
తే. మూఁడులోకములను గెల్చి[1] మోహితమున
జని బృహస్పతి పెండ్లాముఁ జారుమూర్తిఁ
దార నిలు సొచ్చికొనిపోయి తన్ను గురుఁడు
వేఁడినందాఁక నియ్యండు వినఁ డయ్యె. 376

వ. అంత వేల్పులతో రక్కసులకుఁ గయ్యం బయ్యె. బృహస్పతితోడి వైరంబునం జేసి రాక్షసులుం దానును శుక్రుండు చంద్రునిం జేపట్టె సురాచార్యునిం బోదోలిన హరుండు భూతగణసమేతుండై తనగురుపుత్రుండైన బృహస్పతిం జేపట్టె. దేవేంద్రుండు సురగణంబులుం దానును బృహస్పతికి నడ్డంబువచ్చెను. అయ్యవసరంబున బృహస్పతిభార్యానిమిత్తంబున రణంబున సురాసురవినాశకరంబయ్యెను. ఆలోన బృహస్పతిసంక్రియను నంగిరసుండు సెప్పిన విని బ్రహ్మదేవుండు వచ్చి చంద్రుని గోపించి గర్భిణి యైన తారను మరల నిప్పించినం జూచి బృహస్పతి దాని కిట్లనియె. 378

ఉ. సిగ్గొకయింత లేక వెలచేడియ కైవడి ధర్మకీర్తులన్
బొగ్గులు సేసి జారు శశిఁ బొందితి కటా! కడుపేల దెచ్చుకొం
టెగ్గు దలంపఁగా వలదె యిప్పుడు గర్భము దించుకొమ్ము నిన్
భ్రుగ్గఁగఁ జేసెదం జెనటి! మానవతుల్ నినుఁ జూచి మెత్తురే.

---

1. మూర్ఖతచే.

సీత జాత యయ్యె సీరధ్వజుండనఁ
దానఁ జెప్పఁబడియె ధన్యుఁడతఁడు. 373

**వ.** ఆ సీరధ్వజునకుఁ గుశధ్వజుండును గుశధ్వజునకు ధర్మధ్వజుండును ధర్మధ్వజునకుఁ గృతధ్వజ మితధ్వజు లనువా రిద్దఱుఁ బుట్టిరి. అందుఁ గృతధ్వజునకుఁ గేశిధ్వజుం డుదయించెను. అతండు తన్నుఁ దానెఱింగెడి విద్యయందు నేర్పరియయ్యె. మితధ్వజునకు ఖాండిక్యుండను వాఁడు జన్మించి తండ్రివలన నెఱుకగలవాఁడై కర్మతంత్రంబునేర్చి కేశిధ్వజునివలన భీతుఁడై యేఁగె. ఖాండిక్యునకు భానుమంతుండును భానుమంతునకు శతద్యుమ్నుండును శతద్యుమ్నునికి శుచియు శుచికి సనద్వాజుండు సనద్వాజునకు నూర్ధ్వకేతుండును నూర్ధ్వకేతునకు నజుండును నజునకుఁ గురుజిత్తును గురుజిత్తునకు నరిష్టనేమి నరిష్టనేమికి శ్రుతాయువును శ్రుతాయువునకుఁ బార్శ్వకుండును బార్శ్వకునకుఁ జిత్రరథుండును జిత్రరథునకు క్షేమాపియు క్షేమాపికి హేమరథుండును హేమరథునకు సత్యరథుండును సత్యరథునకు నుపగురుండును నుపగురునకు నగ్నిదేవుప్రసాదంబున నుపగుర్వుండును నుపగుర్వునకు సావనుండును సావనునకు సువర్చనుండును గల్గి రతండె సుభూషణుండని వినంబడు నా సుభూషణునకు జయుండును జయునకు విజయుండును విజయునకు ధృతుండును ధృతునకు ననఘుండును ననఘునకు వీతిహవ్యుండును వీతిహవ్యునకు ధృతియు ధృతికి బహుళాశ్వుండును బహుళాశ్వునకుఁ గృతియుఁ గృతికి మహావశియును జన్మించిరి. వీరలు మైథిలులగు రాజులని చెప్పంబడుదురు. యోగీశ్వరప్రసాదంబున గృహస్థులైయుండియు బంధనిర్ముక్తులై యాత్మజ్ఞానంబు గలిగి నిరంతరబ్రహ్మానుసంధానంబు సేయుచు నుండుదురు. అని పలికి శుకయోగీంద్రుం డిట్లనియె.

౧౪ అధ్యాయము

చంద్రవంశ్యులగు రాజుల యితిహాసము

**ఆ.** చంద్రగౌరమైన చంద్రవంశమునందుఁ
జంద్రకీర్తితోడ జనితమైన

యట్టిపుణ్యమతుల నైళాదిరాజుల
నింకవినుము మానవేంద్రచంద్ర! 375

సీ. ఒక వేయితలలతో నుండుజగన్నాథు
బొడ్డుఁదమ్మిని బ్రహ్మ పుట్టె మొదల
నతనికి గుణముల నతనిఁ బోలినదక్షుఁ
డగు నత్రి సంజాతుఁ డయ్యె నత్రి
కడగంటిచూపునఁ గలువలసంగడీఁ
డుదయించి విప్రుల కోషధులకు
నమరఁ దారాతతి కఱనిపంపున నాథుఁ
డై యుండి రాజసూయంబు చేసి
తే. మూఁడులోకములను గెల్చి[1] మోహకమున
జని బృహస్పతి పెండ్లాముఁ జారుమూర్తిఁ
దార నిలు సొచ్చికొనిపోయి తన్ను గురుఁడు
వేడునందాఁక నయ్యింతి విడువఁ డయ్యె. 376

వ. అంత వేల్పులతో రక్కసులకుఁ గయ్యం బయ్యె. బృహస్పతితోడి
వైరంబునం జేసి రాక్షసులుం దానును శుక్రుండు చంద్రునిం జేపట్టె
సురాచార్యునిం బొందొలిన హరుండు భూతగణసమేతుండై తనగురు
పుత్రుండైన బృహస్పతిం జేపట్టె. దేవేంద్రుండు సురగణంబులుం
దానును బృహస్పతికి నడ్డంబువచ్చెను. అయ్యవసరంబున బృహస్పతి
భార్యానిమిత్తంబున రణంబున సురాసురవినాశకరంబయ్యెను. అంత
న బృహస్పతితండ్రియగు నంగిరసుండు చెప్పిన విని బ్రహ్మదేవుండు
వచ్చి చంద్రుని గోపించి గర్భిణి యైన తారను మరల నిప్పించినం
జూచి బృహస్పతి దాని కిట్లనియె. 378

ఉ. సిగ్గొకయింత లేక వెలచేడియకైవడి ధర్మకీర్తులన్
బొగ్గులు సేసి జారు శశిఁ బొందితి కటా! కడుపేల దెచ్చుకొం
టెగ్గు దలంపఁగా వలదె యిప్పుడు గర్భము దించుకొమ్ము నిన్
మ్రగ్గఁగఁ జేసెదం జెనఁటి! మానవతుల్ నినుఁ జూచి మెత్తురే.

1. మూర్ఖత చె.

వ. అని కోపించుచుండ నాచెలువకుఁ బసిండిచాయ మేనుగల కుఱ్ఱండు
పుట్టె. వానిం జూచి మోహంబు సేసి బృహస్పతి దనకొడు కనియు
నుం జంద్రుండు దనకన్నవాఁ డనియునుం జగడించిరి. అప్పుడు. 379

ఆ. వారివాదు సూచి వారింపఁగా వచ్చి
యేర్పరింప లేక యెల్లమునులు
నమరవరుల నడుగ నా [2]వేడుకలకత్తె
యెఱుఁగఁగాని యితరు లెఱుఁగ రనిరి 380

వ. ఆ పలుకులు విని సిగ్గుపడియున్న తారం జూచి చిన్ని కొమరుం
డిట్లనియె. 381

క. ఇలువరుస చెడఁగ బంధులు
దల వంపఁగ మగఁడు రోయఁ దల్లీ! కట్టా!
వెలి నేల నన్నుఁగంటివి
కలిగించినవాఁడు శీతకరుఁడో! గురుఁడో! 382

వ. అని పలుకుచున్న కొడుకునకు మఱుమాట లాడనేరక యూరక
యున్న తార నేకాంతంబునకుం జీరి మంతనంబున బ్రహ్మ
యిట్లనియె. 383

మ. చెలువా! నీయొలసిగ్గు వాపి గురుఁడో శీతాంశుఁడో యెవ్వఁడీ
లలితాకారుఁ గుమారుఁ గన్నయతఁ డేలా దాఁప నీపాటు నీ
తలనేపుట్టెన! వెచ్చనూర్పకుము కాంతల్ గాముకల్ గారె; మా
టల నిందేమియుఁ బోదు పో యొరులతోడం జెప్ప విన్పింపవే.

వ. అని పలికిన బ్రహ్మకు నెదురుమాటాడ వెఱచి మంతనంబున
నయ్యింతి చంద్రునికిం గన్నదాన ననవుడు నాబాలకునకు బుధుం
డనిపేరు వెట్టి చంద్రున కిచ్చి బ్రహ్మ సనియెను. అంత. 385

ఆ. బుద్ధిమంతుఁ డగున బుధుఁడు పుత్త్రుండైన
మేను వెంచి [3]రాజు మిన్ను ముట్టె
బుద్ధిగల సుతుండు పుట్టినచోఁ దండ్రి
మిన్ను ముట్టకేల మిన్నకుండు. 386

1. చెనఁటి = ఓసి దుర్మార్గురాలా! 2. విలాసవతి. 3. చంద్రుఁడు.

వ. ఆ బుధునకుం దొల్లి చెప్పిన యిళాకన్యకవలనఁ బురూరవుండు పుట్టెను.
అప్పురూరవునకుంగల శౌర్యసౌందర్యగాంభీర్యాదిగుణంబులు నారదునివలన నింద్రసభలోన నూర్వశివిని మిత్రావరుణశాపంబున మనుష్యస్త్రీరూపంబుదాల్చి భూలోకంబునకు వచ్చి యప్పురూరవు ముందట నిలువంబడె. 387

తరలము

సరసిజాక్షు మృగేంద్రమధ్యు విశాలవక్షు మహాభుజున్
సురుచిరాననచంద్రమండలశోభితున్ సుకుమారు నా
పురుషవర్యుఁ బురూరవుం గని [1]పుష్పబాణపటుయోధుచేఁ
దొరఁగు [2]క్రొవ్విరితూపులన్ మది దూలిపోవఁగ భ్రాంతయై. 388

వ. ఊర్వశి నిలిచియున్నంత. 389

ఉ. భావజుదీమమో మొగులు బాసి వెలుంగు మెఱుంగో మోహినీ
దేవతయో [3]నభోరమయో దీని కరగ్రహణంబు లేనిచో
జీవన మేటికంచు మరుచేఁ జిగురాకడిదమ్ము జిమ్ములం
దా వడఁకెన్ బురూరవుఁడు దామరపాకుజలంబు కైవడిన్. 390

వ. ఇట్లు రాచపట్టి చెలువు సవింటివాని బారికి నోడి యెట్టకేలకు సైరణ చేసి నిలుకడఁ దప్పకొని యచ్చెలువ కిట్లనియె. 391

ఉ. ఎక్కడనుండి రాక, మఱి కిష్టజనుం దగు, నీకు దక్కి లే
మ్రుక్కఁడి వచ్చెనే యలరుముల్కులవాఁ డడిదంబుఁ ద్రిప్పుచే
దిక్కునెఱుంగ జూచు నను దేహము దేహము గేలుఁ గేల నీ
చెక్కునఁ జెక్కు మోపి తగు చెయ్వుల నన్ను విసన్నుఁ గావవే. 392

వ. అనినం [4]బ్రౌఢ చేసియ యిట్లనియె. 393

మ. ఇవె నాకూర్చు [5]తగళ్లు రెండు దగ నీ వెల్లప్పుడుం గాచెదే
నివి వస్త్రింపవు గాక నాకడఁ దగన్ నీవుండు దేనిన్, విశే
షవిలాసాధిక! నీకు నాఘృతము భక్ష్యం బయ్యె నేనిన్ మనో
జవినోదంబుల నిన్నుఁ దేల్తు నగునే చంద్రాన్వయగ్రామణీ! 394

---

1 పూలుబాణములుగాఁగలయోధుఁడు. (మన్మథుఁడు) 2 క్రొత్త + విరితూపులు = క్రొత్తపూలబాణములు. 3 ఆకాశలక్ష్మి 4 ప్రౌఢ 5 మేకలు.

వ. అని పలికిన వేల్పులవెలయాలి [1]ప్రతినమాటలు కియ్యకొని తన మనంబున. 395

క. మంచిదఁట, రూపుసంతతి
నంచితయా దేవగణిక యఁట, మరుచేతన్
సంచలితచిత్తయై కా
మించిన దఁట, యింతకంటె మేలుం గలదే. 396

వ. అని నిశ్చయించుకొని. 397

ఆ. రాజు రాజముఖిని రతిఁ దేల్చె బంగారు
మేడలందుఁ దరుల నీడలందుఁ
దోఁటలందు రత్నకూటంబులందును
గొలఁకులందు గిరుల కెలఁకులందు. 398

వ. అంత నయ్యిద్దఱకుం దగులంబు నెలకొని. 399

క. ఒకదిక్కు కాని చనఁ బో
రొకచోటన కాని నిలిచియుండరు దమలో
నొకటియ కాని తలంపరు
నొకనిమిషముఁ బాయలేరు నువిదయు ఱేఁడున్. 409

క. దయ్యా మెఱుంగన్ వారల
నెయ్యంబులు మక్కువలును నిజమరితనముల్
వియ్యములును [2]నెడసందిని
బయ్యెదకొం గడ్డమైనఁ బ్రాణము వెసలున్. 401

వ. ఇట్లూర్వశియుం బురూరవుండును నొండొరువులవలన మక్కువలు చిక్కులొత్త బగళ్ళు రేలు నెల్లెడల విహరింప, నొక్కనాఁడు దేవలోకంబున దేవేంద్రుండు గొలువుండుతఱిఁ గొలువున నూర్వశి లేకుండుటం జూచి. 402

క. ఇన్నిదినంబులకును మన
మున్న సభామధ్యవేది యూర్వశి లేమిన్
విన్నఁదనంబున నున్నది
వన్నె దఱిఁగియున్న బసిఁడివడువున ననుచున్.

---

1. శపథవాక్యములు. 2. ఇరువురసందున.

వ. ఇంద్రుండు గంధర్వులం బనిచిన వారు నడురేయింజని చీఁకటి నూర్వశి పెంచుచున్న [1]యేడకంబులం బట్టిన నవి రెండును మొఱ వెట్టిన వాని మొఱవిని రతిఖిన్నుండై మేను మఱచి కూరుచున్న పురూరవు కౌఁగిట నుండి యూర్వశి యిట్లనియె. 404

మ. అదె నాబిడ్డలఁ బట్టి దొంగలు మహాహంకారులై కొంచు ను
న్మదులై పోయెద; రడ్డపాటునకు సామర్థ్యంబునన్ హీనుఁడై
కదలం డీమగపంద కూరుకుగతిం గన్మూసి గుర్వెట్టుచున్,
వదలం జాలఁడు నాదుకౌఁగిలియు దా వంధ్యాత్ముఁడై చెల్లరే.

క. పగతురు దొంగల రేపఁగ
మగఁటిమి వాటింప లేక మగతన మెల్లన్
మగువల కౌఁగిట జూపెడు
మగవాఁడగుకంటె మగఁడు మగు వగు టొప్పున్. 406

ఆ. అధముఁడైనవాని కాలగుకంటె న
త్యధికునింట దాసి యగుటమేలు
హీనుఁబొంది యోని హింసింపఁగా నేల
యువతిజనుల కూరకుంట లెస్స. 407

క. ఏటికి నీరాచఱికం
బాఁటది మొఱవెట్టఁ బసువు లాతురపడ [2]నో
నాఁటదని లేచి దొంగల
[3]గీఁటవు వెడలంగ శవము క్రియ నుండె దిదే. 408

క. వినియు వినవు రణభీరువు
మనుజాధను నిదురపోతు మందుని నకటా
నినుఁ జక్రవర్తిఁ జేసిన
వనజాసనుకంటె వెఱ్ఱివాఁడును గలఁడే. 409

వ. అని పెక్కుభంగుల నయ్యింతి [4]పరుసని పలుకులను [5]కఱకువాల ములు చెవులఁ జొనుప నారాజశేఖరుం డంకుశంబుపోట్ల నడరు మదగజంబు చందంబునఁ జీరమఱచి దిగంబరుండై లేచి వాలు కేల

1 మేకలు. 2 నొచ్చునట్లు నాటలేదని. 3 చెదరఁగొట్టవు. 4 పరుషవచనములను, 5. పదునైన నూటిబాణములు.

నంకించి యానడురేయి దొంగల నఱకివైచి మేషంబుల విడిపించుకొని తిరిగివచ్చునెడ. 410

ఆ. చీరలేని మగని జెలువారఁ దా నీక్షించి
కన్ను [1]మొఱఁగిపోయెఁ గడఁక నతఁడు
వెఱ్ఱివానిభంగి వివశుఁడై పడిలేచి
పొరలి తెరలి స్రుక్కి సొక్కి పడియె. 411

వ. మఱియుఁ బురూరవుండు మదనాతురుండై వెదకుచు సరస్వతీనదీ తీరంబునం జెలికత్తెలతోఁ గూడియున్న యూర్వశిం గని వికసిత ముఖకమలుండై యిట్లనియె. 412

మ. తనుమధ్యా! యిదియేలవచ్చితకటా! ధర్మంబె శర్మంబె ముక్త
మనలో [2]నుంకుగ నాడికొన్న పలుకుల్ మర్యాదలుం దప్పెనే
నిను నేఁబాసినయంతనుండి తనువు న్నేలం బడంబాఱెనక్
దిను నుగ్రంపుమృగాళి దీనిఁ గరుణాదృష్టిన్ విలోకింపవే. 413

వ. అనిన నూర్వశి యిట్లనియె. 414

క. మగువలకు నింత లోఁగెదు
మగవాఁడవె నీవు పశువు మాడ్కిన్ వగవం
దగవే మానుషపశువును
మృగములుఁ గని రోయుఁగాక మేలని తినునే. 415

వ. అదియునుం గాక. 416

మ. తలఁపుల్ [3]చిచ్చులు మాటలుజ్జ్వలసుధాధారల్ విభుండైన పు
వ్విలితున్ మెచ్చర యన్యులన్ దలఁతురే విశ్వాసమున్ లేదు క్రూ
రలు తోడుం బతినైనఁ జంపుదు రధర్మల్ నిర్దయల్ చంచలల్
వెలయాండ్రెక్కడ వారి[4]వేడబము లా వేదాంతసూక్తంబులే. 417

ఉ. ఇంకొకయేఁడు వోయిన నరేశ్వర! యాతలిరేయి నీవు నా
లంకెకు వచ్చి యాత్మజుల లక్షణవంతులఁ గాంచెదేమియుం
గొంకక పొమ్మనీవనుడుఁ గొమ్మను గర్భిణిఁగాఁదలంచుచున్
శంక యొకింతలేక నృపసత్తముఁ డల్లన పోయె వీటికిన్. 418

వ. ఇట్లు మఱలి చని తనపురంబున నొక్కయేఁ డుండి పిదప నూర్వశి

1 అంతర్ధానమునొందెను, 2 సమ్మతిగా, 3 అగ్నులు, 4 కపటములు, నాటకములు.

కడ కేఁగి యొక్క రేయి పురూరవుం డయ్యింతికడ నున్న నా వెలందియు "గంధర్వవరుల వేఁడికొనుము నన్నిచ్చెదరు." అనవుడు నతండు గంధర్వవరులం బ్రార్థించిన వార లతండు వొగడుటకు మెచ్చి యగ్నిస్థాలి నిచ్చి నయ్యగ్నిస్థాలి నూర్వశిఁగాఁ దలంచుచు దానితో నడవిం దిరుగుచుండి యొక్కనాఁ డది యూర్వశిగా దగ్నిస్థాలియని యెఱింగి వనంబున దిగవిడిచి యింటికిఁ జనుదెంచి నిత్యంబు రాత్రి దానిని చింతించుచుండఁ ద్రేతాయుగంబు సొచ్చిన నారాజు చిత్తంబునఁ గర్మబోధంబులయి వేదంబులు మూఁడు మార్గంబులం దోఁచిన నాభూవరుండు స్థాలికడకుంజని యందు శమీగర్భజాతంబైన యశ్వత్థంబుఁజూచి యా యశ్వత్థంబుచేత నరణులు రెండుగావించి ముందటియరణి దానును వెనుకటియరణి యూర్వశియును రెంటినడుమ నున్నకాష్ఠంబు పుత్త్రుండు నని మంత్రంబు సెప్పుచుం ద్రచ్చుచుండ జాతవేదుండను నగ్ని సంభవించి విహితారాధనసంస్కారంబునం జేసి యాహవనీయాదిరూపియై నెగడి పురూరవునిపుత్త్రుండని కల్పింపంబడియె. ఆ యగ్ని పురూరవునిఁ బుణ్యలోకంబునకుఁ బనుపం గారణం బడుగుటం జేసి.

క. ఆ యగ్నిచేఁ బురూరవుఁ
డా యజ్ఞేశ్వరు ననంతు హరి వేదమయుం
శ్రీయుతుఁ గూర్చి యజించె గు
ణాయుతుఁ డూర్వశిఁ గనంగ నరిగెడు కోఱ్కై. 420

ఉ. ఒక్కఁడ వహ్ని, వేల్పు పురుషోత్తముఁ డొక్కఁడ, సర్వవాఙ్మయం
బొక్కఁడ వేద మా ప్రణవ మొక్కఁడ వర్ణము దొల్లి త్రేతయం
దెక్కటి మాన్చి మూఁడుగను నేర్పఱిచెం దనబుద్ధి పెంపుచేఁ
జక్కఁగ నా పురూరవుఁ డశక్యులకుం సులభంబు లౌగతిన్. 421

౧౫ అధ్యాయము

వ. ఇట్లు వేదవిభాగంబు గల్పించి యాగంబు సేసి పురూరవుం డూర్వశియున్న గంధర్వలోకంబునకుం జనియెను. అతనికి నూర్వశి గర్భంబున నాయువు శ్రుతాయువు సత్యాయువు రయుండు

జయుండు విజయుండన నార్గురుపుత్త్రులుగలిగిరి. అందు శ్రుతాయువు నకు వసుమంతుండును సత్యాయువునకు శ్రుతంజయుండును రయు నకు శ్రుతుండు నేకుండన నిరువురును జయునకు నమితుండును విజయునకు భీముండును జనించిరి. ఆ భీమునకుఁ గాంచనుండు కాంచనునకు హోత్రకుండు హోత్రకునకు గంగాప్రవాహంబు పుక్కిటం బెట్టిన జహ్నుండు జహ్నునకుఁ బూరుండు పూరునకు బాలకుండు బాలకునకు నజకుం డజకునకుఁ గుశుండు కుశునకుఁ గుశాంబుండు ధూర్తయుండు వసువు కుశనాభుండన నలువురును సంభవించిరి. అందుఁ గుశాంబునకు గాధి యనువాఁడు గలిగె నా గాధి రాజ్యంబు సేయుచుండ. 422

సీ. సత్యవతిని గాధిజాతను గన్యను
విప్రుఁడు ఋచికుండు వేఁడికొనిన
గాధియు సుత కీడు గాఁడని తెల్లని
నవకంపుమేనులు నల్లచెవులు
గల గుఱ్ఱములు వేయి కన్యకు నీ వుంకు
విచ్చినఁ గూఁతు నేనిత్తు ననిన
వసుధామరుండును వరుణుని కడ కేఁగి
హరులఁ దెచ్చినఁ గూఁతు నాతఁడిచ్చె

ఆ. నా మహాత్ముసతియు నత్తయుఁ గొడుకులఁ
గోరి యడుగ నియ్యకొని యతండు
విప్రరాజమంత్రవితతుల వేల్పించి
చరువు సేసి క్రుంక నరిగె నదికి. 423

వ. అయ్యెడం దల్లి యడిగిన సత్యవతి బ్రహ్మమంత్రంబులఁ దనకు వేల్పించిన చరువు దల్లి కిచ్చి క్షాత్త్రమంత్రంబులం దల్లికి వేల్పించిన చరువు దానందుకొని యుండ నా ముని సనుదెంచి చరువు పోద్దుటు యెఱింగి భార్య కిట్లనియె. 424

ఆ. తల్లి చరువు నీవు దాల్చి నీచరు వేల
తల్లిపాల నిడితి తరళనేత్ర!

కొమ్మయింక నీకుఁ గ్రూరుఁడు పుట్టు మీ
యమ్మ బ్రహ్మవిదుని ననఘుఁ గాంచు. 425

వ. అనిన నయ్యింతి వెఱచి మ్రొక్కి వినయంబు లాడినం బ్రసన్నుం డై నీకొడుకు సాధువై నీ మనుమండు క్రూరుం డగుం గాక యని ఋచీకుం డనుగ్రహించిన నా సత్యవతికి జమదగ్ని సంభవించె. సత్యవతియుం గౌశికీనదియై లోకపావనియై ప్రవహించెను. ఆజమద గ్నియు రేణువు కూఁతురయిన రేణుకను వివాహం బై వసుమనాది కుమారులం గనియెను. అందు. 427

క. పురుషోత్తము నంశంబున
ధర జమదగ్నికి జనించి ధన్యుఁడు రాముం
డిరువదియొకమరి నృపతుల
శిరములఁ జక్కడిచెఁ దనదు చేగొడ్డంటన్. 427

వ. అనిన విని భూవరుండు శుకున కిట్లనియె. 428

—♦ పరశురాముని చరిత్రము ♦—

ఉ. ఏటికిఁ జంపె రాముఁ డవనీశులఁ బల్వుర వారియందు ద
ప్పేటికిఁ గల్గె విప్రుఁ డతఁ డేటికి రాజసతామసంబులన్
వాటముఁ బొందె భూభరము వారిత మౌ టది యేవిధంబు నా
మాటకు మానిచంద్ర! మఱుమాట ప్రకాశముగాఁగఁ జెప్పవే. 429

వ అనిన విని శుకుం డిట్లనియె. 430

సీ. హైహయాధీశ్వరుం డర్జునుం డనువాఁడు
ధరణీశ్వరులలోనఁ దగినవాఁడు
పురుషోత్తమాంశాంశుఁ బుణ్యు దత్తాత్రేయు
నారాధనము సేసి యతని వలన,
బరిపంథిజయమును బాహుసహస్రంబు
నణిమాదిగుణములు యశము బలము
యోగీశ్వరత్వంబు నోజయుఁ దేజంబుఁ
జెడని యింద్రియములు సిరియుఁ బడసి

తే. గాలి కైవడి సకలలోకంబులందుఁ
దనకుఁ బోరాని రారాని తావు లేక
యెట్టిచో నైనఁ దనయాజ్ఞ యేపు మిగుల
ధరణి వెలుఁగొందె వినువీథిఁ దరణిమాడ్కి. 431

మ. ఒకనాఁ డామనుజేంద్రుఁ డంగనలతో నుద్దాముఁడై వీట నుం
డక రేవానది కేఁగి యందుఁ జెలినీటం జల్లు పోరాడి దీ
ర్ఘకరాబ్జంబుల నా నదీజలములన్ గట్టెన్ నడిగా నీరు ద్రో
లకుఁ జెల్లుబ్బి రణాగతుం డయిన యా లంకేశుపైఁ దొట్టఁగన్.

వ. ఇట్లు దిగ్విజయార్థంబు వచ్చిన రావణుం డారాజుచేకట్టం దొట్టిన యేటినీటికి సహింపక రోషంబునం బోటరియుంబోలె నమ్మేటి మగనితోడ పోరాటకుం దొడరినఁ బాటింపకఁ దన బాహుపాటవంబున. 433

క. వీఁక మెయి నతఁడు రావణుఁ
[1]గూఁకటు [2]లగలించి పట్టి కొని మోకాళ్లం
దాఁకించి కోఁతికైవడి
[3]నాకం బెట్టించెఁ గింకరావళిచేతన్.

వ. అంత నర్జునుండు మాహిష్మతీపురంబున కేతెంచి. 435

క. ఆ రాజేంద్రుఁడు రావణు
నోరీ! యిటమీఁద నూరకుండుము జగతిన్
వీరుఁడ ననకుము కాచితిఁ
బోరా యని సిగ్గు పఱిచి పుచ్చెన్ మరలన్. 426

వ. అంత. 437

సీ. ధరణీశుఁ డొకనాఁడు దైవయోగంబున
వేఁటకై కాంతారవీథి కేగి
తిరిగి యాఁకట శ్రాంతదేహుఁడై జమదగ్ని
ముని యాశ్రమముఁ జేరి మ్రొక్కి నిలువ
నా మునీంద్రుఁడు రాజు నర్థితోఁ బూజించి
యారాజునకు రాజు ననుచరులకుఁ

1 జుట్టుమొదళ్లు. 2 పెల్లగించి. పెఱికి. 3 ఆకన్ = అడ్డులో. (బంధనములో)

దన హోమధేనువుఁ దడయక రప్పించి
ఇష్టాన్నములు గురియింప నతఁడు
తే. గుడిచి కూర్చుండి మొదవుపై గోర్కెఁ జేసి
సంపద యదేల యీ యావు చాలుఁ గాక
యిట్టిగోవుల నెన్నండు నెఱుఁగ మనుచుఁ
బట్టి తెండని తనయొద్ది భటులఁ బనిచె. 438

వ. పంచిన వారలు దర్పంబునం జని. 439

క. క్షేపుం బాపకుఁ డంచును
నాపదలం బడితి మనుచు నంబా! యనుచుం
జూపోపరు నృపు లంచును
వాపోవఁగ మొదవుఁ గొనుచు వచ్చిరి పురికిన్. 440

వ. అంత నర్జునుండు మాహిష్మతీపురంబునకు వచ్చునెడ రాముండాశ్ర
మంబున కేతెంచి తద్వృత్తాంతం బంతయు విని. 441

ఆ. అద్దిరయ్య! యింట నన్నంబు గుడిచి మా
యయ్య వలదనంగ నాక్రమించి
క్రొవ్వి రాజు మొదవు గొనిపోయినాఁ డంట
యేను రాముఁ డోట యెఱుఁగఁ డొక్కొ. 442

వ. అని పలికి. 443

మ. ప్రళయాగ్నిచ్ఛటభంగిఁ [1]గుంభి విదళింపం బాఱు సింహాకృతిం
బెలుచన్ రాముఁ డిలేశువెంట నడచెం బృథ్వీతలంబెల్ల నా
కులమై [illegible] గుఠారియై కవచియై కోదండియై [2]కాండియై
చలియై సాహసియై మృగాజినమనోజ్ఞశ్రోణియై తూణియై.

వ. చని మాహిష్మతీపురద్వారంబుఁ జేరి నిలుచున్న సమయంబున.

మ. కనియెన్ ముందటఁ గార్తవీర్యుఁడు [3]సమిత్కాముం బ్రకామున్ శరా
సనతూణీరకుఠారభీము నతిరోషప్రోచ్ఛలద్భ్రూభ్రుయుగా

1. ఏనుఁగును 2. బాణములను ధరించినవాఁడై 3. యుద్ధము కోరువాఁడు.

సనసేత్రాంచలసీము ¹నైణపటునానామాలికోద్దాము ²నూ
తనసంరంభనరేంద్రదారశుభసూత్రక్షామమునిన్ రామునిన్. 446

వ. కని కోపించి. 447

ఉ. బాలుఁడు వెఱ్ఱిబ్రాహ్మణుఁడు బ్రాహ్మణు నై వసి నుంటమాని భూ
పాలురతోడ భూరిబలభవ్యులతోడ భయంబు దక్కి క
య్యాలకు వచ్చినాఁడు మన యందిఁకఁ బాపము లేదు లెండు లెం
డేల సహింప భూసురుని నేయుఁడు వ్రేయుఁడు గూల్పుఁ డిమ్మహిన్.

వ. అని కదలించి దండనాయకులఁ బురికొల్పిన వారు రథగజతురగ హారిపదాతిసమూహంబులతో లెక్కకుం బదియే ³డక్షౌహిణులతో నెదురునడచి శరచక్రగదాఖడ్గభిండిపాలశూలప్రముఖసాధనంబుల నొప్పించిన నవ్విప్రవరుండు గన్నులకొలుకుల నిప్పులు గుప్పలుగొన రెట్టించిన కట్టల్క మిట్టిపడి యజ్ఞోపవీతంబు సక్కనిడికొని కరాళించి బిట్టు దట్టించి కఠోరం బగు కుఠారంబు సారించి మూఁకలపై కుఱికి తొలకరి మొగంబునం గ్రొచ్చెలికపట్టునం జెట్టులు గొట్టు కృషీవలుని తెఱంగున బవంబులు ద్రెంచుచుఁ సనఁటికంబంబులఁ దెగనడచు నారామకారునిపగిది మధ్యంబులఁ ద్రుంచుచుఁ దాళఫలంబులు రాల్చు వృక్షారోహకుని కైవడి శిరంబులు డుంచుచు మృగంబుల వండం దుండించు సూపకారునిభంగి నవయవంబులం జెక్కుచు నంతటం దనివిసనక విలయకాలకీలికేలిని మంట లుమియుచు విల్లంది యెల్లడం బిడుగులసోనలు గురియు బలు మొగిళ్ళవడువున నప్రమాణంబు లగు బాణంబులం బఱపి సుభటసైన్యంబుల దైన్యంబు నొందించుచు నడ్డంబ ని యార్భటంబులుగల బాణవర్షధృతంబులతో రాహుతుంగోపానలంబున కాహుతులు సేయుచు తురంగంబుల నిరంగంబులఁ గావించుచు రథంబుల విశ్లథంబులఁగా నొనర్చుచు ద్విరదంబుల నరదంబులపైఁ బఱవం దోలుచు నివ్విధంబున సేనల నంపవానలముంచి రూపుమాపిన.

1. లేడిచర్మమును వస్త్రముగా ధరించినవాఁడు. 2. నూతనమైన యాటోపముకల రాజులభార్యలయొక్క మంగళసూత్రములపాలి క్షామదేవతయైనవాఁడు. అనఁగా రాజులం జంపి వారి భార్యలకు వైధవ్యము గూర్చువాఁడన్న మాట. 3. అక్షౌహిణి = 21870 రథములు 21870 ఏనుఁగులు 65610 గుఱ్ఱములు 109350 కాలుబంట్లు గల సేనావిశేషము.

క. మత్తిల్లి భూతజాలము
చిత్తంబులఁ జొక్కి వేడ్కఁ జిందులువాఱన్
జొత్తిల్లి సమిత్తలమున
నెత్తురుమేదంబు పలల నికరం బయ్యెన్. 450

వ. అయ్యవసరంబున. 451

క. మే లీ బ్రాహ్మణుఁ డొక్కఁడు
నేలం బడఁగూల్చె సైన్యనిచయము నెల్లన్
బాలార్కునేల యీతనిఁ
దూలించెదఁగాక నాదు దోర్బలమువడిన్. 452

వ. అనిపలికి. 453

మ. ఒకయేనూఱుకరంబులన్ ధనువు లత్యుల్లాసియై తాల్చి వే
ఱొకయేనూట గుణధ్వనుల్ నిగుడ శాతోగ్రాస్త్రముల్ గూర్చి వి
ప్ర! కుఠారంబును నిన్నుఁ గూల్తు ననుచున్ భర్జించి పుంఖానుపుం
ఖకఠోరంబుగ నేసి యార్చె రయరేఖాధామునిన్ రామునిన్.

క. వడిఁ దూపు లెగయ గుడుసులు
పడి కార్ముకపంచశతము పఱఁగ విభుఁడు సొం
పడరెఁ బరివేషమండలి
నడుమఁ గరద్యుతుల వెలయు నలినాప్తు క్రియన్. 455

వ. ఇట్లర్జునుండు బాహువిలాసంబు సూపిన. 456

మ. ధరణీదేవుఁడు రాముఁ డాఢ్యుఁడు జగద్ధానుష్కరత్నంబు దు
ష్కరచాపంబొకఁ డెక్కుపట్టి శరముల్ సంధించి పెల్లేసి భూ
వరుకోదండము లొక్కచూడ్కిఁ దునిమెన్ వాఁడంతటం బోక వే
తరువుల్ ఋవ్వఁ గుఠారధార నఱకెం దద్బాహుసందోహమున్.

క. కరములు దునిసిన నతనికి
శిర మొక్కటి చిక్కె శైలశిఖరము భంగిం
బరశువున నదియుఁ ద్రుంచెను
బరసూదనుఁడైన ఘనుఁడు భార్గవుఁడు వడిన్. 458

ఆ. తండ్రి పడిన నతని తనయులు పదివేలు
దలఁగి పోయి రతనిఁ దాఁక లేక
పరభయంకరుండు భార్గవుం డంత నా
గోవుఁ గ్రేపుతోడఁ గొనుచుఁ జనియె. 459

వ. ఇట్లు హోమధేనువు మరలం దెచ్చి యిచ్చి తన పరాక్రమంబు
దండ్రిదోఁబుట్టువులకు సవర్ణనంబుగాఁ జెప్పిన జమదగ్ని రామున
కిట్లనియె. 460

క. కలవేల్పు లెల్లఁ దమతమ
చెలువంబులు దెచ్చి రాజుఁ జేయుదు రకటా!
[1]బలువేల్పు రాజు వానిం
జలమున నిట్లేల పోయి చంపితి పుత్త్రా! 461

క. తాలిమి మనకును ధర్మము
తాలిమి మూలంబు మనకు ధన్యత్వమునం
దాలిమిగలదని యీశుం
డేలించును బ్రహ్మపదము నెల్లన్ మనలన్. 462

క. క్షమ గలిగిన సిరిగలుగును
క్షమగలిగిన వాణిగలుగు సౌరప్రభయున్
క్షమగలుగఁ దోఁనకలుగును
క్షమగలిగిన మెచ్చుశౌరి సదయుండు దండ్రీ. 463

క. పట్టపురాజును జంపుట
గట్టలుకన్ విప్రుఁ జంపు కంటెను బాపం
బట్టి ట్టనకుము నీ వి
[2]చెట్ట సెడం దీర్థసేవ చేయుము దనయా! 464

౧౬ అధ్యాయము

క. అని తన్నుఁ దండ్రి పనిచినఁ
బనిపూని ప్రసాద మనుచు భార్గవుండు రయం
బున నొకయేఁడు ప్రయాణము
సని తీర్థము లెల్ల నాడి చనుదెంచె నృపా! 465

1. పెక్కుమంది దేవతల స్వరూపము. 2. చెనుఁగు (పాపము).

ఉ. ఆయెడ నొక్కనాఁడు సలిలార్థము రేణుక గంగలోనికిం
బోయి ప్రవాహమధ్యమునఁ బొల్పుగ నచ్చరలేమపిండుతోఁ
దోయవిహారముల్ సలుపు దుర్లభుఁ జిత్రరథుం సరోజమా
లాయుతుఁ జూచుచుండెఁ బతి యాజ్ఞ దలంపక కొంతప్రేమతోన్.

వ. ఇట్లు గంధర్వవల్లభునిం జూచు కారణంబున దడసి. 467

ఉ. అక్కట! వచ్చి పెద్దతడ వయ్యెను హోమమువేళ దప్పె నే
నిక్కడ నేల యుంటి ముని యేమనునో యని భీతచిత్తయై
గ్రక్కునఁ దోయకుంభము శిరస్స్థలమందిడి తెచ్చిచ్చి వే
మ్రొక్కి కరంబు మోడ్చి పతి ముందట నల్లన నిల్చె [1]నల్కుచున్.

వ. అప్పుడు. 469

క. చిత్తమున భార్య దడసిన
వృత్తాంతం బెఱిఁగి తపసి వే కని సుతులన్
మత్తుం డీనిం జావఁగ
మొత్తుం డన మొత్తరైరి మునుకుచు వారల్. 470

క. కొడుకులు పెండ్లముఁ జంపమిఁ
గొడుకులఁ బెండ్లాముఁ జంప గురుఁడానతి యీ
నడుగులకు నెఱిఁగి రాముం
డడు గిడక కుండడంగఁ ద్రుంచె నన్నలఁ దల్లిన్. 471

శా. తల్లిన్ భ్రాతల నెల్లఁజంపు మనుచోఁ దాఁ జంపి రాకున్నఁ బెం
పెల్లం బోవ శపించుఁ దండ్రి తన పంపుఁ జేయుదున్ మెచ్చి దా
తల్లిన్ భ్రాతల నిచ్చునిక్కము తపోధన్యాత్మకుం డంచు వే
తల్లిన్ భ్రాతలఁ జంపె భార్గవుఁడు లేదా చంపఁ జేయాడునే.

వ. ఇవ్విధంబున.

క. అడుగము సెప్పక కడపటి 473
బిడ్డఁడు రాముండు సుతులఁ బెండ్లము నచటన్
గొడ్డంటం దెగ నడిచిన
జడ్డనఁ దలయూఁచి మెచ్చె జమదగ్ని మదిన్. 447

1. భయపడుచు

క. మెచ్చిన తండ్రిని గనుఁగొని
చెచ్చెర నీపడినవారి జీవంబులు నీ
విచ్చితి ననుమని మ్రొక్కిన
నిచ్చెన్ వారలును లేచి రెప్పటి భంగిన్. 475

ఆ. పడినవారి మరల బ్రతికింప నోపును
జనకుఁ డనుచుఁ జంపె జామదగ్న్యుఁ
డతడు సంపె ననుచు నన్నలఁ దల్లిని
జనకు నాజ్ఞయైన జంపఁ దగదు. 476

సీ. పరశురాముని కోడి పరుగులు వెట్టిన
యర్జునపుత్త్రకు లాత్మయందుఁ
దండ్రి మ్రగ్గుటకు సంతప్తులై (వ్రేఁగుచు) పొగులుచు
నింతట నంతట నెడరు లేచి
తిరిగి యాడుచు నొక్క దివసమం దారాముఁ
డడవి కన్నలతోడ నరుగఁ బిదప
బగఁ దీర్పఁ దఱియని పఱతెంచి హాహూల
యంబున సర్వేశు నాత్మ నిలిపి

తే. నిరుపమధ్యానసుఖవృత్తి నిలిచియున్న
పుణ్యు జమదగ్ని నందఱు బొదివిపట్టి
కుమలకుంఠంగఁ దలఁ ద్రెంచి కొనుచుఁ జనిరి
యడ్డమే తెంచి రేణుక యడచి కొనఁగ. 477

వ. మఱియును. 478

మ. జనకుం జంపిన వైరముం దలఁచి రాజన్యాత్మజుల్ నేఁడు మీ
జనకుం జంపిరి రామరామ రిపులన్ శాసింతు రమ్మంచు న
మ్మునిపై వ్రాలి లతాంగి మోఁదికొనియెన్ [1]ముయ్యేడుమాఱుల్ రయం
బున రాముం డరుదెంచి యెన్నికొన [2]నా పూర్ణాపదాక్రాంత యై.

వ. అప్పుడు దల్లి మొఱవిని జమదగ్నికుమారులు వచ్చి యిట్లని
విలపించిరి. 480

1. మూఁడు ఏడు మారులు (21 మారులు) 2. సంపూర్ణములయిన్ కష్టములచే నావరింపబడినది.

క. వాకిలి వెడలవు కొడుకులు
రా కుండఁగ, నట్టి నీవు రాజసుతులచేఁ
జీకాకు నొంది పోవఁగ
నీకా శ్లేష్మాడెఁ దండ్రి నిర్జరపురికిన్. 481

వ. అని విలపించు చున్న యన్నలం జూచి రాముం డిట్లనియె. 482

ఉ. ఏడువ నేల తండ్రి తను వేమఱకుండుఁడు తోడులార! నే
[1]సూడిదె తీర్తు నంచుఁ బరశుద్యుతి భీముఁడు రాముఁ డుగ్రుఁడై
యోడక యర్జునాత్మభవు లున్నపురంబుల కేఁగి చొచ్చి గో
డాడఁగ బట్టి చంపె వడి నర్జునజాతుల బ్రహ్మఘాతులన్.

క. ఖండించి రిపులశిరములు
గొండలుగాఁ బ్రోఁగు లిడియె గురురక్తనదుల్
నిండికొని పాఱ నుబ్బుచు
భండనమున విప్రరిపులు భయ మంద నృపా! 484

వ. మఱియు నంతటఁ బోక.

ఆ. అయ్యపగకు రాముఁ డలయక రాజుల
నిరువదొక్కమాఱు నరసి చంపె
జగతిమీఁద రాజశబ్దంబు లేకుండ
[2]సూడు దీర్ప లేని సుతుఁడు సుతుఁడె. 486

వ. మఱియు నారాముండు శమంతపంచకంబున రాజరక్తంబులం దొమ్మిది మడుఁగులు గావించి తండ్రిశిరంబు దెచ్చి శరీరంబుతో సంధించి సర్వదేవమయుండగు దేవుండు దాన కావునఁ దన్ను నుద్దేశించి యాగంబుం జేసి హోతకుం దూర్పును బ్రహ్మకు దక్షిణ భాగంబును నధ్వర్యునకుఁ బడమటి దిక్కును నుద్గాతృనకు నుత్తర దిశయు నున్నవారల కవాంతరదిశలును గశ్యపునకు మధ్యదేశంబును నుపద్రష్టకు నార్యావర్తంబును సదస్యులకుం దక్కిన యెడలును గలయనిచ్చి బ్రహ్మనదియైన సరస్వతియం దవబృథ

1, సూడు + ఇదె తీర్తును. సూడు = ప్రతివైరము. దెబ్బకు దెబ్బ

స్నానంబు సేసి కల్మషంబులం బాసి మేఘవిముక్తుండయిన సూర్యుం
డునుం బోలె నొప్పుచుండెను. అంత. 487

క. అప్పుడగు పుత్త్రివలనను
బ్రాప్తతనుం డగుచుఁ దపము బలిమిని మింటన్
సప్తర్షి మండలంబున
సప్తముఁడై వెలుఁగుచుండె జమదగ్ని నృపా! 488

క. ఆ జమదగ్ని తనూజుఁడు
రాజీవాక్షాంశు ఘనుఁడు రాముఁ డధికుఁడై
యోజను సప్తర్షులలో
రాజిల్లెడు మీఁది మనువు రా నవ్వేళన్. 489

ఆ. శాంతచిత్తుఁ డగుచు సంగవిముక్తుఁడై
భవ్యుఁడై మహేంద్రపర్వతమున
నున్నవాఁడు రాముఁ డోజతో గంధర్వ
సిద్ధవరులు నుతులు సేయుచుండ. 490

క. భగవంతుఁడు హరి యీ క్రియ
భృగుకులమునఁ బుట్టి యెల్ల పృథివీపతులన్
జగతీభారము వాయఁగఁ
బగ గొని పలుమాఱుఁ జంపె బవరమున నృపా! 491

వ. అంత గాధికి నగ్ని తేజుండగు విశ్వామిత్త్రుండు జన్మించి తపోబలం
బున రాజధర్మంబును దిగనాడి బ్రహ్మర్షి యై యేకశతసంఖ్యాగణి
తులగు కొడుకులం గనియెను. అయ్యెడ భృగుకులజాతుండయిన
యజీగర్తునికొడుకు శునశ్శేపుండు దల్లిదండ్రులచేత హరిశ్చంద్రుని
యాగపశుత్వంబునకు నమ్ముడువడి బ్రహ్మాదిదేవతలవినుతి సేయుచు
మెప్పించి దేవతలచేత బంధవిముక్తుం డయిన వానియందుఁ గృప
గలిగి చేపట్టుకొని విశ్వామిత్త్రుండు పుత్త్రుల కిట్లనియె. 492

క. కన్నులఁ గంటిని వీనిని
మన్నన కొమరుండు నాకు మక్కువ మీఱో

యన్నన్న యనుచు సీతని
మన్నింపుం డనినఁ జూచి మదసంయుతులై. 493

క. ఇతఁ డన్నఁట వో మాకును
గృతకృత్యుల మయితి మనుచు గేలియొనర్పన్
సుతులన్ మ్లేచ్ఛులు గం డని
ధృతి లేక శపించెఁ దపసి తిరుగుడు పడఁగన్. 494

వ. అయ్యెడ నతని శాపంబునకు వెఱచి యానూర్వురయందు మధ్యముం డయిన మధుచ్ఛందుం డేబండ్రు దమ్ములుం దానును నమస్కరించి తండ్రీ! నీ చెప్పిన క్రమంబున శునశ్శేఫుండు మా కన్న యని మన్నింపం గలవార మనవుడు సంతసించి మంత్రదర్శి యైన శునశ్శేఫుని వారలయందుఁ బెద్దఁజేసి మధుచ్ఛందున కిట్లనియె.

ఆ. పాడి సెడక పేఁడు నేఁడు మీకతమునఁ
గొడుకు గలిగె నాకుఁ గొడుకులార!
కడుపులార! మీరు గొడుకులఁ గనుఁ డింకఁ
బ్రీతితోడ దేవరాతుఁ గూడి. 496

వ. అని పలికెను. అట్లు శునశ్శేఫుండు దేవతలచేత విడివడుటంజేసి దేవరాతుం డయ్యె. మధుచ్ఛందుండు మొదలయిన యేఁబండ్రు నా దేవరాతునకుఁ దమ్ములైరి. పెద్దలయిన యష్టకహారీతజయంత సుమదాదు లేఁబండ్రును వేఱై చనిరి. ఈక్రమంబున విశ్వామిత్రు కొడుకులు రెండువిధంబు లయినం బ్రవరాంతరంబు గలిగెనని చెప్పి శుకుం డిట్లనియె.

౧౭ అధ్యాయము

వ. ఆ పురూరవు కొడుకగు నాయువునకు నహుషుండును క్షత్త్రవృద్ధుండును రజియును రంభుండును ననేనసుండును ననువారు పుట్టిరి. అందు క్షత్త్రవృద్ధునకుఁ గుమారుం డగు సుహోత్రునకుఁ గాశ్యుండుఁ గుశుండు గృత్సమదుండు నన ముగ్గురు గలిగిరి. ఆగృత్సమదునకు శునకుండును శునకునకు శౌనకుండును నమ్మహాత్మునికి బహ్వృచప్రవరుండును జన్మించిరి. ఆ బహ్వృచప్రవరుండు దపోనియతుండై చనియె. కాశ్యునకుఁ గాశియుఁ గాశికి రాష్ట్రుం

డను రాష్ట్రునకు దీర్ఘతపుండును జనించిరి. 497

క. ఆ దీర్ఘతపుని కధికుఁడు
[1]శ్రీదయితాంశమునఁ బుట్టె సేవ్యుం డాయు
ర్వేదజ్ఞుఁడు ధన్వంతరి
ఖేదంబులు వాయు నతనిఁ గీర్తన సేయన్. 498

వ. వాసుదేవాంశసంభూతుం డగు నాధన్వంతరి యజ్ఞభాగంబున కర్హుండు. అతనికిఁ గేతుమంతుండు గేతుమంతునకు భీమరథుండు నతనికి దివోదాసుం డనంబరఁగు ద్యుమంతుండు నుదయించిరి. ఆద్యుమంతునకుఁ బ్రతర్దనుండు జన్మించెను. ఆప్రతర్దనుండు శత్రుజిత్తనియును ఋతధ్వజుండనియుం జెప్పంబడెను. ఆతనికిఁ గువలయాశ్వుండు సంభవించె. 499

ఆ. వసుమతీశ! విను కువలయాశ్వభూభర్త
లలితపుణ్యుఁ డను నలర్కుఁ గనియె
నాతఁ డేను వేల నఱువదియాఱువే
లేండ్లు వాఁడు భంగి నేలరెవరు. 500

వ. అయ్యలర్కునకు సన్నతియును నతనికి సునీతుండును నతనికి సుకేతనుండును నతనికి ధర్మకేతువును నతనికి సత్యకేతువును నాతనికి ధృష్టకేతువును నాధృష్టకేతువునకు సుకుమారుండును సుకుమారునకు వీతిహోత్రుండు వీతిహోత్రునకు భర్గుండును భర్గునకు భార్గభూమియు జనియించిరి. 501

ఆ. వాండు తుదయుఁ గాశ్య వసుమతీశుండాది
యైనవారు కాశు లనఁగ నెగడి
రవనిమీఁద వార లాక్షత్త్రవృద్ధిని
వంశజాతు లగుచు వంశవర్య. 502

వ. మఱియు క్షత్త్రవృద్ధునికి రెండవకొడుకగు కుశునికిఁ బ్రీతియును వానికి సంజయుండును సంజయునికి జయుండును జయునికిఁ గృతుండును గృతునికి హర్యధ్వనుండును వానికి సహదేవుండును సహదేవునికి భీముండును భీమునకు జయత్సేనుండును జయత్సేనునకు సంకృ

1. విష్ణుని యంశమున

తియు సంకృతికి జయుండును జయునకు క్షత్త్రధర్ముండును ధర్ముండును బుట్టిరి. వీరలు క్షత్త్రవృత్తిని వశంబునంగల రాజులు. రంభునికి రభసుండును గంభీరుండును గంభీరునికిఁ గృతుండును గల్గి రాగృతునికి బ్రహ్మకులంబు వుట్టెను. అయ్యనేనునకు శుద్ధుండును శుద్ధునకు శుచియు శుచికి బ్రహ్మసారథియైన త్రికకుత్తును జనించిరతనికి శాంతజుండువుట్టె నతండు విజ్ఞానవంతుండుగృతకృత్యుండు విరక్తుండునయ్యె.

సీ. రజియను వానికి రాజేంద్ర! యేనూఱు
కొడుకులు గలిగిరి ఘోరబలులు
వేల్పు లెల్లనువచ్చి వేఁడిన నారజి
దైత్యులఁ జెక్కాడి ధరణిఁ గూల్చి
నాకంబు దేవేంద్రునకు నిచ్చె నిచ్చిన
రజికాళ్ళ కెఱఁగి సురప్రభుండు
పెంపుడు నతనికి విబుధగేహము నిచ్చి
సంతోషబుద్ధి నర్చన మొనర్చె

ఆ. నంత నారజి మృతుఁ డైన నతనిపుత్త్రు
లమరవిభుఁడు తమ్ము నడిగి కొనిన
నీక యింద్రలోక మేలిరి యాగభా
గములుపుచ్చికొనిరి గర్వమంది. 504

క. వేలుపులఱేఁడు గురుచే
[1]వేలిమి వేల్పించి బలిమి వెలయఁగ నిజదం
భోళిని రజిసుతులను ని
ర్మూలము గావించి స్వర్గముం గైకొనియెన్. 505

వ. అది యట్లుండె నహుషునకు యతియు యయాతియును సంయాతియు నాయాతియు వియతియుఁ గృతియు నన నార్గురు గొడుకులు దేహికి నిద్రియంబుల చందంబున సంభవించిరి. అందుఁ బెద్దకొడు కగు యతికి రాజ్యం బిచ్చిన నతండు విరక్తుండై. 506

క. రాజ్యంబు పాపమూలము
రాజ్యముతో నొడ లెఱుంగ రాదు సుమతియున్.

1. హోమము.

రాజ్యమునఁ బూజ్యు నెఱుఁగుము
రాజ్యము గీజ్యమ్ము ముక్తిరతునకు నేలా. 507

వ. అని పలికి వాఁడు రాజ్యంబునకుం బాసి చనియె. 508

క. ఆనహుషుఁడు మఖశతమును
పూనుగఁ నొనరించి యింద్రమానిని గవయుం
బూని మునీంద్రులు మోచిన
[1]యానము పై నుండి కూలె [2]నహియై నేలన్. 509

ఉ. అన్నయుఁ దండ్రియుం జన యయాతి మహీపతియై చతుర్దిశల్
పన్నగఁ గావఁ దమ్ములకుఁ బాలిచి శుక్రుని కూఁతురున్ సుసం
పన్నగుణాభిరామ వృషపర్వుని కూఁతురు నోలి నాండ్రుగా
సన్నయశాలి యీ ధరణి చక్రధురంధరుఁ డయ్యెఁ జేర్మితోన్.

వ. అనిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 511

## ౧౮ అ ధ్యా య ము

## య యా తి చ రి త్ర ము

ఆ. పార్థివుఁడు యయాతి బ్రహ్మర్షి భార్గవుఁ
డల్లుఁ డగుట మామ యగుట యెట్లు
రాజు రాచకూఁతు రతిసేయఁ దగుఁగాక
విప్రకన్య నొంద విహిత మగునె. 512

వ. అనిన శుకుం డిట్లనియె. 513

సీ. దనుజేంద్రు కూఁతురు తరలాక్షి శర్మిష్ఠ
పురములో నొకనాఁడు ప్రొద్దు వోక
వేవురుబోటులు వెంటరా గురుసుత
యగు దేవయానితో నాట మరిగి
పూచిన యెలదోఁట పొంత తోఁపను గొన్న
క్రొమ్మావి నీడల కొలఁకుఁ జేరి
యందుఁ [3]దమ్ముల తేనె లానిచొక్కుచు మ్రోయు
నళులఝుంకృతులకు నదిరిపడుచు

1. వాహనము 2. అహి = పాము 3. తామరపూరేకులను.

ఆ. వలువ లూడ్చి కొలఁకు వడిఁ జొచ్చి తమలోనఁ
బెల్లు రేఁగి నీటఁ జల్లు లాడ
నంది నెక్కి మహాళి [1]నిందురోచులు పర్వ
[2]శూలివచ్చెఁ [3]గొండచూలితోడ. 514

చ. మలహరుఁ జూచి సిగ్గుపడి మానిను లందఱు సంభ్రమంబునన్
వలువలు గట్టుచో దనుజవల్లభుకూఁతురు దేవయాని దు
వ్వలువ ధరించి వేగమున వచ్చినఁ జూచి యెఱిం గెఱింగి నా
వలు విది యెట్లు కట్టికొని వచ్చును దానవి యంచుఁ దిట్టుచున్.

వ. దేవయాని యిట్లనియె. 516

శా. ఆలోకేశుముఖంబునం గలిగె బ్రాహ్మణ్యంబు బ్రహ్మంబు నా
మేలై వైదికమార్గముల్ దెలుపుచున్ మిన్నంది, యందున్ మహా
శీలుర్ భార్గవులందు శుక్రుఁడు సుధీసేవ్యుండు, నే వానికిం
[4]జూలన్, నావలు వెట్లు గట్టితివి రక్షోజాతవై చేటికా! 517

క. మహిమవతు లైన భూసుర
మహిళల విత్తమ్ములు వెఱ మగువల కగునే
మహిఁ బసిఁడిగొలుసు లిడినన్
విహితములే కుక్కలకు హవిర్భాగంబుల్. 518

క. మీతండ్రి మాకు శిష్యుఁడు
మాతండ్రి గురుండు గొంతమాత్రం బైనం
బ్రీతిం గావింపక పరి
భూతం జేయుదువె తులువ పోఁడిమిఁ జెనఁటీ! 519

వ. అని భర్జించుచున్న దేవయాని పలుకులు విని కరాళించి మ్రోఁగు
చున్న భుజంగి చందంబున నిట్టూర్పులు నిగిడించి పెదవులు
గొఱుకుచు శర్మిష్ఠ యిట్లనియె. 520

శా. భిక్షుండై తమతండ్రి మాజనకునిన్ భిక్షించినం దన్ను సం
రక్షింపం దుది నింతయై మఱపుతో రాజపుత్రీసూనాకృతి

1. చంద్రకాంతులు (వెన్నెల లన్నమాట) 2. శివుఁడు. 3. పార్వతి 4. కూతురను

నృక్షోరాజతనూజతో సుగుణతో నాతో సమం బాడెడిం
[1]గుక్షిస్ఫోటము గాఁగ దీనిఁ జెలులీ కూపంబునం ద్రోవరే.

వ. అని పలికి. 522

ఆ. పోటువింపుచేతఁ బొదువంగఁ బట్టించి
రాజసమున దైత్యరాజతనయ
దొడరి దేవయానిఁ ద్రోపించె వలు వీక
క్రుంకి నూతిలోనఁ గుతిలకొనఁగ. 523

వ. ఇట్లు సేసి శర్మిష్ఠ పోయిన వెనుక యయాతిభూపాలుండు వేఁట మార్గంబున నడవిం దిరుగుచు దైవయోగంబున నాదేవయాని యున్న నూయి సేరం జనుదెంచి యందు. 524

క. బంధువుల నెల్లఁ జీరుచు
నంద జలామగ్నమధ్యయై వగచుచు ని
ర్బంధమునఁ జిక్కి [2]పీడా
సింధువున మునింగి యున్న చేడియఁ గనియెన్. 525

వ. కనుంగొని. 526

దేవయాని యయాతిని వరించుట.

శా. సప్తాంభోనిధిమేఖలావృతమహాసర్వంసహాకన్యకా
ప్రాప్తోద్యద్వరదక్షదక్షిణకరప్రాలంబముం జేసి ప్రో
త్థితం జేసె యయాతిగట్టుకొనఁ బైచేలంబు మున్నిచ్చి ప
ర్యాప్తస్వేదజలాంగి [3]నాళిసముదాయస్వర్గవిన్ [4]భార్గవిన్. 527

వ. ఇట్లు నూయి వెడలించిన రాజునకు రాజవదన యిట్లనియె. 528

మ. ననుఁ బాణిగ్రహణం బొనర్చితి కదా నాభర్తవై నీవ దై
వనియోగం బిది తప్ప దప్పురుషనా వాక్యంబు సిద్ధంబు సా
ఖ్యనివాసున్ నిను మాని యొండునరునిం గాంక్షింప నే నేర్తునే
వనజం బానెడి తేఁటి యన్యకుసుమావాసం బపేక్షించునే. 529

వ. అదియునుంగాక.

1. కడుపు బ్రద్దలగునట్లు 2. బాధయనెడి సముద్రమునందు 3. చెలికత్తెలసముదాయమునకు కామధేనువు. 4. శుక్రుని కూతురు (దేవయాని)

సీ. సుగుణాఢ్య! విను నేను శుక్రుని కూఁతుర
దేవయానిని, తొల్లి దేవమంత్రి
తనయుండు కచుఁడు మా తండ్రిచేత మృతసం
జీవినిఁ దా నభ్యసించువేళ
నతనిఁ గామించిన నతఁ డొల్ల ననవుడు
నతఁడు నేర్చిన విద్య యడఁగిపోవ
నతని శపించిన నతఁడు నాభర్త బ్రా
హ్మణుఁడు గాకుండెడు మని శపించె.

తే. నదినిమిత్తంబు నాకు బ్రాహ్మణుఁడు గాఁడు
ప్రాణనాథుఁడ వీవని పడఁతి పలుకఁ
దనదు హృదయంబు నెలఁతపైఁ దగులువడినఁ
దమక మొకయింతయును లేక తలఁచి చూచి. 531

మత్తకోకిలము.
దైవయోగము గాక విప్రసుతన్ వరించునె నామనం,
బేవిధంబున నీశ్వరాజ్ఞయు నిట్టిదంచు వరించె ధా
త్రీవరుండును దేవయానిని, ధీరబుద్ధులకున్ మనో
భావ మొక్కటియే ప్రమాణము [1]భావ్యభావ్యపరీక్షకున్. 532

వ. ఇట్లు వరించి యయాతి సనిన వెనుక, దేవయాని శుక్రుని కడకుం
జని శర్మిష్ఠ సేసిన వృత్తాంతం బంతయు జెప్పి కన్నీరు మున్నీరుగా
వగచిన. 533

క. క్రూరాత్ముల మందిరములఁ
బౌరోహిత్యంబుకంటె పాపం బీ సం
సారముకంటె శిలల్ దిని
యూరక [2]కాపోతవృత్తి నుండుట యొప్పున్.

వ. అని వృషపర్వుకడ నుండుట నిందించుచు శుక్రుండా కూఁతుం
దోడ్కొని పురంబు వెడలి చన, నయ్యసురవల్లభుం డెఱింగి శుక్రుని
వలనం దేవతల గెలువఁ దలంచి తెరువున కడ్డంబు వచ్చి పాదం

1. కాఁదగనది, కారానిదియనెడి పరీక్షకు. 2. కపోతముయొక్క వృత్తి. ముందు కాలమునకుఁ గూడఁ బెట్టుకొనక తత్కాలమునకుఁ గావలసినది గడించి జీవించుట.

బులపైఁ బడి ప్రార్థించి ప్రసన్నుం జేసిన నా కోపంబు మాని శుక్రుం
డు శిష్యున కిట్లనియె. 535

తరలము,

చెలులు వేవురుఁ గాను నీసుత చేటికై పడి నాసుతం
గొలుచు చుండినఁ దీఱుఁ గోపము గొల్వఁబెట్టెదవేని నీ
వెలఁదిఁ దోడ్కొని వత్తునావుడు వేగ రమ్మని భార్గవిం
గొలువఁబెట్టె సురారివర్యుఁడు గూఁతు నెచ్చెలిపిండుతోన్. 536

మ. చల మింకేలని తన్నుఁ దండ్రి పనుపన్ శర్మిష్ఠ సన్నిష్ఠతో
జలజాతాస్యలు సద్వయస్యలు సహస్రంబు న్నిజస్రింబుఁద
న్నలమన్ దాసి సుదాసి యయ్యెఁ బగ వాయన్ [1]భూరికోపానలా
కలితగ్లానికిఁ దేవయానికి [2]మహాగర్వోద్యమస్థానికిన్. 537

వ. అంత.

ఉ. ఆతత మైనవేడ్క దనుజాధిపమంత్రి సురారినందనో
పేతఁ దనూభవం బిలిచి పెండ్లియొనర్చె మహావిభూతికిం
బ్రీతిమహోగ్రజాతికి నధీతికి సాధువినీతికిన్ సిత
ఖ్యాతికి [3]భిన్నదుఃఖబహుకార్యభియాతికి న య్యయాతికిన్. 539

వ. ఇట్లు యయాతికి దేవయాని నిచ్చి శుక్రుండు శర్మిష్ఠాసంగమంబు
సేయకు మని యతని నియమించి పనిచిన పిదప దేవయానియు
నయ్యయాతివలన యదుతుర్వసులను కుమారులం గనియెను. ఒక్క
రేయి సెఱింగుమాసి దేవయాని వెలుపల నున్నయెడ శర్మిష్ఠ
యొదరు వేచి యేకాంతంబున యయాతి కడకుం జని చెఱకువింటి
జోదుపువ్వుటంపఱ కోహటించి తన తలంపు సెప్పిన. 540

శుక్రాచార్యులు యయాతికి శాపం బొసంగుట.

ఉ. ఆ జవరాలిఁ జూచి మన మాఁపగ లేక మనోభవార్తుఁడై
యాజనభర్త మున్ను [4]కవి యాడినమాట దలంచి యైనఁ [5]జే
తోజసుఖంబులం దనిపెఁ ద్రోవఁగ వచ్చునె దైవయోగముల్
రాఁ జెఁట సద్రహస్య మఁట రాజకుమారిని మానసేర్చునే. 541

1. పెద్ద కోపమనెడి యగ్నిచేఁ గలిగిన వాడుతనముగలది. 2. గొప్ప గర్వప్రయత్నమునకు స్థానమైనది. 3. భేదింపబడిన దుఃఖకారులయిన శత్రులు కలవాఁడు. 4 కవి = శుక్రుఁడు. 5. మన్మథసౌఖ్యములచే.

వ. ఇట్లు యయాతివలన శర్మిష్ఠ గర్భంబై క్రమంబున ద్రుహ్యుండు ననువుఁ బూరువు నన మువ్వురు తనయులం గాంచెను. అంత దేవయాని తద్వృత్తాంతం బంతయు నెఱింగి కోపించి శుక్రుకడకుం జని క్రోధమూర్ఛితయై యున్న సమయంబున యయాతి వెంటజని యిట్లనియె. 542

ఆ. మామ కేల చెప్ప మాను సరోజాక్షి!
దనుజతనయఁ బొంది తప్పు వడితిఁ
గామి నయిన నన్నుఁ గరుణింపు పతిమాట
తండ్రిమాట కంటెఁ దగును సతికి. 543

వ. అని పలికి పాదంబుల కెఱఁగిన నయ్యింతి యొడంబడక యుండెను. అంత నది యెఱింగి శుక్రుం డిట్లనియె. 544

క. నామాటఁ ద్రోచి దానవ
భామను బొందితివి ధరణిపాలక! తగవే
యేమాట యేది రూపము
కాముకులకు లోలుపులకుఁ గలవే నిజముల్. 545

వ. అని పలికి నిన్ను వనితాజనహేయం బయిన ముదిమి వొందెదు మని శపియించిన యయాతి యిట్లనియె. 546

క. మామా! నాపైఁ గోపము
[1]మానుమా నీపుత్రియందు మానవు నాకుం
గామోపభోగవాంఛలు
ప్రేమన్ రమియించి ముదిమిఁ బిదపం దాల్తున్. 547

వ. అనిపలికి యనుజ్ఞ గొని దేవయానిం దోడ్కొని పురంబునకుం జని పెద్దకొడుకగు యదువు బిలిచి యయాతి యిట్లనియె. 548

శా. నీతల్లిం గనినట్టి శుక్రువలనన్ నేఁ డీ జరం బొందితిన్
నాతండ్రీ! యదునామధేయ! తనయా! నావృద్ధతం దాల్పవే
[2]నీతారుణ్యము నాకునీవె తనివో నిండారఁ గొన్నాళ్ళు నేఁ
జేతోజాతసుఖంబులం దిరిగెదన్ శృంగారినై పుత్రకా! 549

వ. అనిన విని తండ్రికి యదుం డిట్లనియె. 550

---

1 మా – మా – వద్దు వద్దు. 2 నీయౌవనము.

శా. కాంతాహేయము దుర్వికారము ¹దురాకండూతిమిశ్రంబు హృ
చ్చింతామూలము పీనసాన్వితము ప్రస్వేదప్రణాకంపన
శ్రాంతిస్ఫోటకయుక్తమీ ముదిమి వాంఛం దాల్చి నానాసుఖో
పాంతంబైన వయోనిధానమిది యయ్యా! తేర యీవచ్చునే. 551

వ. అని యదుం డొడంబడకున్న యయాతి దుర్వాసుద్రుహ్యాదుల
నడిగిన వారును యదువు వలికినట్ల పలికినం గడగొట్టు కుమారుం
డైన పూరువున కిట్లనియె. 552

ఉ. పిన్నవు గాని నీవు కడుం బెద్దవు బుద్ధులయందు, రమ్ము నా
యన్న! మదాజ్ఞ దాఁటవు గదన్న! వినీతుఁడవైననీవు నీ
యన్నలు సెప్పినట్లు పరిహారము సెప్పకుమన్న! నాజరన్
మన్ననదాల్చి నీతరుణిమం బొనగూర్పుము నాకుఁ బుత్త్రకా! 553

వ. అనిన విని గురుభక్తిగుణాధారుం డగున పూరుం డిట్లనియె. 554

శా. అయ్యా! నన్నిటు వేఁడ నేల భవదీయజ్ఞానముల్లంఘనం
బయ్యుండం ²బరిహారమున్ నొడువ నే నన్యాయినే నీజరన్
నెయ్యం బొప్పఁగఁ దాల్చి నాతరుణిమన్ నీకిచ్చెదం ³బంపినం
గయ్యం బాడెడి పుత్త్రకుండు క్రిమిసంకాశుండు గాకుండునే. 555

వ. అదియునుం గాక. 556

క. మునివృత్తి ⁴డయ్యె నేఁటికి
జనపాలక! సుగతిఁ గోరు సత్పురుషులకుం
దనుఁగన్నతండ్రి సెప్పిన
పని సేసిన సుగతి గొంగుపసిఁడియ కాదే.

క. పనుపక చేయుదు రధికులు
పనిచిన మధ్యములు పొందు పఱుతురు తండ్రుల్
పని చెప్పి కోరిపనిచిన
ననిశము మాఱాడుపుత్త్రు లధములు దండ్రీ! 558

వ. అని పలికి పూరుండు ముదిమి సేకొని తనలేబ్రాయంబు యయాతి
కిచ్చెను. అయ్యయాతియుం దరుణుండై. 559

---

1 పాండురతతోఁకూడినది. 2 ప్రతివచనము. (కాదనుటను) 3 ఆజ్ఞాపించినచో
4 శ్రమపడుట

శా. ఏడో ద్వీపము లేడువాడలుఁగ సర్వేలాతలం బెల్లఁ బె
స్వాడై పోఁడిమి నేలుచుం బ్రజల నన్వేషించి రక్షించుచుం
దోర్దణ్ భార్గవి రా మనోజసుఖసంతోషంబులం దేలుచుం
గ్రీడించెన్ నియతేంద్రియుం డగుచు [2]నా క్రీడాతిరేకంబులన్. 560

క. మర్మంబుల నతి సాధ్వీ
ధర్మంబుల దేవయాని దన ప్రాణేశున్
నర్మముల మనోవాక్తను
కర్మంబుల నొంచులేక కడు మెప్పించెన్. 561

శా. ఆకాశంబున మేఘబృందము ఘనంబై సన్నమై దీర్ఘమై
యేకంబై బహురూపమై యడఁగున ట్లీదేవుగర్భంబులో
లోకశ్రేణి జనించుచున్ మెలఁగుచున్ లోపించు నాదేవు సు
శ్రీకాంతున్ హరిఁగూర్చి యాగములు సేసెన్ నాహుషుం డిమ్ములన్.

వ. మఱియును.

ఉ. చెలికాండ్రం గరులన్ రథమ్ముల భటశ్రేణిం దురంగంబులం
గలలోఁ గన్నధనావళిన్ సమములం గాఁ జూచుచున్ భార్యతోఁ
బలువేలేండ్లు మనోజభోగలహరీపర్యాప్తుఁడై తేలియున్
బలుతృష్ణం గడఁగాన కెంతయు మహాబంధంబులన్ స్రుక్కుచున్.

౧౯ అధ్యాయము

వ. ఒక్క దినంబున నాత్మజ్ఞానంబునం జేసి కాంతానిమిత్తంబున మోసపోవుట యెఱింగి యయాతి యతివిషాదంబు నొంది దేవయాని కిట్లనియె. 564

యయాతి దేవయానికి బస్తోపాఖ్యానమనెడి వ్యాజంబున స్వవృత్తాంతంబు దెలుపుట

క. మన చారిత్రము వంటిది
విను మితిహాసంబు గలదు వృద్ధజనములున్
మునులును మెత్తురు నీవును
మనమున నంగీకరింపు మంజులవాణీ! 565

వ. అది యెట్టి దనిన. 567

1. సర్వ + ఇలాతలము = సర్వభూతలము. 2. ఆక్రీడ + అతిరేకంబులన్ = విలాసవ్యాపారాతిశయముచే.

సీ. [1]అజ మొకం డడవిలో నరుగుచుఁ దాఁ గర్మ
ఫలమున నూత్రిలోపలికి జాఱి
లోఁగెడి [2]ఛాగి నాలోకించి కామి యై
కొమ్మున [3]దరిఁ గొంత గూలఁ ద్రోచి
వెడలింప నచ్ఛాగి విభునిఁగాఁ గోరిన
నగుఁగాక యని తాను నదియుఁ దిరుగ
నెన్నియేనిని దన్ను నెంత కామించిన
నన్నిటికిని భర్తయై తనర్చి

తే. వాని నేప్రొద్దు రతులకు వశలఁ జేసి
పొరిదిఁ గ్రీడించి క్రీడించి చొక్కి చొక్కి
కాముఁ డనియెడి దుస్సహాగ్రహము కతనఁ
జిత్త మేమఱి మత్తిల్లి చెల్లఁ జిక్కి. 568

క. వెడ విలుతు కేళిఁ జిగురా
కడిదపువ్రేటునకు లోఁగి యతిమోహితుఁడై
విడువక సతులం దగిలెడు
జడునకు నెక్కడివి బుద్ధి చాతుర్యంబుల్. 559

వ. అంత నచ్ఛాగంబు దన పిదపం దగిలిన ఛాగీనివహంబులోపలం జూడ నొప్పెడి ఛాగియందుఁ దగిలి క్రీడింపంగని నూతిలోపలంబడి వెలువడినఛాగి తన పతివలని నెయ్యంబు లేకుండుటకు విన్ననై తన మనంబున. 570

క. పలికినఁ బలుకులు వలుకఁడు
కలయున్ నవకాంతఁ జూచి కడు సంచలుఁడై
నిలిచిన చోటన్ నిలువఁడు
నిలువెల్లను గల్ల కామి [4]నిజమరి గలఁడే. 571

వ. అని పలికి విడిచి చనిన నయ్యజవల్లభుండు సురతపరతంత్రుండై మిసిమిసియను శబ్దంబు సేయుచుఁ దచ్ఛాగివెంటం జని యొడంబఱుపం జాలకుండె నంతదానికిఁ గర్తయైన బ్రాహ్మణుండు రోషం

1. మేక. 2. ఆడుమేక. 3. ఒడ్డు. 4. సత్యవంతుఁడు.

బున రతిసమర్థంబు గాకుండ నల్లాడుచుండ ఛాగవృషణంబులు
ద్రెంచివేసిన నచ్ఛాగంబు గ్రిందఁబడి వేఁడుకొనినఁ బ్రయోజనంబు
వాడగని యోగవిదుండు గావున బ్రాహ్మణోత్తముండు గ్రమ్మఱ
నయ్యజవృషణంబులు సంధించిన. 572

క. వృషణములు మరలఁ గలిగిన
సుషముండై ఛాగవిభుఁడు సుందరితోడన్
విషయసుఖంబులఁ బొందుచుఁ
[1]తృష తుదిఁ గనఁడయ్యెఁ బెక్కు దివసములయ్యున్. 573

వ. అని యివ్విధంబున యయాతి దేవయానికి నిజవృత్తాంతంబు గథా
రూపంబున నెఱింగించి యిట్లనియె. 574

మ. అబలా! నీనిబిడాతిసుష్టయశలష్టాపాంగభల్లంబులం
ప్రబలంబైన మనంబు భగ్నముగ నా ప్రావీణ్యముం గోలుపో
యబలిష్ఠుండగు కాముబారిఁ బడి నే నట్లోర్చు నే [2]బందెక
త్తై బడిం బాపపుఁ దృష్ణ యిప్పు డకటా దీర్ఘాకృతిన్ రొప్పెడిన్.

క. [3]అవలదు ప్రాణము లవలినఁ
గదలదు సర్వాంగకములుఁ గదలుచు నుండన్
వదలదు బిగువులు వదలినఁ
దుదిలేదీతృష్ణ దీనిఁ ద్రుంపఁగవలయున్. 576

క. వెయ్యేండ్లయ్యెను నీతోఁ
గ్రయ్యంబడి యున్నవాఁడఁ గామసుఖములం
[4]గ్రయ్య దొకయించుకైన
న్దయ్యదు కొసలియెఁ దృష్ణ నవపద్మముఖీ. 577

క. ముదిసెను దంతావళియును
ముదిసెను గేశములు దనువు ముదిసెం దనకున్
ముదియనివి రెండు సిక్కెను
[5]బ్రదికెడితీపియును [6]విషయపక్షస్పృహయున్. 578

---

1 తృష్ణకుచివర. (ఆశకంతు) 2 చెఱలో వేయునది. 3 తొలఁగదు (కదలదు)
4 కృశింపదు. 5 ప్రాణములమీఁదితీపి. 6 విషయములయొకవాంఛ.

క. కడ లే దాశాలతకుం
గడఁ జూడఁగ గాన రాదు కడఁగని రేనిన్
గడుముదమున సంసారము
గడఁ గందురు తత్త్వవిదులు కమలదళాక్షీ! 579

క. మండనహాటకపశువే
దండాశ్వవధూదుకూలధాన్యాదులు పె
క్కండియు నాశాపాశము
ఖండింపఁగ లేవు మఱియుఁ గడమయ చుమ్మీ! 580

క. కామోపభోగసుఖములు
వేమాఱును బురుషుఁ డనుభవించుచు నున్నం
గామంబు శాంతిఁ బొందదు
[1]ధూమధ్వజుఁ [2]డాజ్యవృష్టిఁ [3]గ్రుంగుడు వడునే. 581

ఆ. అక్క తల్లి చెల్లె లాత్మజ యొక్కెన
పానుపెక్కఁజనదు పద్మనయన!
పరమయోగి కైన బలిమిని నింద్రియ
గ్రామ మధికపీడఁ గలుగఁ జేయు. 582

క. [4]వెంగలివిత్తయి తిరుగుచుఁ
గంగారై చెడక ముక్తిఁ గాంక్షించు నతం
డంగనలతోడ విడువని
సంగడములు వదలవలయు జలజాతముఖీ! 583

వ. అది గావున నేఁడు మొదలు తృష్ణాఖండనంబు సేసి నిర్విషయుండనయి యహంకారంబు విడిచి మృగంబులం గలసి వనంబున సంచరించెద. పరబ్రహ్మంబునందుఁ జిత్తంబు సేర్చెద. బ్రహ్మనిష్ఠ మనుష్యులకు నాశానివారిణి యగుటం జేసి యేనందుఁ దత్పరుండనై యాహారనిద్రాదియోగంబులం బరిహరించెదను. ఆత్మవిదుండై సంసారనాశంబులఁ దలంచినవాఁడె విద్వాంసుఁ డని పలికి పూరుని యౌవనం బతనికిచ్చి ముదిమి దానుగైకొని విగతలోభుండై నిజ భుజశక్తిపాలితంబగు భూమండలంబు విభాగించి ద్రుహ్యునకుఁ

1. అగ్ని 2. నెయ్యివర్షముచే 3. అణగిపోవునా? 4. మూఢులలో అగ్రేసరుఁడు.

బూర్వభాగంబును యదువునకు దక్షిణభాగంబును దుర్వసునకుఁ
బశ్చిమదిగ్భాగంబును ననువునకు నుత్తరదిగ్భాగంబును సంరక్షిం
పుం డని యిచ్చి వారల సమక్షంబున. 584

క. నాలుగుచెఱఁగుల నేలయుఁ
బాలింపుం డనుచు నగ్రభవులను బంచెన్
భూలోకమేలు మనుచును
బాలారోఁకదారుఁ బూరుఁ బట్టము గట్టెన్. 585

వ. ఇట్లు పూరునికి రాజ్యంబిచ్చి పెక్కువర్షంబులందు ననుభూతంబు
లయిన యింద్రియసుఖంబులు వర్జించి. 586

క. మిక్కిలి సుజ్ఞానంబునఁ
జక్కఁగఁ దెగ నడిచి వైరిషడ్వర్గంబున్
ఱెక్కలువచ్చిన విహగము
గ్రక్కున [1]నీడంబు విడుచు కరణి నుదితుఁడై. 587

క. కారుణికోత్తముఁ డగు హరి
కారుణ్యముకతన నతఁడు ఘనుఁడై గెలిచెం
గ్రూరము లగు విషయంబుల
నూరక గెలువంగ శక్యుఁ డొక్కఁడుఁ గలఁడే. 588

వ. మఱియు నిర్మూలితసకలసంగుండై సత్త్వరజస్తమోగుణంబుల
దిగనాడి నిర్మలంబయి పరమంబయిన వాసుదేవాభిధానబ్రహ్మంబు
నందు యయాతిభూపాలుండు స్వతస్సిద్ధ యయిన [2]భాగవతగతిం
జెందెను. అంత. 589

సీ. ప్రాణేశుఁ డాడిన పలుకులు నగవులు
గాఁ జూడ కంతరంగమున నిలిపి
పథికులై పోవుచుఁ బాసీయశాలలఁ
జల్లగా నుండెడి జనులయట్లు
సంసారమునఁ గర్మసంబంధులై వచ్చి
యాలుఁ బిడ్డలు మగండనుచుఁ గూడి

1. గూడు. 2. భగవంతునియొక్క భక్తిగలవారు పొందుగతిని.

యుండుట గాని సంయోగంబు నిత్యంబు
గా దీశమాయాప్రకల్పితంబు

తే. దీని విడుచుట దగ వని తెగువ మెఱసి
నిద్రసాలించి మేల్కాన్న నేర్పుసాలఁ
గలిగి భార్గవి సర్వసంగముల విడిచి
హరిపరాధీనయై ముక్తి కరిగె నధిప! 590

వ. అని యిట్లు యయాతిచరితంబు సెప్పి భగవంతుండును సర్వభూత నివాసుండును శాంతుండును వేదమయుండును నైన వాసుదేవునికి నమస్కరించెదను. అని శుకుం డిట్లనియె. 591

౨౦ అధ్యాయము.

క. భారత! నీవు జనించిన
పూరుని వంశంబునందుఁ బుట్టినవారిం
జారుయశోలంకారుల
ధీరుల వినిపింతు నధిక తేజోధనులన్. 592

వ. పూరునకు జనమేజయుఁడు జనమేజయునకుఁ బ్రాచీన్వాంసుండు నాప్రాచీన్వాంసునకుఁ బ్రవిరోధనమన్యువు నతనికిఁ జారువుఁ బుట్టిరి. ఆచారువునకు సుద్యువు సుద్యువునకు బహుగతుండును బహుగతునకు శర్యాతియు శర్యాతికి సంయాతియు సంయాతికి రౌద్రాశ్వుండును రౌద్రాశ్వునకు ఘృతాచి యను నచ్చర లేమయందు ఋతేపువుఁ గక్షేపువు స్థలేపువుఁ కృతేపువు జలేపువు సన్నతేపువు ధర్మేపువు సత్యేపువు వ్రతేపువు వనేపువు ననువారు జగదాత్మభూతుండైన ప్రాణునకు నింద్రియంబుల చందంబునఁ బదుగురు గొడుకులు జన్మించిరి. అందు ఋతేపువునకు నంతిసారుండును నంతిసారునకు సుమతియు ధ్రువుండు నప్రతిరథుండు నన మువ్వురు పుట్టిరి. అందు నప్రతిరథునికిఁ గణ్వుండును గణ్వునికి మేధాతిథియు నతనికి బ్రస్కన్దుండు మొదలగు బ్రాహ్మణులును జన్మించిరి. ఆ సుమతికి రైభ్యుండు పుట్టె. రైభ్యునకు దుష్యంతుండు పుట్టె. 593

క. పారావార పరీతో
దారధరాభారదక్ష దక్షిణహస్త

శ్రీరాజిల్లఁగ నొకనాఁ
డా రాజేంద్రుండు వేఁట యం దభిరతుఁడై. 594

క. గండకకంఠీరవభే
రుండశశవ్యాళకోలరోహిషరురువే
దండవ్యాఘ్రమృగాదన
చండశరభశల్యభల్లచమరాటవులన్. 595

క. చప్పుడు చేయుచు మృగముల
రొప్పుచు నీరములయందు రోయుచు వలలం
ద్రిప్పుకొని పడఁగఁ బోవుచుఁ
దప్పక వేయుచును వేఁటతమకం బొప్పన్. 596

క. మృగయూథంబుల వెంటను
మృగలాంఛనసన్నిభుండు మృగయాతురుఁడై
మృగయులు గొందఱు గొలువఁగ
మృగరాజపరాక్రమంబు మెఱయఁగ వచ్చెన్. 597

వ. ఇట్లు వచ్చి వచ్చి దైవయోగంబునఁ గణ్వమహాముని తపోవనంబు సేరం జని.

సీ. ఉరుతరశ్రాంతాహియుగళంబులకుఁ బింఛ
ముల విసరెడి కేకిముఖ్యములను
గరుణతో మదయుక్తకలభంబులకు మేఁత
లిడుచు ముద్దాడు మృగేంద్రములను
ఘనమృగాదనములు గాపుగా లేళ్ళతో
రతులు సాగించు సారంగములను
నునుపుగా హోమధేనువుల కంఠంబులు
దువ్వుచు నాడు శార్దూలములను

తే. దార కలహించు [1]నుందురు దంపతులకు
మైత్రినంకించు మార్జాలమల్లములను
మతిని జాతివైరంబులు మాని యిట్లు
గలసి క్రీడించుమృగములఁ గాంచె నతఁడు. 599

1. ఉందురు = ఎలుకలు.

క. ఇత్తెఱంగున మృగజాతుల
పోత్తులు మే మెఱుఁగ మనుచు భూవల్లభుఁడుం
జిత్తములోపల నాముని
సత్త్వము సద్వృత్తమునకు సంతసపడుచున్. 600
క. హల్లకబిసరుహసరసీ
కల్లోలోత్ఫుల్లయూథికాగిరిమల్లీ
మల్లీమరువకకురువక
సల్లలితానిలమువలన సంతుష్టుండై. 601
వ. దుష్యంతుండు వచ్చు నవసరంబున. 602
క. ఇం[1]దిందిరాతిసుందరి
[2]యిందిందిరచికుర యున్న [3]దిందింద శుభం
బిం దిందువదన! యనుక్రియ
[4]నిందీవరవీథి మ్రోసె [5]నిందిందిరముల్. 603
క. మాకందర్పునిశరములు
మాకందము లగుటఁ జేసి మాకందంబుల్
మాకందము లను కైవడి
మాకందాగ్రములఁ బికసమాజము లులిసెన్. 604
వ. అంత. 605
క. ఇం దున్నకణ్వమునికిని
వందన మొనరించి తిరిగి వచ్చెద ననుచుం
బొందుగ ననుచరులను దా
నందఱ నందంద నిలిపి యటఁ జని మ్రోలన్. 606
శా. ఆ కణ్వాశ్రమమందు నీరజనివాసాంతప్రదేశంబులన్
మాకందంబులనీడఁ గల్పలతికామధ్యంబులన్ మంజురం
భాకాండాంచితశాలలోఁ గుసుమ సంపన్నస్థలిం జూచె నా
భూకాంతుండు శకుంతలన్ నవనటద్భ్రూపర్యటత్కుంతలన్. 607

1. లక్ష్మికంటెను చందగత్తె 2. తుమ్మెదలవంటి జుట్టుకలది 3. ఇదిగో ఇదిగో (ఇదే యిందే) 4. కలువపువ్వుల పంక్తియందు 5. తుమ్మెదలు 6. క్షణక్షణము నదరు కనుబొమలయందు ముసరిన అలకలు కలది.

క. దట్టపుఁదుఱుమును మీఁదికి
మిట్టించిన చన్నుఁగవయు మిఱుమిఱుచూడ్కుల్
నట్టాడునడుముఁ దేనియ
లుట్టెడుమోవియును మనము నూరింపంగన్. 608

వ. అంత నారాజకుమారుం డలరుటమ్ముల విలుగాని వెడవింట ఘణఘణాయమానంబయి మ్రోయు ఘంటాంకృతుం బంటించి తన మనంబున. 609

శా. వన్యాహారములన్ జితేంద్రియత నావాసించు నాకణ్వుఁడే
కన్యారత్నము నే గతిం గనియెం గా దీ కురంగాక్షి [1]రా
జన్యాపత్యము నాఁగ నొప్పు నభిలాషం బయ్యెఁగా దేని నే
యన్యాయక్రియలందు బౌరవుల కెం దాశించునే చిత్తముల్. 610

క. అడిగిన నృపసుతుఁ గానని
నొడివెడినో యిది మనంబు నొవ్వనని విభుం
డుడు రాజవదన నడుగక
[2]తడుమన యొక కొంత ప్రొద్దు దడఁబడఁ జొచ్చెన్. 611

వ. మఱియు నెట్టకేలకుఁ దనచిత్తసంచారంబు సత్యంబుగాఁ దలంచి యిట్లనియె. 612

క. భూపాలకకన్యక వని
నీపయిఁ జిత్తంబు నాఁటె నీవా రేరీ ?
నీపే రెవ్వరు ? నిర్జన
భూపర్యటనంబు దగవె పూర్ణేందుముఖీ ? 613

వ. అని పలుకుచున్న రాజకుమారుని వదనచంద్రికారసంబు నేత్రచకోరంబులవలనం ద్రావుచు నయ్యువిద విభ్రాంతయయి యున్న సమయంబున. 614

క.[3] కంఠేకాలునిచేతం
గుంఠితుఁ డగు టెట్లు మరుఁడు కుసుమాస్త్రంబుల్

1. రాచకూతురు. 2. సందేహముతో. 3. శివునిచేత.

లుంఠించి గుణనినాదము
ఠంఠ మ్మన బాలనేసె ఠవఠవ గదురన్. 615

వ. ఇట్లు నలరాచవాని క్రొవ్విరికోలల వేఁడిమిఁ గాలిమి పోఁడిమి సెడి యావాలుఁగంటి యిట్లనియె. 616

మ. అనివార్యప్రథ మున్ను మేనకయు విశ్వామిత్రభూభర్తయుం గని
రా మేనక డించి పోయె నడవిం గణ్వుండు నన్నింతగా
మనిచెన్ సర్వము నామునీంద్రుఁ డెఱుఁగున్ మద్భాగధేయంబునన్
నినుఁగంటిం బిదపం గృతార్థ నగుచున్ నేఁ డీ వనాంతంబునన్.

క. నీవారము ప్రజ లేమును
నీవారము పూజగొనుము నిలువుము నీవున్
నీవారును మాయింటను
[1]నీవారాన్నంబు గొనుఁడు నేఁడు నరేంద్రా! 618

వ. అని పలికిన దుష్యంతుండు మెచ్చి మచ్చెకంటి యిచ్చ యెఱింగి యిట్లనియె. 619

ఆ. రాజతనయ వగుదు రాజీవదళనేత్ర!
మాట నిజము లోని మాట లేదు
తనకు సదృశుఁ డయిన తరుణిసెఁ గైకొంట
రాజసుతకుఁ దగవు రాజవదన! 620

వ. అని మఱియుఁ దియ్యని నెయ్యంపుం బలుకులవలన నయ్యువిద నియ్యకొలిపి.

క. బంధురయశుఁడు [2]జగన్నుత
సంధుఁడు దుష్యంతుఁ డుచిత సమయజ్ఞుండై
గంధగజగమన నప్పుడు
గాంధర్వవిధిన్ వరించె గహనాంతమునన్. 622

1. నివ్వరి బియ్యపుటన్నము 2. లోకముచేఁ బొగడఁబడిన ప్రతిజ్ఞగలవాఁడు.

### భరతుని చరిత్రము.

వ. ఇవ్విధంబున నమోఘవీర్యుండగు నా రాచపట్టి దపసిరాచూలికిఁ జూలు నెక్కొలిపి మఱునాఁడు తనవీటికిం జనియెను. అయ్యింతియుఁ గొంతకాలంబునకుఁ గొడుకుం గనినఁ గణ్వమునీంద్రుం డా రాచపట్టికి జాతకర్మాది మంగళాచారంబు లొనర్చెను. ఆడింభకుండును దినదినంబునకు బాలచంద్రుఁడునుం బోలె నెదుగుచు. 623

క. కుంఠితుఁడు గాక వాఁడు
త్కంఠం దనపిన్ననాఁడె కణ్వవనచర
త్కంఠీరవముఖ్యంబుల
కంఠములం బట్టియడుచుఁ గట్టున్ విడుచున్. 624

వ. అంత నాకణ్వమునీంద్రుండు బాలకుం జూచి శకుంతల కిట్లనియె.

ఉ. పట్టపురాజు నీమగఁడు పాపఁడు నన్నిట నెక్కు డంతకుం
బట్టపు దేవివై గలువ బాగున నుండక పాఱువారితో
గట్టువనంబులో నవయఁ గాఁ బని లేదిటఁ దర్లి పోఁగదే
పుట్టినయిండ్ల మానినులు [1]పోరచిగా ననిశంబు నుందురే. 626

వ. అనిన నియ్యకొని. 627

క. ఆపిన్నవాని నతుల
వ్యాపారు నుదారువైష్ణవాంశోద్భవు భువినిం
జూపెద నంచు శకుంతల
భూపాలునికడకు వచ్చెఁ బుత్రునిఁ గొనుచున్. 628

వ. వచ్చి దుష్యంతుం డున్న సభామండపంబునకుం జని నిలిచియున్న యెడ.

మ. వలకేలన్ గురుచక్రరేఖయుఁ బదద్వంద్వంబునం బద్మరే
ఖలు నొప్పారఁగ నందు వచ్చిన రమాకాంతుండు నాఁగాంతి న
గ్గలమైయున్న కుమారు మారసదృశాకారున్ విలోకించి తాఁ
బలుకం డయ్యె విభుం డెఱింగి సతి విభ్రాంతాత్మయై యుండగన్.

1. వ్యర్థముగా.

వ. ఆ సమయంబున.

మ. అదె నీవల్లభ, వాఁడు నీసుతుఁడు, భార్యాపుత్రులం బాతురేలెన్
వదలంగా దలనాఁటి కణ్వవనికా వైవాహికారంభముల్
మది నూహింపు శకుంతలావచనముల్ మాన్యంబుగా భూవరేం
ద్ర! దయం జేకొను మంచు మ్రోసెను వియద్వాణీవధూవాక్యముల్

వ. ఇట్లశరీరవాణి సర్వభూతంబులకుం దేటపడ భరింపు మని పలికిన నా కుమారుండు భరతుం డయ్యెను. అంత నా రాజు రాజవదన నంగీకరించి తనూభవుం జేకొని కొంతకాలంబు రాజ్యంబు సేసి పరలోకంబునకుం జనియె. తదనంతరంబ.

క. రెండవహరిక్రియ ధరణీ
మండలభారంబు నిజసమంచితబాహా
దండమున నిలిపి తనకును
భండనమున నెదురు లేక భరతుం డొప్పెన్. 634

మఱియు నా దౌష్యంతి యమునాతటంబున దీర్ఘతపుండు పురోహితుండుగా డెబ్బదియెనిమిదియును గంగాతీరంబున నేఁబదియయిదును నిట్లు నూటముప్పదిమూఁ డశ్వమేధయాగంబులు సదక్షిణంబులుగా నొనర్చి దేవేంద్రవిభవంబున నతిశయించి పదుమూఁడువేలు నెనుబదినాలుగు కదుపు ధేనువులు గలయది ద్వంద్వం బనం బరఁగు నట్టి వేయిద్వంద్వంబుల పాఁడిమొదవులఁ గ్రేపులతోడ నలంకారసహితలం జేసి వేవురు బ్రాహ్మణులకిచ్చి మష్కారతీర్థకూలంబున విప్రముఖ్యులకుఁ బుణ్యదినంబున గనకభూషణశోభితంబు లయి ధవళదంతంబులు గల నల్లని యేనుంగులం బదునాలుగు లక్షలనొసంగె. దిగ్విజయకాలంబున శకశబరబర్బరకష్కకిరాతకహూణమ్లేచ్ఛదేశంబుల రాజులం బీచంబడంచి రసాతలంబున రాక్షస కారాగృహంబులం దున్నవేల్పుల గరితలం బెక్కండ్ర విడిపించి తెచ్చి వారల వల్లభులం గూర్చె. త్రిపుర దానవుల జయించి నిర్జరుల నిజమందిరంబుల నునిచెను. అతని రాజ్యంబున గగనధరణీతలంబులు ప్రజలు గోరిన కోరిక లిచ్చుచుండె నివ్విధంబున. 635

ఆ. సత్యచరితమందుఁ జలమందు బలమందు
భాగ్యమందు లోకపతులకంటె
నెక్కుడైన పేర్మి నిరువదియేడు వే
లేండ్లు ధరణి భరతుఁ డేలె నధిప! 636

క. [1]అర్థపతికంటెఁ గలిమిఁ గృ
తార్థుండై యతులశౌర్య మలవడియు నతం
డర్థములను బ్రాణములను
వ్యర్థములని తలఁచి శాంతుఁ డయ్యె నరేంద్రా! 637

క. భరతునిభార్యలు మువ్వురు
వరుసం బుత్త్రికులఁ గాంచి వల్లభు శోడన్
సరిగారని తోడ్తోడను
శిరములు దునుమగా శిశువు లధిపా! 638

వ. ఇట్లు విదర్భరాజపుత్రికలు శిశువులం జంపిన భరతుం డపుత్త్రకుండై మరుత్స్తోమంబను యాగంబు పుత్త్రార్థియై చేసి దేవతల మెప్పించెను. అయ్యవసరంబున. 639

సీ. అన్న! యిల్లాలిఁ జూలాలిని మమతాఖ్యఁ
జూచి బృహస్పతి సురతమునకుఁ
దొరఁకొని పైపడ్డఁ దొల్లి గర్భంబున
నున్నబాలుఁడు భయంబొదవి వలదు
తగదని మొఱసేయఁ దమకంబుతో వాని
నంధుండవగు మన్న నలిగి వాఁడు
యోనిలోపలివీర్య మూడఁ దన్నిన నేలఁ
బడి బిడ్డఁడై యున్నఁ బాయ లేక

ఆ. నితని పెంపుకొడుకు లిరువురు జన్మించి
రనుచు వెలయఁ జేయు మనిన మమతఁ

1. కుబెరుకం టె.

చెంపఁజాల నీవ పెంపు భరింపుమీ
ద్వాజుననుచుఁ జనియె దాని విడిచి. 640

వ. ఇట్లుచథ్యునిభార్య యగు మమతయు బృహస్పతియు శిశువుంగని ద్వాజుం డైన వీని నీవ నీవ భరింపుమని వదినె మఱఁదులు దమలో నొండొరువులం బలికిన కారణంబున వాఁడు భరద్వాజుం డయ్యె. గర్భస్థుండయినవాఁడు బృహస్పతి శాపంబున దీర్ఘతముండయ్యె. అంత నాబృహస్పతియు మమతయు నుధయించిన వాని విడిచి నిజేచ్ఛం జనిన మరుత్తులు వానిం బోషించి పుత్త్రార్థి యయిన భరతున కిచ్చిరి. భరతుండు వానిం జేకొనియె. వితథంబయిన భరత వంశంబునకు నాభరద్వాజుండు వంశకర్తయగుటం జేసి వితథుం డనం బరఁగెను. ఆవితథునికి మన్యువు, మన్యువునకు బృహత్క్షత్త్రి, జయ, మహావీర్య, నర, గర్గులను వారేవురు సంభవించిరి. అందు నరునికి సంకృతి సంకృతికి గురుండు రంతిదేవుం డన నిరువురు జన్మించిరి. అందు.

౨౧ అధ్యాయము

రంతిదేవుని చరిత్రము

సీ. రాజవంశోత్తమ ! రంతిదేవుని కీర్తి
యేల చెప్పఁగ విను మిందునందు
నారాజు దనసంచితార్థంబు లన్నియు
నెడపక దీనుల కిచ్చియిచ్చి
సకుటుంబుఁడై ధైర్యసంయుతుండై పేద
యై కూడు నీరు లేకధమవృత్తి
నుండేని నలఁవదియెనిమిది దివసముల్
చరియింప నొకదివసంబు రేపు

ఆ. నెయ్యి పాయసంబు నీరును గలిగిన
బహుకుటుంబభారభయముతోడ
నలసి నీరువట్టు నాకలియును మిక్కి
లొదవఁ జూచి కుడువ నుత్సహించె. 642

వ. అయ్యవసరంబున. 643

సీ. అతిథిభూసురుఁ డొక్కఁ డాహార మడిగినఁ
గడపక ప్రియముతో గారవించి
హరిసమర్పణ మంచు నన్నంబులో సగ
మిచ్చిన భుజించి యేఁగె నాతఁ
డంతలో నొకశూద్రుఁ డశనార్థియై వచ్చి
పొడసూప లేదనఁ బోక తనకు
నున్నయన్నములోన నొకభాగ మిచ్చిన
సంతుష్టుఁడై వాఁడు సనిన వెనుక

ఆ. కుక్కఁగమియుఁ దాను నొక్కఁడే తేర నా
యన్నశేషమిచ్చి సన్నయంబు
లాడి మ్రొక్కి పంప నోడక చండాలుఁ
డొక్కఁడరుగుదెంచి చక్కనిలిచి. 644

క. హీనుఁడఁ జండాలుండను
మానవకులనాథ! దప్పి మానదు నవలం
బోనేర నీకుఁ జిక్కిన
పానీయము నాకుఁ బోసి బ్రతికింపఁగదే. 645

వ. అనిన వాని దీనాలాపంబులకుఁ గరుణించి రాజిట్లనియె. 646

ఉ. అన్నములేదు కొన్నిమధురాంబువు లున్నవి, త్రావు మన్నరా
వన్న! శరీరధారులకు నాపదవచ్చిన వారియాపదల్
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుటకన్న నొండుమే
లున్నదె నాకు దిక్కు పురుషోత్తముఁడొక్కఁడచుమ్ము [1]పుల్కసా!

వ. అని పలికి.

మ. బలవంతం బగు నీరువట్టున నిజప్రాణాంతమై యున్నచో
వలయం దేమియు వీని[2]హృజ్జ్వరము నాయాసంబు ఖేదంబు నా

1 చండాలుఁడా! 2 హృదయబాధను

జలదానంబున నేఁడు మాఱు ననుచున్ సర్వేశ్వరాధీనుఁడై
జలముం బోసెను రంతిదేవుఁడు దయం జండాలపాత్రంబునన్.

వ. తదనంతరంబ బ్రహ్మాదిదేవతలు సంతోషించి రంతిదేవునికి మేలు సేయందలంచి నిజాకారంబులతో ముందట నిలువంబడి యారాజ ధైర్యపరీక్షార్థంబు దము చేసిన వృషలాదిరూపంబులగు విష్ణుమాయ నెఱింగించిన నానరేంద్రుం డందఱకు నమస్కరించి. 650

క. వారల నేమియు నడుగక
నారాయణభక్తి దనమనంబున వెలుఁగన్
ధీరుం డాతఁడు [1]మాయా
పారజ్ఞుం డగుచుఁ బరమపదముం బొందెన్. 651

క. ఆ రాజర్షిని గొలిచిన
వారెల్లఁ దదీయయోగవైభవమున శ్రీ
నారాయణచింతనులై
చేరిరి యోగీశు లగుచు సిద్ధపదంబున్. 652

వ. ఇట్లు రంతిదేవుండు [2]విజ్ఞానగర్భిణి యగు భక్తివలనఁ బరమపదంబునకుం జనియెను. అంత గర్గునకు శిని జన్మించె. శినికి గార్గ్యుండు గలిగెను. ఆతనినుండి బ్రాహ్మణకులంబయ్యె. మహావీర్యునికి నురుక్షయుండును నురుక్షయునకుఁ ద్రయ్యారుణియుఁ గవియుఁ బుష్కరారుణియు ననుమువ్వురు సంభవించిరి. వారును బ్రాహ్మణులయి చనిరి. బ్రహ్మక్షత్త్రునికి సుహోత్రుండు సుహోత్రునకు హస్తియు జనించిరి. ఆహస్తి దన పేర హస్తినాపురంబు నిర్మించెను. ఆహస్తికి నజమీఢుండును ద్విమీఢుండును బురుమీఢుండును నన మువ్వురు జనియించిరి. అందజమీఢుని వంశంబునం బ్రియమేధాదులు గొందరు పుట్టి బ్రాహ్మణులయి చనిరి. అయ్యజమీఢునికి బృహదిషువు నతని పుత్త్రుండు బృహద్ధనువు నతనికి బృహత్కాయుండు నతనికి జయద్రథుండు నతనికి విశ్వజిత్తు విశ్వజిత్తునకు సేనజిత్తు సేనజిత్తునకు రుచిరాశ్వుండు దృఢహానువుఁ గాశ్యుండు వత్సుండు నన నలుగురు

1 మాయయొక్క తుదనెఱింగినవాఁడై 2 స్వస్వరూపజ్ఞానమునకుఁ గారణమైనభక్తి.

జనించిరి. అందు రుచిరాశ్వునకుఁ బ్రాజ్ఞుండును నతనికిఁ బృథుసేనుం
డును బృథుసేనునికిఁ బారుండును వానికి నీపుండును నీపునికి
నూర్వురు కొడుకులును బుట్టిరి. మఱియును. 653

ఆ. శుకుని కూఁతురైన సుందరి సత్కృతిఁ
బొందివేడ్కనీవ భూవిభుండు
విమలయోగవిత్తు విజ్ఞానదీపితో
దారచిత్తు బ్రహ్మదత్తుఁ గనియె. 654

వ. ఆ బ్రహ్మదత్తుండు జైగిషవ్యోపదేశంబున యోగతంత్రంబునంజేసి
గోదేవి యను భార్యవలన విష్వక్సేనుండను కుమారునిం గనియె.
విష్వక్సేనునకు నుదక్సేనుండు నుదక్సేనునకు భల్లాదుండు వీరలు
బార్హదిషవులను రాజులైరి. ద్విమీఢునకు యమీనరుండు యమీ
నరునికిఁ గృతిమంతుండు గృతిమంతునికి సత్యధృతి సత్యధృతికి
దృఢనేమి దృఢనేమికి సుపార్శ్వకృత్తు సుపార్శ్వకృత్తునకు సుపా
ర్శ్వుండును సుపార్శ్వునకు సుమతి సుమతికి సన్నతిమంతుండు
సన్నతిమంతునికొడుకు కృతి యనువాఁడు హిరణ్యనాభునివలన
యోగమార్గం బెఱింగి శోకమోహంబులు విడిచి తూర్పుదేశంబున
సామసంహిత పఠియించెను. అతనికి నుగ్రాయుధుండును నుగ్రాయు
ధునకు క్షేమ్యుండు క్షేమ్యునకు సువీరుండు సువీరునకుఁ బురంజ
యుండు బురంజయునకు బహురథుండు జన్మించిరి. హస్తికొడుకు
పురుమీఢునికి సంతతిలేదయ్యెను. అజమీఢునికి నళిని యను
భార్యయందు నీలుండు నీలునికి శాంతియు శాంతికి సుశాంతియు
సుశాంతికిఁ బురుజుండు బురుజునికి నర్కుండు నర్కునికి భర్మ్యా
శ్వుండు భర్మ్యాశ్వునకు ముద్గల యవీనర బృహదిషు కాంపిల్య
సృంజయులను వారేవురుం బుట్టిరి. 655

క. మించిన భర్మ్యాశ్వుండు సుత
పంచకమునుజూచి విషయపంచకమును వ
ర్జించితిఁ దల మని వల్కినఁ
బాంచాలురు నాఁగసుతులు పరఁగిరి ధరణిన్. 656

వ. అంతముద్గలునినుండి బ్రాహ్మణకులంబై ముద్గలగోత్రంబు నానెగడె.

భర్మ్యాశ్వపుత్త్రిం డైన యామ్ముద్గలునికి దివోదాసుండు నహల్య యను కన్యకయునుం బుట్టిరి. ఆయహల్యయందు గౌతమునికి శతానందుండు పుట్టె. శతానందునికి ధనుర్వేదవిశారదుండయిన సత్యధృతిపుట్టెను. అతం డొకనాఁడు వనంబున నూర్వశిం గనిన నతనికి రేతః పాతంబై తద్వీర్యంబు శరస్తంబంబునం బడి మిథునంబయ్యె నాసమయంబున. 657

క. చపలరతి శంతనుం డను
నృపవరుఁ డడవికిని వేఁట నెపమునఁ జనుచుం
గృపతో శిశుయుగముం గని
కృపియుఁ గృపుండనుచుఁ దెచ్చి గృహమునఁ బెంచెన్. 658

౨౨ అధ్యాయము

వ. ఆ కృపి ద్రోణునకు భార్య యయ్యె. దివోదాసునకు మిత్రాయువు మిత్రాయువునకుఁ జ్యవనుఁడుఁ జ్యవనునకు సుదాసుండు సుదాసునకు సహదేవుండు సహదేవునకు సోమకుండు సోమకునకు సుజన్మకృత్తు సుజన్మకృత్తునకు నూర్వురుకొడుకులుం గలిగిరి. వారిలో జంతువనువాఁడు జ్యేష్ఠుఁడు. కడచూలు పృషతుండు. పృషతునకు ద్రుపదుండు ద్రుపదునకు ధృష్టద్యుమ్నాదు లయిన కొడుకులును ద్రౌపది యనుకూఁతురుం గలిగిరి. ధృష్టద్యుమ్ననకు ధృష్టకేతువు పుట్టె. వీరలు పాంచాలరాజులని యెఱుంగుము. మఱియు నయ్యజమీఢునికొడుకు ఋక్షుండు ఋక్షునకు సంవరణుం డాసంవరణుండు తపతి యనియెడి సూర్యకన్యయందుఁ గురువుం గనియె. ఆ కురువుపేరం గురుక్షేత్రంబయ్యెను. ఆకురువునకుఁ బరీక్షిత్తు సుధనువు జహ్నువు నిషధుండు ననువారు నలువురు పుట్టిరి. అందుఁ బరీక్షిత్తు కొడుకులు లేక చనియె. సుధనువునకు సుహోత్రుం డతనికిఁ జ్యవనుండు చ్యవనునకుఁ గృతి గృతికి వసువు వసువునకు బృహద్రథకుసుంభ మత్స్యప్రత్యగ్రచేదిపాదులు పుట్టిరి. అందు బృహద్రథునకుఁ గుశాగ్రుండు గుశాగ్రునికి ఋషభుండు ఋషభునికి సత్యహితుండు సత్యహితునికిఁ బుష్పవంతుండు పుష్పవంతునకు జహ్ను వనువాఁడు పుట్టెను. 659

సీ. ఆ బృహద్రథునకు నన్యభార్యాగర్భ
ములు రెండు తగ ఖండములు జనించెఁ
దునుకలు గని తల్లి తొలఁగంగ వైచిన
సంధించె నొకటిగా జరయనంగ
నొక దైత్యకాంత వాఁ డొప్పె జరాసంధుఁ
డన గిరివ్రజపుర మాతఁడేలె
నతనికి సహదేవుఁ డతనికి సోమాపి
తనయుఁ డాతనికి శ్రుతశ్రవుండు
తే. జహ్నుపుత్త్రుండు సురథుండు జనవరేణ్య!
యతనికొడుకు విదూరథుఁ డతనిపట్టి
సార్వభౌముండు వానికి సంభవుండు
విను జయత్సేనుఁ డనువాఁడు విమలకీర్తి. 660

వ. ఆ జయత్సేనునికి రథికుండు రథికునకు నయుతాయువు నయుతాయువునకుఁ గ్రోధనుండు క్రోధనునకు దేవాతిథియు దేవాతిథికి ఋక్షుండు ఋక్షునికి భీమసేనుండు వానికిఁ బ్రతీపుండుఁ బ్రతీపునకు దేవాపి శంతను బాహ్లీకు లన మువ్వురు గొడుకులు పుట్టిరి. అందు.

సీ. దేవాపి రాజ్యంబు దీర్ప నొల్లక వనం
బున కేఁగెఁ దమ్ముండు పూర్వజన్మ
మందు మహాభిషుఁ డనియెడు వాఁడు శం
తనుఁ డయ్యె వాఁడె యీ ధాత్రినెల్ల
నేలుచుఁ గరముల నేవృద్ధు ముట్టిన
వాఁడెల్ల నిండుజవ్వనము నొందు
నతఁడు శాంతిప్రాప్తుఁడై యున్నదానఁ బం
డ్రెండేండ్లు [1]వజ్రి వర్షింప కున్న
ఆ. వృష్టి లేనిచొప్పు విప్రులనడిగిన
నన్న యుండఁ దమ్ముఁ డగ్నిహోత్ర
దారసంగ్రహంబు దాల్చినఁ బరివేత్త
యగ్రుడు గాన నీవ యతఁడ వైతి. 662

1. ఇంద్రుఁడు.

వ. అది కారణంబుగా నన్న యుండఁ దమ్ముండుఁ రాజ్యార్హుండుఁగాఁడు. నీవు పరివేత్తవు. మీయన్నకు రాజ్యం బిచ్చిన ననావృష్టిదోషంబు సెడునని బ్రాహ్మణులు వల్కిన శంతనుండు వనంబునకుం జని దేవాపికిఁ బ్రియంబుసెప్పి రాజ్యంబు సేకొమ్మని పల్కెను. అంతకు మున్న వానితండ్రి దేవాపిని రాజ్యంబున కర్హుం జేయం దలంచి విప్రులం బిలిచిన నా విప్రులు పాషండమతవాక్యంబులు దేవాపికి నుపదేశించిన దేవాపి వేదంబుల నిందించిన పాషండుండును దేవ దూషకుండును నయ్యెం గావున దేవాపికి రాజ్యంబు లేదని బ్రాహ్మణులు సెప్పిన శంతనుండు మగిడివచ్చి రాజ్యంబుఁ జేకొని యెను. అంత వర్షంబును గురిసెను. ఇవ్విధంబున. 663

క. దేవాపి కలాపపురం
బావాసము గాఁగ యోగి యై యున్నాఁడు
ర్వీవర కలి నష్టం బగు
[1]జైవాతృకకులము మీఁద సంస్థాపించున్. 664

వ. బాహ్లికుం డనువానికి సోమదత్తుండు పుట్టె. సోమదత్తునకు భూరియు భూరిశ్రవసుఁడును శలుఁడు ననువారు మువ్వురు పుట్టిరి. 665

క. భాతిగ శంతనునకు గం
గాతటినికి వైష్ణవాగ్రగణ్యుఁడు [2]ఘోరా
రాతినయననీలోత్పల
భీతికరగ్రీష్ముఁడైన భీష్ముఁడు పుట్టెన్. 666

ఆ. పరశురాముతోడఁ బ్రబలిఘటించి జయింప
నన్యులోకనిఁ గాన మతనిఁదక్క
వీరయూథపతి వివేకధర్మజ్ఞుండు
దివిజనదిసుతుండు దేవసముఁడు. 667

వ. ఆ శంతనునకు దాశకన్యకయైన సత్యవతియందుఁ జిత్రాంగద విచిత్ర వీర్యులు పుట్టిరి. అందుఁ జిత్రాంగదుండు గంధర్వులచే నిహతుం

1. చంద్రవంశము 2. ఘోరశత్రుల నేత్రములనెడి కలువలకు భయముగూర్చు వేడిమి కలవాఁడు.

డయ్యె. మఱియును. 668

ఉ. సత్యవతీవధూటి మును శంతను పెండ్లము గానినాఁడు సాం
గత్యమునం బరాశరుఁడు గర్భము సేసిన బాదరాయణుం
డత్యధికుండు శ్రీహరికళాంశజుఁడై ప్రభవించె నిత్యముల్
సత్యము లైన వేదముల సాంగములన్ విభజింపఁ దక్షుఁడై. 669

ఆ. బాదరాయణుండు భగవంతుఁ డనఘుండు
పరమగుహ్యమైన భాగవతము
నందనుండు నయిన నాకుఁ జెప్పెను శిష్య
జనుల [1]మొఱఁగి యేను జదువుకొంటి. 670

వ. ఆ విచిత్రవీర్యునికిఁ గాశిరాజుకూఁతుల నంబికాంబాలికల భీష్ముండు బలాత్కారంబునఁ దెచ్చి వివాహంబు సేసిన విచిత్రవీర్యుండు వారలం దగిలి మనోజరాగమత్తుండై చిరకాలంబు నానావిధక్రీడల విహరించుచు [2]రాజయక్ష్మపీడితుండై మృతుం డయ్యెను. అంత. 671

క. అతని సతులవలన సుతులు
సుత కను మని తల్లి వనుప సొరిదిం గనియెన్
ధృతరాష్ట్రపాండువిదురుల
నుతచరితుఁడు బాదరాయణుండు నరేంద్రా! 672

వ. అంత ధృతరాష్ట్రునికి గాంధారియందు దుర్యోధనాదులగు కొడుకులు నూర్వురును దుశ్శలయను కన్యకయును జన్మించిరి. మృగశాపభయంబునం జేసి భార్యం బొంద వెఱచిన పాండునకుఁ గుంతీదేవియందు ధర్మానిలేంద్రుల ప్రసాదంబున యుధిష్ఠిరభీమార్జునులను మువ్వురును మాద్రిదేవివలన నాసత్యప్రసాదంబున నకులసహదేవులను వారిద్దఱును గా నేవురు పుట్టిరి. అయ్యేవురకును ద్రుపదరాజపుత్త్రియైన ద్రౌపదియందుఁ గ్రమంబునం బ్రతివింధ్యుండును శ్రుతసేనుండును శ్రుతకీర్తియు శతానీకుండును శ్రుతకర్ముండును నన నేవురు పుట్టిరి. మఱియు యుధిష్ఠిరునకుఁ బౌరవతియందు దేవకుండును భీమసేనునికి హిడింబయందు ఘటోత్కచుండును గాళియందు సర్వగతుండును సహదేవునికి విజయయందు

1. కప్పిపుచ్చి. 2. కుష్ఠు.

సుహోత్రుండును నకులునకు రేణుమతియందు నిరమిత్రుండును నర్జునునకు నులూపియను నాగకన్యకయందు నిలావంతుండును మణలూరుపతిపుత్రియైన చిత్రాంగదయందు బభ్రువాహనుండును సుభద్రయందు శౌర్యధైర్యతేజోవిభవంబుల నఖలరాజనికరంబునం బ్రఖ్యాతుండైన యభిమన్యుండును జన్మించిరి. అందు బభ్రువాహనుం డర్జున [1]నియోగంబున మాతామహుని గోత్రంబునకు వంశకర్త యయ్యె. 673

ఉ. అన్యసుపూజ్య నీజనకుఁ డై యభిమన్యుఁడు భూవరేంద్రమూ
ర్ధన్యుఁడు ధన్యమార్గణకదంబవిదారితవైరివీరరా
జన్యుఁడు జన్యభీతగురుసైన్యుఁడు సైన్యసమూహనాథదృ
జ్మాన్యుఁడు మాన్యకీర్తి మహిమం దనరెం గురువంశకర్తయై. 674

వ. ఆ యభిమన్యునకు నుత్తరయందు నీవు జన్మించితివి. 675

క. ద్రోణసుతు తూపువేఁడిమిఁ
బ్రాణంబులఁ బాసి హరికృపాదర్శన సం
త్రాణంబున బ్రదికితి కా
క్షోణీశ్వర! మున్ను నీ శిశుత్వమువేళన్. 676

వ. నీ కుమారులు జనమేజయశ్రుతసేనభీమసేనోగ్రసేను లనునల్వురు వీరలయందు. 677

ఆ. నీవు తక్షకాహినిహతుండ వని విని
సకలసర్పలోకసంహృతముగ
సర్పయాగ మింక జనమేజయుఁడు సేయఁ
గలఁడు పూర్వరోషకలితుఁ డగుచు. 678

వ. మఱియు నతండు సర్వధరణీమండలంబును జయించి కావషేయుండు పురోహితుండుగా నశ్వమేధంబు సేయంగలవాఁడు. వానికి శతానీకుండు జనియించి యాజ్ఞవల్క్యునితోడ వేదంబులు పఠించి కృపాచార్యునివలన విలువిద్యనేర్చి శౌనకునివలన నాత్మజ్ఞానంబు బడయఁ గలవాఁడు. ఆ శతానీకునికి సహస్రానీకుండు వానికి నశ్వమేధజుం డశ్వమేధజునికి నాసీమకృష్ణుండా సీమకృష్ణునకు నిచకుం

1. ఏర్పాటు. (నిర్ణయము) (ఆజ్ఞ)

డానిచకుండు గజాహ్వయంబు నదిచే హృతంబు గాఁ గౌశాంబి యందు వసియించును. ఆతనికి నుపుం డుష్ణునికిఁ జిత్రరథుండు చిత్ర రథునకు శుచిరథుండు శుచిరథునికి వృష్టిమంతుండు వృష్టిమంతునికి సుషేణుండు సుషేణునికి సునీతుండు సునీతునికి నృచక్షువు నృచ క్షువునకు సుఖానిలుండు సుఖానిలునికిఁ బరిప్లవుండు బరిప్లవునకు మేధావి మేధావికి సునయుండు సునయునికి నృపంజయుండు నృపం జయునికి దూర్వుండు దూర్వునికి నిమి నిమికి బృహద్రథుండు బృహద్రథునకు సుదాసుండు సుదాసునికి శతానీకుండు శతానీకు నకు దుర్దమనుండు దుర్దమనునికి విహీనరుండు విహీనరునికి దండ పాణి దండపాణికి మితుండు మితునకు క్షేమకుండు క్షేమకునకు బ్రహ్మక్షత్త్రంబువాఁడు నిర్వంశుండై దేవర్షి సత్కృతుండై కలి యుగంబునందుఁ జనం గలవాఁడు. 689

క. జగతి నిటమీఁదఁ బుట్టెడు
మగధాధీశ్వరుల నిఖిలమనుజేశ్వరులన్
[1]నిగమాంతవిదులఁ జెప్పెద
సుగుణాలంకార! ధీర! సుభగవిచారా! 690

వ. జరాసంధపుత్రుం డయిన సహదేవునికి మార్జాలి మార్జాలికి శ్రుత శ్రవుండు శ్రుతశ్రవునకు నయుతాయువు నయుతాయువునకు నిర మిత్రుండు నిరమిత్రునకు సునక్షత్రుండు సునక్షత్రునికి బృహత్సే నుండు బృహత్సేనునికిఁ గర్మజిత్తు గర్మజిత్తునకు శ్రుతంజయుండు శ్రుతంజయునకు విప్రుండు విప్రునకు శుచి శుచికి క్షేముండు క్షేము మునికి సువ్రతుండు సువ్రతునకు ధర్మనేత్రుండు ధర్మనేత్రునకు శ్రుతుండు శ్రుతునకు దృఢసేనుండు దృఢసేనునికి సుమతి సుమతికి సుబలుండు సుబలునకు సునీతుండు సునీతునకు సత్యజిత్తు సత్యజిత్తు నకు విశ్వజిత్తు విశ్వజిత్తునకుఁ బురంజయుండును జన్మించెదరు. అని చెప్పి మఱియు నిట్లనియె. 691

ఆ. వినుము మగధదేశవిభులు జరాసంధ
ప్రముఖధరణిపతులు ప్రబలయశులు

1. వేదాంతములఁ దెలిసినవారిని.

వీరు కలియుగమున వేయేండ్ల లోపలఁ
బుట్టి గిట్టఁ గలరు భూవరేంద్ర! 682

౨౩ అధ్యాయము

వ. యయాతికొడుకు కనువునకు సభానరుండుఁ జక్షువుఁ బరోక్షుండు
ననువారు మువ్వురు పుట్టిరి. అందు సభానరునికిఁ గాలనాథుండు గాల
నాథునకు సృంజయుండు సృంజయునకుఁ బురంజయుండుఁ బురం
జయునకు జనమేజయుండు జనమేజయునకు మహాశాలుండు మహా
శాలునికి మహామనసుండు మహామనసునకు సుశీనరుండు తితిక్షువన
నిరువురు జన్మించిరి. అందు సుశీనరునకు శిబివనక్రిమిదర్పు లన
నలువురు జన్మించిరి. అందు శిబికి వృషదర్పసువీరమద్రకేకయులు
నలువురు పుట్టిరి. తితిక్షునకు రుశద్రథుండు రుశద్రథునకు హేముండు
హేమునకు సుతపుండు సుతపునకుబలియుఁ బుట్టిరి. ఆ బలివలన
నంగ వంగ కళింగ సింహ పుండ్రాంధ్రులను పేర్లుగల వారార్వురు
కుమారులు పుట్టిరి. వారలు దూర్పు దేశంబునకు రాజులయి
దేశంబులకుఁ దమతమ నామధేయంబులిడి యేలిరి. సువీరునకు
సత్యరథుండు సత్యరథునికి దివిరథుండు దివిరథునికి ధర్మరథుండు
ధర్మరథునకుఁ జిత్రరథుండుఁ బుట్టిరి. ఆచిత్రరథుండు రోమపాదుండు
నాఁ బరఁగె. 683

క. సంతతి లేనితనంబునఁ
జింతించుచు నుండ నతని చెలికాఁడగు ధీ
మంతుఁడు దశరథుఁ డతనికి
సంతతిగా నిచ్చె నాత్మజను శాంతాఖ్యన్. 684

వ. అంత రోమపాదుండు దనకూఁతురు శాంత యని కైకొని పెంపు
చుండ నారాజు రాజ్యంబునఁ గొంతకాలంబు వర్షంబు లేమికిం
జింతించి విభాండకసుతుండైన ఋశ్యశృంగుండు వచ్చిన వర్షంబు
గురియునని పెద్దలవలన నెఱింగి. 685

క. ఆ రాజు ఋశ్యశృంగుని
ఘోరతపోనియముఁ దెచ్చు కొఱకై పనిచె

వారసతుల నేర్పరుల ను
దారస్తనభారభీరుతరమధ్యగలన్. 686

వ. వారలుఁ జని. 687

తే. కాంతలార! [1]మెకము గన్నది మొదలుగా
నాఁడువారి నెఱుఁగఁ డడవిలోన
గోఁచి బిగియఁగట్టు కొనిన యా[2]వడుగని
[3]మత్తి కాని రతికి మరపవలయు. 688

వ. అని పలుకుచు. 689

క. ఆడుచుఁ జెవులకు నింపుగఁ
బాడుచు [4]నాలోకనిశితబాణౌఘములన్
వీడుచు డగ్గఱ నోడుచుఁ
జేసియ లాతపసి కడకుఁ జేరిరి కలఁపన్. 690

వ. అయ్యవసరంబున వారలం జూచి. 691

సీ. మిళితాళినీలధమ్మిల్లభారంబులు
చారుజటావిశేషంబు లనియు
భర్మాంచలోజ్జ్వలప్రభదుకూలంబులు
తతచర్మవస్త్రభేదంబు లనియు
బహురత్నకీలితభాసురహారంబు
లధికరుద్రాక్షమాలాదు లనియు
మలయజమృగనాభిమహితలేపంబులు
బహువిధభూతిలేపంబు లనియు

తే. మధురగానంబు శ్రుతియుక్త మంత్రజాతు
లనియు వీణెలు దండంబు లనియు సతుల
మూర్తు లెన్నఁడు నెఱుఁగని ముగుద తపసి
వారిఁ దాపసులని డాయ వచ్చి మ్రొక్కె. 692

వ. ఇట్లు వచ్చి మ్రొక్కిన ఋశ్యశృంగుం జూచి నగుచు డగ్గఱి. 693

---

1. లేడి. 2. బ్రహ్మచారిని. 3. కాముకుని. 4. చూపులనెడి తీక్ష్ణమైనబాణములచే,

సీ. సేమమే యని సతుల్ సేతుల గ్రుచ్చి క
రక్కశకుచంబులు మోవఁ గౌఁగిలించి
చిరతపోనియతి డస్సితిగదా యనిమోముఁ
గంఠంబు నాభియుఁ గలయఁ బుడికి
క్రొత్తదీవన లివి గొను మని పీనుల
పొంత నాలుకలఁ జప్పుళ్ళు చేసి
మావనంబుల పండ్లు మంచివి తినుమని
పెక్కు భక్ష్యంబులు ప్రీతి నొసఁగి

ఆ. నూతనాజినంబు నునుపిది మేలని
గోఁచి విడిచి మృదుదుకూల మిచ్చి
పూని మరగఁజేసి మా పర్ణశాలకుఁ
బోద మనుచుఁ గొంచుఁ బోయి రతని. 694

వ. ఇట్లు హరిణీసుతుండు కాంతాకటాక్షపాశబద్ధుండై వారల వెంటం
జని రోమపాదుకకకుం బోయిన నతండు దన ప్రియనందన యైన
శాంతనిచ్చి పురంబున నునిచికొనియెను. అమ్మునీశ్వరుండు వచ్చిన
వర్షప్రతిబంధదోషంబు సెడి వర్షంబు గురిసెను. అంత. 695

ఆ. ఆనృపాలచంద్రుఁ డనపత్యుఁడై యుండ
నెఱిఁగి మునికులేంద్రుఁ డింద్రుఁగూర్చి
యిష్టి చేసి సుతుల నిచ్చె నాతనికృపఁ
బంక్తిరథుఁడు పిదపఁ బడసె సుతుల. 696

వ. ఆ రోమపాదునకుఁ జతురంగుఁడును జతురంగునకుఁ బృథులాక్షుం
డును బృథులాక్షునికి బృహద్రథుండు బృహత్కర్ముండు బృహద్భా
నుండు ననువారు మువ్వురు వుట్టిరి. అందు బృహద్రథునకు బృహ
న్మనసుఁడు బృహన్మనసునకు జయద్రథుండు జయద్రథునకు విజ
యుఁడు విజయునకు సంభూతియను భార్యయందు ధృతియు
నాధృతికి ధృతవ్రతుండు ధృతవ్రతునకు సత్యకర్ముండు సత్యకర్మునకు
నతిరథుండును జన్మించిరి. 697

ఆ. కుంతి చిన్ననాఁడు గోరి సూర్యునిఁ బొంద
బిడ్డఁ డుదితుఁడైనఁ బెట్టెఁ బెట్టి
గంగ నీట విడువఁ గని యతిరథుఁ డంత
గర్ణుఁ డనుచుఁ గొడుకు గారవించె. 698

వ. ఇట్లతిరథునకుఁ [1]గానీనుండైన కర్ణుండు కొడుకయ్యె. కర్ణునకు వృషసేనుండు పుట్టెను. అయ్యయాతికొడుకైన ద్రుహ్యునకు బభ్రుసేతువు బభ్రుసేతువునకు నారబ్ధుండు నారబ్ధునకు గాంధారుండు గాంధారునకు ఘర్మ్మండు ఘర్మ్మనకు ఘృతుండు ఘృతునకు దుర్మ్మదుండు దుర్మదునకుఁ బ్రచేతసుండు బ్రచేతసునకు నూర్గురుపుట్టి మ్లేచ్ఛాదిపతులయి యుదగ్దిశ నాశ్రయించిరి. తుర్వసునకు వహ్ని వహ్నికి భర్గుండు భర్గునకు భానుమంతుండు భానుమంతునకుఁ ద్రిసానువు ద్రిసానువునకుఁ గరంధముండును గరంధమునకు మరుత్తుండు నతనికి యయాతిశాపంబున సంతతి లేదయ్యె. వినుము. 699

యదువంశచరిత్రము.

చ. అనఘ! యయాతి పెద్దకొడుకైన యదుక్షితిపాలువంశమున్
వినినఁ బఠించినన్ నరుఁడు వృద్ధియుఁ బుట్టఁడు ముక్తిఁబొందు న
య్యనుపమమూర్తి విష్ణుఁడు నరాకృతిఁబొంది జనించెఁ గావునన్
వినుము నరేంద్ర! నాపలుకు వీనులపండువు గాఁగఁ జెప్పెదన్.

వ. యదువునకు సహస్రజిత్తుఁ గ్రోష్టువు నలుండు రిపుండు ననువారు నలువురు సంభవించిరి. అందుఁ బెద్దకొడుకైన సహస్రజిత్తునకు శతజిత్తు గలిగెను. ఆశతజిత్తునకు మహాహయ వేణుహయ హేహయులనువారు ముప్వురు జనించిరి. అందు హేహయునకు ధర్మ్మండు ధర్మ్మనకు నేత్రుండు నేత్రునకుఁ గుంతి గుంతికి మహిష్మంతుండు మహిష్మంతునికి భద్రసేనుండు భద్రసేనునకు దుర్మదుండు దుర్మదునికి ధనికుండు ధనికునికిఁ గృతవీర్య కృతాగ్ని కృతకర్మ కృతౌజులను నలుగురు సంభవించిరి. అందుఁ గృతవీర్యునికి నర్జునుండు జనియించె. బుద్ధిబలంబున. 701

1. కన్యకుఁ బుట్టినవాఁడు.

సీ. హరికళాసంజాతుఁ డైన దత్తాత్రేయు
సేవించి సద్యోగసిద్ధిఁ బొంది
బహుయజ్ఞదానతపంబులు గావించి
సకలదిక్కులు గెల్చి జయముతోడ
సతతంబు హరినామసంకీర్తనము సేసి
ధనముల నొంది యుదారవృత్తి
యెనుబది యైదు వేలేండ్లు భూచక్రంబు
ఘనకీర్తిఁ దనపేరు గాఁగ నేలె
ఆ. ముదిమి లేక తరుణమూర్తియై యురుకీర్తి
నమరెఁ గార్తవీర్యుఁ డనఁగ విభుఁడు
నిజము వానిభంగి నేల యేలినయట్టి
రాజు నెఱుఁగ మెందు రాజముఖ్య! 702

వ. అయ్యర్జునునకుం గల పుత్రసహస్రంబునం బరశురాముని బారికిం దప్పి జయధ్వజుండు శూరసేనుండు వృషణుండు మధువు నూర్జితుండు ననువారేవురు బ్రదికిరి. జయధ్వజునకుఁ దాళజంఘుండును దాళజంఘునకు నౌర్వముని తేజంబున నూర్వురు గొడుకులును గలిగిరి. అందుఁ బ్రథముండు వీతిహోత్రుండు మధువునకు వృష్ణుండు వృష్ణునకుఁ బుత్త్రశతంబు పుట్టెను. అందుఁ బ్రథముఁడు వృష్ణి మఱియు మధువృష్ణి యదువుల యావంశంబులవారు మాధవులు వృష్ణులు యాదవులు ననం బరఁగిరి. యదుపుత్త్రుం డైన క్రోష్ణువునకు వృజినవంతుండు వృజినవంతునకు శ్వాహితుఁడు శ్వాహితునకు ఛేరుశేకుండు ఛేరుశేకునకుఁ జిత్రరథుండు చిత్రరథునకు శశిబిందుండుం బుట్టిరి. 703

మ. కృశమధ్యల్ పదివేవు రంగనలతోఁ గ్రీడం బ్రమోదింప స
త్కుశలుండై పదివేలలక్షలు సుపుత్త్రుల్ భక్తిసేయం జతు
ర్దశరత్నుండును యోగి నాఁ బరఁగి సప్తద్వీపరాజేంద్రుఁడై
శశిబిందుం డురునీతిమంతుఁ డమరన్ సత్కాంతిపూర్ణేందుఁడై. 704

వ. అతని కొడుకుల మొత్తంబునకు ముఖ్యు లయిన యార్వురలోఁ బృథుశ్రవుండను వానికి ధర్ముండు పుట్టె. ధర్మునకు నుశనుండు

పుట్టి నూఱశ్వమేధంబులు సేసెను. అయ్యుశనునకు రుచికుండు పుట్టెను. ఆరుచికునకుఁ బురుజిత్తు రుక్మండు రుక్మేషువుఁ బృథువు జ్యామఘుండు ననువా రేవురు పుట్టిరి. అందు జ్యామఘుండు. 705

సీ. తొట్రికోల్పడు శైబ్య తోడి ప్రేమంబున
నసపత్యుఁ డయ్యును నన్యభార్యఁ
గైకొన కొక కొంతకాలంబునకుఁ బోయి
పగవారి యింటను బలిమిఁ బట్టి
యొకకన్యఁ దేరిపై నునిచి తోడ్తేరంగ
జననాథుఁ గన్యను శైబ్య నూచి
కోపించి మానవ కుహక ! యీ పడుచును
దెచ్చియు నేనుండఁ దేరిమీఁదఁ

ఆ. బెట్టినాఁడ వనుచు బిఱుసులు వలుకంగ
నతఁడు వలికె నంత నతివతోడ
నాకుఁ గోడ లింత నమ్ము మీ లలితాంగి
సవతిగాదు నీకు సత్యమనుచు. 706

వ. అయ్యవసరంబున శైబ్య కొడుకుం గాంచు నని యెఱింగి విశ్వే దేవతలును బితృదేవతలును సంతసించిరి. వారల ప్రసాదంబున.

క. తనసవతి మొఱఁగి పెనిమిటి
తనుఁ బొందిన శైబ్య మఱి విదర్భునిఁ గనియెం
దనయుఁ గని జ్యామఘుండును
దన తెచ్చినకన్యఁ దెచ్చి తనయున కిచ్చెన్. 708

౨౪ అధ్యాయము

వ. ఆ కన్యకయందు విదర్భునకుఁ గుశుండును గ్రథుండును రోమ పాదుండునుం బుట్టిరి. ఆ రోమపాదునకు బభ్రువుబభ్రువునకు విభువు విభువునకుఁ గృతి గృతికి నుశికుండు నుశికునకుం జేది చేదికిఁ జైద్యా దులు పుట్టిరి. క్రథునకుఁ గుంతి గుంతికి దృష్టి దృష్టికి నిర్వృతి నిర్వృతికి దశార్హుండు దశార్హునకు వ్యోముండు వ్యోమునకు జీమూతుండు జీమూతునకు వికృతి వికృతికి భీమరథుండు భీమరథు

నకు నవరథుండు నవరథునకు దశరథుండు దశరథునకు శకుని శకు
నికిఁ గుంతి గుంతికి దేవరాతుండు దేవరాతునకు దేవక్షత్త్రుండు
దేవక్షత్త్రునకు మధువు మధువునకుఁ గురువశుండు గురువశునకు
నను వనువునకుఁ బురుహోత్రుం డతనికి నంశు వతనికి సాత్వతుండు
సాత్వతునకు భజమానుండును భజియును దివ్యుండును వృష్ణియు
దేవాపృథుండును నందకుండును మహాభోజుండునునన నేడ్గురుపుట్టిరి.
అందు భజమానునకుఁ బ్రథమభార్యయందు నిమ్రోచికంకణ
వృష్ణులు ముగ్వురును రెండవభార్యయందు శతజిత్తు సహస్రజిత్తు
నయుతజిత్తు నన ముగ్వురును బుట్టిరి. అందు దేవాపృథునకు బభ్రువు
వీర లిరువుర ప్రభావంబులఁ బెద్దలు శ్లోకరూపంబునఁ బఠియింతురు.
అట్టి శ్లోకార్థం బెట్టి దనిన. 709

తే. వినుము దూరంబునం దేమి వినుచు నుందు
మదియ చూతము డగ్గఱ నరుగు దేర
నరులలో బభ్రుకంటె నున్నతుఁడు లేఁడు
యోజ దేవాపృథున కెన యొరుఁడు గలఁడె. 720

క. పదునాలుగు వేవురు నఱు
వదియేవురు నరులు ముక్తి వడసిరి బభ్రుం
డుదితుఁడు దేవాపృథుఁడును
బదపడి యోగంబుఁ దెలియఁ బలికిన కతనన్. 711

వ. మహాభోజుం డతిధార్మికుండు. వాని వంశంబువారు భోజులని పలు
కంబడిరి. వృష్ణికి సుమిత్రుండు యుధాజిత్తును జన్మించిరి. అందు
యుధాజిత్తునకు శినియు ననమిత్రుండును జనించిరి. అనమిత్రునికి
నిమ్నుండు నిమ్నునికి సత్రాజితుండుఁ బ్రసేనుండునన నిరువురు పుట్టి
రి. మఱియు ననమిత్రునికి శిని యనువాఁడు వేఱొకండు గలండు.
అతని పుత్రుండు సత్యకుండును నతనికి యుయుధానుం డనంబరఁగిన
సాత్యకియు నాసాత్యకికి జయుండును జయునకుఁ గుణియు నాకుణికి
యుగంధరుండునుం బుట్టిరి. మఱియు ననమిత్రునకుఁ బృశ్నియను
వేఱొక కొడుకు గలఁడు. వానికి శ్వఫల్కచిత్రకులు గలిగిరి. అందు

శ్వఫల్కునకు గాందినియందక్రూరుండును నసంగుండును సారమేయుం
డును మృదుకుండును మృదుపచ్ఛివుండును వర్మదృక్కును ధృష్టవ
ర్మండును క్షత్త్రోపేక్షుండును నరిమర్దనుండును శత్రుఘ్నుండును
గంధమాదనుండును బ్రతిబాహువును ననువారు పన్నిద్దఱు గొడు
కులును సుచారువను కన్యకయు జనించిరి. వారియం దక్రూరునికి
దేవలుండును ననుపదేవుండునుం బుట్టిరి. మఱియుఁ జిత్రునకుఁ
బృథుండును విడూరథుండును మొదలుగాఁ గలవారు పెక్కండ్రు
వృష్ణివంశజాతులైరి. భజమానుండు కుకురుఁడు శుచి కంబళబర్హి
షుండు నన నలువు రంధకునకుఁ బుట్టిరి. కురునికి వృష్ణి వృష్ణికి
విలోమతనయుండు విలోమతనయునికిఁ గపోతరోముండు గపోత
రోమునికి దుంబురుసఖుండైన యనువును ననువునకు దుందుభి
దుందుభికి దవిద్యోతుండు దవిద్యోతునకుఁ బునర్వసువు నతనికి
నాహుకుండను కుమారుండు నాహుకి యనుకన్యయుం గలిగిరి. ఆ
యాహుకునికి దేవకుం డుగ్రసేనుండు నన నిరువురు జనించిరి. అందు
దేవకునికి దేవలుం డనుపదేవుండు సుదేవుండు దేవవర్ధనుం డన
నలుగురు గలిగిరి. వారలకు ధృతదేవయు శాంతిదేవయు నుపదేవయు
శ్రీదేవయు దేవరక్షితయు సహదేవయు దేవకియు ననఁదోఁబుట్టువు
లేడ్వురు గలిగిరి. వినుము. 712

క. అసదృశలలితాకారలఁ
గిసలయకరతలల దేవకీముఖ్యల నా
బిసరుహనయనల నందఱ
వసుదేవుఁడు పెండ్లి యాడె వసుధాధీశా! 713

వ. ఉగ్రసేనునకుఁ గంసుండును న్యగ్రోధుండును సునామకుండును
గహ్వుండును శంకుండును సుభువును రాష్ట్రపాలుండును విసృ
ష్టుండును దుష్టిమంతుండునునను గలవారు దొమ్మండ్రు కొడుకులును
కంసయుఁ గంసవతియు సురాభువును రాష్ట్రపాలికయునను గూఁతు
లుంబుట్టిరి. వారు వసుదేవానుజభార్యలైరి. భజమానునికి విడూ
రథుండును విడూరథునికి శనియు నతనికి భోజుండు భోజునికి
కుండునుం గలిగిరి. అందు హృదికునికి దేవమీఢుండు శతధనువు

కృతవర్మయు ననుకొడుకులు గలిగిరి. ఆదేవమీఢుండు శూరుండు ననంబడు శూరునికి మారిషయను భార్యయందు వసుదేవుండును దేవభాగుండును దేవశ్రవుండును నానకుండును సృంజయుండును శ్యామకుండును గంకుండును ననీకుండును వత్సకుండును వృకుండును ననువారు పదుగురు కొడుకులును బృథయు శ్రుతదేవయు శ్రుతకీర్తియు శ్రుతశ్రవయు రాజాధిదేవియు నను కూఁతు లేవురును బుట్టిరి. అందు. 714

—♦వసుదేవుని వంశక్రమానువర్ణనము♦—

ఉ. ధీనయశాలి యైన వసుదేవుఁడు పుట్టినవెంట మింటిపై
[1]నానకదుందుభుల్ మొరసె నచ్యుతుఁ డీతనికిం దనూజుఁడై
మానుగఁ బుట్టు నంచు గరిమంబున దేవత లుబ్బ రాజపం
చానన! తన్నిమిత్తమున నానకదుందుభి యయ్యె వాఁ డిలన్. 715

క. తనచెలికాఁ డగు కుంతికిఁ
దనయులు లేకున్నఁ జూచి తనతనయుఁ బృథం
దనయఁగ నిమ్మన శూరుఁడు
దనయందలి మైత్రి నిచ్చె ధరణీనాథా! 716

వ. అయ్యింతి కుంతిభోజు నింటం బెరుఁగుచుండ నొకనాఁడు దుర్వాసుం డరుగుదెంచిన నమ్మహాత్మునకుఁ గొన్నిదినంబులు పరిచర్యలు సేసి వేల్పులం జేరం జీరు విద్యం బడసి యావిద్య లావెఱుంగ నొక్కనాఁ డేకాంతంబున వెలుంగుఱేని నాకర్షించిన నాఁడేవుండు వచ్చినం జూచి వెఱఁగుపడి యిట్లనియె. 717

క. మంత్రపరీక్షార్థం బభి
మంత్రించితిఁ గాని దేవ మదనక్రీడా
తంత్రంబుఁ గోరి చీరను
మంత్రించిన తప్పు సైఁచి మరలు దినేశా! 718

వ. అనిన నయ్యువిదకుఁ బద్మినీవల్లభుం డిట్లనియె. 719

---

1 పెద్దడక్క.

మ. తెలియవా ! నీపలు కల్ల యూ [1]నసదులే దేవోత్తమాహ్వానముల్
మొఱఁగం బోలునె వేల్పులం బడయుటల్ మోఘంబులే నీకు నీ
తలి గర్భం బగుఁ బుత్త్రుఁడుం గలుగు నీ తారుణ్యముం బూజ్యమా
వెలినం గార్యములేదు సిగ్గుదగునే వ్రీడావినమ్రాననా ! 720

చ. అని తగ నియ్యకొల్పి లలితాంగికి గర్భముసేసి మింటికిం
జనియె దినేశ్వరుం డపుడు సక్కని రెండవసూర్యుఁడో యనం
దనరెడు పుత్త్రుఁ గాంచి కృప దప్పి జగజ్జనవాదభీతయై
తనయుని నీటఁబో విడిచి తానరిగెం బృథ దండ్రియింటికిన్. 721

వ. అయ్యువిదను నీప్రపితామహుండైన పాండురాజు వివాహంబయ్యెను. అయ్యంగనకుఁ బాండురాజువలన ధర్మజభీమార్జునులు పుట్టిరి. అంత నమ్మగువ చెల్లెలగు శ్రుతదేవయను దానిం గారూషకుండైన వృద్ధశర్మ పెండ్లియాడెను. అయ్యిద్దఱకు మునిశాపంబున దంతవక్త్రుఁడను దానవుండు జన్మించె. దానితోడంబుట్టువగు శ్రుతకీర్తిని కేకయరాజైన ధృష్టకేతుండు పెండ్లియాడెను. ఆ దంపతులకుఁ బ్రతర్దనాదు లేవురు పుట్టిరి. దానిభగినియైన రాజాధిదేవిని జయత్సేనుండు పరిణయంబయ్యెను. ఆమిథునంబునకు విందానువిందులు సంభవించిరి. చేదిదేశాధిపతి యైన దమఘోషుండు శ్రుతశ్రవసను బరిగ్రహించె. వారలకు శిశుపాలుం డుదయించె. వసుదేవునితమ్ముఁడైన దేవభాగునికిఁ గంసయందుఁ జిత్రకేతు బృహద్బలు లిరువురు జనించిరి. వాని భ్రాత యగు దేవశ్రవుండనువానికిఁ గంసవతియందు వీరుఁడును నిషుమంతుండును నుప్పతిల్లిరి. వాని సోదరుండయిన కంకునికిఁ గంకయను దానికి బకుండు సత్యజిత్తుఁ గురుజిత్తు ననువా రుద్భవిల్లిరి. వానిసహజుండయిన సృంజయునికి రాష్ట్రపాలియందు వృషదుర్మరణాదు లావిర్భవించిరి. వాని యనుజాతుండయిన శ్యామకునకు శురభూమియందు హరికేశహిరణ్యాక్షులు ప్రభవించిరి. వాని తమ్ముండైన వత్సుండు మిశ్రకేశి యను నప్సరసయందు వృకాదిసుతులం గనియె. వానియనుజుం

[1] అసదు = తప్పులా.

డైన వృకుండు దూర్వాక్షియందుఁ దక్షపుష్కరసాళ్వాదుల నుత్పా
దించె. వాని జఘన్యజుండయిన యనీకుండు సుదామని యనుదాని
యందు సుమిత్రానీకబాణాదులయిన గొడుకులం బడసె. వాని
యనుజుండైన యానకుండు కర్ణికయందు ఋతుధామజయులం
గాంచె. వసుదేవునివలన రోహిణియందు బలుండును గదుండును
సారణుండును దుర్మదుండును విపులుండును ధ్రువుండును కృతా
దులును పౌరవియందు సుభద్రుండును భద్రబాహుండును దుర్మ
దుండును భద్రుండును భూతాదులుం గూడ బన్నిద్దఱును మదిర
యందు నందోపనందకృతకశ్రుతశూరాదులును గౌసల్యయందుఁ
గేశియు రోచనయందు హస్తహేమాంగాదులును నిళయందు
యదుముఖ్యులయిన యురువల్కలాదులును ధృతదేవయందుఁ
ద్రిపృష్ఠుండును శాంతిదేవయందుఁ బ్రశమ ప్రశ్రితాదులును నుప
దేవయందుఁ గల్పవృష్ట్యాదులు పదుండ్రును శ్రీదేవయందు వసు
హంససుధన్వాదులార్గురును దేవరక్షితయందు గదాదులు దొమ్మం
డ్రును సహదేవయందుఁ బురూఢ శ్రుతముఖ్యు లెనమండ్రును
దేవకియందుఁ గీర్తిమంతుండును సుషేణుండును భద్రసేనుండును
ఋజువును సమదనుండును భద్రుండును సంకర్షణుండును ననువా
రేడ్వురును బుట్టిరి. మఱియును. 721

క. దుష్టజననిగ్రహంబును
శిష్టజనానుగ్రహంబు సేయుటకొఱకై
యష్టమగర్భమున గుణో
త్కృష్టుఁడు దేవకికి విష్ణుదేవుఁడు వుట్టెన్. 722

ఆ. విష్ణుఁ డుదితుఁడైన వెనుక నా దేవకి
భద్రమూర్తియగు సుభద్రఁ గనియె
నాగుణాఢ్య ముత్తవగు నీకు నర్జును
దయిత యగుటఁ జేసి ధరణినాథ! 723

క. ఎప్పుడు ధర్మక్షయ మగు
నెప్పుడు పాపంబు వొడము నీలోకములో

నప్పుడు విశ్వేశుఁడు హరి
దప్పక విభుఁడయ్యుఁ దన్నుఁ దా సృజియించున్. 723

తనమాయ లేక పరునకు
ఘనునకు నీశ్వరున కాత్మకర్తకు హరికిన్
జనములకుఁ గర్మములకును
మనుజేశ్వర కారణంబు మఱియును గలదే. 725

తలఁపఁగ నెవ్వని మాయా
విలసనములు జననవృద్ధి విలయంబులకుం
గలిమి కనుగ్రహమోక్షం
బులకును జీవునికి మూలములు నా నెగడున్. 726

అట్టి సర్వేశుని కరయంగ జన్మాది
పరతంత్రభావ మెప్పాటఁ గలదు
రాజలాంఛనముల రాక్షసవల్లభు
లక్షౌహిణీశులై యవనిఁ బుట్టి
జనులను బాధింప శాసించుకొఱకు నై
సంకర్షణుని తోడ జనన మంది
యమరుల మనముల కైన లెక్కింపంగ
రాకుండు నట్టి కర్మములఁ జేసి
కలియుగంబున జన్మింపఁ గలుగ నరుల
దుఃఖజాలంబులన్నిటిఁ దొలఁగ నడచి
నేల వ్రేఁగెల్ల వారించి నిఖిలదిశల
విమలకీర్తులు వెదచల్లి వెలసె శౌరి. 727

మంగళహరికీర్తిమహా
గంగామృత మించుకైనఁ గర్ణాంజలులన్
సంగతము సేసి త్రావఁ దొ
లంగును గర్మంబు లావిలం బగుచు నృపా! 728

వనజాక్షునిమందస్మిత
ఘనకుండలదీప్తిగండకలితాననమున్

వనితలుఁ బురుషులుఁ జూచుచు
ననిమిషభావంబు లేమి కలయుదు రధిపా! 729

సీ. జనకుని గృహమున జన్మించి మందలోఁ
బెరిఁగి శత్రుల నెల్లఁ బీఁచ మడఁచి
పెక్కండ్రుభార్యలఁ బెండ్లియై సుతశతం
బులఁ గాంచి తను నాదిపురుషుఁగూర్చి
క్రతువులు పెక్కులు గావించి పాండవ
కౌరవులకు నంతఁ గలహ మయిన
నందఱ సమయించి యర్జును గెలిపించి
యుద్ధవునకుఁ దత్త్వ మొప్పఁ జెప్పి

ఆ. మగధపాండవసృంజయమధుదశార్హ
భోజవృష్ణ్యంధకాదిసంపూజ్యుఁ డగుచు
నుర్విభరము నివారించి యుండనొల్ల
కామహామూర్తి నిజమూర్తి యందుఁబొందె. 730

చ. నగుమొగముం సుమధ్యమును నల్లనిదేహము లచ్చికాట ప
ట్టగు నురమున్ మహాభుజము లంచితకుండలకర్ణముల్ మదే
భగతియు నీలవేణియుఁ గృపారసదృష్టియుఁ గల్గు వెన్నుఁ డి
మ్ముగఁ బొడసూపుఁ గాత గనుమూసినయప్పుడు విచ్చునప్పుడున్.

వ. అని చెప్పి. 732

క. జనకసుతాహృచ్చోరా!
జనకవచోలబ్ధవిపినశైలవిహారా!
[1]జనకామితమందారా!
జనకాదిమహీశ్వరాతిశయసంచారా! 733

మాలిని. జగదవనవిహారీ! శత్రులోకప్రహారీ!
సుగుణవనవిహారీ! సుందరీమానహారీ!
విగతకలుషపోషీ! వీరవిద్యాభిలాషీ!
స్వగురుహృదయతోషీ! సర్వదా సత్యభాషీ! 743

---

1 జనుల కోర్కెలకు కల్పవృక్షముపంటివాఁడా

గద్యము. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందు సూర్యవంశారంభంబును, వైవస్వతమనువు జన్మంబును, హైమచంద్రకథనంబును, సుద్యుమ్నాదిమనుసూనుల చరిత్రంబును, మరుత్త తృణబిందు శర్యాతి కకుద్మి సగర నాభాగ ప్రముఖుల చరిత్రంబులును, నంబరీషుని యందుఁ బ్రయోగింపబడిన దుర్వాసుని కృత్యనిరర్థకయగుటయు నిక్ష్వాకు వికుక్షి మాంధాతృ పురుకుత్స హరిశ్చంద్ర సగర భగీరథ ప్రముఖులచరిత్రంబులును, భాగీరథీ ప్రవాహవర్ణనంబును, కల్మాషపాద ఖట్వాంగ ప్రముఖుల వృత్తాంతంబును, శ్రీరామచంద్రకథనంబును, దదీయవంశపరంపరాగణనంబును, నిమికథయును, జంద్రవంశారంభంబును, బుధ పురూరవులకథయును, జమదగ్ని పరశురాముల వృత్తాంతంబును, విశ్వామిత్ర నహుష యయాతి పూరు దుష్యంత భరత రంతిదేవ పాంచాల బృహద్రథ శంతను భీష్మ పాండవ కౌరవప్రముఖుల వృత్తాంతంబును, ఋశ్యశృంగ వ్రతభంగంబును, ద్రుహ్యానుతుర్వసులవంశంబును, యదు కార్తవీర్య శశబిందు జామదగ్న్యాదుల చరిత్రంబును, శ్రీకృష్ణావతారకథాసూచనంబును నను కథలుగల నవమస్కంధము సంపూర్ణము.

హరిః ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.

శ్రీ శ్రీనివాసార్పణ మస్తు.

—౼—

